# నృత్తరత్నావళి

సంస్కృతం: జాయసేనాపతి

తెలుగు: రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ



ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ హైదరాబాదు

# తొలిపలుకు

నృత్య, సంగీత శాస్త్రముల గురించిన అనేక ప్రామాణిక గ్రంథములు సంస్కృత భాషయందేయుండుట అందరెరిగిన విషయమే. వాని ప్రాశస్త్యము ప్రతి స్రష్టకు విదితము. వాని అవసరము మాత్రము చిన్న నుండి పెద్దవరకు సమానమే. ఇప్పటిలో చాలకొద్దిమంది మాత్రమే సంస్కృతభాషాజ్ఞానము కలవారగుటచే, ఈ గ్రంథములను తెలుగుభాషలోనికి అనువదింపజేసిన సర్వులకు చాల ఉపయోగకరముగ నుండునను సంకల్పముతో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ పనికి పూనుకొన్నది. ఈ పథకము క్రింద సంగీతశాస్త్ర గ్రంథములలో తలమానికమని పేర్కొనబడిన శార్ఙ్గదేవుని 'సంగీతరత్నాకరము' తెలుగు అనువాద ప్రచురణను అకాడమీ చేపట్టి మొదటి భాగమును వెలువరించినది. మిగిలిన మూడుభాగములు క్రమముగ ప్రకటింపబడును.

గాథాసప్తశతి, నాట్యశాస్త్రాలనుబట్టి ఆంధ్రదేశంలో నృత్యకళ ప్రాచీన కాలం నుంచి విలసిల్లుతున్నదని తెలుస్తోంది.

భరతముని ఆంధ్రులు "దాక్షిణాత్య ప్రవృత్తి" కి చెందిన వారుగా వర్గీకరించినారు.

నాట్యశాస్త్రమంత ప్రామాణిక గ్రంథంగా ఎంచబడి యావత్ భారతంలోనూ విశేష ప్రచారంలో ఉన్న "అభినయదర్పణం" రచయిత నందికేశ్వరుడు ఆంధ్రుడు.

అభినయదర్పణం తరవాత అంత ప్రామాణిక గ్రంథంగానూ పరిగణింపబడుతున్న నృత్తరత్నావళి రచించిన జాయసేనాని కూడా ఆంధ్రుడే.

నృత్యశాస్త్రసాహిత్యమునకు తెలుగువారు సమర్పించిన అనర్ఘమణి నృత్తరత్నావళి. దీనిని రచించిన జాయసేనాపతి, కాకతీయగణపతి దేవుని గజసైన్యాధిపతి. గణపతిదేవుడు క్రీ. శ. 1199–1261 మధ్యకాలమున కాకతీయ రాజ్యమును పరిపాలించెను. జాయసేనాపతి 'గీతరత్నావళి' అను గ్రంథమును కూడ రచించినట్లు ఐదవ అధ్యాయము తుదిని పేర్కొనినాడు. కాని అది ఇంత వరకు లంచలేదు.

నిజానికి భారతీయ నృత్యకళకు ఆంధ్రులుచేసిన సేవ అమోఘం. నృత్తరత్నావళి తెలంగాణాలో రచింపబడటం ఒక విశేషం. ఇందులో జాయప దేశీ నృత్యరీతులను వివరించడం మరోవిశేషం.

'నృత్తరత్నావళి' గ్రంథమును తెలుగు చేయించి సంస్కృతమూల ముతోసహా ప్రచురించవలెనని అకాడమీ పది సంవత్సరములనాడు సంకల్పించినది. కాని ఈ గ్రంథమునకు ప్రామాణిక వ్రాతప్రతి లభించలేదు. సాధ్యమైనంతవరకు నిర్దుష్టముగ ప్రచురించవలెనన్న మాఆకాంక్షను డాక్టర్ వి. రాఘవన్‌గారి పరిష్కర్తృత్వమున మద్రాసు ప్రభుత్వప్రాచ్య గ్రంథభాండాగారము వెలువరించిన 'నృత్తరత్నావళి' గ్రంథము చాలవరకు తీర్చినది. ఈ ప్రతియేకాక తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమునుండి అకాడమీ తెప్పించిన వ్రాతప్రతి, తిరుపతి ప్రాచ్యపరిశోధనాలయమునందలి వ్రాతప్రతి మున్నగు వాని సహాయముతో శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు సంస్కృతప్రామాణికప్రతిని, తెలుగుఅను వాదమును సిద్ధపరచి అకాడమీకి అందించినారు. వారికి అకాడమీ పక్షమున ధన్య వాదములు.

ముద్రణప్రతిని, విషయసూచికను, విశిష్టపదసూచిని సిద్ధపరచుట యందు సహాయపడిన శ్రీ సి. శేషాద్రి గారికి, కోరినంతనే సుదీర్ఘమైన పీఠికను వ్రాసి, గ్రంథమునకు నిండుదనము కలిగించిన డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు గారికి, రామప్పదేవాలయమునగల నృత్యభంగిమల చిత్రములు తీసియిచ్చిన శ్రీ వి. శ్రీనివాస శర్మగారికి, సహకరించిన శ్రీ మొదలి నాగభూషణశర్మగారికి, శ్రీ గరిమెళ్ల రామమూర్తిగారికి, నృత్యచిత్రములకు తగిన పేర్లనుంచిన భరత కళాప్రపూర్ణ శ్రీ నటరాజ రామకృష్ణగారికి ఈ గ్రంథ ముద్రణ బాధ్యత వహించిన శ్రీ శ్రీనివాస చక్రవర్తి గారికి మాకృతజ్ఞతలు తెలియపరుస్తున్నాము.

పసల సూర్యచంద్రరావు
ప్రెసిడెంట్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

# ఉపోద్ఘాతము

శ్రీనృత్తరత్నావళి భారతీదేవి సన్నిధిలో తెలుగువారు వెలిగించిన నందాదీపములలో మొదటిది, ఇప్పటికి; తరువాతి లాక్షణికులకెందరికో మార్గదర్శకమైన ప్రామాణికగ్రంథము. దీనిని రచించిన జాయసేనాపతి 'గీతరత్నావళి' అను గ్రంథమును రచించినట్లు ఈ గ్రంథమున చెప్పుకొన్నాడు. కాని అది యిప్పటికి లభించిన పుణ్యము మనకు లేదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'వాద్య రత్నావళి' అనుదానినిగూడ ఇతడు సంతరించినట్లు వినికి గలదన్నారు.[1] ఆ వినికి యెక్కడిదో తెలియదు.

ఆంధ్రప్రదేశ సంగీతనాటక-అకాడమీ యేర్పడిన తొలిదినాలలోనే దీని సంస్కృతమూలమును పరిష్కరించి తెలుగు తాత్పర్యములతో ప్రకటించు కోరిక గలిగినది. అప్పుడు అకాడమీ అధ్యక్షులుగానుండిన శ్రీ అర్. బి. రామ కృష్ణరాజుగారు ఆ విషయమున చాలా ఉత్కంఠ చూపిరి. అప్పటికే మద్రాసులో సుగృహీతనామధేయులగు శ్రీ డా. వి. రాఘవన్‌గారు మూలమును పరిష్కరించి ముద్రింపించుచున్న చిత్తుకాకితములను నేను చూచియుంటిని. కనుక అకాడమీవారు వేరుగా పరిష్కరించుభారము అనావశ్యకమని, మద్రాసు ముద్రణము వెలువడిన తర్వాత తెలుగు తాత్పర్యముతో చేర్చి ముద్రింపవచ్చునని, కార్యనిర్వాహకసమితిలో నేను సూచించితిని. సదస్యులు దయతో నాసూచన నంగీకరించిరి. కాని యే కారణములచేతనో ఆచ్చుపని ముగిసిన తర్వాత కొన్ని యేండ్లవరకును ఆ గ్రంథము బైలుపడలేదు. ఈ నడుమ శ్రీ రామకృష్ణరాజుగారు అధ్యక్షపదవినుండి విశ్రాంతి పుచ్చుకొనగా శ్రీ పసల సూర్యచంద్రరావు

---

1. భరతకోశము ; 'వాద్యరత్నావళి' అను పదము క్రింద. అందే 'నృత్తరత్నావళి' అనుమాట క్రింద "ఈ గ్రంథమున 'ఆత్మచరిత్ర' మను పేరి గ్రంథమొకటి యుదాహరింపబడినది" అని కవిగారు వ్రాసిరి. లభించిన నృత్తరత్నావళి గ్రంథముతో 'ఆత్మచరితము' నాకంటికంపలేదు.

గారు ఆ పదవినంగీకరించిరి. శ్రీ రావుగారును నృత్తరత్నావళి పరిష్కరణ-ప్రకటనల విషయమున ఎంతో ఉత్సాహాసక్తులనుచూపిరి. కాని వారును నాసూచనను మన్నించి, మద్రాసు పుస్తకమునకై వేచియుండుటకంగీకరించి, అది వెలువడిన వెంటనే దానికి తెలుగు తాత్పర్యమును వ్రాయుభారము నామీద పెట్టిరి. వారి విశ్వాసమును త్రోసివేయలేక అంగీకరించితిని.

తుదకు, ఓర్పు నుతిమించకముందే, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య గ్రంథభాండాగారమువారు కడచిన సంవత్సరము గ్రంథమును ప్రకటించినారు. ఇంతకాలము వేచియుండినది సార్థకమైనది. శ్రీ రాఘవన్‌గారి ప్రామాణికమై తలస్పర్శియైన పాండిత్యమునకు, శ్రమసహిష్ణుతకు, ఈ పరిష్కరణము సర్వత్ర సాక్షిగానున్నది. 164 పుటలు నిండిన, వివిధవిషయములను వివరించు ఇంగ్లీషు పీఠికతో, 42 పుటల 'నోట్సు' తో, 166 పుటల 'విశిష్టశబ్దసూచి' తో, నృత్తరత్నావళి మూలము సర్వాంగసంపన్నమై వెలువడినది. ప్రతిపుటయందును వ్రాతప్రతులలోని పాఠభేదములు అడుగున చూపబడియున్నవి. నేటి గ్రంథ పరిష్కరణకిది యొకమేలుమచ్చు. ముప్పది యేండ్లకు పైబడి ఈ గ్రంథమును పరిశీలించుచుండినట్లు శ్రీ రాఘవన్‌గారు తెలిపినారు.[1] దానికి వింతపడవలసినది లేదు. ఈ పరిష్కరణకార్యమునకు తంజావూరి సరస్వతీమహాలునందున్న రెండు తెలుగు తాటాకుల ప్రతులు వారికాధారమైనవి. రెండును ఒకమూలప్రతికి పుత్రికలేయనుకోవలసినవి. రెండును వ్రాతతప్పుల కుప్పలు. ఇవిగాక 'ఏషియాటిక్ సొసైటి ఆఫ్ బెంగాల్' వారి వ్రాతప్రతి యొకటి వారికి లభించినది.[2] కాని దానిలో మూలగ్రంథము 4 వ అధ్యాయమున 11 వ శ్లోకము మొదలు 7 వ యధ్యాయమున 132 వ శ్లోకముదాక మాత్రమే యుండినది. వ్రాత పొరబాట్లును, చిక్కులును ఏమియు తక్కువగావు. ఈ మూటి యాధారముతో ప్రాచీనములగు అనేకలక్షణగ్రంథముల సహాయముతో, పరిష్కర్త మూలమును సవరించి యుద్ధరించినారు. అప్పటికిని అందందు కొన్ని శిథిలభాగములు, చిన్నవి - పెద్దవి, అట్లే దుష్పూరములై నిలిచినవి.

---

1. See Preface, P. 1.,
2. See Introduction, P. 4.,

ఇక నా మాట. ఈవల ఆనారోగ్యముతో దృష్టిబలము, ధారణాబలమును చాలక యశక్తుడనుగానున్నను, నా సూచన ప్రకారము ఇంతకాలము వేచి యున్న అకాడమీవారి సౌహార్దవిశ్వాసములకు కానుకగా ఈ తెలుగు తాత్పర్య మును ఎట్లో వ్రాసియిచ్చినాను. నాట్య నృత్య నృత్తములలో దేనియందును నాకు ప్రవేశము చాలదు. ఉన్న స్వల్ప సంస్కృతభాషాపరిచయమూధారముగా మాత్రమే యీ తెలిగింపు సాగించితిని. కనుక లక్ష్యలక్షణకోవిదులకు ఈ తెలిగింపులో కొన్నియైనను లోపములు కానరాకపోవు. ఈ కార్యమునకు భరతనాట్యశాస్త్రము, అభినవగుప్తాచార్యుని అభినవభారతి, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము, దాని సింగభూపాల-కల్లినాథుల వ్యాఖ్యలు, మానవల్లి వారి భరత కోశము, శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి భరతనాట్యశాస్త్రాంధ్రాను వాదము—ఇవి నాకు చాలా తోడుపడినవి. శ్రీ రాఘవన్‌గారి సూచనలమాట చెప్పబనిలేదు. అకాడమీవారు నాకిచ్చిన వ్రాతప్రతికితోడు తిరుపతి ప్రాచ్య పరిశోధనశాలయందలి వ్రాతప్రతియొకటి చూచి పోల్చుకొనునవకాశము అధ్య క్షులు శ్రీ డా. జీ రెడ్డి చెన్నారెడ్డిగారు నాకు కలిగించిరి. ఇదిగాక దుర్లభమైన అభినవభారతి రెండవసంపుటమును తమ సొంతమైన దానిని నాకెరవుగా శ్రీ రెడ్డి గారే యిచ్చియుండిరి. వీరందరికిని నాధన్యవాదనులు.

దీనికి తగినంతవిపులముగా పీఠిక వ్రాయుటకు ప్రకృతము అనుకూలము, ఆరోగ్యము నాకులేక ఆ భారము వహింపుడని మిత్రులు శ్రీ డా. పోణంగి శ్రీరామ అప్పారావుగారిని ప్రార్థించితిని. ఎంతో కార్యభారము గలవారైనను వారివలె ఈ పని నిర్వహింపగల సమర్థులు ఇతరులు కానరాక ఈబరువు వారికప్ప గింపక తప్పినదిగాదు. వారు దయతో నావేడికోలు మన్నించి ఈ గ్రంథమునకు నిండుదనము గలిగించినారు. దానికి నా ప్రతికారము అంజలి మాత్రమే.

మూలగ్రంథమున అందందు కొన్ని చిన్నసవరణలు చేయదగునని తోచి నది. అట్లు చేసిన సవరణలు అక్కడక్కడ స్పష్టముగా చూపినాను. వాని యౌచిత్యానౌచిత్యములకు సహృదయపండితులు ప్రమాణము.

ముద్రణమునకై దీనిప్రతి సిద్ధపరచుట, విషయసూచిక, విశిష్టపదసూచి — ఈ పనులను తృప్తిగా నిర్వహించినది ఇక్కడి శ్రీ వేంకటేశ్వరకళాశాలలో ఆంధ్రోపాధ్యాయుడైన చిరాయు చేట్లూరి శేషాద్రి, ఎం. ఏ.; అతనికి నా మంగళాశీస్సులు.

తిరుపతి

10-4-69

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# పీఠిక

డా. పోణంగి శ్రీరామ అప్పారావు
డైరెక్టర్, తెలుగు అకాడమి, హైదరాబాదు

## 1. నృత్యకళ

మానవుడు తొలుత నుండియు సంఘజీవి. సుఖదుఃఖసమయములందు సన్నిహితులైన వారందరేకమై గుమికూడి యుండుట సహజము. అట్టి సమయములలో వారు ఆట-పాటలు నిర్వహించుట నేటికిని జరుగుచున్నది. ఆదిమమానవుల ఈ ఆట-పాటలలోని పాట-అంగవిన్యాసములు - మాటలు నేటి లలితకళలకు బీజములని చెప్పవచ్చును. అనగా తొలిమానవులు తమకు కష్టము కలిగినప్పుడు దానికి తట్టుకొనలేక చేసిన ఆక్రోశమును, ఆ కష్టము తొలగినప్పుడు ఆనందోత్సాహములతో చేసిన ఆలాపములును గాన-నృత్త-కవిత్వకళలకు తొలిరూపము అన్నమాట.[1] చిన్నపిల్లలు కోరిన వస్తువు చేతికందిన వెంటనే ఆనందోత్సాహములతో కూనరాగములు తీయుచు, జిలిబిలి పలుకులతో అందముగా చిందులు త్రొక్కుచున్నప్పుడు కూడ పై మూడింటిని అనగా గాన-నృత్త-కవిత్వములకు మూలరూపములను గుర్తింపవచ్చును. కావున ఆధునికుల దృష్టిలో తొలిమానవుల చిందులే నృత్తమునకు మూలరూప మన్నమాట.

భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమందలి ప్రథమ-చతుర్థాధ్యాయములందలి కథనమునుబట్టి నృత్తము అనాది; అది పరమేశ్వరప్రయుక్తము నాట్యము బ్రహ్మసృష్టి; దేవతలకోర్కె ననుసరించి, దృశ్యమును, శ్రవ్యమును అగునట్లుగా, చతుర్వేదముల సారమును గ్రహించి బ్రహ్మ ఈ నాట్యమును, పంచమవేదముగా, నిర్మించెను బ్రహ్మ-భరతాదులు పరమేశ్వరుని నృత్తమును చిరకాలముగా ఎరుగుదురు. పిమ్మట బ్రహ్మ సృష్టియును, భరతప్రయుక్తమును అయిన నాట్యమును శివుడు క్రొత్తగా చూచెను నాట్యమును చూడగనే నృత్త-నాట్యములను సమ్మిశ్రితముచేసిన బాగుండునని శివునకు తోచెను. అనగా తన నృత్తమునకు నాట్యమందలి అభినయములను జోడించినచో గీతములు

---

1. తొలిమానవుల ఆటపాట (Ballad Dance) నుండియే సర్వకళలు ఉత్పన్నములైనవని ఆర్.జి. మౌల్టన్ సిద్ధాంతము (The Ancient Classical Drama-P. 1898, P. 2-5). గ్రీకు నాటకోత్పత్తి వికాసములను గూర్చి పరిశీలించుచోట ప్రతిపాదింపబడిన సిద్ధాంతమిది. కాని, ఇది సర్వభాషలకును వర్తించునని విమర్శకులనిర్ణయము.

అర్థవంతములు కాగలవని ఆయన తలంపు. ముందుగా ఆ పని పూర్వరంగవిధులందు చేయుమని శివుడాదేశించెను. అంతట శివుని ఆదేశముననుసరించి తండుమహర్షి నృత్తమును భరతమునికి బోధించెను భరతుడా నృత్తమును పూర్వరంగవిధులందు ప్రయోగించెను. ఇట్లు ఈ రెండింటి కలయికతో ఒక క్రొత్త కళ సృష్టింపబడినది; అదియే నృత్యము. కాగా కేవలము అంగవిక్షేపాత్మకమైన నృత్తము, అర్థప్రదర్శసాధనమగు అభినయముతో కలిసి నృత్యకళగా రూపొందిన దన్నమాట. ఇది ఒక క్రొత్త కళయని తండుమహర్షి కాని, భరతమునికాని, బ్రహ్మకాని తలంచినట్లు కన్పట్టదు; అయినను శివుడు నృత్తమునకును, బ్రహ్మనాట్యమునకును ప్రవర్తకులైనట్లే భరతముని నృత్యమునకు ప్రవర్తకుడయ్యెనని చెప్పవచ్చును.

'నృత్' అను ధాతువునుండి 'నృత్తము'అను పదమును (నర్తనము, నర్తకి, నర్తకుడు అను పదములు కూడను), 'నట్' అను ధాతువునుండి 'నాట్యము' అను పదము (నటనము, నటి, నటుడు అను పదములు కూడను) ఉత్పన్నములైనవి. ఈ రెండు ధాతువులలో 'నట్' ప్రాకృతధాతువనియు, 'నృత్' సంస్కృతధాతువనియు నేటి విమర్శకుల తలంపు 'నృత్' నకు 'నట్' ప్రాకృతరూపమని కొందరు తలంపగా, 'నట్' నకు నృత్' సంస్కృతరూపమని కొందరు తలంచినారు 'నృత్' అనుధాతువునకు 'క్యప్' ప్రత్యయము చేరినప్పుడు 'నృత్యము' అను పదము నిష్పన్నమగుచున్నది

నాట్యశాస్త్రమందు నృత్యపదములేదు, నృత్త – తాండవ – నాట్యపదములు మాత్రమే కలవు. అందున నృత్త-తాండవ పదములుపర్యాయపదములుగానే ప్రయుక్తములైనవి. తండుమహర్షిచేత బోధింపబడినది కాన 'నృత్తము' తాండవ మనబడినదనియు, తాండవవిధి ప్రాయికముగా 'దేవస్తుతి' నాశ్రయించి యుండుననియు, దాని సుకుమార ప్రయోగము పార్వతీప్రయుక్తమనియు, ఇది శృంగారరససంభవ మగుననియు చతుర్థాధ్యాయమందు భరతముని పేర్కొనెను. ఈ సుకుమారప్రయోగమునే అర్వాచీనులు 'లాస్య' మనిరి. కాగా తాండవము ఉద్ధతనృత్తమనియు, లాస్యము సుకుమార నృత్తమనియు రూఢి పొందినవి. తాండవము పూర్వరంగవిధికె పరిమితముకాగా, శృంగారరస సముద్భవమగు లాస్యము రూపకేతివృత్తమునందు ప్రయుక్తము కాజొచ్చినది.

భరతముని 'లాస్య' పదమును వ్యష్టిగా ప్రయోగించకపోయినను, 19వ అధ్యాయమున పదిలాస్యాంగములను పేర్కొనెను. (అర్వాచీనులు కొందరు 12 చెప్పినారు). ఈ లాస్యాంగములు వేర్వేరు సన్నివేశముల నవలంబముగాచేసికొని ప్రత్యేక ప్రత్యేకముగా ప్రదర్శింపబడుటకు సమర్థములు. ఈ అవకాశమును వినియోగించుకొని, తరువాతి కాలములో భరతముని శిష్యుడుగా తలంపబడుచున్న కోహలుడు నృత్యప్రధానములైన ఉపరూపకములనుకల్పించియుండును. అటు పిమ్మట నృత్యమొక ప్రత్యేకకళగా రూపొందినప్పుడు, నందికేశ్వరుడా కళ కొరకు 'అభినయదర్పణము' అను ప్రత్యేక నృత్యశాస్త్ర

గ్రంథమునురచించినాడు నృత్య కళకొరకు ప్రత్యేకముగా వెలసిన శాస్త్రగ్రంథములలో లభ్యమైన తొలిగ్రంథము నందికేశ్వరుని అభినయదర్పణమే

భరతాదిమునుల ననుసరించి, చతుర్విధాభినయోపేతమైన 'నటనము' నాట్య-నృత్త-నృత్య భేదములచే త్రివిధమని నందికేశ్వరుడు పేర్కొనగా, నాట్య-నృత్య-నృత్త భేదములచే 'నర్తనము' త్రివిధములని శార్ఙ్గదేవుడు పేర్కొనెను (సంగీత రత్నాకరము-7 అ 3 శ్లో) ఇచ్చట నటన-నర్తన పదములు సమానార్థకములుగా ప్రయుక్తములైనవని చెప్పవచ్చును నృత్తోత్పత్తిని వివరించెడి శ్లోకము లేదనిమిది రెండు గ్రంథములందును ఒకే విధముగా నుండుట ఈ యూహను బలపర్చుచున్నవి. ఈ శ్లోకములందలి కథనమును బట్టి భరతమునికి, పరమేశ్వరాదేశానుసారముగా తండుమహర్షి తాండవమును, పార్వతీదేవి లాస్యమును ఉపదేశించిరి తాండవమును భరతముని మహర్షులకు బోధింపగా, అది వారి ద్వారా మర్త్యలోకమున ప్రచారమందినది. ఇంక లాస్యము పార్వతీదేవి మరల బాణాత్మజయైన ఉషకు నేర్పినదట; ఆమె ద్వారవతిలోని గోపికలకు, ఆగోపికలు సౌరాష్ట్రయోషితలకు నేర్పిరి పిమ్మట వారినుండి ఆ యా దేశము (రాష్ట్రము) లందలి యోషితలు లాస్యమును నేర్చిరి.

నృత్త-నాట్య-నృత్య పదములను తులనాత్మకముగా నిర్వచించిన ప్రథముడు నందికేశ్వరుడే.

> "నాట్యం తన్నాటకం చైవ పూజ్యం పూర్వకథాయుతమ్ ।
> భావాభినయహీనంతు నృత్తమిత్యభిధీయతే ॥
> రసభావవ్యంజనాదియుక్తం నృత్యమితీర్యతే"

(పూర్వకథాయుతమై, పూజనీయమైన నాటకమే నాట్యము; భావాభినయ హీనమైనది నృత్తము; రసభావవ్యంజనాది యుక్తమైనది నృత్యము)

నందికేశ్వరుని తరువాత దశరూపక కర్తయగు ధనంజయుడును, తద్వ్యాఖ్యాతయగు ధనికుడును ఈ మూడింటి స్వరూపమును గూర్చి విపులమగు చర్చచేసి యున్నారు. (చూ. తెలుగు నాటక వికాసము. 1967. పుటలు 11-18). పిమ్మట సంగీతరత్నాకరమున శార్ఙ్గదేవుడును, నృత్తరత్నావళిలో జాయనయు వీటి స్వరూపములను, నందికేశ్వరునివలె, సూక్ష్మముగా వివరించినారు. కాని ఈ నల్వురును నృత్యవిషయమున నందికేశ్వరునితో ఏకీభవించినట్లు కనపట్టదు. నందికేశ్వరుడు నృత్యమును 'రస-భావ వ్యంజనాదియుక్త' మనగా వీరు నల్వురును 'రస' పదమును త్యజించినారు; కాగా వీరి దృష్టిలో నృత్యము రసవ్యంజకము కాదన్నమాట కాని, పిమ్మట నాట్యదర్పణకర్తలగు రామచంద్ర - గుణచంద్రులు (క్రీ. శ. 12 వ శతాబ్ది) నృత్యమును 'రస-భావ వ్యంజనాదియుక్తము'నుగానే చెప్పియున్నారు. నాట్యమువలెనే నృత్యము కూడ రసపోషకమే

యనెడి సత్యమును తెలుగు కవియగు నన్నెచోడుడు (క్రీ. శ. 12వ శతాబ్ది) గుర్తించి యుండుటస్మరణీయము (కుమారసంభవము-9 ఆ. 38 ప. ఇది రంభానాట్య వర్ణనము).[1]

"అలతులు నిల్వహస్తమున, హస్తవిలాసముతోఁ బెనంగఁ జూ
డ్కులు, దెలిచూల్కులందెలమి గూడి రమింపమనంబు, తన్మనో
బలమున నుల్లసిల్ల నిజభావను, భావవిశేషసంపదల్
వెలయ రసంబులం, దభినవించె రసంబులు సాంగికంబుగాన్."[2]

కావున నృత్యము కూడ, నాట్యమువలెనే, రసవ్యంజక మనుట స్పష్టము. ఇప్పట్లు గుర్తింపవలసిన విషయ మొకటి కలదు నృత్తము భావాభినయహీనమగుటచేత గాత్రవిక్షేపమాత్రమై, తాళ-లయాశ్రయ మగుచున్నది ఈ గాత్రవిక్షేప విషయమున నృత్త-నృత్యములు రెండును సమానములే కాని నృత్తము భావహీనముకాగా, నృత్యము అభినయాత్మకమైనది (ఈ అర్థమునందే 'నృత్యము' ను కేవలము 'అభినయము' అని కూడ వ్యవహరించుట కద్దు) నృత్యమున శుష్కాక్షరములు ప్రయుక్తములుకాగా, నృత్యమున సాహిత్యము (గేయాదులు) ప్రయుక్తమగుచున్నది. ఇంక అభినయ విషయమున నృత్య-నాట్యములు తుల్యములు కాని నృత్యము ఆంగికాభినయ ప్రధానముకాగా,

---

1. రంభోర్వశుల నృత్యమును వర్ణించిన మరికొందరు కవులు-
   1. కొఱవిగోపరాజు 'సింహాసనద్వాత్రింశిక' - ప్ర. భా. 1-129-30
   2. రఘునాథరాయల 'వాల్మీకి చరిత్ర' - 3 వ ఆ.

2. ఇట్టి పద్యములకు మూలము క్రింది అభినయదర్పణశ్లోకములు :
   "ఆస్యేనాలంబయేత్ గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్ ।
   చక్షుర్భ్యాం దర్శయేత్ భావం పాదాభ్యాం తాలమాచరేత్ ॥ - 36
   "యతోహస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః ।
   యతోమనస్తతో భావో యతో భావస్తతోరసః" ॥ - 37
   ఈ శ్లోకములను మరికొందరు తెలుగు కవులు కూడ అనుసరించియున్నారు-
   1. చిన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి' - 2-21.
   2 కొఱవిగోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' - ప్ర. భా. 1-133

3. చూ. "ఆంగికాభినయములచే (ఆంగిక-వాచిక-సాత్త్వికాభినయములచే) భావములను వ్యంజకముచేయు నర్తనము నృత్యము; ఇంక సర్వాభినయవర్జితమై, వక్ష్యమాణమగు అంగోపాంగ ప్రత్యంగ సహిత గాత్రవిక్షేపమాత్రమగు నర్తనము నృత్తము" - సంగీతరత్నాకరము 1 అ. 26-28 శ్లో.

నాట్యము సాత్త్వికాభినయప్రధానమును, కథాత్మకమును అగుచున్నది. నృత్యమున ప్రతిపదమునకును భావము అభినయము చేయబడుచుండగా నాట్యమున వాక్యార్థము సూచనామాత్రముగ అభినయింపబడును. కావుననే నృత్యము ప్రతిపదార్థాభినయమనియు, నాట్యము వాక్యార్థాభినయ మనియు శాస్త్రకర్తల నిర్దేశము

నాట్య-నృత్య-నృత్త భేదములచే నర్తనము త్రివిధమనియు, తాండవ-లాస్య భేదములచే నృత్త-నృత్యములు రెండేసి విధములనియు చెప్పుటయేగాక నృత్తము విషమ-వికట, లఘుభేదములచే మూడ్విధములని శార్ఙ్గదేవుడు చెప్పియున్నాడు కాని సోమేశ్వరుడు (క్రీ శ. 12వ శతాబ్ది) మానసోల్లాసమున నర్తన మూరు విధములని చెప్పుట గమనింపదగినది – నాట్యము, లాస్యము, తాండవము, లాఘవము, విషమము, వికటము (౪వ భాగము-శ్లో 959-60)

నృత్త-నృత్య-నాట్యములకు జాయసచేసిన నిర్వచనములు అర్వాచీనశాస్త్రకర్తల మతసారమని చెప్పవచ్చును

"పాట, వాద్యములు మొదలగువానితోగలిసి, లయను మాత్రము ఆశ్రయించి, అభినయములేక, అంగముల నాడించుట నృత్తమగును'' (1-53)

"భావముల నాశ్రయించినది, పదార్థముల నభినయించు స్వరూపముగలది నృత్యమగును" (1-50)

"నాట్యము సాత్త్విక భావములతోనిండి, రసాశ్రయమై, వాక్యార్థము నభినయించునదై యుండును" (1-25)

ఇంతస్పష్టముగా నృత్త-నృత్య-నాట్యములు నిర్వచింపబడినను, గ్రంథములందు లోకవ్యవహారమున నివి వ్యత్యస్తములుగా ప్రయుక్తములగుచు వచ్చినవి కాళిదాసు మాళవికాగ్నిమిత్రమందు 'నాట్య' పదమును 'నృత్య' మను నర్థమందేకాక (మాళవిక 'ఛలిత' మనెడి నాట్యమును ప్రదర్శించెనట), నాటకప్రదర్శనమను నర్థమందు (నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్) కూడ వాడెను. నేటితంజావూరు నృత్యము 'భరతనాట్యము' అను పేర ప్రసిద్ధికెక్కినది. ఇట్టి వ్యత్యస్త ప్రయోగములు సామాన్యులలో దురర్థములను కలిగించుచున్నవి. ఇట్టి అవ్యవస్థ 15వ శతాబ్దినాటికే ఏర్పడినదని విప్రదాసుని సంగీతచంద్రమువలన తెలియుచున్నది – "నాట్యము నృత్యమునకు పర్యాయపదముగా కన్పట్టుచున్నది; అట్లే నృత్యశబ్దము నృత్తమునకు పర్యాయ పదముగా కన్పట్టుచున్నది.''[1]

---

1. "రసాభివ్యక్తి పర్యంతో (ఆంగికః) నృత్యమిత్యభిధీయతే ।
నృత్యాభిధేఽంగాభినయే నాట్యశబ్దోఽపి వర్తతే ॥
లోకే హస్తైకదేశేఽపి హస్తశబ్దోయథా యథా ।
నృత్తే నృత్యైక దేశత్వాన్నృత్యశబ్దోఽపి వర్తతే ॥"
—భరతకోశము-పుటలు 340-41

అయినచో జాయన రచించిన 'నృత్తరత్నావళి' నృత్తమునకు శాస్త్రమా? నృత్యమునకు శాస్త్రమా? ఇప్పట్లు శార్ఙ్గదేవుని వాక్యములు స్మరణార్హములు – "నాట్యమందలి చతుర్విధాభినయములలో నృత్తమున కనుపయుక్తములగు వాచిక-సాత్త్విక-ఆహార్యములనెడి త్రివిధాభినయములను విడిచిపెట్టి మిగిలిన ఒక్క ఆంగికాభినయమును గూర్చి మాత్రమే ఇప్పుడు చెప్పబడుచున్నది" (7 అ. 34 శ్లో) అనుచు శార్ఙ్గదేవుడు ఒక్క ఆంగికాభినయము (గాత్ర విక్షేపమాత్రము) ను గూర్చియే వివరించియున్నాడు. ఇంక జాయన కూడ ఒక్క ఆంగికాభినయము (గాత్ర విక్షేపమాత్రమైన నృత్తము) ను గూర్చి మాత్రమే అధికముగా చెప్పెను; అందుచేతనే తన గ్రంథమునకు 'నృత్తరత్నావళి' అని పేరు పెట్టినాడు.

భరతాది శాస్త్రకర్తలందరును నృత్త-నృత్యములు రెండును నాట్యమునకుపకారములని స్పష్టము చేసియున్నారు. నృత్తము పూర్వరంగమందు ప్రయోగింపదగినది కాన నాట్యమునకుపకరించును. ఇంక నృత్యము కథావశమున, శృంగారరససంభవమై, నాట్యమున ప్రవర్తిల్లును. కావుననే నృత్త-నృత్యశాస్త్ర గ్రంథములందు నాట్య ప్రశంస కూడ, సూక్ష్మముగానైన, వచ్చుచుండును. కావుననే జాయన కూడ ప్రథమాధ్యాయమున నాట్యప్రశంసయు, చతుర్విధాభినయముల ప్రశంసయు చేసెను.

కావ్యార్థసాక్షాత్కారమునకు నృత్య-నాట్యము లుపయుక్తములగుచున్నవి కదా? ఇంక భావవిహీనమైన నృత్త ప్రయోజనమేమి? అనెడి ప్రశ్నకు భరతముని సమాధానమిట్లున్నది– "నృత్తము అర్థమును ఏ మాత్రమును అపేక్షింపని మాట నిజమే. కేవలము శోభను కలిగించుటకొరకే నృత్తము ప్రవర్తితమైనది. ప్రాయికముగా సర్వలోకమునకును నృత్తము సహజముగా ఇష్టము. అందుచేతనే నృత్తము మంగళప్రదమనబడినది. వివాహము, పుత్రజననము, ఆవాహము, ప్రమోదము, అభ్యుదయము మున్నగు సమయములందు వినోదకారణమగునట్లుగా ఈ నృత్తము ప్రవర్తితమైనది."

–(చూ. తెలుగు నాట్యశాస్త్రము 1959–పుట–121)

ఈ సందర్భమున నందికేశ్వరుని వివరణ మిట్లున్నది (12–14) – "నాట్య, నృత్తములను విశేషముగా పర్వకాలములందు చూడవలెను." ఇంక నరేంద్రుని అభిషేకోత్సవము, యాత్ర, దేవయాత్ర, వివాహము, ప్రియసంగమము, నగరప్రవేశము, గృహప్రవేశము, పుత్రజననము మున్నగు సమయములందు సర్వకర్మలందును శుభార్థులైనవారు మంగళప్రదమైన నృత్యమును ఏర్పాటు చేయవలెను." శార్ఙ్గదేవుడు కూడ ఇట్లే వీనిని నృత్యసమయములుగానే పేర్కొనినాడు. కాని జాయనమాత్రము వీనిని 'నృత్త సమయములు'గానే చెప్పియుండుట గమనింపదగినది (1–18).

నృత్తవిషయమున భరతముని చెప్పిన సుకుమారభేదము నందికేశ్వరుని నాటికి 'లాస్యము'గా రూఢిపొందినదని గుర్తించినాము. ఈ తాండవ-లాస్యభేదములను శార్ఙ్గదేవ-జాయనలు నృత్తమునకే కాక నృత్యమునకు కూడ అన్వయించినారు. జాయన లాస్య ప్రచారకథను చెప్పకపోయినను లాస్యాంగములను సంక్షిప్తముగా వివరించి యున్నాడు (1-58-72).

గీత-వాద్య—నృత్తములు మూడును 'సంగీత' మనబడుననిచెప్పుచు, మార్గ-దేశి భేదములచే సంగీతము రెండు విధములని శార్ఙ్గదేవుడు చెప్పెను జాయన ఈ భేదములను నృత్త-నృత్య - నాట్యములు మూడింటికిని చెప్పుట గమనింపదగినది (నందికేశ్వరుడిట్టి భేదములను చెప్పలేదు). జాయన చెప్పిన ప్రకారము—నాట్యవేదము నుండి వెలువడినది, మహర్షులు వెదకినది, సజ్జనులు ప్రచారముచేసినది 'మార్గ' మనబడును (1.52); ఇంక ఆయాదేశముల జనులయిష్టానుసారము చెల్లునది 'దేశి' యనబడును (1-54).

## 2. ఆంగికాభినయము : నృత్తము

" 'అభి' అను ఉపసర్గతో చేరిన 'ణీ' ధాతువునకు కర్త్రర్థమున 'అచ్' ప్రత్యయమును గూర్చునప్పుడు 'అభినయ' పదమేర్పడును ప్రయోగము అభిముఖమగునట్లు చేయునది గనుక అది అభినయమనబడును " (1-27) అని జాయన 'అభినయ' పదమును నిర్వచించెను ఈ అభినయము నాలుగు విధములు- ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము (1-29-49).[1] నాట్యప్రయోగసమయములో నటులు ఈ చతుర్విధాభినయముల సాహాయ్యమున రూపకములందలి అర్థములను ప్రేక్షకులకు అభిముఖమగునట్లు—అనగా హృదయగోచరమగునట్లు-చేయుదురు. నాట్యము లోకమునందలి సర్వ ప్రకృతులను, సర్వభావములను ప్రదర్శించుచున్నది. ఈ సర్వభావములును మనఃప్రభవములే; మనస్సులోని ఈ భావములను వ్యక్తముచేయుటకు అంగవిక్షేపము లేదా అవయవ విన్యాసము ఒక సాధనము.

---

1 భరతముని నాట్యశాస్త్రమున సామాన్యాభినయము (22 వ అధ్యా.), చిత్రాభినయము (25 వ అధ్యా ) అను రెండు అభినయములను కూడ చెప్పెను. కాని, ఇవి రెండును ప్రత్యేకభేదములు కావని తెలియవలెను. వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములకు సంబంధించిన విశేషాభినయమే 'సామాన్యాభినయ' మను పేర వివరింపబడినది. ఇంక చిత్రాభినయము సామాన్యాభినయమునకు శేషభూతమైనను ఇది ప్రధానముగా ఆంగికాభినయమునకు సంబంధించినది. కావున ఆయా అభినయములను వివరించునప్పుడు చెప్పబడని విశేషాంశములే ఈ రెండింటియందును చెప్పబడిన వన్నమాట.

మానవశరీరమందలి అవయవములు మూడు వర్గములుగా విభజింపబడినవి- అంగములు, ఉపాంగములు, ప్రత్యంగములు (2-1-2). వీటి కదలికలతో భావములను వ్యక్తము చేయుట లేదా భావానుగుణముగా అవయవములను విన్యసించుట 'ఆంగికాభినయ'మనబడును శిరస్సు, చేతులు, వక్షము, ప్రక్కలు, మొల, పాదములు- ఈ ఆరును అంగములు (స్కంధములుకూడ అంగములేయని కొందరందురు) కన్నులు, బొమలు, ముక్కు, పెదవులు, చెక్కులు, గడ్డము- ఈ ఆరును ఉపాంగములు [1] మెడ, భుజములు, కడుపు, వెన్ను, తొడలు, పిక్కలు- ఇవి ఆరును ప్రత్యంగములు (మణిబంధము, జానువులు, భూపణములు- ఈ మూడునుకూడ ప్రత్యంగములేయని కొందరందురు).

అంగ, ఉపాంగ, ప్రత్యంగ సహితమైన ఆంగికాభినయము స్థూలముగా మువ్విధములు- శారీరము, ముఖజము, చేష్టాకృతము ఈ మూడింటియందును క్రమముగా- శాఖ, అంకురము, నృత్తము అనునవి ప్రధానములు. శాఖ, అంగములు, ఉపాంగములు, ప్రత్యంగములు- వీని మూలమున చేయబడునది శారీరము. ఉపాంగములచే మాత్రమే నిర్వర్తించబడునది ముఖజము. నిలుచుట, కూర్చుండుట, నడచుట మొదలగు చేష్టలతో కూడినది చేష్టాకృతము. విచిత్రకరవర్తనశాఖ యనబడును. కడచిన వాక్యార్థములను మాత్రమే సూచించుట అంకురము, అట్లే రాబోవు వాక్యములను సూచించుట సూచ ఇంక కరణ - అంగహార సాధితమగునది నృత్తము (1-30-34).

శారీరాభినయమందు అవయవములన్నియును భావవ్యక్తీకరణ సమయమున ఏకకాల ప్రవర్తితములగును. ఇంక చేష్టాకృతాభినయమందు స్థాన-ఆసన-శయన-గమనాది చేష్టలు ప్రవర్తిల్లును శారీరాభినయమందు చలనము ప్రధానము కాదు, కాని చేష్టాకృతాభినయమందు చలనమే ప్రధానము. ఈ చేష్టాకృతాభినయము రెండు విధములు— గతిప్రచారము), (గతి, స్థితి నృత్తము (లాస్యముకూడ చేష్టాకృతాభినయమే). భావ-అవస్థా ప్రదర్శకమైనది గతిప్రచారము- అనగా ఏ ప్రకృతి ఏ అవస్థలో, ఎచ్చట ఏ విధముగా నడువవలెను, నిలువవలెను, కూర్చుండవలెను, శయనించవలెను అనువానికి సంబంధించిన వివరణమే గతిప్రచారము; ఇది నాట్యమునకు ప్రాణము ఇంక నృత్తము అర్థ ప్రదర్శకము కాదు, కాని ఇది చారీ-మండల, కరణ-అంగహార సంయుతమై గీత-వాద్య సహితమై, శోభాకరమును, మంగళప్రదమును అగుచున్నది

1. శార్ఙ్గదేవుడు ఉపాంగములనిట్లు వివరించెను—
"దృష్టి, పుటములు, తారకలు, కపోలములు, నాసిక, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు, అధరము, దంతములు, జిహ్వ, చిబుకము, వదనము - ఈ పండ్రెండును శిరము నందలి ఉపాంగములు; పార్ష్ణులు, గుల్ఫములు, చేతివ్రేళ్లు, కాలివ్రేళ్లు, పాదతలములు - ఇవి తక్కిన అంగములందలి ఉపాంగములు." —7 అ. 38-42.

## పీఠిక

భరతాదులందరును అంగ-ఉపాంగ-ప్రత్యంగములకు సంబంధించిన అభినయ భేదములను పేర్కొని, నిర్వచించి, వినియోగములను వివరించియున్నారు.[1] ఇవి యన్ని యును భరతముని పేర్కొన్నట్లుగా, లోకకరణాశ్రయములే; అనగా లోకధర్మి ననుసరించి నవే. భరతాదులననుసరించి, అభినయము లోకధర్మి, నాట్యధర్మి భేదములచే రెండు విధములు.[2] అభినయము లోకానుసారిగా ఉండుట లోకధర్మి, ఇంక నాట్యలక్షణ లక్షితమగుట నాట్యధర్మి లోకధర్మి అనునది లోకమునందును, నృత్య-నాట్యములందును ఉండును, కాని నాట్యధర్మి అనునది నృత్త-నృత్య-నాట్యములందే ఉండును నృత్త-నృత్యములందు నాట్యధర్మి అధికము; నాట్యమందు లోకధర్మి అధికము ఇంక నాట్య మందే-నాటకాదులలో నాట్యధర్మి అధికము; ప్రకరణాదులలో లోకధర్మి అధికము. కావుననే లోకధర్మి భిత్తి స్థానీయమనియు, దానిమీది చిత్రమే నాట్యధర్మియనియు అభినవ గుప్తుడు పేర్కొనియున్నాడు

## ముఖజాభినయము :

దృష్టులు- దృష్టి భేదములు ముప్పదియారు; ఇందు రసదృష్టులెనిమిది, స్థాయిభావదృష్టులెనిమిది, సంచారి భావదృష్టులిరువది ఈ దృష్టులయందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నదని భరతముని నొక్కి చెప్పినాడు "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" అన్నట్లే, నాట్యమునకు జీవగఱ్ఱ అయిన అభినయమునకును దృష్టులు ప్రాణ మన్నమాట.

తారకలు తొమ్మిది విధములు; తారకలననుసరించి యుండు దర్శనప్రకా రము లెనిమిది విధములు; తారకలనే అనుసరించి యుండెడి కనురెప్పలు తొమ్మిది విధములు, తారకలను కనురెప్పలను అనుసరించెడి కనుబొమ లేడు విధములు. నాసిక ఆరు విధములు, ఓష్ఠ (అధర)ము ఆరు విధములు, కపోలములారు విధములు, చుబుక మేడు విధములు, హనువు ఆరు విధములు, జిహ్వ ఆరు విధములు, దంతములైదు విధ ములు, ముఖరాగము నాలుగు విధములు

---

1. ఆయా శాస్త్రకర్తలు పేర్కొన్న సంఖ్యలలో కొలది భేదములున్నవి; వాటినెల్ల పట్టిక రూపములో కూర్చి చూపినాను-చూ తెలుగు నాట్యశాస్త్రము పుట 390. ఇచ్చట మాత్రము జాయనను అనుసరించి పేర్కొనుచున్నాను
2. లోకధర్మి, నాట్యధర్మి - ఇవి రెండును చిత్తవృత్త్యర్పిక, బాహ్యావస్త్వనుకారిణి అనెడి భేదములచే మరల రెండేసి విధములని శార్ఙ్గదేవుడు చెప్పినాడు (సం ర. 7 అ 22-26). వీటిలో మనోధర్మమును నిరూపించునది చిత్తవృత్త్యర్పిక (గర్వ సూచకముగా మీసములు మెలిపెట్టుట మొ॥); ఇంక బాహ్యావస్తువులను అనుక రించునది బాహ్యావస్త్వనుకారిణి (పద్మమును సూచించుటకు పద్మకోశహస్త మును పట్టుట మొ॥).

**శారీరాభినయము :**

శిరస్సు పదుమూడు విధములు (ఇతరులు చెప్పినవి మరి పదునొకండు కలవు).

హస్తములు అరువదియారు ; ఇందు అభినయ హస్తములు ముప్పదియేడు , నృత్త హస్తములిరువది తొమ్మిది అభినయహస్తములు మరల రెండు విధములు— అసంయుత హస్తములిరువది నాలుగు , సంయుత హస్తములు పదుమూడు. పతాకాదు లిరువది నాలుగును అసంయుతహస్తములైనప్పటికిని, కార్యవశమున రెండవ హస్తము కూడ చేరుచుండును ; ఇంక సంయుతహస్తములు మాత్రమెల్లప్పుడును సంయుతము లుగానే యుండును. ఇంక నృత్తహస్తములు కేవలము నృత్తోపయోగులు మాత్రమే. సాత్త్వికాభినయమందు దృష్టులు ప్రధానములు కాగా, ఆంగికాభినయమందు హస్తములు ప్రాధాన్యమును వహించును

వక్షమైదు విధములు, పార్శ్వములైదు విధములు, కటి అయిదు విధములు, పాదములైదు విధములు (ఇతరులు మరి పది భేదములు చెప్పిరి)

ఇంక ఉపాంగములు— శిరఃకర్మననుసరించెడి గ్రీవము తొమ్మిది విధములు, జఠరము ముప్విధములు, ఊరువు లైదు విధములు, జానువు లేడు విధములు, జంఘలైదు విధములు (ఇతరులు చెప్పినవి మరియైదు), పాదాంగుళులేదు విధములు (ఇతరులు చెప్పినవి మరి మూడు విధములు).

**చేష్టాకృతాభినయము :**

దేశ–కాల–అవస్థా–వయోచితముగా, ఉత్తమ–మధ్యమ–అధమ ప్రకృతుల స్వభావోచితముగా స్త్రీ పురుషులు రంగస్థలమును ప్రవేశించు విధమును, రంగస్థలమందు ప్రవర్తించు విధమును భరతముని 'గతిప్రచార'మను పేర ఒక ప్రత్యేకాధ్యాయమందు వివరించియున్నాడు (12వ అధ్యా) అందు మొదట రసానుసారులైన గతులు, పిమ్మట దేశానుసారులైన గతులు వివరింపబడినవి. అటు పిమ్మట స్థానక–ఆసన–శయన భేదములు చెప్పబడినవి పురుషుల స్థాన(క)ములారు; స్త్రీల స్థాన(క)ములు మూడు (ఎనిమిదని జాయన). స్థాన(క)మనగా ఒక భావమును చూపుటకై కనుచూపులు వెన్నంటి చేయు ఒకానొక నిశ్చలమైన నిలుపు. స్త్రీ పురుషుల సుప్తస్థానములు (శయనవిధి) ఆరు విధములు. ఇంక ఉపవేశన విధి ఆయా సన్నివేశముల కనుగుణముగా నుండవలెను.

కర్తియుద్ధమందు న్యాయములనునవి ప్రవర్తిల్లును , ఇవి నాలుగు విధములు. ప్రవిచారములనునవి శస్త్రప్రయోగమందు ప్రవర్తిల్లును (శస్త్రప్రయోగము రెండు విధ

ములు—ఒకచేతితో వేయఁదగినవి; రెండుచేతులతో వేయఁదగినవి) ఇంక ధనుర్యుద్ధమునందు ప్రవర్తిల్లు ధనుఃకరణములు నాలుగు ఇచ్చట ఒక విషయమును గ్రహింపవలసి యున్నది—రంగముమీద ఆయుధములతో చీల్చుటచేత, నరకుటచేత, నెత్తురు కార్చుట, స్పష్టముగా గాయపరచుట, చిత్తమునకుద్వేగము గలిగించుట, మొదలగు పనులేవియును చేయ గూడదు. లేదా, పగుల్చుట మొదలగు వానిని శాస్త్రీయమైన అభినయములచేతనే చేయవ లెను; ఎందుకనగా సామాజికులకు చూపిన జాలును, వారు తెలిసికొందురు.

ఇంతకుముందు కటీ—ఊరు - జాను - జంఘా-పాద-పాదాంగుళుల కర్మలు వేర్వేరుగా పేర్కొనబడినవి. ఇవియన్నియు పరస్పరసంయోజితములై ఏకార్థమున ప్రవర్తితములగుట 'చారి' అనబడును; వీనిలోపాదము ప్రధానమగుటచేత పాదప్రచారమే 'చారి' అని కూడ అందురు చారులు మొత్తము ముప్పదిరెండు-అందు భూచారులు పదునారు; ఆకాశచారులు పదునారు పాదములు రెండును ఎక్కువగా భూమియందు చరించునవి భూచారులనబడినవి, పాదములు ఎక్కువగా ఆకాశమందు చరించునవి (పైకెత్తబడునవి) ఆకాశచారులన బడినవి భూచారులు ప్రధానముగా నియుద్ధమందును, కరణములందును ప్రయుక్తములగును. ఇంక ఆకాశచారులు లలితములైన అంగక్రియా రూపములు.

ఒక కాలిపని చారి యనబడును; రెండు పాదములది కరణ మగును. మూడు కరణముల ప్రచారము ఖండమనబడును ఖండములు మూడో, నాలుగో చేరి మండల మగును అనగా, పైని వివరించినట్లు ఏకపాదప్రచారము చారికాగా బహుపాదముల ప్రచారము 'మండలము' అనబడును. ఆకాశ—భూచారుల ప్రాచుర్యమును బట్టి మండల ములుకూడ ఆకాశ-భూభేదములచే రెండువిధములు అనగా ఆకాశచారులప్రాచుర్యమున్న మండలములు ఆకాశమండలములును, భూచారుల ప్రాచుర్యమున్న మండలములు భూమండలములును అగును. భౌమమండలములు పది; ఆకాశమండలములు పది. ఇవి ఏకజాతి చారులవలన నేర్పడినవి. పండితుడు ఆకాశ-భూచారులను కలిపి మరికొన్ని మండలములను కల్పింపవచ్చును. మండలములన్నియు, యుద్ధమందు. బాహుయుద్ధము నందు, నర్తనమునందు శాస్త్రప్రకారము ప్రవర్తిల్లును.

ఇచ్చట ఒకవిషయమును గుర్తింపవలసియున్నది - పాదప్రచారము ఉన్నప్పుడు దాని ననుసరించి హస్తప్రచారమును ఉండును సందర్భమును బట్టి, ఔచిత్యము ననుస రించి, హస్తవ్యాపారము పాదప్రచారమునకు ముందుగానో, సమముగానో, వెనుకగానో ఉండును. అనగా ఒకప్పుడు పాదము ప్రధానముగా, మరొకప్పుడు హస్తము ప్రధాన ముగా, ఇంకొకప్పుడు రెండును ప్రధానముగానుండును. పాదము ముఖ్యముగానున్నచో హస్తములు తగ్గియుండదగును; తమకే ముఖ్యత్వమున్నయెడల అవి ముందుగానడుచును. రెండును ముఖ్యములేని సమములై సాగును. ఇది అందముననుసరించి, ప్రయోగముచే

తెలిసికొనవలయును. చారిని ప్రయోగించునపుడు అడుగులున్న దిక్కులో హస్తము లుండవలెను, హస్తమున్న దిక్కు త్రికము (వెన్నెముకక్రింది భాగము) తిరుగవలయును; అది తిరిగిన దిక్కునసే కన్ను మొదలగునవి ప్రసరించవలయును పాదచారియందు తన పని ముగించి పాదము నేలపై నిలుచునట్లే హస్తము కూడ తనపని ముగియగానే కటినాశ్రయించును ఇచ్చట ఇంకొక విషయమును కూడ గుర్తింపవలసియున్నది–హస్త ప్రచారమున్నప్పుడెల్ల పాదప్రచారము ఉండునని చెప్పజాలము; కాని హస్తప్రచార మున్నప్పుడు తుంటి పైభాగమంతయు అనగా ఊర్ధ్వకాయ మంతయు సాధారణముగా కదలుచునే యుండును

హస్తములను లేదా హస్తప్రచారమును గూర్చి ఇంతకుముందే వివరించి యున్నాను ఈ హస్తప్రచారము, పాదప్రచారము వేర్వేరుగా జరుగుట కాక, ఏక కాలమున సమన్వయరూపమున ప్రవర్తితములగుట 'కరణ' మనబడును (స్థానకములు, నృత్త హస్తములు, చారులు–ఇవి మూడును ఏక కాలమున తగినట్లు కూడుకొనుట) అనగా హస్త–పాదసమాయోగము 'కరణ' మన్నమాట ఇచ్చట హస్తమనగా ఉర్ధ్వకాయమునకును, పాదమనగా అధఃకాయమునకును ఉపలక్షకములు; కావుననే హస్త–పాదములతో పాటు తక్కిన అవయవములన్నియును ఏక కాలమున తత్తదుచితములుగా విన్యస్తములగు చుండును. అందుచేతనే చారులు, నృత్తహస్తములు కరణమునకు మాతృక (మూలాధారము) కాగా కరణము నృత్తమునకు మాతృకయని పేరు పొందినది (కరణమును, అసలు, నృత్తకరణమనియే అందురు). "మీది – క్రింది దేహమునకు చేరిన హస్తములు, పాదములు మొదలైన అంగములు తమ తమ చోటినుండి వేరొక చోటికి విలాసపూర్ణముగా చేరుట నృత్తకరణ మనబడు"నని జాయన దీనిని నిర్వచించి యుండెను (IV–3)

చేతనప్రధానమగు మానవజీవితమందు, నిత్యకృత్యములలో హస్త–పాదముల కదలికలు అనంతములుగానుండును. కాని, విలాసవిన్యాసములతో కూడిన వానిని మాత్రమే శాస్త్రకర్తలు గ్రహించినారు. భరతముని సువ్యవస్థితములైన నూట యెనిమిది కరణములను మాత్రమే పేర్కొని నిర్వచించెను. జాయనయు అట్లేచేసెను. (డా. వి. రాఘవన్‌గారు కరణములను గూర్చి తులనాత్మకమైనా పరిశీలనచేసియున్నారు. చూ. వారి పీఠిక–పుటలు–65–115)

హస్తపాద సమాయోగమువలన నేర్పడిన వివిధములగు కరణములను పరస్పరము సంయోజనము చేసినచో ఏర్పడు కరణముల సమూహములను 'అంగహారము' లందురు. కరణములనంతములైనట్లే అంగహారములు కూడ అనంతములే; కాని, భరతాదులు విశిష్టములును, స్పష్టగోచరములును అయిన ముప్పదిరెండు అంగహారములనే పేర్కొని, నిర్వచించిరి. జాయన ముప్పదిరెండు అంగహారములను రెండువర్గములుగా విభజించియున్నాడు–చతురశ్రాంగహారములు పదునారు; త్ర్యశ్రాంగహారములు పదునారు.

ఒక్కొక్క అంగహారము అనేకకరణముల సమాహారమైనప్పటికిని, అంగహార ప్రయోగమందు ఆయాకరణములు విడివిడిగా కన్పట్టరాదు; అవి ఏకరూపముగా భాసించి, ఏకతాబుద్ధిని కలిగింపవలయును అనగా ఒక కరణములోని హస్తపాదవిన్యాసము నుండి, రెండవాని కరణములోని హస్త-పాదవిన్యాసము ప్రారంభమగునప్పుడు ఏకసూత్రత చెడకుండ నృత్యాచార్యుడు సంయోజనము చేయవలయును. ఈ సంయోజనము నందు ప్రధానముగా ఉపయుక్తములగునవి రేచకములు. చారీకరణాంగహారాదులందు కాని, తదితర విన్యాసములందు గాని అవయములలో దేనినేని స్వస్థానమునుండి కదల్చుట, లేదా గుండ్రముగా త్రిప్పుట, లేదా పైకిఎత్తుట, లేదా స్వేచ్ఛగా చలింపజేయుట 'రేచకము' అనబడును పాదరేచకము, కటి రేచకము, హస్తరేచకము, గ్రీవారేచకము అనెడి భేదములచే రేచకము నాలుగు విధములు కాగా నృత్తమునందు ఒక భంగిమకును, ఇంకొక భంగిమకును మధ్య నేర్పడెడి అవకాశములను (ఛిద్రములు-Gaps) పూర్తిచేసి, నైరంతర్యము (Continuity)ను చేకూర్చునవి రేచకములన్నమాట.

ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసియున్నది. శాస్త్రములందలి కరణాంగహారాదుల నిర్వచనములను, వినియోగములను చదువుకొని, స్వయముగా సాధించుటకు పూనుకొన్నంత మాత్రమున ఎవ్వరును నృత్త - నృత్యప్రయోగసమర్థులు కాజాలరు. శాస్త్రమెంత చెప్పినను, అందుకొన్ని ఛిద్రములు ఉండనే ఉండును. కాని సంప్రదాయము నెరిగిన ఆచార్యుడు, తదనుసారముగా, ఛిద్రచ్ఛాదనముచేసి, అలాతచక్రప్రతిమత్వమును సాధించును. కావున శాస్త్ర-సంప్రదాయ విదుడైన ఉత్తమాచార్యునికడనే నృత్త-నృత్యముల నభ్యసింపవలెను.

ఈ కరణ-అంగహారవములను సుష్ఠుగా నిర్వర్తించుటకును, వానిని అర్థావబోధకములగు నట్లుగా మలచుటకును, ప్రదర్శనసమయమందు అలసట లేకుండుటకును చక్కని వ్యాయామము ఆవశ్యకము ; అంతేకాదు, ఈ వ్యాయామము నిరంతరము కావలయును. లేనిచో నేర్చినది మరచిపోయి, మరల మొదటికి వచ్చుట జరుగును. నృత్యాచార్యుడు శరీరశాస్త్రమును కూడ బాగుగా తెలిసినవాడై, ఆయా శిష్యుల అవయవగతిని చక్కగా గుర్తింపగలిగినవాడు కావలయును. ఇంక నర్తకీ - నర్తకులు సుశిక్షణకు లోబడినవారై, తమతమ అవయవములనన్నింటిని స్వాధీనము నందుంచుకొని, శిల్పి శిలలను మలచునట్లుగా తమతమ అవయవములను వలసిన విధముగా మలచుకొనగలవారు కావలయును. ఇంతశ్రమతో, దీక్షతో కూడుకొన్న నృత్త-నృత్యాభ్యాసములు యోగతుల్యమైనవి; కావుననే అవి శివ-పార్వతులకు ప్రీతిపాత్రములు !

పాల్కురికి సోమనాథుని బసవపురాణమున శివతాండవ ప్రశంసకలదు. కంచి ఏకామ్రనాథుని గుడిలో నాట్యనమిత్తండి తాండవమూర్తిని చూచి, ఏకామ్ర

నాథుడు రోగగ్రస్తుడైనాడని భావించి, చికిత్సలుచేసి, ఫలముకానక, శివుని ప్రార్థింప, ఆయన ప్రత్యక్షమై తాండవస్వరూపము నిట్లువివరించెను (పుటలు 59-60) :

"ఇది తాండవాకార మెట్టులంటేని - ముదమున నాట్యాభిముఖుడనై నిల్చి
'హాం'యని డమరుకంబొగి నొక్కమాటు-వాయింపఁదడవ సర్వమ్ము లయంబొందఁ
జరణంబు దొలవిచగలనగాఁ జేసి - పరగంగ నక్షత్ర పంక్తులు డుల్ల
వినుతమహోద్రేకవీక్షణాటోప-మున నజాచ్యుత దేవముఖ్యులడంగ
మూవలగంటల మ్రోతకు వెఱచి-దేవియున్న సగంబుధృతిఁదన్నుఁగలయ
ఖ్యాత మహోద్ధతకరతాడనముల-నాతతదిక్తతియవలన జనంగ
వడిమహోచ్ఛ్వాస నిశ్వాసోపనిహతి-బడబానలంబాఱ జడనిధులింక
గతినిమెట్టెడుపాద ఘట్టనచేత-నతుల ధాత్రీతలంబది ధూళిగాఁగ
నురవడిమైజిట్టఁదిరిగి నిల్చుడును-బోరిమూలి దిగ్గజంబులు వొడవడఁగ
గ్రక్కున జాఱిటంకారంబుచేత-నెక్కొన్న కులగిరుల్ నెఱఁబొడి గాఁగ
నొందంగఁ బాదాగ్రమూఁదినటింప - గ్రిందటి కూర్మంబు గిజిగిజిగాఁగ
మహిత జటాచ్ఛటా వినాతినజాండ-బహులకటాహంబు వఱియలుగాఁగ
నురుకిరీట విఘాతనోద్వృత్తిఁజేసి-పొరిఁదత్త్వసందోహములు వెల్లగిలఁగఁ
దాండవోద్ధతిఁజేసి ధరియింపఁబడిన-డండి ఫణీంద్రుండుదలరి రోజంగ
నిటురోజుచున్న ఫణీంద్రు నూర్పులకు - స్ఫుటఫాలనేత్రాగ్నిభుగులనెగయ
వడి నెగసెడినేత్రవహ్ని రోచులకు-జడలపైఁ జంద్రుఁడా సగమునుగరఁగఁ
గలయ సుధాసూతి గరఁగినకతన-బలువిడి నమృతంబు దలడిగి పఱవఁ
దలడిగి పఱతెంచు తత్సుధాపూర- మలరిముంచుడు జీవనములువచ్చియంత
నురమున శిరమున నొగిగళంబునను-గరముల భూషణోత్కరములై వెలిఁగి
పరుగు సురాసురబ్రహ్మాచ్యుతాది-వరకపాలావళుల్ శరణువేఁడుచును
బొబ్బలు వొడువంగఁ బొంగియార్వంగ-నుబ్బియాళతి సేయ నొగిఁదాళగింపఁ
గ్రీడవత్రీల జతిగీతముల్ పాడ-నాడుదుఁ బ్రమథులు సూడఁదాండవము"

తెలుగు సాహిత్యమున శివతాండవవర్ణనమింత విపులముగా మరియొకచోట కన్పట్టదు. అందున, కవి, శివునినోటనే స్వీయతాండవస్వరూపమును చెప్పించుట మరియొక విశేషము.

ఆదిలో నృత్తము ఏకవిధమే. కాని, తరువాతి కాలములో అందు పెక్కు భేదములు కలిగినవి. వీనిలో శాస్త్రానుగుణములైన వానిని 'మార్గ' భేదములనియు, ఆయాదేశములందు ప్రవర్తిల్లిన వానిని 'దేశి' భేదములనియు పేర్కొనుచున్నారు. "రాజులకు ప్రాయికముగా క్రొత్తక్రొత్త విషయములందు ప్రీతియుండును. కనుక వారి ప్రీతికై, క్రొత్తక్రొత్తగా ఏ నృత్తము కల్పింపబడునో, అది ఆయాదేశముల ననుసరించు

నదిగనుక 'దేశి' యనబడు"నని జాయన దేశి నిర్వచనము (V–3) భూతకాలమందలి దేశి నృత్తము శాస్త్రప్రమాణము సంపాదించియుండును కాన అది మార్గభేదములోనే చేరి పోవును, ఇంక భవిష్యత్తు విషయము తెలియరాదు ; అందుచేత ప్రస్తుతము (తననాడు) నడచుచున్న దేశి భేదములను గూర్చియే తెలుపుచున్నట్లు జాయన పేర్కొనుట గమనింపదగియున్నది (V–4).

మార్గపద్ధతియందు పేర్కొన్న భేదములకు, దేశిపద్ధతియందు పేర్కొన్న భేదములకు కొన్నింట నామసామ్యము కన్పట్టగలదు, అంతేకాదు, దేశిభేదములు చాలవరకు సంస్కృతభాషానామములు కలిగియుండుట కూడ గమనింపవచ్చును. ఈ దేశి భేదములు మార్గభేదములకు పూరకములు, సహకారకములు అని చెప్పదగును. ఇప్పుడింక నృత్తరత్నావళిలో చెప్పబడిన ఆంగికాభినయమును సంక్షిప్తముగా పట్టికలరూపమున వివరింతును.

## ఆంగికాభినయము











శారీరము
(అంగాభినయము)
శిరస్సు
(13+11)
హస్తములు
వక్షము
(5)
పార్శ్వములు
(5)
కటి
(5)
పాదములు
(5+10)
సంయుత
(13)
అసంయుత
(24)




శారీరము
(ఉపాంగాభినయము)
గ్రీవము
(9)
జఠరము
(3)
ఊరువులు
(5)
జానువులు
(7)
జంఘలు
(5+5)
పాదాంగుళులు
(7+3)




చేష్టాకృతము
(గతిప్రచారము)
గతి
స్థితి
రసాదిగతులు
దేశిగతులు
(21+ )
స్థాన(క)మములు
(స్థానము)
(6+3)
దేశిస్థానములు
(23)
ఉపవేశనవిధి
(ఆసనము)
సుప్తస్థానములు
(శయనము)
(6+3+5)


చేష్టాకృతము
(నృత్తము)
తాండవము
(ఉద్ధతము)
లాస్యము
(సుకుమారము)
లాస్యాంగములు
(10+2)
దేశిలాస్యాంగములు
(46)
మండలములు
(20)
అంగహారములు
(16+10)
భౌమ
(10)
ఆకాశికి
(10)
నృత్తకరణములు
(108)
నృత్త హస్తములు
(31)
చారులు
(32)
దేశి ఉత్ప్లుతికరణములు
(32)
భౌమ
(16)
ఆకాశిక
(16)
దేశిభౌమ
(26)
దేశి సంకీర్ణ
(4)
దేశిఆకాశిక
(16)
రేచకములు
(4)
ప్రవిచారములు
( )
ధనుఃకరణములు
(4)
దేశిభ్రమరులు
(8+5)

# 3. దేశి

దేశి సంప్రదాయము గ్రంథస్థమగుట యెప్పటినుండి జరిగినదో చెప్పుటకు తగిన యాధారములు లేవు మతంగుడు 'బృహద్దేశి' యను గ్రంథమును రచించెను. కాని, ఇందు సంగీతమునకు సంబంధించిన అల్పభాగము మాత్రమే లభించినది. సంగీత రత్నాకరమునకు వ్యాఖ్యానము రచించిన కల్లినాథుడు కోహలుని "సంగీత మేరువు" నుండి 'చాలకము' లకు సంబంధించిన భాగము నుద్ధరించి యున్నాడు ఇందులో నారదుని 'దేశీ నృత్త సముచ్చయము' కూడ ఉదాహృతమైనది. ఈ రెండు గ్రంథములుకూడ లభ్యము కాలేదు. ఇంక లభ్యములైన గ్రంథములలో, దేశి సంప్రదాయమును వివరించిన ప్రధాన గ్రంథము సోమేశ్వరుని మానసోల్లాసము (అభిలషితార్థచింతామణి) అటు పిమ్మట పేర్కొన దగినవి శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము, పార్శ్వదేవుని సంగీతసమయసారము, జాయన నృత్తరత్నావళి.

దేశినృత్త సంప్రదాయవివరణములో శార్ఙ్గదేవుని పద్ధతికిని, జాయన పద్ధతికిని భేదమున్నది. శార్ఙ్గదేవుడు దేశి భేదములను ఆయామార్గభేదముల వెనువెంటనే వివరింపగా, జాయన దేశిభేదముల నన్నింటిని, ప్రత్యేకముగా నాల్గు అధ్యాయములందు వర్ణించియున్నాడు. జాయన వర్ణించిన దేశి భేదములను రెండు వర్గములుగా విభజింపవచ్చును - దేశిస్థానక, ఉత్ప్లుతికరణ, భ్రమరి, పాద, పాట, చారి, లాస్యాంగ, గతిభేదములు మొదటివర్గము ; ఇవి మార్గభేదములకు అనుషంగికములు (additional poses). ఇంక పేరణి, రాసకము, చర్చరి, బహురూపము, ఖాండిక, కొల్లాటము మున్నగు ప్రత్యేకనృత్యపద్ధతులు రెండవ వర్గము.

## ప్రథమ వర్గము :

స్థానకములు - దేశిస్థానకములు ఇరువదిమూడు. పార్శ్వదేవుడు చెప్పిన ప్రకారము ఈ దేశిస్థానకాదులు పేరణి, ప్రేంఖణము, గొండ్లి, దండరాసకము మున్నగు దేశి నృత్యము లందెక్కువగా ఉపయుక్తములు. ఉత్ప్లుతికరణములు : ఇవి ఐదు తెరగులు - అంచిత భేదములు (14), ఆలగాదులు (4), లోహడి మొదలగునవి (7), దర్పసరణాదులు (3), కపాల స్పర్శనాదులు (4) - మొత్తము 32. దేశి భ్రమరులను కూడ శార్ఙ్గదేవుడు ఉత్ప్లుతికరణములందే కలిపిచెప్పినాడు. 'ఉత్ప్లుతి' (గంతు) అనునది ఈ దేశికరణము లందలి విశేషము.

భ్రమరులు : ఇవి పదుమూడు విధములు. ఇందు శుద్ధభేదములు-8; అన్యోన్య సంకరముచే నేర్పడినవి-౫. ఈ రెండు తెగల భ్రమరులు ఐదో, నాలుగో కలిపి, వరుస

గాను, వరుస తప్పించియు, విచిత్రముగా చతురులైనవారు చేసినచో ఏడు నూర్లువరకు ఏర్పడును భ్రమణము వీనియందలి విశేషము.

పాదములు: మతంగానుసారియగు దేశిపాదభేదములు-16. కోహలుని ప్రకారము వీటికి 'మధుపములు' అనియు పేరు.

పాటములు ( = పాటమణులు = పాదపాటములు): దేశీనృత్తసముద్రము నుండి యెత్తి పేర్కొన్న కొన్ని పాటభేదములు-28. పరస్పరమిశ్రణముచే ఇంకను చాల భేదములను కల్పింపవచ్చును

చారులు . సంచారధర్మమునుబట్టి ఇవి రెండు విధములు· భౌమచారులు-26; ఆకాశిక చారులు-16 ; ఇవికాక సంకీర్ణచారులు-4 ; మొత్తము-46,

ఇచ్చట గమనింపవలసిన విషయ మొకటున్నది. పైన పేర్కొన్న పాదములు, పాటములు, చారులు-ఇవి యన్నియు పాద (foot-work) భేదములే; అంతియేకాదు చారులయందుపయుక్తములగునవియే. అందుచేతనే కొందరు వీనినెల్ల చారీభేదములు గానే గణించియున్నారు.

లాస్యాంగములు : ఇవి 46 విధములు. భరతాదులు లాస్యమును, లాస్యాంగ ములను నాట్యాంతర్భాగములుగా గణించియున్నారు. ఒక్క శార్ఙ్గదేవుడు మాత్రము లాస్యమును, లాస్యాంగములను దేశిభేదములుగానే వర్ణించియుండుట గమనింపదగినది.

గతులు : ద్రుత-మధ్య-విలంబిత భేదములచే ముప్విధములైన గతిభేదములు-21; ఇవి శుద్ధగతులు. రెండుగాని, మూడుగాని, మిశ్రమమగునవి సంకీర్ణభేదములు. చారులు, పాటములు, లాస్యాంగములు కలిసినచో గతు లనంతములు కాగలవు.

## ద్వితీయ వర్గము :

గొండ్లి (గోండలి) : దీనిని వేటకత్తె నృత్య మనవచ్చును; దీనికి రూపురేఖలు దిద్దినవాడు సోమేశ్వరుడు. జాయన వర్ణించిన దేశిపద్ధతి దీనికి సన్నిహితముగా నున్నది. ఇందు పుష్పాంజలి విహితమైనది.

పేరణి : పంచాంగ సహితమగు దీనికి శైవమత సంబంధమున్నట్లు తోచగలదు.

ప్రేక్కణము : ఇది ఉద్ధతనృత్యముగా కన్పట్టుచున్నది.

రాసకము : ఇది స్త్రీల బృందనృత్యము. భరతముని వర్ణించిన పిండీబధం ములకిందు ప్రాముఖ్యము కలదు.

చర్చరి : ఇది రాసకతుల్యమే; కాని ఇందు నర్తకులు వసంతోత్సవములందు మండలములుగా నేర్పడి నాయకగుణములను కీర్తించుచు నర్తింతురు

నాట్యరాసకము దీనినికూడ వసంతోత్సవసమయ నృత్య మనదగును

దండరాసకము : ఇది నాట్యరాసక తుల్యమే, కాని ఇందు నర్తకులు కోలలను ధరింతురు.

శివప్రియము : ఇది శైవోత్సవసమయములందు చేయబడెడి నృత్యము.

చింతు : జాతర్లలో జరిగెడి నృత్యమిది.

కందుకము : చెండాటయందలి విశేషము.

భాండికము : హాస్యగాండ్రు చేయునది.

ఘటిసణి : హుడుక్కా వాద్యమును ధరించి చాండాలికచేయు నృత్యమిది.

చారణము : ఇది గుజరాత్ నృత్యము.

బహురూపము : ఇది పగటివేషములకు సంబంధించినది. ఒకే నర్తకుడు ఆశువుగా బహురూపములను ధరించుట.

కోల్లాటము : ఇది దొమ్మరుల ఆట.

దేశి స్థానకాదులను గూర్చియు, గొండ్లి మున్నగు దేశి నృత్యములను గూర్చియు డా॥ వి. రాఘవన్ నృత్తరత్నావళికి తాము రచించిన విపులమైన ఉపోద్ఘాతమున వివరించి యున్నారు (Pp. 115-58).

దేశి నృత్త-నృత్యముల ప్రశంస తెలుగు కావ్యములందధికముగా కలదు. కొన్ని ఉదాహరణము లొసగుచున్నాను:

సోమనాథుని పండితారాధ్యచరిత్ర ఈ సందర్భమున ప్రధానముగా పేర్కొన దగియున్నది. పండితారాధ్యచరిత్రలోని పర్వతప్రకరణమున శివరాత్రి ఉత్సవసమయ ములో జరిగెడి ఆటపాటలనేకము సోమన విపులముగా వర్ణించియున్నాడు. ప్రస్తుతోప యోగియగుటచేతను, పండితారాధ్యచరిత్ర ముద్రితప్రతులు అలభ్యములగుటచేతను ఈ వర్ణన సుదీర్ఘమైనను పూర్తిగా ఉదాహరించుచున్నాను (పుటలు-435-65):

"చప్పట్లు వెట్టంగఁ బక్కనలేచి-యప్పాట వెడయాట లాడెడువారు
వేడుకతోఁ జిందువాడంగనుబ్బి-కోడంగియాటలఁ గునిసెడువారుఁ
బ్రన్నని నిజదేశ భాషల జతుల-కన్నికోడంగాటలాడెడువారు
భ్రమరముల్ సాళెనుల్ బయకముల్-రమణఁబంచాంగి పేరణి యాడువారు
ప్రముఖ పురాతన పటుచరిత్రములుఁ-గ్రమమొంగ బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ-లలవడ బహురూప మాడెడువారుఁ
గరణముల్ మెరవణుల్ గతులుఁ జిత్రములు-నరుదుగ వెడ్డంగమాడెడువారు
నమరాంగనలు దివినాడెడుమాడ్కి-నమరంగ గడలపై నాడెడువారు
నావియద్గతిఁ బతులాడెడునట్టి-భావనమోకులపై నాడువారు
భారతాది కథలఁ జీరమఱఁగుల-నారంగబొమ్మల నాడించువారు
గడునద్భుతంబుగఁ గంబసూత్రంబు - లడరంగ బొమ్మలనాడించువారు
(పుట. 435)

నాదట గంధర్వ యక్ష విద్యాధరాదులై పాడెడు నాడెడువారు
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి-యధికోత్సవము దులుకాడనట్లాడు

## ఆ ట పా ట లు

శిరమున నురమునఁ జెవులఁ గంఠమున-గరములఁ గూఁకటఁగాళ్ళఁ జెల్వారఁ
గవదండలును గనుఁగవగరణికలు-సవరంబులును గళంబు దండలును
ఖచితంబుపూతపైఁ బరుగుబచ్చెనలు-నసలారు చిరుగజ్జియలు నందియలును
సరిరత్న పంక్తుల జలపోసనములుఁ-గరమొప్పు తొంగళ్ళుగల చల్లడములుఁ
బొల్పుదంతావళుల్ పుష్పమాలికలుఁ-దాల్చి యత్యద్భుతోత్సవలీల దనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి-యనుకూలవిధవాద్యసమేళనమున
(పుట. 436)

నార్భటంబిచ్చి యొయ్యన జవనికల-గర్భంబు వెడలి యక్కజము వట్రిల్ల
నాడకముందఱ నభినయం బొలయఁ-జూడకముందఱఁ జోద్యంబుదనర
నిక్కుచును ద్రిభంగి నిలుచుచునట్ల-చొక్కుచు సభఁజూచి యొక్కింతనగుచు
నలినంగసంచలనము నంద గతులు-బలిగొని భ్రూలతలన నర్తనంబు
మొనయుచు చిత్తోల్లాసమునను రంజకత-దనరఁ గటాక్షంబునను గుళలంబు
లలరి, శిరఃకంప మాచరించుచును-నళినంగుళిస్ఫోటనంబు సేయుచును

లాగు, వంజళము, ఢాళము, వళి, దిరువు-బాగు, వాహిణి, సాళి, బయగతి, సుగతి,
బహుగతి, గతియునాఁ బరిపాటిదనర-సహజమై తనుగతి స్వరవంచనములుఁ
(పుట. 437)

బటురసాలంకార భావముల్ దనర-స్ఫుట వాద్యతాళ సంఘటన ఘటిల్ల
దనుపాదఘట్టన దనరనుద్ఘట్టన-లనునయించుచు నందియల్ గదల్చుచును
'నోహో!' యనుచు గతులొడ్డవించుచును- 'సాహో' యంచు లాస్యమనున
యించుచును
జతులువాడుచుఁ దాళగతుల కాడుచును-శ్రుతులఁ గూడుచు నేలఁద్రొక్క-
నోడుచును

వీఁగుచుఁ గరణికల్ విస్తరించుచును-లోఁగుచు దంతావళుల్ నటింపుచును
జాఱుచు జంగలు సాఁపుచు మంది-నూఱించుచును మొగం బోఱవుచ్చుచును
జంకఁజూపుచు బయల్ సప్పరించుచును - జంకలడిచికొనుచు శంకరుఁ బాడు
చును, నుఱుకుచుఁ ద్రేళ్లసూపుచుఁ బన్ని-కొనుచు గంతులు వైచుచును మణికట్లు
(పుట. 438)

వెడమరించుచు, వ్రేళ్లు విడికిలించుచును-నొడలడంచుచు నురంబొగ్గుచు, వీపు
విఱిచికొనుచుఁ బురివిచ్చుచు, మోము-బోఱడువుచ్చుచు, భుజంబులు బవియుచును
మోఁకాళ్లఁ దొడలును ముడివరచుచును-గూఁకటిఁ గిఱవుచుఁ గోకటింపుచును
మూఁతులు నలుపుచు మురుకటింపుచును-మోఁతకునుబ్బుచు మురియుచుఁజనుచు
మిన్నకచూచుచు మెడవిర్చికొనుచుఁ-గన్నులార్చుచుఁ జెవుల్ గత్తిరించుచును
వెవ్వెఱలాడుచు వెక్కిరించుచును-గవ్వదండలయందు గతులువుచ్చుచును
బొమలెత్తివైచుచు బుగ్గరించుచును-దమకించిదాఁటుచు దండలిచ్చుచును
గొంకుచు వడఁకుచు గొసరుచు, మూఁడు-వంకలఁ బోవుచు శంకించుకొనుచుఁ
బరులఁజేవ్రేయుచుఁ బకపకనగుచుఁ-గరముబ్బుచును జొల్లుగాఱిచికొనుచు
(పుట. 439)

సరసంబులాడుచుఁ జప్పటవిడుచుచు - విరసంబులాడుచు విట్టువీగుచును
నొడ్డోలగంబులో నొఱసి తిర్గుచును-నడ్డంబుద్రికటంబు నన్నివాడుచును
మరగాళ్ళ నడచుచు మట్టిగాళ్ళగుచు-నొరుగాళ్ళ నడచుచు ధరగొంతుగొనుచు
మోఁకాళ్ళ నడచుచు మొగినేలఁగాళ్లు-దాఁకుచుండ నెగసి తటుకనచనుచుఁ

గూర్చుండి నడచుచుఁ గుప్పించి యచట-నార్చుచు మెఱములందందవైచుచును
నురమున నడచుచు నొదికిలఁజనుచు-ధరఁబొరలుచు సముద్ధతి లేచిచనుచు
నుర్వీఁద్రిప్పటమున నొక్కవ్రేలయిడి య-గుర్వుగాఁ దిరుగుచు గుర్వించుకొనుచుఁ
(పుట. 440)

గిరతలంబాని శీఘ్రమసారియట్లు-ధరఁదిరుగుచు దెసల్ఎన్ని నిల్చుచును
ధర బొమ్మరమునట్లు దలక్రిందుసేసి-తిరుగుచు వెలిదన్నితివుట నిల్చుచును
నమిలియుఁబోలె నున్నతి నటించుచును-భ్రమరంబు క్రియను దాఁ బరిఘటించుచును
జిలుకయుఁబోలెఁ జెన్నొలయఁ బల్కుచును-జలచరంబులవోలె జనులకుల్కుచును
గలహంసయునుబోలె గతులనేర్చుచును-నిలమృగ మట్లిరిమిరిమి చూచుచును
గిండుఁగోయిలవోలెఁ గడఁగికూయుచును-వెండిక్రోతియుఁబోలె వికృతిసేయుచును
నాలఉడునుబోలె నటయిటసనుచు-గోలికాఁడునుబోలె గోర్మెనఁగొనుచు
మదగజంబునుబోలె మాఱుమలయుచుఁ-బొదలివ్యాఘ్రంబట్ల పొఱనులియుచును
(పుట. 441)

గేసరివోలె లంఘించి పట్టుచును-మాసటీఁడునుబోలె మడ్డివెట్టుచును
మహీభుజంగమువోలె మలకలుగొనుచు-విహాగంబు క్రియనభోవీథిని జనుచు
సరివిలాసినివోలె సభమురియుచును-వరవిటునట్లు భావములరయుచును
గవియట్లు నవరస గ్రాహకుండగుచు-శివయోగియట్టులుసిఱు నవ్వునగుచుఁ
బగలేని నృపునట్లు వరిణమించుచును-బొగలేని వహ్నియుఁబోలె మించుచును
బాయలేని వెలుంగుఁ బాళిగప్పుచును-మాయలేని పురాతిమాడ్కి నొప్పుచును
బురములుగాల్చిన పోల్కియాడుచును-మరుఁజిఱువుచ్చినమాడ్కి నాడుచును
సతి కర్ధమిచ్చిన చందమాడుచును-యతులుగొల్వఁగనున్న యందమాడుచును
నంధకాసురు మదంబడచు టాడుచును-గంధగజాసురుఁ గడపుటాడుచును
(పుట 442)

జన్నంబుఁద్రుంచిన చాళినాడుచును-వెన్నుండు గన్నిచ్చువేళ నాడుచును
గరళంబుదాల్చిన కరణియాడుచును సరినజుతలఁగొన్న సరణియాడుచును
వెండియుభవు బహువిధచరిత్రముల-ఖండితగతి నాటకంబు లాడుచును
భృంగియు నభిమతప్రీతి మర్త్యంబు-భృంగులలోఁ దాను భృంగియైయుండ
వీణోత్తమము, బ్రహ్మవీణ, కైలాస-వీణయు ......... (పుట-443)
దేసియుమార్గంబుఁ దీటుకొనంగ-భాసురంబుగ ఢక్ప్రాణాదు లులియ
లలిరవర్ణనాలంకారభావ-ములు మృదుమధురసముచితోక్తులలర
మున్నట హారవేషములలోనఁబేరు-గొన్నగాణలలోనఁ గుపితవేషమున
గంబళాశ్వతరాది గాణాధిపతులు-దుంబురు నారదాదులు ప్రీతిఁబాడ

నంగిరాగంబు, గీతాంగరేఖయును-రంగశోభయు ముఖరాగంబుఁ దతము
వితతంబు నిలయంబు విగతియు నంస-గతియు నావర్తన గ్రహాగతిలవణి
దేసికారత సభాధీరథియును గ-ళాసంబు సౌక్కి సళావళి భ్రమరి
యవధానమును సంధియను నొకవిధము-వ్యవసాయమును నిజవణియు లంఘితముఁ
దాళమభినయోపతాపనయును సు-తాళంబును ప్రసన్నతయు వివర్తనముఁ
బయవాటము లలితవసయుఁ గనిష్ఠ-ఓయును నప్పణము బళయును గోమళక
యుల్లాసమును లలియును మనోహరము—డిల్లాయి దుడాళి రేవణిజంకె
(పుట. 459)

డాలంబు రవళి సౌష్ఠవము విభ్రమము-జాళి యొయ్యారంబు సరసంబుఁదనర
వరుసఁ జతుర్విధ వక్త్రవిభ్రమము-బొరిసప్తవిధనిజభ్రూలతాటనము
షడ్వింశతి క్రమచతు రంకితము - షడ్విధనాసాలసత్కుంచితంబు
ఘనయుక్తి దశవిధ కర్ణావధాన-మునునవవిధగళ ముఖోల్లసనము

సురుచిరత్రివిధవక్షోవిలాసంబు-ధరఁజెప్పనొప్పు పాదద్వయ పంచ
కంబు నూరుద్వయ కలితపంచకముఁ-బంబిసుగతి సమభంగి త్రిభంగి
యరుదగు వింశతి యంగహారములు-ధర నిఱువదిరెండు దానకంబులును
చత్తీసుదృష్టుఁ జౌషష్టిహస్తములు-బత్తీసుచారులు భ్రమరులునేడు (పుట 460)

నొగిఁగరణంబులష్టోత్తరశతము-మొగినూఱలంకారములు శిరోభేద
ములు పదుమూఁడును ముప్పదిరెండు-వొలుపారు దండనంబులు నొప్పహంస
గతియును మాయూరగతియును - భోగిగతియునునా బెక్కుగతులు వొల్పార
రంభయాదిగ నప్సరస్సమూహంబుఁ-గుంభినీసతులతోఁ గూడియాడంగ
నాటదటనుభయామరాచార్యలీల-నాదధీచ్యుపమన్యులాదిగాఁ గొలువ
... ... ... ... ... ... (పుట. 462)

సుస్థితి మల్లికార్జున దేవదేవు—నాస్థానమిట్లు సెన్నారంగ (పుట. 465)

తిక్కన సోమయాజి భారత రచనలోసంస్కృత మూలమందులేని కొన్ని క్రొత్త భావములను చేర్చి, తననాటి నృత్యసంప్రదాయమును సమయోచితముగా వ్యక్తము చేసినాడు మూలమందు బృహన్నల రూపధారియైన అర్జునుడు విరాట నృపతితో తన్ను గూర్చి ఇట్లు చెప్పుకొనెను (విరాటపర్వము-వావిళ్ళ ముద్రణము-పు. 1252).

"గాయమినృత్యామ్యథ వాదయామి భద్రోస్మిన్నృత్యే కుశలోస్మిగీతే ।
త్వముత్తరాయై ప్రదిశస్వమాం స్వయంభవామి దేవ్యా నరదేవనర్తకః ॥"

ఇంక తిక్కన సోమయాజి పై శ్లోకమును తెనిగించిన విధము పరిశీలింపదగి యున్నది. (విరాటపర్వము—ప్ర ఆ 239-41 ప)—

"గీ. ఒండు పనులకు సెలవులేకునిక్కఁ జేసి
యభ్యసించితి శైశవమాదిగాఁగ
దండలాసక విధమును గుండలియును
బ్రేంఖణంబు తెఱంగును బ్రేరణియును

క. విశ్రుతవాద్యములును మం
జుశ్రుతి సంభావ్య గీతసుగితులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్య ర
సాశ్రయములునైన యభినయంబు తెఱుఁగుదున్.

గీ ఇన్ని దెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర
తావిహీనములైన పాత్రములనైన
నట్టువౌజ్జనై మెలఁగుదు నగళులందు
నిపుణనై పద్యవిధులకు నేర్తునధిప !"

పై పద్యములందు ముఖ్యముగా గమనింపవలసినది దండలాసకాది దేశినృత్య భేదములు పేర్కొనబడుట. సంగీతసమయసారకర్తయగు పార్శ్వదేవుడు దేశినృత్యము నాలుగు విధములు-పేరణము, పేక్కణము, కుండలి, దండరాసకము-అని చెప్పుట ఇప్పట్ల గమనింపదగినది కీచకవధా ఘట్టమున మూలములో నర్తనశాల, నర్తనాగారము, నర్తనా గృహము, నర్తనాలయము అనెడి పదములు మాత్రమే ప్రయుక్తములైనవి. కాని తిక్కన-నాట్యమండపము(2-274), నాట్యశాల(2-324, 279),నాట్యమందిరము(4-27), నృత్తశాల(3-4), నర్తనాగారము(2-325), నర్తనమండపము (3-44), సంగీతనిలయము (4-32), నర్తనశాల (పలుమార్లు) అను పదములను వాడెను ఈ ప్రయోగవైవిధ్యము నృత్యమున కానాడుగల ప్రచురప్రచారమును వ్యక్తము చేయుచున్నది మనుమసిద్ధి పక్షమున తిక్కన గణపతిదేవుని సందర్శించెననెడి చారిత్రకసత్యమునిచ్చట స్మరించుట సమంజసము.

దేశినృత్యములను కొన్నింటిని భంగ్యంతరముగా నాచన సోమనాథుడు కూడ పేర్కొనియున్నాడు (ఉత్తరహరివంశము— 4-216) :

"పడఁకు పన్నగరాజు పడగలమీఁద స
ర్వాంగ సహాకాంత పేరణము నూప

నుఱ్ఱూత లూఁగెడు నుదయాస్త గిరులతో
నాకాశలక్ష్మి కోలాటమాడఁ
దెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
మొకములచాయ వేఱొకచందముగ నిల్చి
కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప

మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క-
లిక్కడక్కడ పడ దిక్కులెనిమిదియును
బగులఁ బాతాలతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరిపూరింప నప్పాంచజన్యరవము "

శ్రీనాథుడు తన రచనలందు పెక్కుచోట్ల దేశినృత్య ప్రశంశ చేసియున్నాడు. అందు కొన్ని—

"కుండలీదండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధు కందుక ధమాళి చేల మతల్లీ హల్లీసకాది నృత్యంబులవలోకించుచు..." —భీమేశ్వరపురాణము-1-118.

"ముని చూడామణియెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
పున జారీకరణాంగహారముల రావుల్ మించి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుందానును దేశిమార్గముస గంధర్వాప్సరోనృత్తముల్"
—కాశీఖండము-3-19.

"కొదమ మొగుళ్ళు దెరలును, దడంబడఁ బడు వలుద
వడగండ్లు పుష్పాంజలులును, నుఱుము చప్పుళ్ళు
మర్దళధ్వనులుగా గగన రంగస్థలంబునం గ్రొమ్మె
ఱుంగు మెఱుంగుఁ బోఁడి గొండ్లి పరిఢవించె"
—కాశీఖండము-3-23.

నాయకరాజగు రఘునాధ నాయకుడు దేశినృత్యమును బాగుగా అభిమానించినట్లు కనప్పట్టుచున్నది. వాల్మీకిచరిత్రలో "పేరణి దండలాస్యమును జెక్కణి కుండలి నాఁ జతుర్విధోదారములైన నాట్యములు" (3-42) అని రఘునాధుడు పేర్కొనుట గమనింపదగినది. ఆయన రంభోర్వశుల చేతకూడ దేశి నృత్యమునే చేయించెను వీరి ఆస్థానమున పెక్కురు నర్తకీమణులు కలరనియు, వారందరు దేశినృత్యములందు ప్రసిద్ధికెక్కినవారనియు విజయరాఘవనాయకుడును, చెంగళ్వ కాళకవియును పేర్కొనినారు :

"బిరుదు పాత్రలు విజృంభించి యారాజ
వరునిముందఱ నిల్వ వారి లోపలను
పదచాళిఁ గొనియెరూపవతీవధూటి
కొదలేక పేరణిఁ గొనెఁ జంద్రరేఖ
మిక్కిలి కోపుల మెఱవడిఁ జూపి
జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు
ననఁబోఁడియగు లోకనాయికాకాంత
వనజలోచన కీరవాణిలతాంగి
దురుపదకేళిక దురుసైన కోపు
వరుస నటించిరి వన్నెమీఱఁగను
కొరవంజి శివలీల గుజరాతిదేశి
విరిబోండ్లు కొందఱు వినిపించిరపుడు
ఏణీలోచన యింపుగా నొకతె
వీణె వాయించెను వింతరాగముల
మురళి రబాబు తంబుర దండెడెంగు
స్వరమండలంబు రావణహస్తమనఁగ
విలసిల్లు జంత్రముల్ వేర్వేఱఁబూని
వెలఁదులు కొందఱు వినిపించిరపుడు
భువిమెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు
నవరసచిత్రంబునలచరిత్రంబు
హరువైన పారిజాతాహరణంబు
మెఱవడిఁ జూపు వాల్మీకి చరిత్ర
జానకీకల్యాణ చాటుకావ్యంబు
తానిర్వహించిన తక్కిన కృతులు
కొందఱు వినిపింపఁ గొందఱు తగిన
సందర్భముల సమస్యలు సేకరింప
నెదుట సంగీత సాహిత్య నాట్యములు
మొదలైన విద్యలు మూర్తీభవించె
ననమించు నలచంచలాతుల కెల్ల
గనకాంబరంబులు కరుణించియొసఁగె."

—రఘునాథనాయకాభ్యుదయము-పుటలు. 21-22

—రఘునాథాభ్యుదయము-పుటలు 15-16

గీ. "భరత సంగీతసాహితీ ప్రముఖ విద్య
లాకృతులుగన్న చందాన నబ్జముఖులు
సరసముక్తాతపత్రచామరములలర
వివిధ బిరుదాంక వాద్యముల్ వెలయనిల్వ.

సీ॥ తీగె మెఱుంగులతీరున నిరుగడ
వరుస బంగారుపావడలు మెఱయ
పఱపుగావల గొన్న భానుమండలముల
హరువున నపరంజి హారిగెలమర
మొగిలు మొత్తంబులు మోహరించినరీతిఁ
బ్రమ్ము సాంబ్రాణి ధూపమ్ములలర
విద్యావిశేషముల్ వేఱ్వేఱ వివరించు
హవణిక బిరుదవాద్యములు మొరయ

వీరవేంకటరాయ పృథ్వీమహేంద్ర
దత్త బహువిధ బిరుదముల్ దనరుచుండ
సముఖమున నిల్చియాముద్దు 'చంద్రరేఖ'
వివిధ విద్యలు వినిపించె వింతయనఁగ.

సీ॥ చౌపదకేలిక 'రూపవతీ' కాంత
శబ్దచూడామణి 'చంప' కాఖ్య
చెలువగు జక్కిణి చెలువ 'మూర్తివధూటి'
కొరవు 'కోమలవల్లి' గురునితంబ
నవపదంబులు 'లోకనాయికా' లోలాక్షి
యలదేశి 'శశిరేఖ' కాబ్జనయన
దరుపదంబులు 'రత్నగిరి' నితంబినియును
పేరణి విధము 'భాగీరథి' యును

మదనపదదూత్య నవరత్నమాలికాది
బహువిధాలక్ష్య నాట్యప్రపంచమెల్ల
ఘనతవిలసిల్ల తక్కినకాంతలెల్ల
నభినయించిరి తమనేర్పులతిశయిల్ల.

సీ॥ వీణవాయించెను శోణాధరయొకర్తె
కిన్నరఁ బలికించె కన్నెయొకతె
చపలలోచనయోర్తు ద్విపదులు చదివెను
తత్రపసంగము చేసెతరుణియోర్తు

ముఖవీణచే నొక్క ముదితరాగముచేసె
కొమ్మ యొక్కతె పిల్లఁగ్రోవియూఁదె
తంబురా మొరయించె ధవళాక్షి యొక్కతె
స్వరమండలము మీటె సతియొకర్తు

యక్షగానంబు రావణహస్త ముడుకు
దండెమీటులు చెంగులు తాళములును
జోల సువ్వాల ధవళంబు లేల లమర
కొందఱతివలు వినిపించి రందముగను.''

—చెంగల్వ కాళకవి 'రాజగోపాలవిలాసము'—1-21-4

వీరందరును, వేరొక సందర్భమున, చేమకూర వేంకటకవి వర్ణించినట్లుగా—

"చెలఁగి యింపుగ నగఁబాడఁ జెప్పఁ జదువ
వలవ వలపింప నేర్చినయలరుఁ బోండ్లు
విపుల భరత కళాశాస్త్ర నిపుణులైన
బిరుదు పాత్రలు............"

—విజయవిలాసము—1-80.

ఇందు కాళకవి 'చంద్రరేఖ'ను ఎక్కువగా వర్ణించెను అమె 'ముద్దుచంద్రరేఖ అట! వీరవేంకటపతిరాయ (క్రీ శ. 1642 వరకు పాలించిన మూడవ వేంకటపతిరాయ పృథ్వీమహేంద్రదత్త బహువిధ బిరుదములు కలిగినదట. కావుననే కాళకవి తన కావ్యము నందు, ఆశ్వాసాంతభాగములను 'చంద్రరేఖా' చిహ్నితములుగా నొనర్చినాడు. ఈ చంద్రరేఖ పేరణి నృత్యమును చేసినట్లు విజయరాఘవుడు పేర్కొనెను ఇంక తక్కిన వారిలో రూపవతీ- శశిరేఖా—లోకనాయికలను కాళకవి, విజయరాఘవు లిరువురును పేర్కొనిరి. కీరవాణిని విజయరాఘవుడును, చంపకా—మూర్తివధూటి—కోమలవల్లీ—రత్నగిరి—భాగీరథులను కాళకవియును అధికముగా పేర్కొనిరి. వారు చేసిన నాట్యములు క్రింది విధముగానున్నవి—

ముద్దు చంద్రరేఖ—పేరణి
రూపవతి—పదచాళి ('చౌపదకేళి' యని కాళకవి)
శశిరేఖ — కోపులతో కూడిన 'జక్కిణి' ('దేశి' అని కాళకవి)
లోకనాయిక — దురుపదకేళిక ('నవపదములు' అని కాళకవి)
కీరవాణి — దురుసైనకోపు
చంపక — శబ్దచూడామణి
మూర్తివధూటి — జక్కిణి
కోమలవల్లి — కొరవు (కోపు ?)

రత్నగిరి — ద (దు) రుపదములు.
భాగీరథి — పేరణి

వీరేకాక కొరవంజి, శివలీల, గుజరాతి దేశి మొదలగు నృత్యవిశేషములను మరి కొందరభినయించినారట; మనకు పేర్లు తెలియని వారింకెంతమందియున్నారో ? ఇట్లు నట్టువరాంధ్రు సంఖ్యాతీత లగుటచేతనే చేమకూర వేంకట కవి రఘునాథనాయకుని "భరత విద్యాధురంధరుఁడౌట రంగస్థలంబు రామాలంకృతంబు చేసె" అని వర్ణించియున్నాడు (విజయవిలాసము-1-21). నాయకరాజులు ఆస్థాననృత్యములనే కాక ఆరాధనా నృత్యములను కూడ పోషించినట్లు కాళకవి రచన వలన తెలియుచున్నది (రాజగోపాలవిలాసము- 1-45).

రఘునాథ నాయకుని కాలమున తంజావూరులో పెక్కు నాట్యశాల లున్నట్లు విజయవిలాసము (1-28) ను బట్టి తెలియుచున్నది. రఘునాథుని నగరులో నవరత్నమయమైన నాటకశాల కలదట (రఘునాథనాయకాభ్యుదయము-పుట 17).

కామరసు వేంకటపతి సోమయాజి రచించిన 'విజయరాఘవచంద్రికావిహార' మందలి నాయిక 'బైటి నాటకశాల పడుచు' అట ! నాడు ఇట్టి 'బైటి నాటకశాలలు' శృంగాటకము (నాలుగు వీథులు కలియుచోటు) లందు ఎన్నికలవో?

## 4. ఆంధ్రదేశము నృత్యకళ

ప్రాచీన తెలుగు కావ్యములందు బహుళముగా నృత్త-నాట్య-నృత్య వర్ణనలు కలవు. పరిశీలించి చూచినచో అందు వర్ణితములైన 'నాట్యశాలలు', నృత్యశాలలే అని తెలియగలదు. ఇంచుమించుగా తెలుగు కవులందరును కొంచెముగానో, గొప్పగానో, ఏదో ఒక సందర్భమును పురస్కరించుకొని నృత్యవర్ణనలను చేసియున్నారు (చూ. తెలుగు నాటక వికాసము-పుటలు 89-187).

ఆంధ్రదేశమందలి ప్రాచీననృత్యసంప్రదాయము ప్రధానముగా రెండు శాఖలుగా వర్ధిల్లినది-మొదటిది నట్టువమేళ సంప్రదాయము; రెండవది నాట్యమేళ సంప్రదాయము. ఈ రెండు సంప్రదాయములకును మూలగ్రంథములు నాట్యశాస్త్ర, అభినయ దర్పణాదులే. అయినను ఇవి ప్రదర్శనక్రమములో భిన్నములై రెండు వేర్వేరు శాఖలుగా రూపొందినవి.




భారతదేశమున, ప్రాచీన కాలమునుండియు దేవాలయములే లలితకళలన్నింటికిని పట్టుగొమ్మలు. అట్టి కళలలో నృత్యమొకటి. ఆలయములో స్వామి సన్నిధిని జరిగెడి ఆరాధనానృత్యములు, కల్యాణమంటపములో జరిగెడి కేళికానృత్యములు నట్టువమేళ సంప్రదాయమునకు చెందినవి; వీనిని దేవదాసీలే చేయుదురు అందున, స్వామి సన్నిధిని బలిపీఠముపై నృత్యముచేయు నర్హత అధికారముద్రలను పొందిన దేవదాసీలకే కలదు; అచ్చట నృత్యము చేయుటకు తక్కినవారికి అర్హతలేదు. విజయనగరరాజుల కాలములో దేవదాసీలు పవిత్రజీవనమును గడపెడి వారనియు, దేవదాసి కావలసిన వ్యక్తిని పదేండ్ల ప్రాయమందే దేవాలయమున అర్పింతురనియు, అప్పుడు దేవునకును ఆమెకును పెండ్లి, మహోత్సవపురస్సరముగా, జరుగుననియు, ఆమె దేవుని సేవకు అర్పింపబడినదగుటచేత 'దేవదాసి' అయినదనియు బార్బోజా అను విదేశయాత్రికుడు వర్ణించియుండెను తన జీవిత

సర్వస్వమును దేవదేవుని సేవకే అంకితమొసర్చి, తదైక్యమునకు తహతహపడి, భగవంతుని లోలయించిన దేవదాసి (గిరిక) కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "వేయి పడగలు"లో వర్ణితమైనది, అట్టివారే నిజమైనదేవదాసీలు.[1]

ఇంక ఆలయపుటావరణలో, కల్యాణమంటపమందు స్వామి వేంచేసి కొలువై యున్నప్పుడు దేవదాసీలే కాక నృత్య విద్యాపారంగతలైన వారాంగనలును నృత్యము చేయవచ్చును ఇది వినోదార్థ మేర్పడినది కనుక దీనిని 'కేళిక' అని పేరు[1]

దేవాలయములందు ఒకరికిమించిన దేవదాసీలుండవచ్చును. కాని, రాజాస్థానములందు, సాధారణముగా ఒక్కతెయే 'రాజనర్తకి' ఉండును. చాళుక్యరాజుల కాలములోని చెల్లవ్వ, చామెకాంబలు; కాకతీయులనాటి మాచల్దేవి, కర్పూరవసంతరాయబిరుదాంచితుడగు కుమారగిరిరెడ్డి యాస్థానమందలి లకుమాదేవి, శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమందలిరంజకంకుప్పాయి, నాయక రాజుల ఆస్థానమందలి ముద్దుచంద్రరేఖ ప్రభృతులు ఇట్టివారే. ఈ నట్టువమేళములందు 'హంగుదారులు' కొందరుందురు; సాధారణముగా గురువు బ్రాహ్మణుడే అయియుండును దేవదాసీ-రాజనర్తకీ నృత్యములు రెండును ఏకపాత్రహార్యములే (Solo-type dances). రాజాస్థానములందలి నృత్యములు రెండువిధములు-మార్గపద్ధతి; దేశి పద్ధతి. ఇందు మార్గపద్ధతి నాట్యశాస్త్రానుసారి, ఇంక దేశిపద్ధతి ఆయా సీమలకు ప్రత్యేకమైనది. తిక్కన సోమయాజి పేర్కొన్నదండలాసిక, కుండలి, ప్రేంఖణము, పేరణి అనునవి దేశిపద్ధతికి చెందినవే. ఈ దేశిపద్ధతులను విపులముగా ఏడవ యధ్యాయమున జాయన వర్ణించియున్నాడు. ఈ దేశిపద్ధతులు నాయకరాజుల కాలములో పరాకాష్ఠ చెందినవని చెప్పవచ్చును.

ఇంక భారత-భాగవత- రామాయణాదులందలి కథలను స్వీకరించి, వాటికి నృత్యములను మేళవించి నాటకముగా ప్రదర్శించువారిది 'నాట్యమేళవు' అనబడును, ఈ ప్రదర్శనములను 'నృత్యనాటకములు' (ఉపరూపకములు : dance dramas) అందురు. వీటిని యక్షగానములనుట కూడ పరిపాటి. భగవంతుని లీలలకు సంబంధించినవై, భగవదారాధనమే ధ్యేయముగా కలవి కాన ఈ నృత్యనాటకములకు 'భాగవతములు' అనియు,

---

1. దేవుని కంకితము చేయబడిన 'దేవదాసీ' లు అస్ఖలిత బ్రహ్మచారిణులగుటచేత 'దేవదాసీకులము' అనునది ఏర్పడుట కవకాశములేకుండెను. కాని, క్రమముగా అనిష్ఠలగ్గినది. దైవసేవ అప్రధానమై మానవసేవ ప్రారంభమైనది; తత్ఫలముగా కులమొకటియేర్పడినది; అదియే వారాంగనాకులము. నాట్యశాస్త్ర-కామసూత్ర-అభినయదర్పణాదులందు దేవదాసీ ప్రశంసలేదు. కాగా, ఈ దేవదాసీ వ్యవస్థ ఎప్పుడు ప్రారంభమైనదో తెలియదు. ఇట్టి వ్యవస్థ ఇతర దేశములందును ఏదో ఒక రూపమున కన్పట్టగలదు (చూ. Devadasi by Sri Santosh Chatterjee).

వీటిని ప్రదర్శించు నర్తకులకు 'భాగవతులు' అనియు పేర్లు వచ్చినవి. ఇవి నాలుగు వీథులును కలియుచోట (శృంగాటకమునందు) ప్రదర్శింపబడుచుండుట చేత వీనికి 'వీథిభాగవతములు', 'వీథినాటకములు' అను పేర్లు వచ్చినవి. పూర్వకథాయుతములగుటచేతను, బహునర్తకులు, తత్తదుచిత వేషధారణము కలిగినవగుటచేతను ఇవి నాట్యశాఖకుచెందిన వగుచున్నవి, వీనిని ప్రదర్శించువారు 'నాట్యమేళము' అగుచున్నారు నాట్యమేళములవారు నృత్యనాటకములనే కాక 'కలాపము' లను కూడ ప్రదర్శింతురు ఈ కలాపములో విశిష్టసృష్టి. నాయకరాజుల కాలములో[8] రాజసంబంధి కథలు, కల్పితసాంఘికకథలు కూడ నృత్యనాటకముల ఇతివృత్తములైనవి ఈ నాట్యమేళములందు కూచిపూడి భాగవతులు సుప్రసిద్ధులు వీరిమేళములందు స్త్రీలకు ప్రవేశములేదు అంతేకాదు. కూచిపూడి వారందరును బ్రాహ్మణులే కాని అర్వాచీనకాలములో పిచ్చుకకుంట్లు మున్నగువారు నృత్యనాటకములను, వారాంగనలు కలాపములను నేర్చి ప్రదర్శింపసాగిరి. వీరికి గురువులో లేదా ఆ గురువులకు గురువులో కూచిపూడి సంప్రదాయములో శిక్షణమును బడసినవారే అగుట గమనింపవచ్చును. ఇట్లు కూచిపూడి సంప్రదాయము తెలుగు దేశమంతంతటను అల్లుకొని పోవుటయేకాదు, నాయకరాజుల కాలములో తంజావూరు ప్రాంతములకును ప్రాకినది నేటి మేలట్టూరులోని నృత్యనాటకసంప్రదాయము కూచిపూడి నాట్యమేళ సంప్రదాయమే.[1] కూచిపూడి వారు కొందరు దక్షిణదేశమున స్థిరపడినట్లే, మరికొందరు గోల్కొండ నవాబులవలన సమ్మానితులై కర్నూలు జిల్లాలో స్థిరపడినారు, అట్టివారే 'కోటకొండ భాగవతులు'.

తెలుగుదేశమున వీరశైవమత విజృంభణముతో నృత్యములు, నాట్యములు సాంఘికకళలుగా రూపొందినవి. అవి క్రమముగా శిలపహితుల పాలబడి, నట-నర్తకులు నీతి బాహ్యులై సంచరించుచు నింద్యులైనారు. కళాకారుడు తన కళాశక్తితో ప్రజలను సంస్కరించి అభ్యుదయమార్గమున నడిపింపగలవాడే అయినను, నాట్యమందు కొరకే సృష్టింపబడినను, ఒక దశలో ప్రజల నైతికపతనముతో బాటు కళలను

1. తెలుగు దేశమున కూచిపూడి నాట్యమెట్టిదో మళయాళదేశమున 'కథాకళి' అట్టిది. ఈ కథాకళి నాట్యమునకు క్రీ. శ 1575-1650 నాటి వాడగు కొత్తరక్కరరాజు మూలపురుషుడు క్రీ.శ 1503-1609 ప్రాంతముల విజయనగరమున వీర నరసింహరాయల యెదుట నాట్యప్రదర్శనమొసంగిన కూచిపూడి నాట్యమేళము, ఆ ప్రాంతములందే మళయాళదేశమునుకూడ సందర్శించి, ప్రదర్శనను లొసంగినట్లు తెలియుచున్నది. కూచిపూడి వారి నాట్యకళ ప్రేరకము కాగా, కొత్తరక్కరరాజు నాడు ఆ దేశమందున్న 'కుడియాట్టము'ను సంస్కరించి, నేటి కథాకళికి రూపులు దిద్దియుండును. నాడు కథాకళి మేళములును, కూచిపూడి మేళములును బ్రాహ్మణమేళములేయగుట గమనింపదగినది

పతనములగుట తటస్థించుచుండును. ఇట్టి పతనోన్నతులు ఆయా కాలములందు కళలకు సహజములే. 13 వ శతాబ్దిలో, కాకతీయుల కాలములో, నృత్యకళకు రాజాస్థాన ప్రవేశ గౌరవములు కలిగించుటకు ప్రయత్నములు జరిగినట్లు కన్పట్టుచున్నది; అసలు ఈ ఉద్యమమునకు బ్రాహ్మణులు గుఱుపీఠమును వహించినారు, రాజులును, రాజబంధువులును, మంత్రిసేనానులును పట్టుగొమ్మలైనారు. జాయపసేనానికి నృత్యగురువగు గుండామాత్యుడును, నూత్నభరతాచార్యుడుగా కీర్తింపబడిన వెన్నెలకంటి సూరామాత్యుడును బ్రాహ్మణులు కూచిపూడి నాట్యకళకు మూలపురుషుడుగా, భామాకలాపస్రష్టగా ప్రసిద్ధి చెందిన సిద్ధేంద్రయోగియును నాడు నాట్యకళోద్ధరణమునకు పూనుకొనిన బ్రాహ్మణులలో ఒకడై యుండును (చూ నా వ్యాసము-సిద్ధేంద్రయోగి - భారతి జనవరి-1960)

సిద్ధేంద్రయోగిని గూర్చి పరంపరాగతముగా వినవచ్చెడి ఐతిహ్యములు పెక్కులు కలవే కాని చారిత్రికాధారములు కన్పట్టవు సిద్ధేంద్రుడు 16 వ శతాబ్దికి చెందినవాడని కొందరు విమర్శకులు సిద్ధాంతించియున్నారు. కాని, అది విశ్వసనీయముగా కన్పట్టదు ప్రసిద్ధమైన మాచుపల్లి కైఫీయత్తునుబట్టి క్రీ. శ. 1500 నాటికే కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు సుప్రసిద్ధులైనారనియు, వారి మేళ మొకటి విజయనగరము మున్నగు దూర ప్రాంతములందు సంచారము చేయుచు కేళికాప్రదర్శనముల నొసంగెననియు స్పష్టమగుచున్నది కావున కూచిపూడి నాట్యకళకు మూలపురుషుడగు సిద్ధేంద్రుడు విధిగా క్రీ శ. 1500 నాటికి పూర్వుడగును; అనగా ఏ 13 వ శతాబ్దికో చెందిన వాడగుచున్నాడు.

కూచిపూడి వారి ప్రసక్తి ప్రప్రథమముగా మాచుపల్లి కైఫీయతు నందు గలదు. శ్రీకృష్ణదేవరాయల సవతి అన్నగారైన వీరనరసింహరాయల కాలము (క్రీ.శ 1906-09) లో విజయనగరమున కూచిపూడి భాగవతులు 'కేళిక' ను ప్రదర్శించినట్లు దీని వలన తెలియుచున్నది ఈ కైఫీయతులో కొంత భాగమును డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు రచించిన విజయనగరసామ్రాజ్యపు మూడవ రాజవంశచరిత్రకు ఒక అనుబంధముగా చేర్చినారు. (Studies in the History of the third Dynasty of Vijayanagar - pp 462-63) దాని నీ క్రింద నుదాహరించుచున్నాను—

"ఆయన (సంబెట గురవరాజు) చాలా దినములు జీవించి ప్రభుత్వముచేసినందున ఆయనను తాతగురవరాజు అని చెప్పుకొనే వారు... ఆ గురవరాజు ప్రభుత్వములో ప్రజలకు అతిదారుణ శిక్ష చేయిస్తూవుండేవారు ప్రజల వద్ద ద్రవ్య ఆకర్షణ చేసే యెడల త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసుకవచ్చి స్తనాలకు చిరుతలు[1] పట్టించేవారు.

---

1. రెండుకఱ్ఱలను చేర్చి, ఒకప్రక్క కొనలుచేర్చి కట్టి, రెండవప్రక్క కొనలను విడదీసి రెండుచేతులతో పట్టుకొని, ఆ కఱ్ఱల సందున చేతివ్రేళ్ళను, స్తనాలచివరలను అడక త్తెరలో ఒత్తినట్లు ఒత్తుటనే చిరుతలు పట్టించడం అనేవారు.

ఆలాగంటి దినములలో వినుకొండ తట్టున కూంచిపూడి అనే గ్రామం నుంచి బ్రాహ్మణులు భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థళమునకు (మాచుపల్లికి దక్షిణ భాగమందలి కోటకు) వచ్చివుండి సంబెట గురవరాజుగారి యొక్క దారుణ ప్రభుత్వం చూచి యిక్కడనుండి లేచిపోయి విద్యానగరమునకు పోయి, అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపరిపాలనంచేస్తూవుండగా భాగవతులు దర్శనం అయి కేళిక (ఆట) అడుగగా శలవు యిచ్చినారు కూచిపూడి మేళంవాండ్లు చాలా విద్యావంతులని ప్రసిద్ధిగా వినికిడి వున్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్లవద్ద దివాణములో కీర్తనకు శలవుయిచ్చి నారు అక్కడ కీర్తన వినికి చేసేటప్పుడు సంబెట గురవరాజు వేషం వేసికొని వొకడు, యిద్దరు బంట్రోతుల వేషం వేసుకొని, సంబెట గురవరాజు వలెనే ఆ వేషగాడు కూర్చుండి, రాయల సమక్షమందు ఆ స్త్రీ యొక్క స్తనాలకు చిరుతలు పట్టించి సొమ్ము యివ్వమని తహాశ్శీలు చేసినట్లు వినికి చేసినారు

అప్పుడు రాయలవారు చూచి అది ఏమి అని అడుగగా ముఖస్తులయినవారు భాగ వతుల ముఖతా ఆ వర్తమానము తెలిసి, శిద్ధవటంసీమలో సంబెట గురవరాజు అనే ఆయన ప్రజలవద్దనుంచి ద్రవ్యాకర్షణ చేసేయెడల స్త్రీలను తీసుకపోయి యీ ప్రకారము గనే తహాశ్శీలు చేస్తున్నారుగనుక యేలినవారికి తేటపడేటందుకై ఈ ప్రకారం వేషములు కట్టి వినికి చేసినారని విన్నపంశాయగా, చాలా తీక్షంచేసి, మరునాడు ఉదయమందు ఆ సంగతి తిరుగా జ్ఞాపకం సేయమని ముఖస్తులైనవారికి అజ్ఞ ఇచ్చినారు ఆ రాత్రి కీర్తన సాంతమయినవెనుక తెల్లవారినపిమ్మట రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చు కొని, ఆస్థానమునకు వచ్చి పేరోలగముననుండి తమవద్ద కార్యభారకులు వచ్చి సంబెట గురువరాజుగారి వర్తమానం జ్ఞాపకం చేయగా విని ప్రధానులను సేనానాయకులను పిలి పించి ముహిముకు (ఒక ముఖ్యకార్యమునకు) సైన్యము సిద్ధము చేయించవలసినదని శెలవు యివ్వగా ఆస్థాన పంజరములో చిలుక జయం జయం జయం అని మూడుసార్లు పలికినది. ఆ పలుకులు మహారాజు విని యిదే మనకు శకునము అని అప్పుడే పేషుఖానే బయట వేయించి, కోట పశ్చిమద్వారము వెలుపట భానుజండా వేయించి శిబ్బందీ బట్టువాడాలుగ చేయించి సైన్యం యావత్తుకు ఖర్చు వెచ్చములకు యిప్పించి ఆ మొహిముకు, రాయల కొమారుడు అనిపించుకొని వున్న యిసుమాలుఖానుడనే తురక సర్దారుడుగా మొక రర్రు (నిర్ణయము)చేసి, అతనిని పిలిపించి సమక్షమందు వలసిన బుద్ధిమతులు శలవు యిచ్చి తాంబూలం యివ్వగా ఆ సరదారుడు తాంబూలం అందుకొని, సంబెట గురవ రాజు తల తెస్తున్నానని ప్రతిజ్ఞపలికి, సైన్యమునువెంటబెట్టుక వచ్చి గురవరాజుగారు ఉన్న కోటకు పశ్చిమ వైపున వున్న బండ్లకనమమీద లడాయిచేసి, కనమపైవున్న చౌకి విరగ బొడిచి, కనమధారుఅయివచ్చి కోటకు పశ్చిమభాగమందు దిగివుండి ఆ దినం రాత్రి కోటకు పశ్చిమ వైపున వున్న గుండ్లకట్ట అనే సన్నకొండమీదను దమదమాలు యెత్తి, మొహర్జాలు (ఫిరంగిపెట్టే దిబ్బ) ఖాయంచేసి, కోటమీద లడాయి షురువు చేసినంతట

శక్తి వున్నంత మట్టుకు కోటలో నుంచిన్నీ వేటువారు జవాబుయిచ్చినారు. అంతట కోట లో నిభావుచెయ్యలేక కొలుమీద (అభయం పొంది) కోట యివ్వగా అప్పుడా గురవ రాజును పట్టుకొని వల తీసుకొని పోయినారు కోటలో స్త్రీలు, బాలురు అందరు దేహ త్యాగము చేసినారు ''

పై కైఫీయతులో కూచిపూడివారు బ్రాహ్మణభాగవతులని స్పష్టముగా నలదు. వారు తమ నాట్యమేళముతో క్రీ. శ. 1506-09 ప్రాంతాలనాటికే దేశసంచారము చేయు చున్నారు వారు విద్వాంసులని ప్రసిద్ధిచెంది యుండుటచేత రాచనగరులో ప్రదర్శించుట కవకాశము కలిగినది. ఇందులో కీర్తన, కేళిక అనెడి పదములు పర్యాయపదములుగా ప్రయుక్తము లయినవి. కీర్తన వినికి చేసేటప్పుడు సంబెట గురువరాజు ప్రభృతుల వేషము లతో తహాశ్శీలు పద్ధతి వినికి చేసినారట అనగా, నాటి కీర్తన లేదా కేళికకంటె ఈ ఘట్టము భిన్న మనియు, కేళిక మధ్యలో ఈ ఘట్టము ప్రదర్శింపబడె ననియు తెలియగలదు అంతియేకాదు, ఈ ఘట్టము ముగిసిన తరువాత అసలు కేళిక ఇంకను సాగినట్లు తరువాతి వాక్యములు స్పష్టము చేయుచున్నవి ప్రదర్శనసమయములో, మధ్యమధ్య, ప్రజల ఉబుసు పోకకు, నటుల విశ్రాంతికొఱకు కూచిపూడి నర్తకులు హాస్యములను ప్రదర్శించుచుండుట సంప్రదాయము. అందులో తత్కాలసాంఘికపరిస్థితులపై విమర్శలుకూడ సాగు చుండును. గురవరాజు తహాశ్శీలు ఘట్టము అట్లు మధ్యలో ప్రదర్శితమైనదే

గురవరాజుచరిత్ర మధ్యలో ప్రదర్శింపబడిన చిన్నఘట్టమైనచో నాడు పూర్తిగా ప్రదర్శింపబడిన కేళిక లేదా కీర్తన ఎట్టిది? 'కేళిక' అనగా ఆట అనియు, 'కీర్తన' అనగా భగవత్సంబంధమైన స్తుతి అనియు నర్థములు. భగవత్సంబంధమైన కథను ప్రదర్శించువారు అగుటచేతనే వారు భాగవతులయిరి నాడు వారు ప్రదర్శించినది నాటకముకాదు నాట కమే అయినచో, ఆ పదము స్పష్టముగా ప్రయుక్తమై యుండెడిది వారా నాడు సుప్ర సిద్ధమైన భామాకలాపమునే ప్రదర్శించినారు.

శ్రీకృష్ణదేవరాయల కాలములో నాటకప్రదర్శనములు వేరుగా సాగుచున్నట్లు తెలియుచున్నది. క్రీ.శ. 1514 నాటి ఒక శాసనము (M. E R. No. 556 of 1916) లో (కేశవస్వామి ఆలయము స్తంభముమీద) నాటి నటీనటుల పేర్లు కలవు-తిరుపత్తూరి లోని సోమరస కుమారుడైన కర్ణంబసవరస చేగయ్యకుమారుడైన నట్టువ నాగయ్యకు, పోతవరం నివాసిఅయిన నట్టువ తిమ్మయ్య కుమార్తె అయిన పాత్రికి "తాయికుం(కొం)డ నాటకము"ను ప్రదర్శించి నందులకు కొంత భూమిని దానముచేసిన విషయము నీ శాసనము వివరించు చున్నది. తిమ్మయ కుమార్తె పేరు ఇందు పేర్కొనబడ లేదు. కాని, ఆమె పాత్రి (నర్తకి)యట. కాగా, ఈ తాయికొండ నాటకము నృత్యనాటకమై యుండును.

నటవృత్తి వంశపారంపర్యముగా వచ్చుచుండుట ఇందు స్పష్టమగుచున్నది. అంతేకాదు నాడు స్త్రీ, పురుషులు కలిసియే ప్రదర్శనము లిచ్చుచున్నారు ఈ పద్ధతికి అపవాదము కూచిపూడి మేళము ఇందులో అందరును పురుషులే భామాకలాపమును బహుకాలము ప్రదర్శించి విసుగెత్తిన కూచిపూడి భాగవతులు తరువాతి కాలములో నృత్యనాటకము లను చేపట్టి యుందురు. వీరి యీ నృత్యనాటక సంప్రదాయమే మేలట్టూరిలో గూడా పాదుకొన్నది. ఇంక వీథినాటకములకు తంజావూరు పట్టుగొమ్మ యే అయినది.

ఇప్పుడింక తెలుగుకావ్యములనుండి ఆ యా నృత్యములకు సంబంధించిన యుదాహరణము లొసంగుదును.

## ఆరాధనానృత్యములు

నృత్య సంగీతములకు సాతవాహనుల, ఇక్ష్వాకుల కాలములలో రాజాస్థానములు ఆటపట్టులు కాగా, చాళుక్య చోళుల కాలములో దేవాలయములు ఆటపట్టులైనట్లు గోచరించుచున్నది. నాటి శాసనములనుబట్టి ఆ కాలములలో పెక్కు దేవాలయములందు నాట్యమండపములు నిర్మితము లయినట్లు తెలియుచున్నది. స్వామి అర్చనసమయములో, ఇతర సేవలను నిర్వర్తించెడి సమయములో గాయక నర్తకులు శివాలయములో శైవకథలను, విష్ణ్వాలయములో వైష్ణవకథలను పాడుట, ఆడుట ఆచారమయినది ఈ ఆచారము వలననే నాట్యమండపనిర్మాణముతోబాటు గాయక నర్తకులకు నివాసములు లేర్పరచుట కూడ జరిగినది ఉదాహరణముగా శక 1172 (క్రీ. శ 1250) నాటి శాసనము—"...శ్రీ వీర నరసింహదేవ సంప్రదాయము సానులు ముప్పండ్రును,[1] మద్దెల కాండ్రు ఆరువురును, నట్టువుం ఒకరుడు, మొఖరి ఆవంజకాడు, కరడకాండు కాహళకాండు, మేలినాయకుంగా సంప్రదాయమునకు మాపలపోలి భోగముగొని ఆచంద్రార్కము గొల్వంగలారు (S I I. voe v No. 1150-A R. No 272 of 1897). ఆనాడు శ్రీ కూర్మాది దేవాలయములందలి నట నర్తకుల పేర్లుకూడ శాసనములవలన తెలియు చున్నది. ఎరునటువు, వానికొడ్కు నరసింహ మండలికుండు, నట్టువ సోమయ్య, నట్టువప్రోల, గణికా విభూషిణి ప్రోలమ, ప్రోలనట్టువు చెల్లెలు అక్కసాని

---

1. ఒకే దేవాలయమున పలువురు దేవదాసీలు (సానులు) ఉండవచ్చును, ఇప్పట్ల శ్రీనాథుని రచనకూడ పరిశీలింపవచ్చును—

"గీతవాదిత్ర నృత్యంబు కేవలంబు
శంభునకు సార్వకాలంబు సంభ్రమింప
నప్సరః స్త్రీల నర్పించె నాఱునూఱు
ఖాలలను యువతుల జంభభంజనుండు" —భీమేశ్వరపురాణము—vi—78

మొదలగువారు. పూర్వచాళుక్యులకాలములో శివాలయములకు పెక్కు దానము లొసంగ బడినవి. అట్టి దానములకు ముఖ్యకారణములలో ఒకటి చతుర్విధాతోద్య—గాయక-నటీ-నర్తక పోషణము కొన్ని శాసనములలో ఆ యా దైవముల అంగ-రంగ భోగములకు దానాదులొసంగ బడినట్లు కలదు. "అంగభోగ" మనగా దేవుని అలంకరణ నైవేద్యాదులకు సంబంధించిన సేవ; ఇంక "రంగభోగ"మనగా నృత్య సంగీత సేవ. శక 1172 నాటి శాసన మందు పేర్కొన్న సానులు వాద్యకాండ్రు ఈ రంగభోగమునకు సంబంధించిన వారే.

కాగా, తెలుగుదేశమున పూర్వ, మధ్య కాలములలో నర్తకులు, నాట్యమండపములేని దేవాలయము ఉండెడిది కాదని గ్రహించవచ్చును అంతేకాదు చదలవాడ మల్లన్న చోళదేశమును గూర్చి చెప్పిన క్రింది పద్యము, ఆ కాలమునాటి తెలుగుదేశమునకు కూడ చక్కగా అన్వయించును—

"తిరునాళ్ళును, దేరులు, ననవరతంబును నంగరంగ వైభవములునుం
దిరమగును దేవళంబులఁ బరఁగఁగనొక కోడిగూయు పల్లియనైనన్"

(విప్రనారాయణ చరిత్రము—1-60)

పూజాసమయనృత్యవర్ణనము పాల్కురికి సోమనాథుని బసవపురాణమున కన్పట్టుచున్నది. ముగ్ధ సంగయ్య కథలో పూజా నృత్యవిధానము వర్ణితమైనది. లంజెటిక మనగా నదియునొక విధమగు లింగార్చన కాబోలునని తలచిన ముగ్ధసంగయ్య భక్తురాలైన ఒక గణిక ఇంటికేగినప్పుడామె చంద్రోదయానంతరము నృత్యము చేయించినది.

—(పుటలు—53-54)

"అనయంబులింగపూజనల నటించు - తనదు విలాసినీజనుల రావించి
యక్కమహాదేవి ! యల్లమద్దెలలు - జక్కొల్పి వేగంబ సంధించుకొనుము
స్వరమానమున బసవప్రమథవ్వ! - కరమర్థిఁ బట్టుము కాహాళలోలి
సకళవ్వ ! నీవును సంగళవ్వయును - నొకరీతి నిలువుఁడు సుకరంబుగాఁగ
బాలరుద్రమ ! యొత్తుపట్టఁగ వాసె - గ్రోలు (వాళకోలు ?) వాయింపుము.
గుడ్డవ్వ ! నీవు

సిట్టితాళమువట్టు, శివదేవి ! నీవు - సట్టన నృత్యంబు సరసం బెటింగి,
సంగుదాసమ ! మహేశ్వరి ! వీరభద్ర - లింగవ్వ ! మీరుగేళికలుసేయుండు,
రమణదుకూలాంబరమును గంచుకము - నమరించి కొని చల్లడము బిగియించి
యే తెమ్మ నీవు పురాతమ్మ ! శీఘ్ర - మాతతమ్ముగ నృత్యమాడుదుగాని
తాళముల్వట్టుఁడు దాళగింపుండు - నాళతివేళకు నందఱు, ననుచు
నవిరళంబుగ నంత నార్భటం బిచ్చి - జవనిక రప్పించి సరసమై నిలిచి
బొలుపగు ముఖరసంబును సౌష్ఠవమ్ము - లలిఁయు భావంబు ధూకళియు ఝంకళియు

మఱియు రేవయు విభ్రమమును రేఖయును - నెఱయంగనీ రీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లీలఁ జేయుచును - మంగళారవములు సింగడినులియ".

ఇది ఇంటిలో జరిగిన లింగార్చనా (శివపూజా)సమయనృత్యము. ఇందు పేర్కొనబడిన 'పురాతమ్మ' నర్తకి, తక్కిన వారందరును హంగుదారులు (శైవసంప్రదాయమున బసివిరాండ్రు కలరు ; కాని వారు దేవదాసీలవంటివారు కాదు).

రెడ్డిరాజులు ఈశ్వరుని పూజించునప్పుడు నృత్యములు జరుగుచుండెడివని శ్రీనాథుడు వర్ణించియుండెను-

"వల్లకి చక్కి-కాహళము వంశము డక్క హుడుక్క ఝర్ఝరల్
ఝల్లరియాదిగాఁగలుగు శబ్దపరంపర తాళబద్ధమై
యుల్లసితప్రబంధముల కొప్పుగ నాడుదురగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంటమహీశులు పూజ సేయగన్"

—కాశీఖండము-1-56.

చిత్రభారతకృతిపతియైన ఎమ్మెలపల్లి పెద్దామాత్యునకు ప్రభువైన చితాబుఖానుడు పరిపాలించెడి ఏకశిలానగరమందు శివుని యెదుట నిత్యమును నృత్యములు జరిగెడివట-

"సంతతోత్సవ తోషితశంభులింగ
సమ్ముఖేందు శిలానంద చారుమంట
పస్థలీ నృత్యదంగనా పాదరణిత
నూపురంబగు నేకశిలాపురంబు" —చిత్రభారతము-1-10

కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో శివాలయమందలి నృత్యమును వర్ణించెను (VIII-72)-

గంగానదిలోని ఉష్ణతీర్థము నుండి వెలువడిన ఎనమండుగురు స్త్రీలు ఒడ్డున గల శివుని గుడిలో ఒక నాటి రాత్రి, శశిమౌళిని హేమజలజముల పూజించి, నాట్య సన్నాహము చేసిరి అప్పుడు-

"తతఘన మర్దళాదినినదంబులు సప్పవినాల్గు హస్తని
ర్గతులును నృత్యవిలాసములుఁ గన్నుల పండుగ గాఁగఁ దాళసం
గతులు చెలంగఁ భావకటకంబులుఁ బ్రమోయఁగ నాట్యమాడె నొ
క్కతె తొలుకారు క్రొమ్మెఱుఁగుకైవడిఁ దరసభావపుష్టిగన్"

పైన పేర్కొన్నవి శివపూజాసమయ నృత్యప్రశంసలు. విష్ణుపూజా సమయ నృత్యప్రశంసలు కూడ కొందరు చేసియున్నారు-

విష్ణుచిత్తుని సాగనంపవచ్చిన పాండ్య నగరి దొరలు విల్లి పుత్తూరులో-
"ఉలుపాల్వట్టిన యిండ్ల మజ్జన నృపాహ్వోదాకథు స్త్రీక్రియో
జ్జ్వలులై, రేహరి కొల్వునన్ వివిధలాస్యస్పర్ధి సుభ్రూ-భ్రుకుం
సులవాదుల్సరిదేర్చిపుచ్చి, మణి వాసోభూషణ గ్రామమున్
జలజాతాపునకున్ సమర్పణమునిష్ఠం జేసి, యవ్వేకువన్"
పాండ్యనగరి తరలి పోయిరట

— శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద-IV-36.

మహార్నవమి ఉత్సవసమయములలో తొమ్మిది రోజులును రాయలవారు ప్రత్యుదయమును దైవసందర్శనమునకు వచ్చెడివారనియు, ఆతడు దైవసందర్శనము చేయుచున్నంత సేపును, ఆ ఓరువాత చాలసేపటి వరకును నర్తకీమణులు నృత్యము చేయుచుండెడివారనియు పేయసు అను విదేశ యాత్రికుడు వర్ణించియుండెను.

మట్లి అనంతభూపాల ప్రణీతమగు విక్రమార్క విజయములో శ్రీ రంగేశుని కొరకు నిర్మించిన ఆలయమున "ఒక ప్రదక్షిణ విధినుభయనాట్యంబుల మేళంబులకుఁ జంద్రశాలలునిచి" నట్లు వర్ణింపబడినది (II-12)

వసుచరిత్రలోని క్రింది పద్యమునందు (III-153) హోమసమయములందు నృత్యముచేయు సంప్రదాయము సూచితమైనది (యజ్ఞయాగాది సమయములందు యువతులు నృత్యము చేసెడివారని వేదవాఙ్మయమునుబట్టి తెలియుచున్నది)

"వనజముఖుల్ గనుంగొని రవారితవారితరంగ రంగన
ర్తన సలిలభ్రమణ భ్రమణ రంగదభంగ రథాంగధామమున్
మనసిజహోమకుండనిభమంజులకింజగతాళిధూమమున్
ధనదసరోజధామసమధామము నొక్క సరోలలామమున్."

## రాజస్థాననృత్యములు

"రస భావవ్యంజనాదియుక్తం నృత్యమితీర్యతే ।
ఏతన్నృత్యం మహారాజసభాయాం కల్పయేత్ సదా ॥"

అని నందికేశ్వరుడు చెప్పినాడు. నృత్తసమయములేవియో ఇంతకుముందే వివరింపబడినవి ఇంక నృత్యము ఎల్లప్పుడును మహారాజసభలోనే కల్పించబడవలయు నన్నమాట భంగ్యంతరముగా చెప్పవలయునన్నచో ఆరాధనా సమయములందు నృత్తము ప్రాధాన్యము వహించినచో, రాజ సభయందు 'అభినయము' ప్రాధాన్యము వహించు నన్నమాట.

పండితారాధ్యచరిత్ర ప్రర్వతప్రకరణములో మల్లికార్జునదేవుని ఆస్థానమందలి నృత్యములు వర్ణితములైనవి విక్రమార్కచరిత్ర, షట్చక్రవర్తిచరిత్ర, సింహాసన

ద్వాత్రింశిక, వాల్మీకి చరిత్ర మున్నగు తెలుగు కావ్యములలో ఇంద్రుని ఆస్థాన నర్తకీ మణులగు రంభోర్వశుల నృత్యములు, వారి స్పర్ధలు వర్ణితములైనవి. పల్నాటి వీర చరిత్రములో రాజాస్థాననృత్యము విపులముగా వర్ణితమైనది

నృత్యవిద్యలో మిన్నయగుటకు 'దేవదాసి' చిన్ననాటి నుండియు ఎంత పరిశ్రమ చేయవలసి యున్నదో, 'రాజనర్తకి' (రాజపాత్ర) యగుటకు వారాంగనయునంతియే పరిశ్రమ చేయవలసియున్నది ఈ విషయమును మల్హణచరిత్రములో క్రింది పద్యము (I-పుట 19) స్పష్టము చేయుచున్నది—

"అలోనఁ బుష్పగంధిని జాలకుఁడనునటుని యొద్ద సాముచేఁడిసెన్
మేలైన నాట్య విద్యయు బాలిక లిగ నేర్చి రాజపాత్రంబయ్యేన్"

చాళుక్యరాజగు గుణగవిజయాదిత్యుడు (క్రీ శ 848-92) 'గాంధర్వ విద్యా ప్రవీణ' బిరుదాంకితుడు ఇతడు సౌందర్యపరాజిత దేవాంగనయగు చెల్లవ్వకు అత్తిలి గ్రామములో కొంత భూమిని దానముగా నొసంగెనట[1] ఈ చెల్లవ్వ పట్టవర్ధనికులసంజాత; నట్టువరాంద్ర నేడి కలువకులమునకు సూర్యకాంతిగా వర్ణితమైనది[1] వేంగీరాజ్యపాలకు డును, 'కవిగాయకతల్పతరు' బిరుదాంచితుడును అగు రెండవ అమ్మరాజు (క్రీ శ. 945-70) చామెకాంబయను జైనశ్రావకి ప్రోత్సాహముతో అర్హనందియను జైనా చార్యునకు 'కలుచుంబఱ్ఱు' గ్రామమును దానమిచ్చెను ఈ చామెకాంబ అర్హనంది శిష్యురాలు, పట్టవర్ధని వంశీయురాలు, అమ్మరాజుకు ప్రియురాలు, నృత్యకళలో మిన్న[2] ఈ చెల్లవ్వయు, చామెకాంబయు రాజనర్తకీమణులే అయియుందురు.

క్రీడాభిరామమున మాచల్దేవి ప్రసక్తి కలదు. ఆమె "సర్వజగత్ప్రసిద్ధ, సుమనోబాణాసనామ్నాయ విద్యోపాధ్యాయిని, ప్రతాపరుద్ర ధరణీశో పాత్త గోష్ఠీ ప్రతిష్ఠాపాత్రేణ" ఇచ్చట చెప్పబడిన ప్రతాపరుద్రుడు రెండవ ప్రతాపరుద్రుడు ఈ మాచల్దేవిని గూర్చి వేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు[3]— ప్రతాపరుద్ర దేవుడు తౌర్యత్రిక ప్రియుడు. ఆయన యాస్థానమునఁ బలువురు నృత్త-గీత వాద్య నిపుణు లుండెడివారు. మాచల్దేవి తద్గోష్ఠిలో గొప్ప ప్రతిష్ఠనందినదిగావచ్చును. ప్రతాపరుద్ర నృపసార్వభౌముని నాళ్ళలో నేకశిలానగరమున మహైశ్వర్య సంపన్నురాలై మాచల్దేవియని వేశ్య నిజముగానున్నదో లేదో కాని మన శ్రీనాథకవి సార్వభౌముని నాళ్ళలో బెజవాడ నగరమున మహైశ్వర్యసంపన్నురాలై 'మాచల్దేవి' యని వేశ్యయొక్కర్తు గలదు. ఆమె క్రీ. శ. 1437 ప్రాంతముల బెజవాడ పాపవినాశనదేవరకును, రుద్రపాదములకును బహు

1, 2. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర-పుట. 211

3. క్రీడాభిరామము-ఉపోద్ఘాతము (1952) పుటలు—105-06.

గ్రామములందు, దనకుఁ జెల్లివచ్చుచున్న భూములనెన్నింటినో ధర్మము చేసినది. ఈ విషయమును చెప్పు బెజవాడ శిలాశాసనమున నామె నృత్యము చేయుచున్నట్టు విగ్రహ చిత్రముగూడఁ గలదు. ఆమె భాగ్యసంపన్నురాలు, ప్రఖ్యాతనర్తకి, విజయవాటీనివాసిని. కావున నిట్టి యామెను శ్రీనాథకవిసార్వభౌముఁడెటి గుండును "

మాచల్దేవి యేకాలము నాటిదైనను, చెల్లవ్వ, చామెకాంబలవలె ఆమెకూడా రాజనర్తకి అయి యుండును

భీమేశ్వరపురాణ ప్రారంభములోని వర్ణనను బట్టి బెండపూఁడన్నయామాత్యుఁడు గట్టించిన మొగసాల వాకిట మహోత్సవ మండపంబునందుఁ బేరోలగంబుండి భీమేశ్వరుండు "కుండలీ దండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధు కందుక భుమాళి చేల మతల్లీ హల్లీస కాదినృత్యంబులవలోకించుచుఁ, బంతంబులవధరించుచు, మేలంబు లాలకించుచుఁ...... నిఖిలలోకరక్షణార్థంబుగా వివిధవిద్యావిలాసంబుల వినోదించుచుండు "నట (1ఆ.వ 118) నిజముగా భీమేశ్వరుండు వినోదించెనో లేదో కాని ఇది మాత్రము రెడ్డిరాజుల ఆస్థానవర్ణనమేఅయియుండును

పలనాటివీరచరిత్రలో రాజాస్థాననృత్యము విపులముగా వర్ణితమైనది. (పుటలు- 18-19)—

"నాట్యమేళమువారు నవవిలాసముల। వచ్చినమ్రతమ్రొక్కి ప్రక్కగా నిల్వ
ఘనవైభవంబున కామభూవిభుడు। నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుచేయ
వరమృదంగము లెస్స వాయించుమేటి। కుడిభాగమునయందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటిదిశను। నిలిచి రుత్సాహంబు నేరుపుమీర
ముఖవీణ వాయించు ముఖ్యుడొకండు। రాగమాలపించు రమణులిద్దరును
నిండువేడుకతో నిలిచిరి వెనుక। కంజలోచనయను ఘనమైనపాత్ర
మదనుపట్టపుకంతి మంజులవాణి। భరతశాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతుబాణంబు। వచ్చిసభాసదుల్ వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన। వేత్రపాణిక దగ వినయంబు జూపి
అతడొసంగిన గజ్జ లతిభక్తితోడ। పాదములంగట్టి పంచవర్ణముల
కాశగట్టిగ గట్టి కడు జవంబడర। మద్దెలతాళాలమధ్య నిల్చుండి
ఓరచూపున రాజునొయ్యన జూచి। సమపాదయుక్తమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి। పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాటంబు సభ యెల్లగ్రమ్మ। కైకోలు విడుదలల్ ఘనకళాశైలి
కైముడి కట్నముల్ కనుపింపజేసి। వెలయంగ తొమ్మిది విధములయినట్టి
భూచారి నాట్యంబు పొందుగా సలిపి। పదునారు విధములై పరగినయట్టి

ఆకాశచారియు సమరంగనాడి। అంగహారాఖ్యగలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిదివిధములనాడి। గతిచారి భేదముల్ గనుపడునట్టు
భ్రమణసంయుతదీప్తి పటిమ మీరంగ। పాణిభేదములను బాటించి చూపి
స్థానకసంచయసంయుక్తి అమర। పేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగుబహుచారి। సప్తతాండవములు సల్పె చిత్రముగ
సభవారలాశ్చర్య సంయుక్తులైరి। తరువాత నిరుమేల దగు చెలువమర
సంయుతాసంయుత చలన సంకుచిత। నానార్థకరములు నాట్యహస్తములు
శిరమును చూపులు చెక్కిళ్ళు బొమలు। దంతోష్ఠకంఠముల్ తగుచుబుకంబు
ముఖరాగవక్షముల్ మొదలుగానెన్న। అంగంబులారు ఉపాంగంబులారు
ప్రత్యంగసముదయంబారునుంగూడి। యెనిమిది పదియగు నెసగునంగంబు
లమరంగనభినయంబాశ్చర్యముగను। మాచెర్ల చెన్నుని మహిమంబు దెలుపు
ఆంధ్ర సంస్కృత వాఙ్మయాది గీతముల। భావంబులెస్సగా ప్రకటంబుచేయ
చూచి రంభాదులు చోద్యంబునొంది। శిరసులువంచియు సిగ్గును జెంది
రప్పుదు భూమీశు డాదరంబొప్ప। వస్త్రభూషణములు వారలకిచ్చె".

ఇంక రెడ్డిరాజుల కాలములో ప్రఖ్యాతిపొందిన రాజనర్తకి 'లకుమాదేవి.' ఈమె 'కర్పూరవసంతరాయ' బిరుదాంచితుడగు కుమారగిరి రెడ్డి ఆస్థాననర్తకి; ప్రియు రాలనియు చెప్పుదురు లకుమాదేవి కుమారగిరిప్రభువు రచించిన నాట్యశాస్త్రమందలి రహస్యములను అభినయించి వన్నె కూర్చెడిదట!

"జయతి మహిమా లోకాతీతః కుమారగిరిప్రభోః
సదసి లకుమాదేవీ యస్యశ్రియా సదృశీప్రియా
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూర్థానర్థి ప్రజాయ సహస్రశః"

—కాటయవేముని శాకుంతలవ్యాఖ్యాన ప్రారంభము

శ్రీకృష్ణదేవరాయల కాలములో, ఆయన ఆస్థానమందు 'రంజకం' వంశము (లేదాబిరుదు) నకుచెందిన నర్తకీనర్తకులు కలరని తిరుపతిదేవస్థానమువారు ప్రకటించిన శాసనముల మూడవసంపుటమువలన తెలియుచున్నది (**Devasthanam's Epigraphical Report** కూడ చూడవలెను) 'విద్వత్సభారాయ' బిరుదాంచితుడగు కృష్ణదేవ రాయలు కొంత తడవు విద్వద్గోష్ఠి నెరపి పిమ్మట నృత్యమును తిలకించెడివాడు. ఈ నృత్య మేళమునకు నాయకుడు తిరుమలనాథుని పుత్రుడగు 'శ్రీరంగరాజు'. ఈ మేళములో సుప్రసిద్ధ నర్తకి శ్రీ రంగరాజు పుత్రికయగు కుప్పాయి లేదా కుప్పాసాని. శ్రీరంగ రాజు, వాని కుమార్తె కుప్పాయి—ఇరువురును 'విద్వత్సభారాయ రంజక' బిరుదాంచితులు చివరకు 'రంజకం' అనునది ఇంటి పేరుగా మారినది శ్రీ రంగరాజు, కుప్పాయి కూడ శ్రీ వేంకటేశుని ప్రీత్యర్థము దానములొసంగినట్లు శాసనములున్నవి

ఈ రంజకం కుప్పాయికి కుమార్తె లిరువురు కలరు— తిరుమలమ్మ,ముద్దు కుప్పాయి వీరిలో ముద్దు కుప్పాయి అచ్యుతరాయల నగరులో నర్తకిగా నుండెడిది. 6 6.1531 తేదీ నాటి శాసనమును బట్టి అచ్యుతరాయ లీమెను తిరుపతిలోని శ్రీ గోవింద రాజస్వామివారి ఆలయములో దేవదాసినిగా నియమించినట్లు తెలియుచున్నది. అంతే కాదు, ముద్దు కుప్పాయి వంశములోని వారెల్ల తరతరములుగా శ్రీ వేంకటేశుని ఆలయములో నృత్యము చేయుటకు అధికారమీయబడినట్లు గూడ ఈ శాసనమందు కలదు

తంజావూరు పాలకుడగు అచ్యుతప్పనాయకుని కాలము (క్రీ.శ. 1580-1614) లో నృత్య సంగీతములకు పట్టు గొమ్మలైన పెక్కు తెలుగు కుటుంబములు రాజాశ్రయము నర్థించి తంజావూరునకు వలసపోయెను అచ్యుతప్పనాయకుడు వారినెల్ల ఆదరించి, తన పేర 'అచ్యుతాపురము' ను అగ్రహారముగా వారికొసంగెను, అదియే నేటి మేలట్టూరు (మేళముల ఊరు).

విజయనగరసామ్రాజ్యమున కృష్ణదేవరాయలెట్లు సాహితీసమరాంగణ చక్రవర్తియో తంజావూరున రఘునాథనాయకుడట్లు. రఘునాథనాయకుడును, వాని కుమారుడు విజయరాఘవ నాయకుడును స్వయముగా తాము సంగీతనాట్యవేత్తలే కాక పెక్కు గ్రంథములను రచించి, రచింపజేసినారు. నాటి దేశినృత్యవిశేషములను గూర్చి ఇదివరకే పేర్కొని యున్నాను. వీరి కాలమున గుర్తింపవలసిన మొదటి విశేషము కవయిత్రులనేకులు వీరి ఆస్థానమునందుండుట; రెండవ విశేషము వీరికాలము యక్షగాన- వీథినాటకములకు స్వర్ణయుగమగుట.

సుప్రసిద్ధ వాగ్గేయకారుడును, పదకర్తయును అయిన క్షేత్రయ్య (1600-1680) విజయరాఘవుని ఆస్థానమును సందర్శించి ఆతనిపై పదములను చెప్పియుండెను క్షేత్రయ్య పదాలకు నాటినుండి నేటివరకును నృత్యప్రదర్శనములందు గల ప్రాముఖ్యము విజ్ఞులకు తెలిసిన విషయమే.

నేటి భరతనాట్యము తంజావూరును పరిపాలించిన మహారాష్ట్రరాజగు శరభోజీ కాలము (క్రీ.శ 1786-1821) లో రూపొందిన విషయము కూడ విజ్ఞులకు తెలిసినదే.

## ఇతర నృత్యములు

ఆరాధనేతరనృత్యములను పలువిధములుగా విభజంపవచ్చును - రాజాస్థాన నృత్యములు, రాచనగరులోని రాజపుత్రికలనృత్యములు, వసంతోత్సవాదులందలి నృత్యములు, వారాంగనానృత్యములు, కేళికలు, కలాపములు, నృత్యనాటకములు మొదలైనవి ఇంతకుముందు రాజాస్థానసృత్యములనుగూర్చియు, కలాపాదులను గూర్చియు వివరించి యున్నాను. ఇప్పుడింక తక్కిన నృత్యములను గూర్చి కొంతవివరింతును

రాజపాత్రలు కాదంచినవారు మాత్రమే కాక రాజపుత్రికలు కూడ నృత్యాది లలితకళలు నేర్చుకొనెడివారు రాజాంతఃపురములందలి నాట్యశాల లన్నియు నృత్యశాలలే కాదగునని యింతకుముందే పేర్కొనియున్నాను రాజపుత్రికలకు నృత్యము నేర్పుటకు ప్రత్యేకముగా ఆచార్యులుండెడివారు; వారు పురుషులు కావచ్చును, లేదా స్త్రీలు కావచ్చును. మహారాజు, రాజపుత్రికను నాట్యాచార్యునకప్పగించువిధమును తిక్కన సోమయాజి వర్ణించియుండెను (విరాటపర్వము - I 247-53)

"ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నల దెసగనుంగొని సాదర దరస్మితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాట శిష్యురాలగు పాత్రంబగునే యని యడిగి, తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధురసల్లాపంబుచేసి, కర్పూరసహితంబగు తాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబరంబు లిచ్చి మణిమయంబులగు నాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు ......

"బాలకేలిమీఁదిభరము క్రమంబున
విడువఁ గలఁ యందు వేడ్కసొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవకాదె"

విరాటనృపతి ఉత్తరను బృహన్నల కప్పగించిన ఘట్టమిది

శ్రీకృష్ణదేవరాయల రాచనగరులోని నృత్యశాలను స్వయముగా దర్శించిన 'పేయస్' అను యాత్రికుడు దానిని క్రిందివిధముగా వర్ణించినాడు (చూ Sewell–Forgotten Empire–pp 288-9)

"Thence we went up by a little staircase, and entered by a little door into a building which is in this manner. This hall is where the king sends his women to be taught to dance. It is a long hall and not very wide, all of stone sculpture on pillars, which are at a distance of quite an arm's length from the wall; between one and another is an arm's length and a half, perhaps a little more. These pillars stand in that manner all around the building; they are half-pillars (?) made with other hollows (?) all gilt. In the supports (or pedestals) on the top are many great beasts like elephants, and of other shapes; it is open so that the interior is seen, and there are on the inner side of these beasts other images, each placed according to its character; there are also

figures of men turned back to back and other beasts of different sorts In each case from pillar to pillar is a cross-bar (the architrave) which is like a panel, and from pillar to pillar are many such panels; there are images of old men, too, gilded and of the size of a cubit Each of the panels has one placed in this way. These images are over all the building. And on the pillars are other images, smaller, with other images yet more subordinate, and other figures again, in such a way that I saw this work gradually diminishing in size on these pillars with their designs, from pillar to pillar, and each time smaller by the size of a span and it went on, becoming lost; so it went dwindling gradually away till there remained of all the sculptured work only the dome, the most beautiful I ever saw. Between these images and pillars runs a design of foliage, like plats (a maneyra de lamines), all gilt, with the reverses of the leaves in red and blue, the images that are on the pillars are stags and other animals, they are painted in colours with the pink on their faces; but the other images seated on the elephants, as well as those on the panels, are all dancing women having little drums (tom-toms)

"The designs of these panels show the positions at the ends of dances in such a way that on each panel there is a dancer in the proper position at the end of the dance; this is to teach the women, so that if they forget the position in which they have to remain when the dance is done, they may look at one of the panels where is at the end of that dance. By that they keep in mind what thay have to do.

"At the end of this house on the left hand is a painted recess where the women cling on with their hands in order better to stretch and loosen their bodies and legs; there they teach them to make the whole body supple, in order to make their dancing more graceful. At the other end on the right, in the place where the king places himself to watch them dancing, all the floors and walls where he sits are covered with gold, and in the middle of

the wall is a golden image of a woman of the size of a girl of twelve years, with her arms in the position which she occupies in the end of a dance "

ఇంత వర్ణించియు ఈ నృత్యశాల పేరేదియో పేయస్ పేర్కొనలేదు. ఈ నృత్యశాల శిథిలములైనను నేటికి నిలిచియుండకపోవుట దురదృష్టము. కాని నేటికిని నిలిచియున్న శిథిలములలో విఠ్ఠలస్వామి ఆలయకల్యాణమండపమునకు ఎదురుగా ఉన్న ఒక మండపమే ఈ నృత్యశాల కావచ్చునని ఒక పరిశోధకుడు అభిప్రాయపడినాడు (చూ Social and political life in Vijayanagar Empire-by R N Saletore-Vol. II-p. 411)

మనసిజుని పునరవతరణోత్సవసమయమునందలి వసంతోత్సవమును, అందలి వివిధ కార్యకలాపములను వర్ణించిన తొలి తెలుగు కవి నన్నెచోడుడని చెప్పవచ్చును (కుమార సంభవము - 9 వ. ఆ. ప. 51-133). ఇందు నృత్యము లోకభాగము; ఈ నృత్యములలో అధికముగా రాచనగరులలోనివారే పాల్గొందురు. నన్నెచోడుడు రంభానృత్యమును వర్ణించిన విధమును ఇంతకుముందే పేర్కొనియున్నాను (9 ఆ. 38 ప). నన్నెచోడుడు రతిలీలావ్యాజమున లాస్యనృత్యమును వర్ణించిన ఘట్టముకూడ గమనింపదగియున్నది (8 ఆ 180 ప.)—

గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీలసత్కింకిణీ
కలనాదంబులు హృద్యవాద్యములుగాఁ గాంతోరుపీఠోన్నత
స్థలరంగమ్ములఁ గాముఁడన్నటికుఁడొజంగుండ నాడింపఁగా
లలనాపాత్రములాడి రొప్పరతిలీలాలాస్యలోలాస్యలై."

ఈ వసంతోత్సవము బహుప్రాచీనకాలమునుండియు భారతదేశమున ప్రచార ములోనున్నది (చూ. తెలుగునాటక వికాసము-పుటలు 108) ఇది రెడ్డిరాజుల కాల ములో, ముఖ్యముగా కుమారగిరిరెడ్డి కాలములో పరాకాష్ఠనందుకొన్నది. వసంతోత్సవ ప్రియుడగుటచేతనే కుమారగిరిరెడ్డి, కర్పూరవసంతరాయలుగా ప్రసిద్ధినందినాడు.

రెడ్డిరాజుల రాజ్యములో వసంతోత్సములు ప్రాధాన్యము వహించినట్లుగా, విజయనగరరాజుల రాజ్యములో మహార్నవమి ఉత్సవములు ప్రఖ్యాతి వహించినవి. ఈ మహార్నవమి ఉత్సవములు తొమ్మిది రోజులు జరుగుటచేత, వీనికి నవరాత్ర్యుత్సవములు అని కూడ పేరు. ఇవి వసంతోత్సవముల కంటె భిన్నములైనవి. ఇందు పికత్వాని ప్రదర్శన ములు కూడ జరుగును. ఈ ఉత్సవములలోకూడ నృత్యములకు ప్రాధాన్యమున్నది. ఇమ్మడిదేవరాయల (రెండవ దేవరాయల) కాలము (క్రీ.శ. 1421-45) లో విజయనగర

రజాక్ వర్ణనలలో ముఖ్యముగా గమనింపదగిన రెండు విశేషములు కలవు. మొదటిది నర్తకీమణులు పాడుచు నృత్యముచేయుట; పాడుచు నృత్యముచేయుట తెలుగు దేశపు ప్రత్యేకత. ఈ సంప్రదాయము నేటికిని, కూచిపూడివారిలో కన్పట్టగలదు.

ఈ సంప్రదాయమునకుమూలము క్రింది భరతార్ణవశ్లోకమనవచ్చును-

"అంగే (కంఠే) నాలంబయేత్ గీతంహస్తే నార్థ ప్రదర్శనమ్
చక్షుర్భ్యాం భావయేద్భావం పాదాభ్యాం తాలనిర్ణయః "

తెలుగు కవులుకూడ ఈ సంప్రదాయమును గ్రంథస్థము చేసియున్నారు-

"తనువున గీతాలంబనమును, జేతుల నర్థవ్యూమితమును, నేత్రయుగం
బున భావముఁ బదముల దాళనిర్ణయమ్మును మెఱయఁగలాస్యము నెఱపెన్.
ఊర్వశీనృత్యవర్ణనము - సింహాసనద్వాత్రింశిక I – 1 ఆ. 133.

"కనుఁగొన నొప్పుకంఠమున గానముఁబాణుల మంజులార్థక
ల్పనమును, దృగ్విశేషమున భావములుం, జరణక్రమంబులన్
దనరు లయప్రపూర్ణమగుతాళముఁ, గ్రాలఁగఁ బాత్రయోర్తురం
జనముగనాడె నింపువెదజల్లుచు విశ్వనృపాలు సన్నిధిన్.
—'లలిత' మనెడి స్త్రీల నైసర్గికాలంకారమునకులక్ష్యము
—కావ్యాలంకారచూడామణి— 2 ఆ. 21 ప.

ఇంక రజాక్ వర్ణనలోని రెండవవిశేషము నర్తకీముందు పట్టినతెర రెండు ప్రక్కలకును లాగివేయబడుట ఈ తెరనుగూర్చి తెలుగు కావ్యములందలి కొన్నివర్ణనల నిచటయుదాహరించుచున్నాను—

"కామసుఖములతోఁబూర్వకామకేళి
కామచిహ్నలు మెయిసురంగంబుగాఁగ
నెఱయఁగై సేసిజవనిక దెఱచివచ్చు
చెలువుశోడ రతిమ్రోలనిలిచె మరుఁడు "
—మనసిజుని పునరవతరణవర్ణనము, నన్నెచోడుని కుమారసంభవము— 9 ఆ. 46 ప.

"సురుచిర తారకాకుసుమశోభి నభోంగణభూమిఁగాలమ
న్గరువపు సూత్రధారి జతనంబున దీప్తికోటి ముందటన్
సరసముగా నటింపఁగ నిశాసతికెత్తిన క్రొత్తతోఁపుఁజెం
దెరయన నొప్పెసాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్"
—సూర్యాస్తమయవర్ణనము-ఎఱ్ఱాప్రెగడనృసింహపురాణము — 3 ఆ. 78 ప.

"చరమదిక్సతి లాస్యావసరమునందు
బయలు గాకుండ నిడుతోరపుఁ బచ్చడంపు
దెఱయొకోయనఁ బశ్చిమదిశను మిగుల
ఘనతరస్ఫూర్తి సాంధ్యరాగంబుదోఁచె."

—సూర్యాస్తమయవర్ణనము– షట్చక్రవర్తిచరిత్రము 3 ఆ. 43.

"హరిదంభోరుహలోచనల్ గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్వక్త్రింబునుందోఁచెనా
హరిణాంకాకృతి వొల్చె రేకయి, సగంబై, బింబమై, తూర్పునన్."

—చంద్రోదయవర్ణనము– వసుచరిత్రము- 4ఆ. 17ప.

నర్తకీముందరి తెరను ప్రక్కలకు కాక క్రమముగా క్రిందికిదించినప్పుడు ఈ దృశ్యము దృగ్గోచరము కాగలదు భామాకలాపమందు భామ తొలుత తెరపై జడవేసి, కార్యకలాపము నడపినపిమ్మట, తెరను క్రమముగా క్రిందికిదించినప్పుడిట్లే భామాముఖము దృగ్గోచరమగును.

## 5. నృత్యసాహిత్యము : ఆంధ్రుల కృషి

**సంస్కృతరచనలు**

భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమందలి 13వ అధ్యాయమునుబట్టి క్రీస్తుశక ప్రారంభము నాటికే దక్షిణభారత దేశమునందును, మధ్యభారత దేశమందును చక్కని నాట్య వ్యవస్థ యేర్పడియున్నదని చెప్పగలము. 'ప్రవృత్తి' వివరణములో, ఆంధ్రులు దాక్షి

---

1. ఎఱ్ఱనయును 'తోపు' తెర యనినాడు. సూర్యాస్తమయారుణకాంతికి సరిపోవు నట్లుగా ఈ కవులు వర్ణించినారో, లేదా ఆనాడు ఎఱ్ఱని తెరలనే వాడెడివారో?

2. సమీపసరోవరస్నాతయై, గట్టు ఎక్కివచ్చుచున్న దమయంతి రూపమును నన్న పార్యుడు వర్ణించిన ఘట్టమిప్పట్ల స్మరణార్హము

"రజనికరాననఁ బీనపయోధర రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశిత కాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెటిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతోన్.

—అరణ్యపర్వము– 2ఆ. 90ప.

ణాత్యప్రవృత్తికి చెందినవారనియు, దాక్షిణాత్యులు బహు-నృత్త-గీత-వాద్య-లలితాభినయప్రియులనియు భరతముని పేర్కొనెను. కాగా నాటికే ఆంధ్రులు లలితకళలలో, ముఖ్యముగా నృత్యములో ఎంతయో అభివృద్ధిని సాధించియున్నారన్నమాట

## నందికేశ్వరుడు

నాట్యశాస్త్రము తరువాత పేర్కొనదగిన గ్రంథము అభినయదర్పణము. ఇది నందికేశ్వరప్రణీతముగా ప్రసిద్ధము (కాని ఈ విషయము గ్రంథమందెచ్చటను లేదు). ఇది వైశాల్యమున చాలచిన్నది; అయినప్పటికిని నేటి కూచిపూడి—భరతనాట్యములకిదియే ప్రమాణగ్రంథము. ఇది క్రీ. శ. ౧౨వ శతాబ్ది తరువాత రచింపబడియుండును. దేశమందు లభించిన అభినయదర్పణపు వ్రాతప్రతులన్నియును తెలుగులిపిలోనే ఉన్నవి దీనిని బట్టి, అభినయదర్పణము తెలుగుగడ్డమీదనే రచింపబడి యుండుననుట స్పష్టము

అభినయదర్పణమందు 324 శ్లోకములున్నవి; అంతయును ఏకాధ్యాయమే; శైలిచాలసరళము. ఇందు ఆంగికాభినయమే వర్ణితమైనది. భరతుని నిర్వచనములకు, ఇందలినిర్వచనములకు కొన్నింటభేదమున్నది. నందికేశ్వరప్రణీతమగు భరతార్ణవము ఇటీవలనే ప్రకటితమైనది. ఇది అసంపూర్ణము అభినయదర్పణమునకిది మూలగ్రంథము కాదగునేమో ?

## జాయన

ఆంధ్రుడురచించినశాస్త్రమని అసందిగ్ధముగా చెప్పదగిన తొలిగ్రంథము జాయన కృతమగు నృత్తరత్నావళి. ఈ జాయననుగూర్చి తరువాతి ప్రకరణములో వివరింతును.

## సింహభూపాలుడు (క్రీ. శ. 1300ప్రాంతాలు)

ఇతడు రేచర్లవంశస్థుడు; రాజుకొండప్రభువు. సర్వజ్ఞబిరుదాంచితుడు. సుప్రసిద్ధమైన 'రసార్ణవసుధాకరము'ను రచించుటయేకాక శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమునకు, 'సంగీతసుధానిధి' అను పేర ప్రామాణికమైన వ్యాఖ్యరచించినాడు. ఇటీవల మైసూరు విశ్వవిద్యాలయమువారు సింహభూపాలవిరచితమగు కన్నడగ్రంథమునొకటి ప్రకటించి యున్నారు. ఇది సంగీతరత్నాకరమందలి నృత్యాధ్యాయమునకు కన్నడీకరణము ఈ సింహభూపాలుడెవ్వరో లాస్యరంజనసంపాకులు నిర్ణయించలేదు , కాని, కొండవీడు ప్రాంతపు సామంతుడై యుండునని యూహించినారు. సంగీతరత్నాకరమునకు సంగీత సుధానిధి పేర ప్రామాణికమగు వ్యాఖ్యరచించిన సింహభూపాలుడే (రెండవ సింగమ నాయకుడే) ఈ లాస్యరంజనమును కూడ రచించియుండునని తలంచుట అసమంజసము కానేరదు. ఈ గ్రంథము సంవాదరూపమున నున్నది. తన రాణి ప్రశ్నలు అడుగుచుండగా తాను సమాధానము లొసంగినట్లు సింహభూపాలుడు రచనను సాగించినాడు.

## కుమారగిరిరెడ్డి (క్రీ.శ. 1386-1402)

లలితకళాప్రియుడగు కుమారగిరిరెడ్డి 'కర్పూరవసంతరాయ' బిరుదాంచితుడు. ఇతని బావమఱదియగు కాటయవేముడు మంత్రియై రాజ్యభారమును వహించి, శత్రువులను చక్కజేసి, కుమారగిరిని నిశ్చింతునిజేసెను. కావుననే కుమారగిరిరెడ్డి విలాసపురుషుడనియు, అతని బావమఱదియును, మంత్రియును నగు కాటయవేముడు రాజ్యపాలనాభారమును వహించెననియు చరిత్ర తెలుపుచున్నది. కుమారగిరిరచించిన వసంతరాజీయమునను సరించి కాళిదాసనాటకత్రయమునకు వ్యాఖ్యరచించిన కాటయవేముడు వ్యాఖ్యాన ప్రారంభములో చెప్పినవిషయముకూడ దీనిని బలపర్చుచున్నది

"భాగ్యంనామ సమగ్రమీదృశ మతిస్నే హైకపాత్రంయతో
వీరంకాటయవేమముద్ధతరిపు ధ్వంసేనియుజ్య స్వయమ్
నిత్యంనందతి నర్తనై రభి నవైః కాంతై ర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః''

కుమారగిరి విలాసప్రియుడేకాక నాట్యశాస్త్రవేత్తకూడను. అతడు తన బిరుదము పేర రచించిన నాట్యశాస్త్రము - వసంతరాజీయము - లంభింపక పోవుట దురదృష్టము. ఆయా వ్యాఖ్యాతలుదాహరించిన శ్లోకములను బట్టి[1] వసంతరాజీయము, రసార్ణవసుధాకరమువంటి నాట్యశాస్త్ర గ్రంథమని తోపగలదు. కాని కాటయవేముడు లకుమాదేవిని గూర్చి చెప్పిన శ్లోకమును బట్టి, అందు నృత్యాధ్యాయము కూడ కలదని స్పష్టమగుచున్నది.

## పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402-1420)

సింహభూపాలుని వలెనే ఇతడును సర్వజ్ఞబిరుదాచింతుడు; కుమారగిరి తరువాత రాజ్యమునకు వచ్చిన వేమారెడ్డి అతనివలెనే నాట్యశాస్త్రపారంగతుడు. ఇతడు రచించిన సాహిత్యచింతామణి, సంగీతచింతామణి అను గ్రంథములింకను ముద్రణ భాగ్యమును బొందలేదు సంగీతచింతామణి వ్రాతప్రతులు రెండు తిరువనంతపురం పాలెస్ లైబ్రరీలో మాత్రమేఉన్నవి. వీనిలో ఒక దానియందు 16 అధ్యాయములున్నవి. రెండును అసమగ్రములే. ఇందులో తతవిభాగము, వాద్యవిభాగము, మార్గతాళములు, దేశీతాళములు, సుషిర- అవనద్ధ- ఘనవాద్యలక్షణములు, గీతవిభాగము, నృత్తవిభాగము (ఇదే పెద్ద అధ్యాయము) కలవు. వేమారెడ్డి దేశీభేదములను కూడ వివరించుట గమనింప దగినది.

---

1. చూ. నా వ్యాసము "వసంతరాజీయము" భారతి-సెప్టెంబరు-1948.

## చతురకల్లినాథుడు

ఇతడు ఇమ్మడిదేవరాయల (క్రీ.శ. 1446-65) ఆస్థానవిద్వాంసుడు; శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమునకు 'కలానిధి' అనెడు వ్యాఖ్యను రచించెను ఇది సంగీత సుధానిధి కంటె మేల్తరము. కల్లినాథుడు అభినవభరతాచార్య, రాయబయకార, తోడరమల్ల బిరుదాంచితుడు.

## భండారు విఠలుడు

ఇతడు లక్ష్మీనారాయణుని తండ్రి, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు తెలుగులో వ్యాఖ్యరచించెను (అముద్రితము) ఇతడు గుజరాత్ సుల్తాన్ అయిన గియాజుద్దీన్ చేత 3000 లతులముల బంగారమును బహుమతిగా పొందెనని లక్ష్మీనారాయణుడు పేర్కొనెను.

## భండారు లక్ష్మీనారాయణ

ఇతడు భండారు విఠలుని పుత్రుడు, శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానమున రాయబయకారుడు. ఇతడు 'సంగీత సూర్యోదయ' మనెడి శాస్త్రమును రచించెను; దీనికి 'లక్ష్మణభరత' మనెడి నామాంతరము కలదు ఇందు 5 అధ్యాయములున్నవి. ఇందలి రెండవ అధ్యాయము నృత్యాధ్యాయము నృత్తకరణముల వివరణములో 'గంగావతరణ' కరణము నితడు 'కృష్ణావతరణ' మనివ్యవహరించుట గమనింపదగినది.

## చెరుకూరి లక్ష్మీధరుడు (16వ శతాబ్ది)

గుంటూరుజిల్లా చెరుకూరి నివాసియగు నీతడు రామరాయలతమ్ముడైన ఆరవీటి తిరుమల రాయల కాశ్రితుడు ఇతడు 'భరతశాస్త్రము' అను గ్రంధమును రచించెను (Bhandarkar Institute Manuscript library - No. 40 of 1916-18). ఇందు నాట్యసంగీతములు రెండును వివరింపబడినవి ఇతడు 'శ్రుతిరంజని' యనుపేర జయదేవుని గీతగోవిందమునకు వ్యాఖ్యరచించెను

## రఘునాథభూపాలుడు

సాహితీసమరాంగణచక్రవర్తియగు రఘునాథుడు 'సంగీతసుధ' యనెడు శాస్త్రమును రచించెను. ఇతడు తనపేర 'రఘునాధమేళవీణ' అను క్రొత్తవీణను కనిపెట్టి అన్నిరాగములను పాడుటకు వీలుకల్పించెను సంగీతసుధయందు 7 అధ్యాయములున్నవి ఇందలి 7వ అధ్యాయము నర్తనాధ్యాయము.

## తెలుగు రచనలు

ఇంతవరకును ఆంధ్రుల సంస్కృత రచనలను గూర్చి వివరించినాను; ఇప్పుడింక ఆంధ్రుల తెలుగు రచనలను కొన్నింటిని గూర్చి వివరింతును.

## పోలూరి గోవిందకవి

ఇతడు తాలదశప్రాణదీపిక, రాగతాళచింతామణి అను రెండు పద్యగ్రంథములను నాట్యశాస్త్రము ననుసరించి రచించెను. తాలదశప్రాణదీపిక నాట్యశాస్త్రమందలి తాళాధ్యాయమునకు అనుసరణ. ఇంక రాగతాళచింతామణి యందు 5 అశ్వాసములు కలవు. ఇందలి ప్రథమాశ్వాసము నాట్యశాస్త్రమందలి ప్రథమద్వితీయాశ్వాసములకు స్వేచ్ఛానువాదము. ద్వితీయాశ్వాసమున స్వరలక్షణమును, తృతీయశ్వాసమున గ్రామ మూర్ఛనాలక్షణములును, నాల్గవయాశ్వాసమున రాగభేదములును ప్రధానముగా వివరింపబడినవి. ఇంక 5 వఆశ్వాసమున నృత్త వాద్య స్వరూపములు వివరింపబడెను

రాగతాళచింతామణి కృతిభర్తఅయిన కట్టమూరి బుస్సభూపతి చెప్పినట్లు 'సంగీత శాస్త్ర మంత్రోక్తి విస్తారమునకు బూర్వులెవ్వరు' ను ఇంతకు ముందు వ్రాయ లేదు. నాట్యశాస్త్రభాగముల నాంధ్రీకరించుటకును తెలుగులో నిట్టిలక్షణగ్రంథములను రచించుటకును ఈ గోవిందకవియే ప్రథముడు గోవిందకవి తాలదశప్రాణదీపికలో పావులూరి మల్లన్నను, భరతమువీరరాఘవయ్యను స్తుతించి యున్నాడు. వీరరాఘవయ్య మీదచెప్పిన పద్యము ప్రత్యేకముగా గమనింపవగినది

> ''సరసుఁడు లాస్యదర్శనవిశారదశారద, తాళలక్షణం
> బరసితదీయ లక్షణమునందఱు మెచ్చఁగఁ దద్గుణంబుల
> బ్బురముగఁసదెల్పు వైఖరిఁ బోల్పఁగ రెండవ మేరుధ్వనిన, యీ
> భరతము వీరరాఘవయపాటి మహానటమౌళి కల్గునే''

ఈ మహానటమౌళిని గూర్చిన వివరములు తెలియుటలేదు.

## లింగముగుంట మాతృభూతయ్య (16లేదా 17 వ శతాబ్ది)

ఇతడు 'అభినయదర్పణ' మనెడు మూడాశ్వాసముల పద్యగ్రంథమును రచించెను దీనికి సంస్కృత 'అభినయదర్పణము' మూలమైనను, పలుతావులందు భేదములు కన్పట్టు చున్నవి; ఇవి సంప్రదాయామును బట్టి వచ్చిన మార్పులని చెప్పదగును. మాతృభూతయ్య 'అభినయము' ను నిర్వచించిన విధానము గమనింప దగియున్నది.

> ''చెలువొంద గీతంబు చెన్నుమీఱఁగఁబాడి
> యర్థంబుఁ గరముల నమరఁ బట్టి
> పరగఁగన్నులయందు భావంబుఁదగనుంచి
> పదములఁదాళంబుఁబరఁగదీర్చి
> హస్తంబు పోడచూపునచట దృష్టియునుంచి
> మఱి దృష్టి గలచోట మనసు నిల్పి

మనసు నిల్పిన యెడనె నయభావముంచి
భావంబుతో రసంబలరఁజేసి
యెలమి నివియెల్ల నొక్కటై మెలఁగుచుండ
నట్టిదే సూఁడనిల లోన నభినయంబు" (1-19)

**కంఠీరవరాజు** (క్రీ శ. 1704—13)

మైసూరు రాజగు నితడు 'నాట్యవిద్యావిలాసము' అనెడి గ్రంథమును రచించెను, ఇది సంస్కృతాంధ్రమిశ్రమగు రచన. ఇందు నర్తకీమణులు తమ తమ సామర్థ్యములను వివరింతురు.

**మతుకుమల్లి నృసింహకవి (19 వశతాబ్ది ప్రథమభాగము)**

ఇతడు 'భరతశాస్త్ర సర్వస్వము', 'సంగీతసారసంగ్రహము' అనెడి గ్రంథములను రచించెను (ఇవి అముద్రితములు) ఇతడు తెనాలినివాసి, భరతాచార్యుడై యుండవచ్చును వీరి భార్య జానకమ్మగారు కూడ విదుషీమణి; ఆమె చెప్పిన పద్యములలో నొకటి మధునాపంతులవారి ఆంధ్రరచయితలులో ఉదాహృతమైనది (పుట 21).—

"వసుధలోపల మంచెళ్ళవారి యిల్లు
శారదాదేవి నాటకశాల యంద్రు
వాసుదేవుని కవితావిలాసమచట
మొలకబంగరు గజ్జెల మ్రోఁతగాదె"

**లేపాక్షి వేంకట నారాయణ కవి (1900 ప్రాంతము)**

ఇతడు 'నాట్యప్రదీపనము' అను భరతశాస్త్రమును రచించెను (అముద్రితము). ఇతడు పెక్కు యక్షగాననాటకములను రచించినవాడు; నాట్యాచార్యుడు; నాట్యప్రదీపమునందు 32 అడవులను నిర్వచించిన అల్పభాగము మాత్రమే లభ్యమైనది; వ్రాతప్రతిలో నున్నవానిని ఉన్నట్లు — 15 అడవుల నిర్వచనములను ఉదాహరించుచున్నాను :

కం॥ అడవులు ముప్పదిరెండన
వెడు వేడుకగలవు దాని క్రమముర చింతున్
పడుచుదనంబున సాధక
ముడుగక సేయగను సిద్ధి నొందగవచ్చున్
..............................

1. లేపాక్షి గ్రామకరణము శ్రీ వేంకటనారాయణగారియొద్ద వ్రాతప్రతియున్నది. ఈ వ్రాతప్రతిని శోధింపవలసి యున్నది

1 జంపడవ

గీ. వగలుమిగుల పతాకంబు పరగబట్టి
ముదముతో బాహువులు భుజములకు సమము
గాను నిరుపార్శ్వముల నిల్పిగళము గుల్క
అడుగులను తట్టుతట్ట జంపడవయగును

2 తట్టుజగ్గడవా

గీ. చక్కగాతగ్గిమోకాళ్ళు ప్రక్కలకును
త్రిప్పిరెండడుగుల మధ్యదేశమందు
జానడరవెళ్ళు బయలుండగా నడుగుల
నూనితట్టగ తట్టుజగ్గౌను మెరయ

వ. ఇందుకు కుడిహస్తము శిరస్సునకు కించిదెక్కువగా నెత్తి అలపల్లవహస్తం పట్టి వామహస్తము ముష్టిహస్తముతోగాని, లర్ధచంద్రహస్తముతోగాని రెంటిమీదనుంచి నట్టించవలెను.

3. జగ్గుజారడవ

గీ. చెలగు నీ జగ్గుయడవలో శిరమునకును
కరము వెళ్ళుగపై కెత్తి గళముగుల్క
ఒళ్ళునూపుచు నడుగుల నొక్కమాఱె
జరుపుగా నౌనునిది జగ్గుజారయడవ.

4. జగ్గుజార్తిరుగుడడవ

కం. ఈ జగ్గుజారుతో (నే)
రాజసమున చుట్టుతిరుగ రయమునభారం
బోజతయడమను బూనిన
తేజంబుగ జగ్గుజారుతిరుగుడుయడవౌ.

వ ఇందుకు హస్తములు తట్టుజగ్గడవకు పట్టినటుల పట్టవలెను.

5. అర్ధతిరుగుడు జగ్గుజారడవా

గీ. కలయగా జగ్గుజారలో క్రమముగాను
ప్రక్కలకు దిరుగుచు నొక్కపాదమందు
భారమిడుచును దిరిగిన భవ్యమైన
అర్ధతిరుగుడు జగ్గు జారడవయగును.

వ. ఇందులో తిరుగునపుడు వామపాదము మీద భారముమోపి కుడిప్రక్కకు దిరుగవలెను. కుడిపాదముమీద భారముమోపి, ఎడమప్రక్కకు తిరుగవలెను. ఏవైపు దిరిగిన నావైపు యా పల్లవహస్తమును సరిగాబట్టి నటించవలెను.

6. చిన్నిజార్తిరుగుడడవా

గీ. ఎడమపాదంబు మిడిమిపై కెత్తిదాని
మీదగూర్చుండియును భారమూది వెళుపు
దోప కుడిపాదమును నిండుదోప చుట్టి
బరువుచును తిరుగ చిన్నిజార్తిరుగుడడవౌ.

వ. ఇందుకు హస్తములు జగ్గడవకు పట్టినటులనే మోకాళ్ళు రెండువైపులకు వెడల్పుగా, చక్కగా, త్రిప్పి చుట్టును తిరుగవలెను.

7. మెట్టడవా

కం. జగ్గడవకాళ్ళు మిడిమెలు
నిగ్గునరెండొక్కమాఱె నేలను మోటన్
తగ్గుచు సమముగ బట్టిన (?)
దిగ్గన మెట్టడవయగును తేజంబలరన్.

వ. ఇందుకు త్రిపతాకహస్తముతో, కుడిహస్తము ఎదకుమూఱెడు ముందుగా బట్టి, ఎడమచేయి పతాకహస్తముచేసి, ఒకటి కొకటి యెదురు మ్ముఖములుగా నిలిపి నటించవలెను.

8. ఒంటిమెట్టడవా

గీ. సమముగా పాదములు నతిక్రమముగాను
పార్శ్వభాగంబులకు మునిపాదమెత్తి
మిడిమెతో నొక్కటొక్కటి మీటు వెలయ
మీటుచును రాగనది యొంటిమెట్టయడవౌ.

9. జంటమెట్టడవా

కం. ఇటునొంటి మెట్ట బట్టిన
నటువలె రెండేశి మాట్లు రూఢిగ వెలయన్
స్ఫుటముగ తాటింపుచు నా
మిటినెదురెక్కగను జంటమెట్టడవయగున్.

వ. మెట్టడవ వలె హస్తములుండవలెను.

10. తిరుగుడు మెట్టడవా

కం. తిరుగుడు మెట్టడవవలెన్
పరువడి మునిపాదములనుపై కెత్తుచు యా
తెరగున మెట్టుచు చుట్టును
కురుకుచును తిరుగంగనగు.

11. తట్టుపెన్నడవా

గీ నిండు కుడిపాదమును ధరనుండజేసి
యించుకంతను యడమకాలుంచిపెనయు
గానవెనుకకునిడి, తగ్గి, కాళ్ళుతట్టి
నడవగానిది తట్టుపెన్నడవయగును.

వ. బొమ్మకుసరిగా అర్ధపతాకహస్తముబట్టి చక్కగాచూచి, ఎడమచేయి అర్ధ
చంద్రహస్తముతో రెండి మీదఉంచి, ఒక పాదమయిన మీదటనొకపాదము
తట్టుచు నటించవలెను

12. జారుపెన్నడవా

గీ దనరయీపెన్నయడవలో వెనుకకిడిన
పాదమెత్తియు మునివ్రేళ్ళమీదభార
మూనితక్కిన కుడిపాదమునునయంబు
తోనునడపగ జారుపెన్నడవ యగును.

వ హస్తాభినయము జగ్గడవవలెనే యుండవలెను.

13. దాటుపెన్నడవా

కం. జారుపెనడవయు బట్టుచు
సారెకు నంతంతజరిపి చెయ్యన కుడికాల్
దూరమున తగ్గి దాటిగ
నారయ నిది దాటుపెనయు నన విలశిల్లున్.

వ. హస్తాభినయనము పైప్రకారమే.

14. ఉబుకుపెన్నడవా

కం. వనరపెనడవందునుగల
పెన విడువక మిడిమెరయెత్తి ఖింః ముతోడన్

మునికాళ్ళతో నటింపన్
గను నుబుకు పెనడవయగును కౌతుకమలరన్.

వ. హస్తములు, ఎడమచేయి అర్ధచంద్రహస్తముతో రొండిమీదబెట్టి, కుడి చేయి యెదకుముందుగా అలపల్లవహస్తముబట్టి శరీరము నూపుచు నటించవలెను

15. ఉబుకడవా

కం. ఈ యుబుకు యడవయందును
కాయముబింకముగ, హొయలుగానూపుచు
బాయక కుడిమునిపాదం
బున్ యెత్తినటింపగా నుబుకడవయగున్

## దామరాజు సోమయ్య

ఇతడు 'భరతము' ను రచించినట్లు పెదపాటి జగన్నాథకవి కూర్చిన "ప్రబంధ రత్నావళి" ని బట్టి తెలియుచున్నది ఇది నృత్యకళకు సంబంధించినగ్రంథమై యుండును ఇత డెప్పటివాడో తెలిసి కొనుటకు తగిన ఆధారములులేవు; కాని, '1560 ప్రాంతమువాఁడని' శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు వ్రాసియున్నారు ప్రబంధరత్నావళిలో క్రింది ఐదు పద్యము లుదాహృతములయ్యెను [శ్రీ వేటూరివారు సంపాదించినది — 1918. పుటలు-142-43]—

ఉ॥ అంబరసీమఁదారలు జటాటవి మల్లెవిరుల్, భుజాంతరా
ళంబున హారసంతతు లిలాస్థలిఁబూలవర్షముల్, ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననంగగి మౌక్తికతుల్యమౌళిగం
గాంబు కణంబులుట్టిపడ నాడెడుశంభుఁడు మిమ్ముఁబ్రోవుతన్

చ॥ అడుగుల్ ముప్పదియాఱిటన్ వెడలువై హస్తత్రిషట్కంబుచే
నిడువై యున్నతమై సమస్థలమునై నిర్మోకహస్తాంకమై
మృడమిత్ర [?] పులందు వాకిలొక టైమించం గవాక్షంబు లిం
పడరన్ శాలను రాజు షడ్విధము నాట్యంబిట్టు సేయించుటన్

ఉ॥ నందిమృదంగరావము ఘనస్తనితంబని మ్రోలనున్నయా
స్కందుని వాహనంబగుశిఖండి యఖండితనృత్యమాడ భీ
తిం దనహస్తరంధ్రము గణింజొర నాభరణాహిరాజివో
వం దలయూచు విఘ్నపతి భాసురపూత్కృతి మిమ్ముఁబ్రోవుతన్.

సీ॥ ప్రాకారములయందుఁ బటుగోపురంబుల
　　దామరమ్యద్వారసీమలందు,
విపణిగృహంబుల వెలయు నాయుధహస్త
　　భటులను హి(తము)గాఁ బ్రౌఢినిల్పి,
రక్షితం బొనరించి రాజబింబద్యుతుల్
　　మించికాయుచు నున్నమంచివేళ,
మహిమ నాప్తసుబంధుమధ్యస్థలమునందుఁ
　　జెలఁగిరత్నాసనాసీనుఁడగుచు,

నర్తనకేళిలాస్య నటనాగతులచేత
శాస్త్రసమ్మతముగ జనులకెల్ల
వేడ్కఁజూపి మఘవవిభవుఁడై కొలువుండ
వలయువిభుఁడు నిఖిలకలలునెఱిఁగి.

సీ॥ మొదలిపుష్పాంజలి ముదమునఁ గావించి
　　కరబాళి మొగబాళి సరవులెత్తి,
యురుపృథుబాళములొగిఁ బిల్లమురువును
　　హస్తప్రకరణము వేననువుచఱచి,
కడకట్టు శబ్దంబు కడఁగి దర్వును జిందు
　　బాగైన గీతప్రబంధవులును,
కుండలి బహురూప దండలాస్యవిలాస
　　దేశిమార్గంబుల తెరువు లెఱిఁగి,
నయము బిఱుసును, న(స?)రిగతుల్ కడిఁదిగాను
తిరువుమురువును నిలకడ తిన్ననగుచు,
పాత్రఁగొనిపించఁగొనఁగను బ్రౌఢియైన
వాఁడె నటుఁడనఁబరఁగు నీవసుధయందు.

## చిల్లకూరి దివాకరకవి

ఇతడు 'భరతసారసంగ్రహ' మను గ్రంథమును రచించెను. భరతముని నాట్యశాస్త్రము మొదలు సంగీతరత్నాకరము వరకును గల నాట్యశాస్త్రగ్రంథముల సారమిది. ఇది శ్రీరామునకంకితము. హస్తాధ్యాయ – మృదంగాధ్యాయములు సమగ్రముగా గలవు.

సీ॥ "భరతముధరలోనఁ బదియాఱు విధములై
　　విలసిల్లునందుఁ గోహళమతంబు
నందికేశ్వర వాయునందన నారద
　　ఫల్గున శక్రుల భరతములును

యాజ్ఞవల్క్యయు గురు డల భరతచార్యు
　　లరుదార జెప్పిన భరతములును
నమరసంగీతరత్నాకరమును పది
　　విధములు, మఱియూఱు విధములేను
తెలియజాలను బరిపాటిఁదెలియగాను
నెరయువిధము లొక్కటిగాను నీదుకృపను
పద్యకావ్యం బొనర్తును హృద్యముగను"

అని అతడు తానుపదిభరతముల నెఱిగినట్లు చెప్పుకొనెను ఈ భరతములలో పెక్కులు తెలుగు టీకలతో తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయములో నున్నవి.

## 6. జాయన : నృత్తరత్నావళి

కాకతీయప్రభువులు సంగీత—సాహిత్యములను అత్యధికముగా ఆదరించినట్లు చరిత్రవలన తెలియుచున్నది. ప్రథమప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1158-95) విద్యాభూషణ బిరుదాంచితుడు; నీతిసారాది గ్రంథకర్త. కాకతీయచక్రవర్తులలో సుప్రసిద్ధుడు గణపతి దేవుడు. ఇతడరువది సంవత్సరములు (క్రీ శ 1199-1261) పైగా రాజ్యమునుపాలించి, దేశమును సుభిక్షమొనరించెను. ఇంక రెండవప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1290-1326) పండితులలో పండితుడు, కవులలోకవి, సంగీతరహస్యమెరిగిన గాయకశిరోమణి, చిత్రకళా వేత్త. కావుననే ఈ కాలము లలితకళలకు, ముఖ్యముగా నృత్యమునకు, నవవసంతోదయ మైనది. రాజులు, రాజబంధువులు, మహామాత్యులు, సేనానులు స్వయముగా వివిధకళా వేత్తలైనారు.

కాకతీయులనాటి నృత్యకళాచరిత్ర ముత్త్రిధములుగా వెలుగులోనికి వచ్చినది—శాసనములు, శిల్పములు, సాహిత్యము.

రేచెరువుల నామిరెడ్డి పిల్లలమఱ్ఱి శాసనమునందు దేవాలయ గాయకులకు, మార్దంగికులకు, నర్తకులకు గృహములను దానముచేసినట్లు కలదు (**Corpus of Inscriptions No. 37**). మైలాంబ పానగల్లు శాసనములోకూడ నృత్యసంగీత కళాకారుల కిట్టి దానము లొసంగబడినట్లు కలదు (**Corpus of Inscriptions No. 36**). ధర్మసాగర్ శాసనమునుబట్టి గాయకులకు, పదిమంది దేవదాసీలకు భూదానములొసంగబడినట్లు తెలియు చున్నది (**Corpus of Ins. No. 1**). గణపతిదేవుడు జాయసేనాపతికి చేబ్రోలునొసంగి నట్లు తెలియజేసెడి శాసనములో 16 మంది దేవదాసీలను దానముచేసినట్లున్నది (**Epi. Ind. Vol. VI. 38ff**). రుద్రమదేవి మల్కాపురశాసనములో 10 మంది వేశ్యలు దేవాలయమునొద్ద నాడుటకు, 14 మంది గాయకులు పాడుటకు ఏర్పాటు జరిగినది. ఇట్టి అంశములు ఆయాశాసనములందు అనేకములుకలవు.

శిల్పములుకూడ ముఖ్యముగా దేవాలయములకు సంబంధించియున్నవి. ఈ దేవాలయములలో ప్రధానమైనవి వరంగల్లులోని వేయిస్తంభాలగుడి, పాలంపేటలోని రామప్పగుడి రామప్పగుడి అనునది రుద్రేశ్వరాలయము. గణపతిదేవుని సేనానియును, మంత్రియునునగు రేచెర్ల రుద్రదేవుడు క్రీ. శ. 1213లో ఈ దేవాలయమును నిర్మించెను. ఇందలి ప్రతిభాగమును ఒక అపరూప శిల్పకళాఖండము. కాకతీయుల నృత్యకళాభిమానమునకిది పరాకాష్ఠ (ఇందలి నృత్యచిత్రము లీగ్రంథమున ముద్రితములైనవి). వరంగల్లు కోటలోని స్వయంభూలింగేశ్వరస్వామి దేవాలయ మండపమునందు శివతాండవమునకు సంబంధించిన పెక్కుశిల్పములుకలవు.

ఇంకసాహిత్యమునకు సంబంధించిన సాక్ష్యములలో తిక్కన, పాల్కురికి సోమనాథుల రచనలనుగూర్చి ఇంతకుముందే పేర్కొనియున్నాను ఇవి తెలుగు రచనలు. ఇంక సంస్కృతమున వెలసిన ఉత్తమోత్తమగ్రంథము ప్రస్తుతమగుచున్న నృత్తరత్నావళియే.

జాయన అయ్యకుల సంజాతుడు; పిన్నచోడనపుత్రుడు. ఇతని తాతముత్తాతలది వెలనాడులోని క్రొయ్యూరు ఈతని తండ్రితాతలు, చందవోలు రాజధానిగా తెలుగు దేశమును పాలించిన వెలనాటి చోళమహీపతులను సేవించిరి. జాయన తాతయైన నారాయణ నాయకుడు వెలనాటి రెండవచోళుని కాలములో కృష్ణానదిసముద్రమున గలియు చోటనున్న దీవియందు గొప్పనగరమునిర్మించెను (ఈ దీవి ఇంతకుపూర్వము జననివాసమున కయోగ్యమైనది). నాటినుండి వీరచ్చటనే నివసింపసాగిరి. క్రీ. శ 1203 లో కాకతి గణపతిదేవచక్రవర్తి ఈ దీవిపై దండెత్తి, అయ్యకులజుడైన పిన్నచోడనాయకుని (జాయన తండ్రిని) ఓడించి, దీవిని వశపరచుకొనెను కాని, ఆతడు అయ్యకులజుల పరాక్రమాదులను మెచ్చుకొని, వారితోసఖ్యముచేసికొనెను; అంతేకాదు జాయన అక్కల నిరువురను-నారమ పేరమలను వారిని - వివాహమాడెను (Epi. Ind Vol. III- P. 84). అప్పటికి జాయన చాలచిన్నవాడు. ఆతని సౌమ్యాకారమును, నయవినయ శౌర్యగాంభీర్యములను గమనించిన గణపతిదేవుడు, వానికి ఆందోళికాతపత్రాది గౌరవములను ప్రసాదించి, గజసైన్యాధిపతినికావించి, క్రీ శ. 1213లో 'తామ్రపురి' ని (గుంటూరుజిల్లాలోని చేబ్రోలును)పరిపాలింపనిచ్చెను (Epi. Ind Vol. V-PP 142-43). అంతేకాదు, కౌమారదశనుండియు జాయన ప్రజ్ఞాతిశయములనెరింగిన గణపతిదేవుడు, స్వయముగా శ్రద్ధవహించి, గుండామాత్యులవారిచే జాయనకు కళలను నేర్పించెను. (1-13)

"ప్రేక్ష్య ప్రజ్ఞామతిశయవతీం స్వామిభక్తించహర్షాత్
ఆకౌమారాత్ గణపతినృపోజాయనం సమర్ప్య
గుండామాత్యే సకలసుమనస్సేవ్యమానేజయంతం
వాచాంపత్యౌ హరిరివ కలాం శ్లాఘనీయాం వ్యనైషీత్."

పిమ్మట ప్రాజ్ఞుడైన జాయన గణపతిదేవుని యాజ్ఞచే, ఆయనకు మిగుల ప్రియము.గు నృత్తలీలలకు రత్నదర్పణమువంటి "నృత్తరత్నావళి"ని క్రీ.శ. 1253-54 (కలియుగ

4355) లో రచించెను. అనగా, అప్పటికి జాయన సుమారు 60 ఏండ్ల వయస్సువాడు అయి యుండును. ఈ గ్రంథరచనలో జాయనకు నాటికి వెలువడిన శాస్త్రగ్రంథములు, లోక మందు ప్రసిద్ధి వహించిన దేశినృత్యములు మాత్రమేకాక రామప్పగుడివంటి దేవాలయము లందలి నృత్యశిల్పములుకూడ తోడ్పడియుండును

నృత్తరత్నావళి యందలి విశేషములను ఆయా సందర్భములందు కొంత వివ రించియున్నాను . ఇప్పుడిందలి విషయములను క్రమముగా వివరింతును (విషయసూచిక, విశిష్టపదసూచికకూడ విషయగ్రహణమునకు తోడ్పడగలవు) : నృత్తరత్నావళి యందు 8 అధ్యాయములు గలవు దీనినంతటిని రెండు వర్గములుగా విభజింపవచ్చును- మొదటి నాలుగు అధ్యాయములు మొదటివర్గము, ఇందు భరతమతానుసారముగా 'మార్గ' నృత్తము వివరింపబడినది ఇంక తరువాతి నాలుగు అధ్యాయములును రెండవవర్గము ; ఇందు 'దేశి' సంప్రదాయము వర్ణితమైనది

నృత్తరత్నావళి యందలి ప్రథమాధ్యాయము 'పరిచయము' వంటిది. ఇందు కృతిప్రారంభము, నృత్త-నృత్య-నాట్యముల విశేషములు, లాస్యాంగవివరములు కలవు. రెండవ అధ్యాయమున, నృత్తము దృష్టిలో ప్రధానమైన ఆంగికాభినయము-అంగోపాంగ ప్రత్యంగ సహితముగా-వర్ణితమైనది. మూడవ అధ్యాయమున చారీ-మండలములు, స్థానక-ఆసన-శయనాది విధులు, వ్యాయామ వైశిష్ట్యము వర్ణితములైనవి నాలుగవ అధ్యాయము కరణాంగహారములకు, రేచకములకు పరిమితమైనది ఈ నాలుగు అధ్యా యములందునుచెప్పిన విషయములన్నియు భరతాదులు చెప్పిన 'మార్గ' భేదమునకు సంబం ధించియున్నవి ఇవి గతానుగతికములే అయినప్పటికిని, వీని నిర్వచనములలో జాయన మౌలికతను చూపినాడు

ఇంక ఐదవ అధ్యాయమునుంచి దేశి విధానము వర్ణితమైనది ఇందు దేశి స్థాన కములు, ఉత్ప్లుతికరణములు, భ్రమరులు చెప్పబడినవి. ఆరవ యధ్యాయమున దేశిపాద ములు, పాటములు, చారులు, లాస్యాంగములు, గతిభేదములు చెప్పబడినవి. ఏడవ యధ్యాయమున ప్రధానముగా పేరణి మున్నగు 15 నృత్యభేదములు వర్ణితములైనవి. అంతేకాక శిక్షాపద్ధతి, వాద్యపద్ధతి, నర్తకీ-నర్తక-ముఖరి-ప్రతిముఖరి-వాద్యబృంద- బృంద-ముఖ్యగాయక-సంప్రదాయలక్షణములు చెప్పబడినవి మరియు నృత్త-నృత్యము లను ప్రదర్శించెడి మండపలక్షణము, వీనిని తిలకించెడి సభాపతి—సభ్యుల లక్షణములుకూడ చెప్పబడినవి ఎనిమిదవ అధ్యాయమున ప్రేక్షాగారమున సభాపతి—సభ్యుల విన్యాసము, ప్రధాన నర్తకి నైపథ్యవిధానము, బృందవిన్యాసము, వాద్యముల మేళవింపు, నృత్య ప్రారంభము, నర్తకిని బహూకరించు విధానము వర్ణితములైనవి

ఇప్పుడింక జాయన పేర్కొన్న శాస్త్ర కర్తలనుగూర్చియు, జాయనను అనుస రించిన శాస్త్రకర్తలను గురించియు సంక్షిప్తముగా వివరింతును

## భరతముని

జాయన నాట్యశాస్త్రమును క్షుణ్ణముగా చదువుకొని, ఎన్నో వ్యాఖ్యానములను పరిశీలించినాడు (1-12); అందుచేతనే భరతముని ఆశయములను గ్రహించిన వాడై, క్లిష్టమైన నాట్యశాస్త్ర నిర్వచనాదుల నచ్చటచ్చట స్వయముగా వ్యాఖ్యానింప గలిగి నాడు-"ప్రోక్తం జాయచమూపేన మునేరాశయ వేదినా"(2-437) ఇట్టివనేకములుకలవు. కాగా జాయన భరతాభినవగుప్తులను బాగుగా అనుసరించుటయేకాక వారికి వ్యాఖ్యాత కూడ అయినాడు భరతముని ఆశయములను పూర్ణముగా తెలిసిన వాడనను ఆత్మ ప్రత్యయము జాయన కెంతగలదో ప్రథమాధ్యాయ మందలి 16 వ శ్లోకమును పరిశీలించిన స్పష్టముకాగలదు.

## కోహలుడు

నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమందు కోహలుడు భరతపుత్రునిగా పేర్కొనబడినాడు ఇంక చివరి అధ్యాయమందు కోహలుడు, తక్కిన భరతసుతులతోకలిసి, కొంత కాలము భూలోకమున మర్త్యభావముతోవసించి, నాట్యశాస్త్రమును భూలోకమున ప్రవర్తింపజేసినట్లుకలదు. అంతేకాదు నాట్యశాస్త్రాంతమున "శేషముత్తరతంత్రేణకోహలః కథయిష్యతి" అనికూడ కలదు. కావున, కోహలుడు భరతముని తరువాత ప్రధానముగా నెన్నదగినవాడు అంతేకాదు, అభినవగుప్తాదుల ననుసరించి, కోహలుడు ఉపరూపక నిర్మాత యనికూడ స్పష్టమగుచున్నది కాని, కోహల విరచితమైన గ్రంథమేదియు లభ్యముకాలేదు అభినవభారతి ననుసరించి, నికుట్టక నిర్వచనములో జాయన కోహలుని పేర్కొనినాడు (4-48). రెండవ అధ్యాయమున 19 వ శ్లోకములో జాయన 'అనుతంత్ర విధాయిభిః' అని పేర్కొనినాడు. ఈ అనుతంత్రవిధాయులలో ఉత్తరతంత్ర కర్తయగు కోహలుడుకూడ ఉండియుండును

## తుంబురుడు

జాయన తుంబురుని ఒక్కసారి పేర్కొనినాడు (4-369).

## మతంగుడు (క్రీ.శ. 9 వ శతాబ్ది)

జాయన మతంగుని నాలుగుసార్లు పేర్కొనినాడు (6-1, 6-54, 7-21, 7-31)- ఇవి అన్నియు దేశినృత్తపద్ధతులకు సంబంధించిన ప్రస్తావనలు. మతంగుడు 'బృహద్దేశి' కర్తగా సుప్రసిద్ధుడు.

## భట్టతండువు

జాయన భట్టతండువును పెక్కు (19) సార్లు పేర్కొనెను. ఇవియన్నియు కరణనిర్వచనములకు సంబంధించియున్నవి. పరమేశ్వరాదేశము ననుసరించి భరతమునికి నృత్తము నేర్పిన తండుమహర్షి కంటె ఇతడు భిన్నుడుకావచ్చును.

## కీర్తిధరుడు

నృత్తరత్నాకరమున కీర్తిధరుడు పెక్కుసార్లు ఉదాహరింపబడెను. కీర్తిధరుని రచన నేడు లభ్యముకాకున్నను, అభినవగుప్తునకు, జాయసకు ఆ గ్రంథము లభించియుండు నని చెప్పవచ్చును.

జాయన కరణనిర్వచనములలో భట్టతండువు అభిప్రాయములను పేర్కొనిన వెంటనే కీర్తిధరుని అభిప్రాయములనుకూడ పేర్కొనుటనుబట్టి కీర్తిధరుడు భట్టతండువు కంటె అర్వాచీనుడు అయియుండునని తలంపవచ్చును.

## శంకుకుడు

జాయన శంకుకుని ఒక్కసారి మాత్రమే పేర్కొనెను (4–237)-అర్ధనికుట్టక కరణ నిర్వచనమునకు సంబంధించిన ఘట్టమున శంకుకుడు నాట్యశాస్త్ర వ్యాఖ్యాత, అభినవగుప్తునకు పూర్వుడు.

## అభినవగుప్తుడు

జాయన అభినవగుప్తుని పేరుపెట్టి ఒక్కసారిమాత్రమే పేర్కొనెను (2-275)-నిషధహస్త నిర్వచనమున. కాని, జాయన అభినవభారతిని అనుసరించిన ఘట్టములు బహుళ ములుగా కలవు అంతియేకాదు అభినవగుప్తుని వ్యాఖ్యానమును అనుసరించియే జాయన నాట్యశాస్త్రమును ఉపయోగించుకొనెననికూడ చెప్పవచ్చును

## సోమేశ్వరుడు

జాయన సోమేశ్వరుని పేరుపెట్టి రెండుసార్లు పేర్కొనెను (2–177, 7–162); ఇందు మొదటిది హస్తముల సంఖ్యకు సంబంధించిన ప్రశంస, ఇంక రెండవది గోండలి నృత్యమునకు సంబంధించిన ప్రశంస. కాని, జాయన పేరు చెప్పకయే పెక్కుసార్లు సోమే శ్వరుని అనుసరించియున్నాడు. సోమేశ్వరుడు పశ్చిమ చాళుక్యరాజు; అభిలషితార్థ చింతా మణి యను నామాంతరముగల "మానసోల్లాస" కర్త (ఇది క్రీ.శ. 1131 లో రచింపబడి నట్లు ఆ గ్రంథమందేకలదు).

## ఇతరులు

పేరుచెప్పక "అన్యే, అపరే, పరే, మతాంతరే, కేచిత్, కైశ్చిత్" అనుచు జాయన పెక్కుసార్లు చెప్పినాడు. ఇవి బహుళముగా అభినవగుప్త-సోమేశ్వరులను, శార్ఙ్గ దేవుని సూచించుచున్నవి

## శార్ఙ్గదేవుడు

సంగీతరత్నాకర కర్తయగు శార్ఙ్గదేవుడు దేవగిరిని(నేటిదౌలతాబాదును) క్రీ.శ. 1210 నుండి 1247 వరకు పరిపాలించిన యాదవరాజగు సింఘణదేవుని ఆస్థానమందు ప్రధానరాజగణకపదవిని నిర్వహించెను సింఘణదేవుడు క్రీ శ. 1247 లో చనిపోవుటచేత సంగీతరత్నాకరము అంతకుముందే రచింపబడియుండవలెను కాగా, క్రీ శ. 1253–54 లో వ్రాయబడిన నృత్తరత్నావళికంటె సంగీతరత్నాకరము, అవ్యవహితపూర్వరచన యగుచున్నది సంగీతరత్నాకరమునందలి ఏడవయధ్యాయము నృత్యాధ్యాయము. దీనికిని, నృత్తరత్నాకరమునకును చాలపోలికలున్నవి. కాగా, నృత్తరత్నావళి కాలక్రమమున అర్వాచీనరచనయగుచున్నదికాన జాయన, శార్ఙ్గదేవుని అనుసరించెనని చెప్పుటకు అవకాశము కలుగుచున్నది. కాని, సంగీతరత్నాకరము నృత్తరత్నావళికి అత్యవహితపూర్వమునందున్నదగుటచేత జాయన శార్ఙ్గదేవుని అనుసరించెననుటకంటె, ఇరువురును వేరొక మూలగ్రంథమును (నేడు లభ్యముకానిదానిని) అనుసరించియున్నారనుట సమంజసమేమో?

## పార్శ్వదేవుడు

ఇతడు 'సంగీతసమయసార' కర్త. పార్శ్వదేవుడు సోమేశ్వరుని పేర్కొనెను. ఇంక పార్శ్వదేవుని పేర్కొన్న తొలిశాస్త్రకారుడు సింహభూపాలుడు (క్రీ. శ. 1330 ప్రాంతములు) సంగీతసమయసారమునకును, నృత్తరత్నావళికిని దేశివిషయములందు చాల పోలికలు కలవు ఒక ఉదాహరణము; శార్ఙ్గదేవుడు పది దేశిలాస్యాంగముల పేర్కొనెను. పార్శ్వదేవుడు "అత్రపూర్వైరనుక్తాని దేశ్యాంగాని వదామ్యహమ్" అనుచు 20 దేశి లాస్యాంగములను పేర్కొనగా, జాయన 46 భేదములను పేర్కొనెను. ఈ భేదములు 'ప్రసిద్ధము' లని జాయన పేర్కొనుటచేత, పార్శ్వదేవుడు చెప్పినవిందుండుటచేత జాయన పార్శ్వదేవునికంటె అర్వాచీనుడగుచున్నాడు.

## నారదుడు

నారదుడు 'దేశీనృత్తసముద్రము' నందు 700 చాలక (బాహుప్రకార) భేదములను పేర్కొన్నట్లు సంగీతరత్నాకరవ్యాఖ్యలో కల్లినాథుడు పేర్కొనినాడు. 'దేశీనృత్తసముద్రము' నుండి కొన్ని 'పాటమణులు' గ్రహించినట్లు జాయన పేర్కొనినాడు (6–13).

## గీతరత్నావళి

జాయన తన్నుగూర్చి పెక్కుసార్లు, పేర్కొనియున్నాడు; ఇవియన్నియు స్వీయాభిప్రాయములకు సంబంధించియున్నవి. 'తన్న మన్యామహే వయమ్' (1–72);

'తదాహంసరుతం బ్రూతేపాపం జాయచమూపతిః' (6-12) మొ॥ అన్నింటికంటె ప్రధానమైన ప్రసక్తి స్వీయరచనయగు 'గీతరత్నావళి' కి సంబంధించియున్నది (5-109). ఇది కేవలము గానమునకు సంబంధించిన గ్రంథము; అలభ్యము.

## జాయనను అనుసరించినవారు

మేవాడురాజగు కుంభకర్ణుడు (క్రీ. శ. 1433-68) తన సంగీతరాజమందలి నృత్యరత్నకోశమున నాలుగైదుచోట్ల జాయనను అనుసరించియున్నాడు. కోమటి వేమారెడ్డి (క్రీ. శ. 1402-20) తన సంగీతచింతామణియందలి నృత్యాధ్యాయమున జాయన నృత్తరత్నావళిని బహుళముగా అనుసరించినాడు ఇంక తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజగు తులజుడు తన సంగీతసారామృతమునందు రెండుసార్లు నృత్తరత్నావళి నుండి భాగములనుద్ధరించియున్నాడు. కాగా నృత్తరత్నావళి దూరదేశములందుకూడ ప్రసిద్ధినందినదని చెప్పగలము.

## కృతజ్ఞతలు

నేను మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో పనిచేసిన రోజులలో (1952-56) డా. వి. రాఘవన్‌గారితోసన్నిహితపరిచయమేర్పడినది డా రాఘవన్‌గారు నృత్తరత్నావళికి రచించిన పీఠిక ముద్రణలో ఉన్నసమయము (1956) లో పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోని భాగములను ఎత్తి వారికి వ్రాసియిచ్చినాను అప్పుడే నృత్తరత్నావళిని చూచెడి అవకాశము నాకులభించినది నేను ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి కార్యదర్శిగా పనిచేసిన రోజులలో(1964-65) దీని నాంధ్రీకరించెడి భారమును పూజ్యులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి అప్పగించుట జరిగినది. ఇట్లీవిధముగా నృత్తరత్నావళితో నాకు ఆత్మీయత ఏర్పడినది. ఇట్టి స్థితితో, దీనికి విపులమైన పీఠిక వ్రాసెడి భారమును నాకే అప్పగించినారు శ్రీమాన్ అనంతకృష్ణశర్మగారు నృత్తరత్నావళియెడ యేర్పడిన ఆత్మీయత, పూజ్యులైనశర్మగారి ఆదేశము — ఈ రెండును నాచే ఈ పీఠికను రచింపజేసినవి. ఈ కృషిలో ఎంతవరకు కృతకృత్యుడనైతినో సహృదయులే ప్రమాణము నన్నుపెద్దజేసి, నాచే ఈ కార్యమును నిర్వహింపజేసిన పూజ్యులు శ్రీమాన్ శర్మగారికి కృతజ్ఞతలు ఆంధ్రసేనాని రచించిన ప్రామాణికశాస్త్రగ్రంథమును, శ్రమకోర్చి పరిష్కరించి, సర్వాంగసుందరముగా వెలువరించిన డా. వి. రాఘవన్‌గారికి ఆంధ్రులెల్లరును కృతజ్ఞులే.

ప్రామాణికశాస్త్ర గ్రంథప్రచురణకు ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమి కార్యకలాపములలో ప్రాధాన్యముకల్పించిన సహృదయులు, ఆత్మీయులు శ్రీ వసల సూర్యచంద్రరావుగారు - వారికి నా నమోవాకములు

# విషయసూచిక


## మొదటి అధ్యాయము

ఆశీస్సులు 3
నృత్తప్రశంస 3
గ్రంథకర్తృప్రశంస 7
గ్రంథప్రశంస 9
నృత్తసమయము 9
నాట్యావతరణము 9
నాట్యలక్షణము 11
చతుర్విధాభినయము 13
ఆంగికము ,,
వాచికము ,,
ఆహార్యము ,,
సాత్త్వికము 17
నృత్యనృత్తనాట్యముల మార్గదేశీ భేదముల లక్షణము ,,
లాస్యతాండవముల లక్షణము 19
లాస్యాంగములు (పది) ,,
గేయపదము, స్థితపాఠ్యము, ఆసీనము, పుష్పగంధిక, ప్రచ్ఛేదకము, ఉత్తమోత్తమకము, ,,
ద్విమూఢకము, త్రిమూఢకము, సైంధవము,
ఉక్తప్రత్యుక్తము, 21
చిత్రపదము, భావికము 23
ఉద్ధతము ,,

## రెండవ అధ్యాయము

అంగప్రత్యంగోపాంగములు 25
శిరోలక్షణము (13) ,,
ఆకంపితము, కంపితము, ధుతము, విధుతము, అంచితము, పరివాహితము, ఆధూతము, అవధూతము, నిహంచితము, అధోగతము, పరావృత్తము, ఉత్క్షిప్తము, 27
లోలితము 29
మరికొన్ని శిరోభేదములు (11) 29
సమము, నైరాజితము, తిర్యక్నతము, తిర్యఙ్నతోన్నతము, పార్శ్వాభిముఖము, 29
ఉన్నతము, సకంపపరివాహితము, సకంపధుతము, ఉద్ధుతము, పార్శ్వకంపితము, పార్శ్వాకంపితము 31
దృష్టిలక్షణము 31
రసదృష్టులు ,,
స్థాయిభావదృష్టులు ,,
వ్యభిచారిభావదృష్టులు ,,
రసదృష్టులు(8) 33
కాంతము, హాస్యము, రౌద్రము, కరుణము, వీరము, అద్భుతము, ,,
బీభత్సము, భయానకము 35
స్థాయిదృష్టులు (8) 35
స్నిగ్ధము, హృష్టము, క్రుద్ధము, దీనము, దృప్తము, విస్మితము, జుగుప్సితము, భయాన్వితము 35

సంచారిదృష్టులు (20) 37
శూన్యము, లజ్జాన్వితము,
శ్రాంతము, నిషాదిని,
మలినము, శంకితము,
ముకుళము, గ్లానము,
కుంచితము, 37
లలితము, అభితప్తము,
అర్ధముకుళము, విభ్రాంతము,
వితర్కితము, ఆకేకరము,
వికోశము, జిహ్మము,
త్రస్తము, విప్లుతము 39
మదిరము 41
ఈదృష్టులవినియోగము 41
తారాకర్మ (9) 43
భ్రమణము, వలనము, పాతము,
చలనము, సంప్రవేశనము,
వివర్తనము, సముద్వృత్తము,
నిష్క్రామము, ప్రాకృతము 43
తారాకర్మల వినియోగములు 43
దర్శనప్రకారములు (8) 45
సమము, సాచి, అనువృత్తము,
ఆలోకితము, విలోకితము,
ప్రలోకితము, ఉల్లోకితము,
అవలోకితము 45
రెప్పలపని (9) 45
ఉన్మేషము, నిమేషము,
ప్రసృతము, కుంచితము,
సమము, వివర్తితము, 45
స్ఫురితము, పిహితము,
వితాడితము 47
వీనిరసభావవినియోగము 47
బొమలపని (7) 47
ఉత్క్షేపము, పాతనము,
భ్రుకుటి, చతురము,
కుంచితము, రేచితము,
స్వాభావికము 47
వీనిరసభావవినియోగము 49
నాసాకర్మ (6) 49
నతము, మందము,
వికృష్టము, సోచ్ఛ్వాసము,
వికూణితము, స్వాభావికము 49
వీని వినియోగము 49
ఓష్ఠలక్షణము (6 + 4) 51
వివర్తనము, విసర్గము,
వేపనము, వినిగూహనము,
సందష్టము, సముద్గము 51
ఆయతము, రేచితము,
వృత్తము, వికాసి 53
కపోలలక్షణము (6) 53
కుంచితము, కంపితము, ఫుల్లము,
క్షామము, పూర్ణము, సమము 53
చుబుకలక్షణము (7) 53
కుట్టనము, లేహనము, ఛిన్నము, 53
ఖండనము, చుక్కితము, సమము,
దష్టము 55
హనువు (కటమర) లక్షణము(6) 55
లోలము, శ్లథము, చల
సంహతము, సంహతము,
స్ఫురితము, వక్రము 55
జిహ్మకర్మలు (6) 55
ఋజ్వి, సృక్కానుగము,
వక్రము, నతము, లోలము,
లేహని 57
దంతకర్మములు (5) 58
చర్వణము, ఛేదనము, పీడ
నము, గ్రహణము,
నిష్కర్షణము 57

గ్రీవాలక్షణములు (9) 57
సమము, అంచితము, 57
నతము, త్ర్యశ్రము, రేచి
తము, కుంచితము, ఉన్న
తము, వలితము, నివృత్తము 59
ముఖరాగము (4) 59
స్వాభావికము, ప్రసన్నము,
రక్తము, శ్యామము 59
ముఖరాగప్రాధాన్యము 59
హస్తలక్షణములు 61
అసంయుతహస్తములు (24) 61
సంయుతహస్తములు (13) 61
నృత్తహస్తములు (29) 61
హస్తములసంఖ్యాపరిగణనము 63
నృత్తహస్తములద్వివచనము 65
అసంయుతహస్తములు (24) 65
పతాకము 67
త్రిపతాకము 67
సర్పశిరము, మృగశీర్షకము,
కర్తరీముఖము,కటకాముఖము 69
సూచీముఖము 73
శుకతుండము, హంసాస్యము,
కపిత్థము, శిఖరము 75
పద్మకోశము, కాంగూలము,
ముష్టి, చతురము, భ్రమరము 77
అరాళము, హంసపక్షము,
అర్ధచంద్రము 79
సందంశము,ముకులము,ఊర్ణనా
భము, అలపల్లవము, తామ్ర
చూడము 81
సంయుక్తహస్తములు (13) 83
అంజలి, కటకావర్ధమానము,
స్వస్తికము, కర్కటము,
కపోతము 83
నిషధము, ఉత్సంగము, గజదం
తము, అవహిత్థము, దోలము 85
పుష్పపుటము, వర్ధమానము,
మకరము 87
హస్తములనంతములు 87
హస్తప్రయోగవిధానము 89
హస్తకర్మలు (20) 89
హస్తకరణములు (4) 91
అపవేష్టనము, ఉద్వేష్టనము,
వ్యావర్తము, పరివర్తనము 91
హస్తప్రచారములు (5+5) 93
ఉత్తానము, అధస్తలము,
తిర్యక్కు, ఊర్ధ్వముఖము,
అధోముఖము 93
ఊర్ధ్వగతము, అధోగతము,
తిర్యగ్గతము, అగ్రగతము,
సమ్ముఖాగతము 93
హస్తగతి 93
బాహుప్రకారములు (10+6) 93
ఊర్ధ్వగతము, పృష్ఠగతము,
తిర్యగ్గతము, స్వస్తికము,
మండలము, అపవిద్ధము 93
అంచితము, ఆవిద్ధము, కుంచితము,
అధోముఖము 95
సరళము, ఆందోళితము,
నమ్రము, ఉద్వేష్టితము, ఉత్సా
రితము, ప్రసారితము 95
బాహువులసంఖ్యాపరిగణనము 95
హస్తాభినయమునిషిద్ధము 95
నృత్తహస్తములు (31) 97
చతురశ్రములు, ఉద్వృత్తములు,
తలముఖములు 97
స్వస్తికములు, విప్రకీర్ణములు,
అరాళకటకాముఖములు, ఆవిద్ధ
వక్రములు, సూచ్యాస్యములు 99
రేచితములు, అర్ధరేచితములు,

ఉత్తానవంచితములు, పల్లవ
ములు, కేశబంధములు 101
లతాఖ్యములు, కరిహస్త
ములు, పక్షవంచితములు,
పక్షప్రద్యోతకములు, తార్క్ష్య
పక్షములు 103
దండపక్షములు, ఊర్ధ్వమండల
ములు, పార్శ్వమండలములు,
ఉరోమండలములు 105
ఉరఃపార్శ్వార్ధమండలములు,
ముష్టికస్వస్తికములు 107
నలినీపద్మకోశములు, అల
పద్మోల్బణములు, లలితములు,
వలితములు, నికుంచకములు 109
ద్విశిఖరములు, వరదాభయ
ములు 111
వక్షోలక్షణము (5) 111
సమము, ఉద్వాహితము,
ఆభుగ్నము 111
నిర్భుగ్నము, ప్రకంపితము 113
పార్శ్వలక్షణము (5) 113
వివర్తితము, అపసృతము,
ప్రసారితము, సమున్నతము,
నతము 113
పృష్ఠలక్షణముచెప్పలేదు 113
జఠరకర్మములు (3) 115
క్షామము, ఖల్వము,
పూర్ణము 115
కటీలక్షణము (5) 115
రేచితము,కంపితము,
ఛిన్నము, నివృత్తము,
ఉద్వాహితము 115
ఊరుకర్మములు (5) 115
కంపనము, 115
వలనము, స్తంభము,
ఉద్వర్తనము, నిరవర్తనము 117
జానుకర్మములు (7) 117
ఉన్నతము, వివృతము,
నమ్రము, అర్ధకుంచితము,
కుంచితము, సంహతము,
సమము 117
జంఘాకర్మములు (5 + 5) 117
పరివృత్తము, కుంచితము 117
(నతము),క్షిప్తము, ఆవర్తి
తము,
ఉద్వాహితము 119
భ్రామితము, నిస్సృతము,
కంపనము, తిరశ్చీనము,
బహిర్గతము 119
పాదలక్షణము(5 + 10) 119
సమము, అగ్రతలసంచారము,
కుంచితము 119
ఉద్ఘట్టితము, అంచితము, 121
తాడితము, ఘట్టితోత్సేధము,
ఘట్టితము, మర్దితము,
అగ్రగము 121
పార్ష్ణిగము, పార్శ్వగము,
సూచి, అంగుళిపృష్ఠము,
తలాహతి 123
పాదాంగుళీలక్షణము (7 + 3) 123
ఉత్క్షిప్తములు, కుంచితములు,
స్తబ్ధములు, అవక్షిప్తములు,
స్వభావజములు 123
అనంగుష్ఠయుతములు, అంగుష్ఠ
సంయుతములు, ఉత్క్షిప్తము,
అవనతము, సహజము 125

## మూడవ అధ్యాయము


చారిప్రశంస 127
చారులలక్షణము 127
పదునారుభూచారులు 129
పదునారుఆకాశచారులు 129
భూచారులు (16) 129
సమపాదము, స్థితావర్తము, జనితము, స్యందితము, అపస్యందితము 131
బద్ధము, శకటాస్యము, విచ్యవము, ఏలకాక్రీడితము, చాషగతి, ఉత్స్యందితము 133
అడ్డితము, సమోసరిమత్తల్లి, మత్తల్లి, అధ్యర్ధికము, ఊరూద్వృత్తము 135
ఆకాశచారులు (16) 137
అతిక్రాంతము, పార్శ్వక్రాంతము, సూచి, మృగప్లుతము 137
భుజంగత్రాసితము, అలాతము, ఆవిద్ధము, నూపురపాదిక, ఆక్షిప్తము, భ్రమరి 139
దండపాదము, విద్యుద్భ్రాంతము, ఊర్ధ్వజానుపు, ఉద్వృత్తము, డోలాపాదము 141
హస్త, పాదములప్రాధాన్యము 141
స్థానములు 143
పురుషులస్థానములు (6) 145
వైష్ణవము, సమపాదము, వైశాఖము 145
మండలము, ఆలీఢము, ప్రత్యాలీఢము 147
న్యాయములు (4) 147
భారతము, సాత్వతము, వార్షగణ్యము, కైశికము 149
ప్రవిచారములు 149
రంగనిషిద్ధములు 151
వ్యాయామము 151
సౌష్ఠవము 151
పొట్టితనము 151
చతురశ్రము 153
ధనుఃకరణములు (4) 153
ఉత్కటము 153
యోగకృతము, చింతాకృతము, అవహిత్థము 155
సుప్తస్థానములు (6) 155
సమము, ప్రసారితము, ఉద్వాహితము 155
వివర్తితము, నతము, ఆకుంచితము 157
స్త్రీలస్థానములు (3 + 5) 157
ఆయతము 157
అవహిత్థము, అశ్వక్రాంతము, గతాగతము, 159
వలితము, మోటితము, వినివర్తనము, ప్రోన్నతము 161
మండలములు (10 + 10) 161
పదిభౌమమండలములు 163
భ్రమరము 163
ఆస్కందితము, పిష్టకుట్టము, చాషగతము, అడ్డితము, ఏలకాక్రీడితము 165
అధ్యర్ధము, ఆవర్తము, శకటాస్యము, సమోసరితము 167
పదిఆకాశమండలములు 169
సూచీవిద్ధము, అతిక్రాంతము, దండపాదము 169

అలాతము, విచిత్రము,
విహృతము 171
వామబంధము,లలితసంచరము,
క్రాంతము 173
లలితము 175

## నాలవ అధ్యాయము

నృత్తకరణములు (108) 177
కరణప్రయోగరహస్యము 181
కరణములక్షణములు 181
తలపుష్పపుటము, క్రాంతము,
ఛిన్నము, సమనఖము, 183
అంచితము, శకటాస్యము,
కటిచ్ఛిన్నము, ఉద్ఘట్టితము, 185
నికుట్టకము, లలితము,
వలితము, లీనము, 187
స్ఖలితము, చక్రమండలము,
నివేశము,స్వస్తికము, సూచి, 189
సూచీవిద్ధము, అర్ధసూచి,
వక్షఃస్వస్తికము, ఉన్నతము
అర్ధరేచితము 191
అర్గలము, అర్ధస్వస్తికము,
ఆవర్తము 193
పృష్ఠస్వస్తికము, వర్తితము,
భుజంగాచితము, 195
విష్కంభము, విక్షిప్తము,
దండరేచితము, అర్ధమత్తల్లి, 197
మత్తల్లి, మదస్ఖలితము,
లోలితము, ప్రేంఖోలితము, 199
నితంబము, ఊర్ధ్వజానువు,
పార్శ్వనికుట్టితము, పార్శ్వ
క్రాంతము, అతిక్రాంతము,
అపక్రాంతము, 201
నికుంచితము, విద్యుద్భ్రాం
తము, కటిభ్రాంతము,
ఉరోమండలము, 203
సన్నతము,వినివృత్తము,
నివృత్తము, అపవిద్ధము,
గరుడప్లుతము, 205
లలాటతిలకము, దోలాపాదము,
తలవిలాసితము, తలసంస్ఫో
టితము, దండపక్షము, 207
ఆక్షిప్తరేచితము, జనితము,
ఉపసృతము, ఉద్వృత్తము,
అవహిత్థము, 209
నిశుంభితము, విక్షిప్తాక్షిప్తము,
ఆక్షిప్తము, 211
భుజంగత్రస్తరేచితము,
మండలస్వస్తికము,
దండపాదము, పాదాపవిద్ధ
కము, భుజంగత్రాసితము 213
విష్ణుక్రాంతము, స్వస్తిక
రేచితము, ఏలకాక్రీడితము,
సంభ్రాంతము,సింహాకర్షితము,215
సర్పితము, నాగాపసర్పితము,
పార్శ్వజానువు, వృశ్చిక
రేచితము, లతావృశ్చికము 217
వైశాఖరేచితము, హరిణ
ప్లుతము, దిక్స్వస్తికము, గజ
క్రీడితము, చతురము, 219
కటీసమము, మయూర
లలితము, అలాతము,
సింహావిక్రీడితము, 221
కుంచితము, వృశ్చికము,
వ్యంసితము, పరివృత్తము,
వివర్తితము, రేచిత
నికుట్టితము, 223
ఊరూద్వృత్తము, వృశ్చిక

కుట్టితము, తలసంఘట్టి
తము, గండసూచి 225
భ్రమరము, నూపురము,
ఘూర్ణితము, వృషభ
క్రీడితము, 227
కరిహస్తము, ప్రసర్పితము,
గృధ్రావలీనకం, వలితోరువు, 229
అర్ధనికుట్టకము,
గంగావతరణము 231
అంగహారములు (32) 231
చతురశ్రాంగహారములు (16) 233
త్ర్యశ్రాంగహారములు (16) 235
స్థిరహస్తము, పరిచ్ఛిన్నము,
పార్శ్వచ్ఛేదము, అపరాజి
తము, పర్యస్తము, 237
భ్రమరకము, ఆలీఢము,
మత్తాక్రీడము, అపసర్పితము,
మదవిలసితము, 239
విద్యుద్భ్రాంతము, వైశాఖ
రేచితము, సూచివిద్ధము,
ఆక్షిప్తకము, 241
పార్శ్వస్వస్తికము, ఆచ్ఛు
రితము, గలిమండలము,
విష్కంభము, పరావృత్తము, 243
అపవిద్ధకము, మత్తస్ఖలితము,
సంభ్రాంతము, 245
ఆక్షిప్తరేచితము, 247
రేచితము, విష్కంభాపసృతము,
అలాతము, ఉద్వృత్తము, 249
అర్ధనికుట్టకము, ఉద్ఘట్టితము,
వృశ్చికాపసృతము, స్వస్తిక
రేచితము, 251
పరివృత్తకరేచితము, 253
అంగహారములందు
కరణములసంఖ్య 253
అంగహారములసంఖ్య 255
రేచకములలక్షణములు (4) 257
పాదరేచకము, హస్తరేచకము,
కటిరేచకము, కంఠరేచకము 257
కరణ-రేచక-అంగహారముల
సంబంధము 259

## ఐదవ అధ్యాయము

దేశిప్రశంస 263
దేశిస్థానకములు (23) 265
సమపాదము, పరావృత్తము,
స్వస్తికము, వృషభాసనము 265
బ్రాహ్మము, వైష్ణవము,
శైవము, గారుడము,
సంహతము, పృష్ఠోత్తాన
తలము, వర్ధమానము,
కూర్మాసనము,
ఏకపార్శ్వగతము, 267
నంద్యావర్తము, చతురశ్రము,
పార్ష్ణిపార్శ్వగతము, ఏకజాను
నతము, పార్ష్ణివిద్ధము,
ఏకపాదము, నాగ
బంధము, సమసూచి, 269
విషమసూచి, ఖండసూచి 271
ఉత్ప్లుతికరణములు (14) 271
అంచితము, అలగము,
లోహడి, దర్పశరణము, 271
కపాలస్పర్శనము 273
ఉత్ప్లుతికరణముల లక్షణములు 273
అంచితములలక్షణము 273
అంచితము, తిర్యంచితము,
భైరవాంచితము, ఏక
పాదాంచితము, క్షేత్రాం

చితము, స్కంధాంచితము,
లోహడ్యంచితము 273
దండప్రమాణాంచితము,
లంకాదాహాంచితము,
భ్రాంతపదాంచితము,
అంగుష్ఠబంధాంచితము,
బలిబంధాంచితము, అలగాంచి
తము, సమకర్తర్యంచితము 275
అలగలక్షణము 277
అలగము, కూర్మాలగము,
ఊర్ధ్వాలగము, అంతరా
లగము, 277
లోహడిలక్షణము 277
లోహడి, కర్తరిలోహడి,
సమకర్తరిలోహడి,
బాహుబంధలోహడి,
చిత్రలోహడి, 277
ఏకపాదలోహడి,
చతుర్ముఖలోహడి 279
దర్పసరణలక్షము 279
దర్పసరణము, జలశయనము,
నాగబంధము, కపాలస్పర్శము,
వ్యంకోలము, సూచ్యంతము 279
మత్స్యకరణము 281
భ్రమరీలక్షణము (13) 281
అంతర్భ్రమరి, బాహ్యభ్రమరి 281
ఛత్రభ్రమరి, తిరిపభ్రమరి,
ఓతభ్రమరి, అలగభ్రమరి,
ఉచితభ్రమరి, 283
విద్యుద్భ్రమరి, చక్రభ్రమరి,
శిరోభ్రమరి, హస్తభ్రమరి,
కుంచితభ్రమరి, 285
అంగభ్రమరి 287
గీతరత్నావళి 287


**ఆరవ అధ్యాయము**


దేశిపాదములు (16) 289
సరిక, స్వస్తికము, ఉల్లాలము,
స్ఫురిక, అర్ధపురాటి,
పురాటి, వేష్టనము, 289
ఉద్వేష్టనము, ఖుత్త,
అర్ధస్ఖలితము, ప్రావృతము,
లతాక్షేపము, సమస్ఖలితము,
ఉత్క్షేపము 291
పాటములు (28) 291
పాటభేదములు 293
తాడిత-పాటములు-
ఊరుద్వయ, పార్శ్వోర్వరు,
వ్యత్యాస, 293
స్వస్తిక, వి(త్రి)తల,
పార్శ్వ, క్రమ 295
ఉద్వృత్తపాటములు
సమ, 295
స్వస్తిక, పర్యాయ, పృష్ఠ,
విచ్యుత, పార్శ్వ, 297
స్వస్తికవిచ్యుతము 297
తలోద్ఘట్టితము, పాదత
లోద్ఘట్టితము, కలనూపు
రము, చిత్రము, 299
లురితము, కులు(డు)పము,
అలగము, చతుష్కోణము,
త్రికోణము, మంజీరశింజి 301
తము, కుచుంచిని, షడ్రశము,
లంఘితప్రతిలంఘితము 303
దేశిచారులు 303
దేశిభౌమచారులు (26) 305
ఆకాశిక దేశిచారులు (16) 305
దేశిభౌమచారులలక్షణములు (26)

మనఖము, పార్ష్ణిరేచితము, 305
తలదర్శిని, అర్ధమండలి,
తిర్యక్కుంచితము, అపకుం
చితము, సకటి (కాతరము),
ఉత్కుంచితము,
తిర్యఙ్ముఖము 307
నూపురవిద్ధము, మదాలసము,
పరావృత్తతలము, లంఘిత
జంఘము, మరాళిక, స్ఫురితము
(స్ఫురిక), ఊరువేణి, 309
సంఘట్టితము, హరిణత్రాసిత,
కరిహస్తము, కుళీరిక,
స్తంభక్రీడనకము, రథచక్రము,
ఊరుతాడితము,
సంచారితము, 311
విశ్లిష్టము, తలోద్వృత్తము 313
దేశీఆకాశికచారులు (16) 313
విద్యుద్భ్రాంతము, పురః
క్షేపము, అవక్షేపము, అంఘ్రి
తాడితము, డమరి, భ్రమరి, 313
దండపాదము, విద్ధము,
ఊర్ధ్వజానువు, అలాతము,
ఆందోళితము, సూచి,
విక్షేపము, హరిణప్లుతము 315
జంఘాలంఘనకము,
జంఘావర్తము. 317
సంకీర్ణచారులు (4) 317
తలసర్పణిక, హంసరుతము,
తిత్తిరిగతి, 317
అంతరపద్మాసనము 319
దేశీలాస్యాంగములు (46) 319
సౌష్ఠవము, స్థాపన, రేఖ,
డాలము, చాళి, చలావళి, లలి,
తృకని, ఉల్లాసము, 321
సుకలాసము, ఉరోఽంగణము,
భావము, ధరహాసము, కిత్తు,
దేశీకారము, నిజాపణము, 323
డిల్లాయి, లవణి, గీతవాద్యత,
అభినయము, లయ,
కోమలిక, 325
ఓయారము, అనీకి, అంగ
హారము,మనోధర్మము,
అంగము,అనంగము,
వివర్తనము, ఝుంక,
ముఖరసము, రేవ, 327
విహాసి, ధసకము, తలము,
వితలము, రసవృత్తి,
మసృణత, అనుమానము,
ప్రమాణము, 329
లంఘితము, అంశగతి, సుసంధి,
పాదపాటము, గతిస్థము,
చండనము 331
గతిలక్షణము 331
ద్రుతాదిగతులు (21) 333
గతులు (8) 335


## ఏడవ అధ్యాయము


శిక్షాపద్ధతి 337
వాద్యపద్ధతి 341
శుద్ధపద్ధతి 341
విచిత్రపద్ధతి 345
పేరణిలక్షణము 345
పేరణివేషము 345
పేరణమునకంగములు (5) 347
నృత్తము, కైవారము.
ఘర్ఘరము, 347
వికటము,గీతము 349

| | |
|---|---|
| పేరణిపద్ధతి | 4 39 |
| దేశిపద్ధతి | 351 |
| పుష్పాంజలి | 353 |
| ప్రేక్కణపద్ధతి | 353 |
| సూడ (2) | 355 |
| రాసకము | 355 |
| చర్చరి | 359 |
| నాట్యరాసకము | 359 |
| దండరాసకము | 359 |
| శివప్రియము | 361 |
| చిందునృత్తము | 361 |
| కందుకనృత్తము (చెండాట) | 363 |
| భాండికనృత్తము | 363 |
| ఘటిసణీనృత్తము | 365 |
| చారణనృత్తము | 367 |
| బహురూపనృత్తము | 367 |
| కొల్లాటనర్తనము | 369 |
| నర్తకీలక్షణము | 371 |
| నర్తకలక్షణము | 373 |
| ముఖరిలక్షణము | 375 |
| ప్రతిముఖరిలక్షణము | 377 |
| వాద్యబృందలక్షణము | 377 |
| ముఖ్యగాయకలక్షణము | 377 |
| బృందలక్షణము | 379 |
| సంప్రదాయలక్షణము | 379 |
| మండపలక్షణము | 383 |
| సభాపతిలక్షణము | 387 |
| సభ్యగుణములు | 389 |


## ఎనిమిదవ అధ్యాయము


| | |
|---|---|
| సభాపతిసభ్యులవిన్యాసము | 391 |
| ప్రధాననర్తకినైపథ్యము | 397 |
| బృందవిన్యాసము | 401 |
| వాద్యములమేళగింపు | 401 |
| శుష్కవాద్యము | 403 |
| నర్తకి ముందుపట్టెడితెరలు | 405 |
| నర్తకిని బహూకరించుట | 407 |

శ్రీః

# ప్రథమోఽధ్యాయః

**ఆశిషః**

మౌలిం స్వేదజలార్ద్రకుంతలమురః పూర్వాధికోష్ణస్తనం
శ్రోణీ ముచ్ఛ్వసదంశుకాం పులకితే పార్శ్వే ప్రకంపౌ కరౌ
సస్తంభం చరణద్వయంచ ముదితో గౌర్యాః శివః కౌతుకాత్
తత్తన్నృత్త కలోచితాంగకథనవ్యాజైః స్పృశన్ పాతు వః. 1

వామే భావాభినయసుషమాలంకృతాం లాస్యభంగిం
అర్ధేఽన్యస్మిన్నుదిత డమరుం బిభ్రత స్తాండవం చ
స్వస్వక్షేత్ర వ్యవహృత కరాలోక దత్తావధానాః
శంభోః కాంతాకలితవపుషో దృష్టయః పాంతు యుష్మాన్. 2

దేవ్యా లీలాలలితమధురం లాస్య ముల్లాసయంత్యా
యః శృంగారో రహసి పురతః పత్యురావిష్కృత స్తమ్
వీర్యాత్ నృత్తై ర్వికటగతిభిర్వ్యంజయన్ కుంజరాస్యః
శంభోః[1].............................. 3

**నృత్తప్రశంసా**

....................భామనోఽపి[2]
సదాశివాద్యాకృతి భేదయోగే
యత్కౌతుకం కారణమాహు రాప్తాః
నృత్తం న తత్ కస్య భవేత్సుఖాయ. 4

---

1 పాదభాగము వ్రాతప్రతులలో లుప్తము.

2. గ్రంథలోపము. భామనోపి—'భాత్మనోపి' అని యుండునేమో యని పరిష్కర్త ఊహ.

వైరెంటిని వారి యూహ ననుసరించినదే తెనుగు తాత్పర్యము.



# మొదటి అధ్యాయము

## ఆశీస్సులు

శివుడు, గౌరియొక్క చెమటనీట తడిసిన వెంట్రుకలు గల శిరమును, మొదటికంటె వేడియెక్కిన స్తనములుగల వక్షమును, మీదికుబికిన చీరతోడి కటి భాగమును, పులకరించిన పార్శ్వములను, వణకుచున్న చేతులను, బ్రమ్మాన్పడిన చరణద్వయమును, ఆయానృత్తకళకుచితములైన యంగములను చెప్పు నెపములచే, కుతూహలముతో తాకుచు సంతుష్టుడై మిమ్ము రక్షించును గాక! 1

కాంతతో కూడిన దేహముగలశివుడు, ఎడమ సామేనియందు భావాభినయముల శోభాతిశయముచే అలంకరింపబడిన లాస్యరీతిని, కుడిసగమునందు డమరు వాద్యము మ్రోయుచున్న తాండవమును నెరవేర్చుచు, ఆయా సందర్భములందుపయోగించిన హస్తములను ఏకాగ్రచిత్తముతో చూచు చూపులు మిమ్ము కాపాడును గాక! 2

లీలచే[1] లలితముచే[2] ఇంపైన లాస్యము చేయుచు దేవి రహస్యమున భర్త ముందు వెలువరిచిన శృంగారమును, వెడనడకలుగల నృత్తముతో బీరముగా వ్యంజింపజేయు గజాననుడు శివునికి (నవ్వు పుట్టించుచు మిమ్ము బ్రోచునుగాక) 3

## నృత్తప్రశంస

(నిరాకార స్వరూపుడైన శివునికి)[3] సదాశివమూర్తి మొదలగు ఆకారభేదములను పొందుటకు నృత్తమందలి కుతూహలమే కారణమని పెద్దలు చెప్పుదురు. అట్టి నృత్తము ఎవరికి సుఖము గలిగింపదు ? 4

---

1. 'ప్రియస్యానుకృతి ర్లీలా శ్లిష్టా వాగ్వేషచేష్టితైః' (అమరవ్యాఖ్యలో క్షీరస్వామి. ౧—నాట్యవర్గ. ౩౨ శ్లో). మాట, వేషము, చేష్ట—వీనిచే ప్రియుని అనుకరించుట లీల.
2. లలితము నృత్తకరణము (చూ. నాలుగవ అధ్యాయము)
3. మూలగ్రంథతాత్పర్యము సందర్భమునుబట్టి పరిష్కర్త సూచించినది.

................................స్వప్రేయసీభి స్సమం
గోపాలోఽపి, పితామహోఽపి చ గిరాం దేవ్యా యదభ్యస్యతి
తస్యైతస్య సమస్తలోకనయనానందామృతస్యందినో
నృత్తస్యాద్భుతసంపదో మధురిమ[[1]స్పందో నవర్ణ్యో గిరా]. 5

కల్హారై రనవాప్తచంద్రకిరణాశ్లేషై రలబ్ధాంబుదైః
................అలికులై రప్రాప్తపుష్పాసవైః
సామ్యాలాపదశామమూని దధతే నేత్రాణి యేషాం పురః
శశ్వన్నావతరంత్యుదారసుషమాః నృత్తప్రయోగక్రమాః 6

ఉద్యద్యౌవనసౌరభాం మృదుతనుం ప్రస్నిగ్ధగీతస్వనాం
నానాభావరసాఢ్యలాస్యనిపుణాం బింబాధరాం నర్తకీమ్
లబ్ధ్వా రాజపురందరస్య సతతం నిర్విష్టసర్వేంద్రియాం[2]
................ఇవాస్వాదో వినోదాంతరైః. 7

[3]నృత్తేనాట్యకలావిలాస కుతుకప్రాగ్భార విద్రావణ -
ప్రౌఢావాంకృతి నాంతరాహి(నా కరంభి?)త ముదో ధన్యాః ధరిత్రీశ్వరాః
శృంగారే విరతిం నయాంతి, లఘుతాం ధైర్యే, వినోదే క్లమం,
మానే మ్లాని, మనాదరం వితరణే, కీర్త్తావనాస్థామపి. 8

---

1. ఈ లుప్తగ్రంథపూరణము సందర్భమునుబట్టి పరిష్కర్త సూచించినది.

2. 'యా గ్రామ్యానంద మనోదక' — 'గ్రాహ్యానంద మహోదక' — వ్రాత ప్రతుల పాఠములు రెండును అస్పష్టములే. తాత్పర్య మూహించినది.

3. నృత్తోనాట్య — విద్రావన — నాతరంభిత — నాతరహిత' — వ్రాతప్రతుల పాఠములు. 'నిత్యం నాట్య — విశ్రాణన — నా తరంగిత' — అని పరిష్కర్త గ్రహించిన పాఠములు. మీది సవరణ నా సూచన — తెలుగు తాత్పర్యము దాని ననుసరించినది.

(పరమశివుడును గౌరితో[1]),గోపాలకృష్ణుడును తన ప్రియురాం[డ]తో, చతుర్ముఖుడును వాగ్దేవితో గూడి యీ నృత్తము నిత్యమును ఆడుచుందురు;అట్టి లోకు లందరి కన్నులయందును ఆనందామృతమును జిలుకునదై, అద్భుతమైన సమృద్ధిగల యీ నృత్తకళయందలి మాధుర్య[స్పందము మాటలచే వర్ణించుట యసాధ్యము][2]. 5

ఏ కన్నులముందు, ఎడతెగక, అసాధారణమైన శోభాతిశయముగల నృత్త ప్రయోగరీతులు అవతరింపవో ఆ కన్నులు, చంద్రకిరణముల కౌగిలిలేని సౌగంధిక పుష్పములతో, మేఘోదయము దొరకొనని (నెమిళ్ళతో?), పూదేనియ లభింపని తుమ్మెదలతో— పోల్పదగినవని చెప్పవలసిన దశకు వచ్చును. 6

మీదికెత్తిన ప్రాయపు గుబాళింపులు గలది, మృదువైన దేహముగలది, స్నిగ్ధమైన స్వరముతో పాడగలిగినది, అనేకభావరసములు నిండిన లాస్యమున నేర్పరియైనది, దొండపండువంటి మోవిగలదియు నగు నర్తకిని సంపాదించుకొన గలిగిన రాజేంద్రునకు సర్వేంద్రియములును సుఖింపగా ఇతర వినోదములందలి రుచి [మందగించును][3]. 7

ఇతర కళల మెరుగులమీద గలుగు కుతూహలాతిశయమును పారదోలుట యందు పరిణతమైన అహంకారము — నా ముందు ఏ కళలును ఎందుకు పనికి వచ్చునను పొగరు — గల నృత్తము ఎవరి యంతరంగములందు సుఖమునించునో అట్టి రాజులు ధన్యులు; వారికి శృంగారము చాలుననిపించదు; ధైర్యము పలుచ బడదు; వినోదములందు విసుగుపుట్టదు; చిత్తౌన్నత్యము కృశింపదు; ఈవియందు అనాదరముండదు; కీర్తియందాస్థ తగ్గదు. 8

---

1. 2. 3. } లుప్తగ్రంథ తాత్పర్యములు సందర్భమునుబట్టి పరిష్కర్త సూచించినవి.

సంసారే భవతి ప్రధాన మమితై ర్లభ్యం శుభై ర్మానుషం[1]
జన్మాస్మిన్ క్షితిపాలతా నిరవధిః శ్రీరత్రకాంతం వపుః
ఏతస్మిన్ ముఖమిందుసుందరమిహ స్నిగ్ధా విశాలాయతా
దృష్టిస్తాం సఫలీకరోతి రమణీలాస్యావలోకోత్సవః. 9

క్షితౌ రత్నచ్ఛాయాఫలనముదకే వీచిలలితం
శిఖిన్యర్చిః ప్రేంఖా, సహజగతి వైచిత్ర్య మనిలే,
తటిత్క్రీడా వ్యోమ్నిత్యకృత[2]సుభగః పంచసు పరః
ప్రవిష్టో భూతేషు ప్రభవతి హి నృత్తస్య మహిమా. 10

ధర్మందేవాః ధరణిపతయో దద్యురర్థం ప్రసన్నాః
తస్వివర్గః స్పృహయతి కలాప్రౌఢిభంగీవిధేయః
విద్వద్గోష్ఠ్యో బహువిధగుణప్రక్రియా వర్ణనాభిః
కీర్తిం తస్మై దధతి విధివత్[3] యేన నృత్తం ప్రయుక్తమ్. 11

## గ్రంథకృత్ప్రశస్తిః

అభ్యాసాత్ భరతోక్తిభంగిషు, బహువ్యాఖ్యావశేషు క్రమాత్,
సంవాదాత్ గురుసంప్రదాయసుహృదాం, శంభోః ప్రసాదాదపి,
జ్ఞాత్వా శాస్త్రరహాంసి నిర్మితమిదం వ్యక్తం మహార్థాన్వితం
నస్యాత్ కస్యహితాయ శాశ్వతయశస్సంరక్షణం లక్షణమ్. 12

ప్రేత్య ప్రజ్ఞామతిశయవతీం స్వామిభక్తించ హార్షాత్
ఆకౌమారాత్ గణపతినృపో జాయనం యం సమర్ప్య[4]
గుండామాత్యే సకలసుమనస్సేవ్యమానే జయంతం
వాచాం పత్యో హారిరివ కలాం శ్లాఘనీయాం[5] వ్యనైషీత్. 13

1. 'మానుష్యైర్జన్మా' ముద్రితపాఠము — అనన్వితము. ఈ సవరణ నా సూచన.
2. 'అకటసుభగః' వ్రా. ప్ర పాఠము. ఈ సవరణ పరిష్కర్త సూచన.
3. 'వివిధాం' అనుటకంటె ఈ పాఠాంతరమే యుక్తముగా తోచినది.
4. 'సమర్చ్య' అను పాఠము, సంగతి చాలనిది. పై పాఠము నా సూచన.
5. 'కలాశ్లాఘనీయం' అను పాఠమును అట్టిదే. 'శ్లాఘనీయాం' అను ఒక వ్రాత ప్రతి పాఠమున కనుగుణముగా మీది సవరణ నాది.

అమితములైన శుభకర్మలు చేసి పొందదగిన మనుష్యజన్మము ప్రపంచమున ప్రధానమైనది; దానియందు దొరతనము, అందుమేరలేని సంపద, దానిలో అందమైన దేహము, దానియందు చంద్రునివలె సుందరమైన ముఖము, దానియందు నిద్ధమై దీర్ఘమైన విశాలనేత్రములు, ప్రధానములు. ఆ కన్నులచూపును సఫలము చేయునది రమణీలాస్యమును చూచు నుత్సవము. 9

రత్నకాంతుల తళతళలు భూమియందు, తరంగముల లాలిత్యము నీటియందు, జ్వాలల ఊపు అగ్నియందు, సహజమైన వింతనడక వాయువునందు, మెరుపు దీగయాట ఆకాశమందు—ఇట్లు అకృత్రిమసుందరమైన నృత్తకళమహిమ పంచభూతములందు ప్రవేశించి వెలయును. 10

ఎవడు శాస్త్రము మీరక నృత్తమును ప్రయోగించునో అతనికి దేవతలు ధర్మము కలిగింతురు; ప్రసన్నులై రాజులు ధనము నిత్తురు; కళయందలి ప్రోడతనమునకు లోగి స్త్రీలు వలతురు; గోష్ఠులందు విద్వాంసులు బహువిధములుగా గుణములను, ప్రకారములను వర్ణించి కీర్తిని చేకూర్తురు. 11

## గ్రంథకర్త ప్రశంస

భరతుని వాక్యరీతులను పలుమారు చదువుకొని, ఎన్నో వ్యాఖ్యానముల గుంతలలో శ్రమచేసి, గురుసంప్రదాయమునకు చెందిన మిత్రులతో సంవదించి, శివుని యనుగ్రహము గూడగలిగి, శాస్త్రరహస్యములు తెలిసికొని రచించిన యీ స్పష్టమైన లక్షణము, గొప్ప యర్థములు కలిగి శాశ్వతమైన కీర్తిని గడించుచు ఎవరికి హితము గాదు ? 12

గొప్పప్రజ్ఞను, స్వామిభక్తిని గమనించి సంతోషముతో గణపతిభూపాలుడు, చిన్నవయసు మొదలుకొనియే ఎవనిని విబుధులందరిచేతను కొలువుగొన్న గుండామాత్యునికి, ఇంద్రుడు బృహస్పతికి జయంతునివలె, అప్పజెప్పి, శ్లాఘనీయమైన కళను నేర్పించెనో, 13

జిత్వా శౌర్యేణ పృథ్వీం జలనిధిరశనాం, సుస్థిరీకృత్య లోకమ్,
సంగీతసోద్యోపభోగే సకుతుకమనసః స్వామినః శాసనేన,
తస్యాక్షిప్తస్య బాస్వన్మణిముకురనిభం నృత్త లీలాయితస్య
ప్రాజ్ఞోఽసౌ శాస్త్రమేతద్రచయతి చతురం నృత్తరత్నావలీతి 14

### గ్రంథప్రశస్తిః

కవీనాం[1]...............నృత్తకలావిదాం
నృత్తరత్నావలీ రాజ్ఞాం చిత్తకైరవకౌముదీ. 15

ఆగత్య బ్రహ్మలోకాదిహ భరతమునిః శాస్త్రమేతన్మదీయం
దృష్ట్వా భూయః కృతాదౌ ప్రసృమరపులకవ్యంజితాంతఃప్రమోదః
'ఆశ్చర్యం పశ్యతేదం కథమధిగతవానాశయం మే సమగ్రం
స శ్రీమాన్ జాయసేనాపతి'రితి నియతం వక్ష్యతేఽగ్రే మునీనామ్. 16

మమ వాఙ్నర్తకీ నూనం వర్ణకాంగైర్మనోహరైః
కరోతి శాస్త్రరంగేఽస్మిన్ లక్ష్మనృత్త మతిస్ఫుటమ్. 17

### నృత్తకాలః

[2]యాగోద్వాహ మహాభిషేక నగరీవేశ్మప్రవేశోదక -
క్రీడాసు ప్రియసంగమ వ్రత మహోదానాత్మజోత్పత్తిషు
యాత్రా పర్వ పరీక్షణోత్సవ జయానంద ప్రతిష్ఠాహిత
ప్రాప్తిష్వభ్యుదయాయ నృత్తముచితం స్యాద్దేవ పూజాదిషు. 18

### నాట్యావతారః

పూర్వరంగప్రయోజ్యత్వాత్ నృత్తం నాట్యోపకారకమ్
తతో నాట్యస్య వక్ష్యామి సంక్షేపాదిహ లక్షణమ్. 19

---

1. వ్రాతలో అక్షరములు చెడినవి. తెలుగు తాత్పర్యమూహించినది.
2. 'త్యాగో' ముద్రితపాఠము. ముందు 'మహోదాన' మున్నది, కనుక ఈ సవరణ సూచించితిని.

ప్రాజ్ఞుడైన ఆ జాయన, సముద్రములు మొలనూలుగాగల భూమినంతయు శౌర్యముచే జయించి, లోకమును స్థిరపరచి, సంగీతానుభవమునకు వేడుకపడిన ప్రభుని యాజ్ఞచే, ఆయనకు మిగుల ప్రియమగు నృత్తలీలకు రత్నదర్పణము వంటి చదరమైన యీ శాస్త్రమును "నృత్తరత్నావళి" అను పేర రచించు చున్నాడు. 14

## గ్రంథ ప్రశంస

కవులకు (ప్రియమైనది), నృత్తకళనెరిగినవారికి (నిధియైనది), రాజులకు చిత్తమను కలువను వికసింపజేయు వెన్నెల — యీ నృత్తరత్నావళి. 15

రాబోవు కృతయుగమునాదియందు మరల బ్రహ్మలోకమునుండి ఇక్కడికి వచ్చి భరతముని, నాయీ శాస్త్రమును చూచి, నిండినపులకలచే లోపలి సంతోషమును వెలిబుచ్చుచు "ఈ యాశ్చర్యము చూడుడు! ఆ శ్రీజాయసేనాని నా యాశయమంతయు ఎట్లు కనుగొన్నాడు!" అని మునులముందు తప్పక చెప్పును. 16

నిజముగా నావాక్కను నర్తకి, ఈ శాస్త్రమును రంగస్థలమున మనోహరములగు వర్ణములను అంగములతో లక్షణమను నృత్తమును అతిస్పష్టముగా చేయుచున్నది. 17

## నృత్త సమయము

యజ్ఞము, పెండ్లి, పట్టాభిషేకము, నగరప్రవేశము, గృహప్రవేశము, జలక్రీడ, ప్రియసంగమము, వ్రతము, మహాదానము, పుత్రజననము, యాత్ర, పండుగ, పరీక్షణము (విద్యాపరీక్షణము ?), ఉత్సవము, విజయానందము, (దేవాలయాది) ప్రతిష్ఠ, ఇష్టార్థసిద్ధి, దేవపూజ — మొదలగు సందర్భములందు అభ్యుదయమునకై నృత్తము నేర్పరుపదగును. 18

## నాట్యావతరణము

పూర్వరంగమందు ప్రయోగింపదగినది గనుక నృత్తము నాట్యమున కుపకరించును. అందుచేత ఇక్కడ సంక్షేపముగా నాట్యలక్షణము చెప్పుదును. 19

వైవస్వతేఽంతరే హ్యస్మిన్ పురా త్రేతాయుగే కిల
లోకేఽస్మిన్నరిషడ్వర్గనిఘ్నే సుఖిత దుఃఖితే 20

పురందరముఖా దేవాః పప్రచ్ఛుః కమలాసనమ్,
'దృశ్యం శ్రవ్యంచ సర్వేషామిచ్ఛామః క్రీడనీయకమ్' 21

ఇతి విజ్ఞాపితో దేవైః భావయన్ సార్వవర్ణికమ్
వేదేభ్యస్సారమాదాయ నాట్యవేదం ససర్జ సః. 22

పశ్యన్నథ మనుష్యాణాం చాతురీ మాంగికాదిషు
శిక్షయామాసచ మునిం భరతం మానసాత్మజమ్. 23

తేనచాధ్యాపితాః పుత్రాః శాండిల్యప్రముఖాశ్శతమ్
తైః సార్ధమప్సరోభిశ్చ శక్ర[1]ధ్వజమహాదిషు
నాట్యవేదప్రయోగోఽయం మునినా సంప్రవర్తితః. 24

**నాట్యలక్షణమ్**

లోకస్యచ స్వభావో యః సుఖదుఃఖవిమిశ్రితః
నాట్యం తస్యానుకరణం చతుర్ధాఽభినయాత్మకమ్. 25

స్పందనార్థతయా ధాతోః నశే స్సాత్త్వికపూరితమ్
రసాశ్రయంచ తత్ జ్ఞేయం వాక్యార్థాభినయాత్మకమ్. 26

అభిపూర్వాత్ ణిఙో ధాతో రచి కర్తరి యోజితే
ప్రయోగమాభిముఖ్యం యన్నయ త్యభినయ స్తతః. 27

శాఖయాంగై రుపాంగైశ్చ ప్రయోగేణ విభావయన్
అర్థాన్ బహువిధాన్ ప్రాపయన్నే[2]వాభినయో మతః. 28

---

1 'కటధ్వజ—కటిధ్వజ' ప్రా. ప్ర ఈ సవరణ పరిష్కర్త సూచన.

2. పాఠము సందిగ్ధము.

ఈ వైవస్వతమన్వంతరమున తొల్లి త్రేతాయుగమందు, కామక్రోధాద్యరి షడ్వర్గమునకు లోగి లోకులందరును సుఖదుఃఖముల ననుభవించుచుండగా, ఇంద్రుడు మున్నగు దేవతలు బ్రహ్మను ప్రార్థించిరట—"అందరును చూడదగిన, వినదగిన వినోదసాధనము నపేక్షించుచున్నాము" అని. 20—21

దేవత లిట్లు విన్నవింపగా, అతడు భావనచేసి అన్నివర్ణముల వారికిని హితమైన సారమును వేదములనుండి తీసి నాట్యవేదమును సృజించెను. 22

ఆపై ఆంగికాద్యభినయములందు మనుష్యులకుగల చాతుర్యమును గమనించి తనమానసపుత్రుడైన భరతమునికి ఆ నాట్యకళను నేర్పెను. 23

భరతుడును తన నూర్గురు కుమారులు శాండిల్యుడు మొదలైనవారికి దానిని నేర్పెను. వారితోడను, అప్సరసలతోడను ముని యీ నాట్యవేదము ప్రయోగించి ప్రవర్తింపజేసెను. 24

**నాట్యలక్షణము**

సుఖదుఃఖములచే మిశ్రమైనది లోకస్వభావము. నాట్యమనగా దాని ననుకరించుట. అది నాలుగు విధములగు అభినయములతో ఏర్పడినది. 25

'నట' ధాతువునకు స్పందించుట - అంతరంగములను కంపింపజేయుట - అర్థము; కనుక నాట్యము సాత్త్వికభావములతో నిండి, రసాశ్రయమై, వాక్యార్థము నభినయించునదై యుండునని తెలియదగును. 26

'అభి' అను ఉపసర్గతో చేరిన 'ణీ' ధాతువునకు కర్త్రర్థమున 'అచ్' ప్రత్యయమును గూర్చునపుడు 'అభినయ' పదమేర్పడును. ప్రయోగము అభిముఖమగునట్లు చేయునది గనుక అది అభినయ మనబడును. 27

శాఖ, అంగములు, ఉపాంగములు — వీని తోడ్పాటుతో బహువిధములైన యర్థములను స్పష్టముగా భావనచేసి చూపుట అభినయమని యందురు. 28

**చతుర్విధాభినయః**

ఆంగికో వాచికాహార్యౌ సాత్త్వికశ్చేత్యసౌ పునః
చతుర్ధాకలితో యత్ర సర్వం నాట్యం ప్రతిష్ఠితమ్. 29

**ఆంగికః**

తత్రాంగికో ఘవేదంగైః నిర్వృత్తః సపునస్త్రిధా
శారీరో ముఖసంజాతః చేష్టయా చ వినిర్మితః. 30

శాఖయాఽంగైరుపాంగైశ్చ ప్రత్యంగైశ్చ ప్రదర్శితః
శారీరస్తత్ర, ముఖజః కేవలోపాంగ నిర్మితః. 31

చేష్టాకృతస్తు చేష్టాభిః స్థానాసనగతాదిభిః
శాఖాఽంకురశ్చ నృత్తం చ ప్రధానం తేష్వనుక్రమాత్. 32

శాఖా స్యాత్ నృత్తహస్తానాం వైచిత్ర్యాత్మ వివర్తనా
అంకురః సూచనారూపో భూతవాక్యైకగోచరః. 33

భవిష్యద్వాక్యవిషయః సతు సూచేతి కథ్యతే
నృత్తం నాత్రోచ్యతే పశ్చాత్ ప్రపంచేనాభిదాస్యతే. 34

**వాచికః**

వాగాత్మా వాచికో ద్వేధా సంస్కృత ప్రాకృతాశ్రయః
నామాఖ్యాతాదిభిర్భేదైరయం విస్తరమశ్నుతే. 35

**ఆహార్యః**

నైపథ్యస్య విధానం స్యాదాహార్యః; సచతుర్విధః
పుస్త భూషాంగరచనా సజీవా[1]ః పరికల్పితః. 36

---

1. 'సజీవః' అనుట ముద్రణ దోషమగును.

### చతుర్విధాభినయము

ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము—అని అభినయము నాలుగు విధములు. నాట్యకళ అంతయు దీనియందే నెలకొని యుండును. 29

### ఆంగికము

వానిలో ఆంగికము అంగములచే నెరవేర్పబడునది. అది మూడు విధములు : శారీరము, ముఖజము, చేష్టాకృతము అని. 30

శాఖ, అంగములు, ఉపాంగములు, ప్రత్యంగములు — వీని మూలమున చూపబడునది శారీరము; ఉపాంగములచే మాత్రము నిర్మించునది ముఖజము; నిలుచుకొనుట, కూర్చుండుట, నడచుట మొదలగు చేష్టలతో చేయునది చేష్టాకృతము. ఈ మూటియందును అనుక్రమముగా శాఖ, అంకురము, నృత్తము అనునవి ప్రధానములు. 31-32

నృత్తహస్తములను విచిత్రముగా మలచుట 'శాఖ' యనబడును; కడచిన వాక్యార్థములను మాత్రమే సూచించుట అంకురము; రాబోవు వాక్యమును దెలుపుదానికి 'సూచ' అని పేరు. నృత్తమును ఇక్కడ వివరింపము; ముందు విస్తరముగా చెప్పబడును. 33-34

### వాచికము

భాషారూపమైన అభినయము 'వాచికము'; అది సంస్కృతమును, ప్రాకృతమును ఆశ్రయించి రెండువిధములగును. నామపదము, క్రియాపదము మొదలగు భేదములు గలిగి అది విస్తరమును పొందును. 35

### ఆహార్యము

నైపథ్యమును — రంగస్థలమునకు వలసిన సంభారమును — సమకూర్చుట 'ఆహార్యము'. అది పుస్తము, అలంకారము, అంగరచన, సజీవము అని నాలుగు విధములుగా నేర్పరుపబడినది. 36

తత్ర శైల విమానాది నాట్యే యద్యత్ ప్రదృశ్యతే
తత్తత్ పుస్త ఇతి జ్ఞేయః (ం?) సచత్రేధా విధీయతే. 37

ఆదిమస్సంధిమస్తత్ర మధ్యమో వ్యాజిమః స్మృతః
అంతిమశ్చేష్టిమస్తేషాం క్రమాల్లక్షణముచ్యతే. 38

కిళింజ చర్మ వస్త్రాద్య సంధానాః తత్రసంధిమః
సూత్రాకర్షాదిభిర్వ్యాజైః నిర్వృత్తం వ్యాజిమం విదుః. 39

జతు సిక్థాది సంబంధాత్ చేష్ట్యతే యస్సచేష్టిమః
యేనాలంక్రియతే దేహః సో౽లంకారః ప్రకీర్తితః. 40

సచాభరణ మాల్యాత్మా చతుర్ధా (గదితో)[1] బుధైః
ఆవేధ్య బంధనీయాఖ్య ప్రక్షేప్యారోప్య భేదతః. 41

కర్ణభూషణమావేధ్యం కుండలాభరణాదికమ్
బంధనీయంతు విజ్ఞేయం శ్రోణీసూత్రాంగదాదికమ్. 42

నూపురప్రముఖం క్షేప్యం హారాద్యారోప్యమిష్యతే,
సా భవేదంగరచనా యద్రంగై రంగవర్తనమ్. 43

తేచ వర్ణాః సితశ్యామ రక్తపీతాః స్వభావజాః
ఏతేషాం సంకరాత్ భేదాః జాయంతే బహవః పునః. 44

సజీవః ప్రాణినాం రంగే ప్రవేశః పరికీర్తితః
ద్వి చతుశ్చరణౌ పాదరహితశ్చేతి సత్రిధా. 45

ద్విపదాస్తత్ర విజ్ఞేయాః దేవమానుషపక్షిణః
చతుష్పాదాస్తు పశవః పాదహీనాః భుజంగమాః. 46

1. 'చతుర్ధాభరణం బుధైః' అను వా ప్ర. పాఠమున 'బుధైః' అనన్వితము. 'ఆభరణము' పునరుక్తి. కనుక ఈ సవరణ నా సూచన.

అందు నాట్యమున చూడబడు కొండలు, విమానములు మొదలగునవెల్ల పుస్తమని యెరుగనగును. అదియు మూడు విధములు. 37

మొదటిది 'సంధిమము'; నడిమిది 'వ్యాజిమము'; కడపటిది 'చేష్టిమము'. వీని లక్షణము క్రమముగా చెప్పబడును. 38

చాప, చర్మము, గుడ్డ మొదలగు వానిచే చేయబడిన వస్తువులు సంధిమము. సూత్రము, అయస్కాంతము (సూత్రముతో ఈడ్చుట ?) మొదలగు కపటసాధనములతో నెరవేర్పబడినది వ్యాజిమము. 39

లక్క, మైనము మొదలగువాని సంబంధముచే ఆడింపబడునది చేష్టిమము.
దేనిచే దేహమలంకరింపబడునో అది యలంకారము. 40

అలంకారము, సొమ్ములుగా, మాల్యములుగా నుండును. విద్వాంసులు దానిని నాలుగు విధములుగా వచింతురు. ఆవేధ్యము (రంధ్రముచేసి పెట్టుకొనునది), బంధనీయము (ముడివేసుకొనవలసినది), ప్రక్షేప్యము (తొడుగుకొనదగినది), ఆరోప్యము (మీదవేసికొనునది) అని. 41

కుండలాభరణములు ( ? ) మొదలగు కర్ణభూషణము ఆవేధ్యము; మొలనూలు, బాహుపురి మొదలగునది బంధనీయము. 42

కాలందియ మొదలైనది క్షేప్యము; హారము మొదలైనది ఆరోప్యము. వన్నెలచే దేహమును పూయుట అంగరచన. 43

ఆ రంగులు తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు అనునవి, స్వభావజన్యములు. వాని కలపమువలన మరి యెన్నో భేదములగును. 44

రంగస్థలమునందు ప్రవేశించిన ప్రాణముగల జంతువు సజీవమనబడును. అది రెండుకాళ్ళది, నాల్గుకాళ్ళది, కాళ్ళులేనిది అని మూడువిధములు. 45

దేవతలు, మనుష్యులు, పక్షులును రెండుకాళ్ళుగల తెగ; పశువులు నాల్గుకాళ్ళవి; పాములు కాళ్ళులేనివి. 46

**సాత్త్విక లక్షణమ్**

పరస్య సుఖదుఃఖాది భావైః యద్భావనం భవేత్
తత్రాంతఃకరణాసక్తిరత్యంతా సత్త్వమిష్యతే. 47

సాత్త్వికః సత్త్వనిష్పాద్యైర్భావైర్జాతః సచాష్టధా
స్తంభప్రస్వేద రోమాంచాః స్వరభేద స్సవేపథుః. 48

వివర్ణతాశ్రుప్రలయా ఇత్యేతే సాత్త్వికాః స్మృతాః
ఏషామభినయానాం న ప్రపంచోఽత్ర ప్రదర్శితః. 49

**నృత్య నృత్త నాట్యానాం మార్గదేశ్యోశ్చ లక్షణమ్**

ఇదానీం ప్రకృతం నృత్యం యథాలక్షణముచ్యతే
భవేత్ భావాశ్రయం నృత్యం పదార్థాభినయాత్మకమ్. 50

గాత్రవిక్షేపణార్థత్వాత్ నృత్తే బహుళమాంగికమ్
వివిధేన విలాసేన క్షేపో విక్షేప ఇష్యతే. 51

నాట్యవేద ప్రవృత్తత్వాత్ మార్గితత్వాత్ మహర్షిభిః
సద్భిః సంచారితత్వాచ్చ మార్గమాహు రిదం బుధాః
నృత్యం శ్రీగదితాదిస్స్యాత్ నాట్యం తన్నాటకాదికమ్. 52

గీతవాద్యాది మిళితం లయమాత్ర సమాశ్రయం
అంగవిక్షేపణం నృత్తం భవే దభినయోజ్ఝితమ్. 53

నాట్యే హ్యభినయే[1] ఛిద్రప్రచ్ఛాదన ఫలం హి తత్
ఏతద్దేశీతి విఖ్యాతం తత్తద్దేశ జనేచ్ఛయా. 54

అస్యాచార్యో మృడానీశః యతః 'సంధ్యాసు నృత్యతా
మయాపీదం స్మృతం నృత్తం'[2] ఇత్యుక్తం చంద్రమౌళినా. 55

---

1. 'నాట్యేఽప్యభి' అని పాఠముండును. ఒక వాక్యమందు రెండు 'హి' శబ్దము లుండవు.
2. భరతనాట్యశాస్త్రము. అధ్యా. ౪, శ్లో. ౧౩ కాశీ ముద్రణము,

### సాత్త్విక లక్షణము

ఇతరుల సుఖదుఃఖాది భావములను చూచి వానిని భావించునప్పుడు ఆ భావన యందు మనస్సునకు కలుగు అత్యంతాసక్తి సత్త్వమనబడును. 47

సత్త్వముచే నెరవేర్పదగిన భావములమూలమున కలుగు అభినయము సాత్త్వికము. అది యెనిమిది తెగలు: స్తంభము, ప్రస్వేదము, రోమాంచము, స్వరభేదము, వణకు, వివర్ణత, కన్నీరు, ప్రళయము — అని. వీని వివరణ ఇక్కడ చేయబడదు. 48_49

### నృత్య నృత్త నాట్యముల మార్గ దేశీభేదముల లక్షణము

ఇప్పుడు ప్రకృతమైన నృత్యము లక్షణానుసారముగా చెప్పబడును: భావముల నాశ్రయించినది, పదార్థముల నభినయించు స్వరూపముగలది నృత్యమగును. 50

శరీరమును విక్షేపించుటయే దాని ప్రయోజనము గనుక నృత్తమందు ఆంగికాభినయము ఎక్కువగా నుండును. వివిధములైన అందచందములతో ఆడించుట విక్షేపమనబడును. 51

నాట్యవేదమునుండి వెలువడినది గనుక, మహర్షులు వెదకి తీసినది గాన, సజ్జనులు ప్రచారముచేసినది గావున దీనిని బుధులు 'మార్గము' అని పేర్కొందురు. 'శ్రీగదితము' మున్నగునది నృత్యము; 'నాటకము' మొదలైనది నాట్యము. 52

పాట, వాద్యములు మొదలగువానితో గలిసి, లయను మాత్రము ఆశ్రయించి, అభినయములేక, అంగముల నాడించుట నృత్తము. 53

నాట్యమునందు అభినయమునందును గలుగు కొరతలను గప్పిపుచ్చుట దాని ఫలము గదా! ఇది ఆయా దేశముల జనుల యిష్టానుసారము చెల్లునది గనుక 'దేశి' యని ప్రసిద్ధమైనది. 54

దీనికి గౌరీశుడు ఆచార్యుడు; ఎట్లనగా 'సంధ్యాకాలములలో నృత్యము చేయునప్పుడు నాకీ నృత్తముగూడ స్మృతికి వచ్చినది' అని చంద్రమౌళి వచించినాడు గనుక. 55

### లాస్యతాండవ లక్షణమ్

లాస్య తాండవ భేదేన ద్వయమేతత్ ద్విధా పునః
సుకుమారం తయోరాద్యం భవేదపరముద్ధతమ్. 56

భావః స్త్రీపుంసయోర్లాసః తదర్ధః (ర్థం ?) తత్ర సాధు వా
లాస్యం మనసిజోల్లాసహేతు మృద్వంగహారవత్
దేవ్యై దేవోపదిష్టత్వాత్ ప్రాయః స్త్రీభిః ప్రయుజ్యతే. 57

### లాస్యాంగాని

గేయపదం స్థితపాఠ్య మాసీనం పుష్పగంధికా
ప్రచ్ఛేదకః త్రిమూఢాఖ్యం సైంధవాఖ్యం ద్విమూఢకమ్. 58

ఉత్తమోత్తమకాభిఖ్యం ఉక్తప్రత్యుక్తకాభిధమ్
లాస్యాంగాని దశైవాత్ర తేషాం లక్ష్మాభిధీయతే. 59

యత్రాసన సుఖాసీనాః తంత్ర్యాద్యాతోద్యసంయుతమ్
గాయంతి గాయనాశ్శుష్కం తద్గేయపదమిష్యతే. 60

ఆసనస్థా వదేద్యత్ర ప్రాకృతం విరహే వధూః
మన్మథానలతప్తాంగీ స్థితపాఠ్యం తదుచ్యతే. 61

చింతాశోకాన్వితం సర్వైః వాద్యైరభినయైరపి
హీనం యత్రాస్యతే తస్మాత్ (తత్స్యాత్ ?)
ఖ్యాతమాసీనసంజ్ఞయా. 62

నృత్తం గీతంచ వాద్యంచ యత్ర నానావిధం భవేత్
పుంవచ్చ వివిధాశ్చేష్టాః నార్యాస్సా పుష్పగంధికా. 63

ప్రచ్ఛేదకో భవేద్యత్ర జ్యోత్స్నా సంతాపవిహ్వలాః
కామిన్యో యాంతి నిర్వ్రీలాః సాపరాధానపి ప్రియాన్. 64

### లాస్య తాండవముల లక్షణము

ఈ రెండును (నృత్య నృత్తములు) లాస్యమని, తాండవమని మరల రెండు విధములగును. అందు మొదటిది — లాస్యము — సుకుమారముగా నుండును; రెండవది — తాండవము — ఉద్ధతమైనది. 56

స్త్రీ పురుషుల పరస్పరవిషయమైన భావము లాసము; దానికొరకైనది, లేదా దానికి తగినది అను నర్థముగలది లాస్యము; అది కామోల్లాసమునకు హేతువులగు మృదువైన అంగవిక్షేపములు గలది. దేవికి శివుడుపదేశించినది గనుక ప్రాయికముగా దీనిని స్త్రీలే ప్రయోగింతురు. 57

### లా స్యాం గ ము లు

లాస్యమునకు పదియే అంగములు: గేయపదము, స్థితపాఠ్యము, ఆసీనము, పుష్పగంధిక, ప్రచ్ఛేదకము, త్రిమూఢము, సైంధవము, ద్విమూఢము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము, అని; వాని లక్షణమును తెల్పుదుము. 58—59

ఆసనములందు నెమ్మదిగా కూర్చొని గాయకులు వీణ మొదలగు వాద్యములు తోడుగా శుష్కముగా పాడుట గేయపదము. 60

విరహమునందు స్త్రీ, కామాగ్నిచే దేహము తపింపగా, ఆసనమందుండి ప్రాకృతభాషతో వ్యవహరించునది స్థితపాఠ్యము. 61

ఏ వాద్యములును, అభినయములును లేక చింతాశోకములతో కూర్చుండుటకు ఆసీనమని పేరు. 62

నానావిధములైన నృత్తగీత వాద్యములతో మగవానివలె స్త్రీ వివిధచేష్టలు చేయుట పుష్పగంధిక. 63

వెన్నెలవేడికి తాళలేక కామినులు సిగ్గువిడిచి, తప్పుచేసిన ప్రియులనైనను వెన్నాడుట ప్రచ్ఛేదకము. 64

నాట్యం పుంభావభూయిష్ఠం సమవృత్తవిభూషితమ్
అనిష్ఠురశ్లక్ష్ణపదం యత్రస్యాత్ తత్ త్రిమూఢకమ్. 65

పాత్రం వంచిత సంకేతం నాట్యం పాశ్యే నచోర్జితమ్[1]
భాషాచ సైంధవీయత్ర తజ్జ్ఞాస్తత్ సైంధవం విదుః. 66

ముఖప్రతిముఖోపేతం చతురశ్రపదక్రమమ్
శ్లిష్టభావ రసం యత్తత్ వైచిత్ర్యార్థం ద్విమూఢకమ్. 67

విచిత్ర శ్లోకబంధం యత్ నానారస సమాశ్రయమ్
ఉత్తమోత్తమకం తత్స్యాత్ లీలాభావమనోహరమ్. 68

సాధిక్షేపైః పదైర్వ్యక్తం చిత్రగీతార్థయోజితమ్
కోపప్రసాదసంజాత ముక్త ప్రత్యుక్తకం విదుః. 69

యత్ర ప్రియాకృతిం దృష్ట్వా వినోదయతి మానసమ్
మదనానలతప్తాంగీ తచ్చిత్రపదముచ్యతే. 70

దృష్ట్వా స్వప్నే ప్రియం యత్ర మదనానలతాపితా
కరోతి వివిధాన్ భావాం స్తద్వై భావికముచ్యతే. 71

కేచిదేతద్ద్వయం ప్రాహుః తన్నమన్యామహేవయమ్
అంగాని దశ చైవేతి మునినా యత్ ప్రకీర్తితమ్. 72

**ఉద్ధతమ్**

ఉద్ధతం తు మహేశస్య శాసనాత్ తండునోదితమ్
భరతాయ తతః ఖ్యాతం లోకే తాండవసంజ్ఞయా. 73

---

1. ‘పాశ్యే నచోష్ఞితం’ అని దొరకిన పాఠము. ఇది పరిష్కర్త మంచి సవరణ. (వివరములకు చూ. Notes P. 3)



దారి ఝాముమున్నది
నీదు ప్రియ
తరళాక్షి ఒకచిన్నది

పురుషస్వభావమే యెక్కువగా గలిగి, సమవృత్తములచే అందమై, మృదువైన, ప్రియమైన మాటలుగల నాట్య మెందుండునో అది త్రిమూఢకము. 65

సంకేతస్థానమునకు ప్రియుడు రాక వంచితురాలైన పాత్ర, ఉత్తమమైన పాఠ్యమును లేని నాట్యము, సైంధవి భాష - ఇవి గలది సైంధవమని తెలిసిన వారందురు. 66

ముఖ ప్రతిముఖములు గలది, చతురశ్రమైన నడక గలది, భావరసములు శ్లిష్టముగా నుండునది, విచిత్రములైన అర్థములు గలది (విచిత్రత ప్రయోజనముగా గలది ?) ద్విమూఢకము. 67

విచిత్రములైన శ్లోకముల రచన గలిగి, నానారసముల కాశ్రయమై లీల యను భావముచే మనోహరమైనది ఉత్తమోత్తమకము. 68

ఎత్తిపొడుపు మాటలు గలది, వింతవింతలగు పాటలును అర్థములును గలది, కోప ప్రసాదములచే గలుగునది ఉక్తప్రత్యుక్తకమందురు (మాట కెదురుమాట). 69

మన్మథాగ్నిచే తపించెడి యంగములుగల స్త్రీ, ప్రియుని చిత్రపటమును జూచుచు మనస్సు నెమ్మదిపరుచుకొనుట చిత్రపదము. 70

స్వప్నమున ప్రియునిజూచి, మదనానలమున క్రాగుచు, నాయిక వివిధభావములను చూపుట భావికమనబడును. 71

ఈపై రెండంగములనుగూడ - చిత్రపదము, భావికము-కొందరు చెప్పుదురు. కాని మేమది యంగీకరింపము; 'అంగములు పదియే' యని భరతముని చెప్పెను గావున. 72

## ఉద్ధతము

ఉద్ధతము మహేశ్వరుని యాజ్ఞచే తండువు భరతమునికి చెప్పినది గావున లోకమున తాండవము అను పేర వెలసినది. 73

ప్రాయో నిర్వర్త్యతే పుంభిరంగహారైస్తదుద్ధతైః
ప్రయోగస్తూచ్యతే తజ్జ్ఞైః తస్యోత్సాహాదిగోచరః. 74

ఇతి శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
నర్తనవివేకోనామ ప్రథమోఽధ్యాయః.

అది ప్రాయికముగా ఉద్ధతమైన అంగహారములతో పురుషులు నెరవేర్తురు. ఉత్సాహము మొదలగు భావములందు దానిని ప్రయోగింపదగునని తెలిసిన వారు చెప్పుదురు. 74

ఇది శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుడగు
జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు
నర్తనవివేకమను మొదటి యధ్యాయము.

# అథ ద్వితీయోऽధ్యాయః

## అంగ ప్రత్యంగోపాంగాని

స నాట్యయోరథాంగాని వక్ష్యంతే నృత్య నృత్తయోః
శిరో హస్తౌ పురః పార్శ్వే కటీ పాదౌచ షట్ క్రమాత్. 1

గ్రీవా దోః కుక్షి పృష్ఠోరు జంఘాః ప్రత్యంగకాని షట్
విలోచన భ్రూ నాసోష్ఠ కపోల చుబుకాని షట్
ఉపాంగాన్యథవై తేషాం భేదాన్ వక్ష్యే సలక్షణాన్. 2

## శిరో లక్షణమ్

ఆకంపితం కంపితాఖ్యం ధుతం విధుత మంచితమ్
పరివాహిత మాధూత మవధూతం నిహంచితమ్. 3

అధోముఖం పరావృత్త ముత్క్షిప్తం లోలితం శిరః
త్రయోదశవిధం వృత్తం [నృత్తే?] మునినా సముదీరితమ్. 4

సకృదాకంపనాదూర్ధ్వమధశ్చాకంపితం శనైః
ప్రశ్నోపదేశ నిర్దేశ సంజ్ఞాదావేతదిష్యతే. 5

(ఆకంపితమ్—1)

తదేవ బహుశస్తూర్ణం కంపనాత్ కంపితం విదుః
వితర్క రోష విజ్ఞాన ప్రతిజ్ఞా తర్జనాదిషు. 6

(కంపితమ్—2)

మందం సంచారితం తిర్యక్ శిరో ధుత ముదీరితమ్
పార్శ్వావలోకనాశ్చర్య నిషేధానీప్సితాదిషు. 7

(ధుతమ్—3)

తదేవ శీఘ్రతాం నీతం శిరో విధుతమీప్సితమ్
పీతమాత్రాసవ త్రస్త శీతార్త[1] జ్వరితాదిషు. 8

(విధుతమ్—4)

---

1. 'శీతార్క' ముద్రితపా; సూర్యుని విషయమున గాని, యెండ విషయమున గాని యిది సరిపడదని తోచి పై సవరణ సూచించినాను.

# ఇక రెండవ అధ్యాయము

## అంగప్రత్యంగోపాంగములు

ఇక నాట్య-నృత్య-నృత్తముల యంగములు చెప్పబడును. అవి క్రమముగా శిరస్సు, చేతులు, వక్షము, ప్రక్కలు, మొల, పాదములు—ఇట్లు ఆరు. 1

మెడ, భుజములు, కడుపు, వెన్ను, తొడలు, పిక్కలు—ఇవి ఆరు ప్రత్యంగములు. కన్నులు, బొమలు, ముక్కు, పెదవులు, చెక్కులు, గడ్డము — ఈ యారును ఉపాంగములు. వీని భేదములను లక్షణములను వచింతును. 2

### శిరోలక్షణము

ఆకంపితము, కంపితము, ధుతము, విధుతము, అంచితము, పరివాహితము, ఆధూతము, అవధూతము, నిహంచితము, అధోముఖము, పరావృత్తము ఉత్క్షిప్తము, లోలితము — ఇట్లు వృత్తియందున్న [నృత్తము నందలి ?] శిరస్సు పదుమూడు విధములగునని ముని వచించెను. 3—4

ఒకమారు తిన్నగా మీదికిని క్రిందికిని కదలించు శిరస్సు ఆకంపితము; ప్రశ్న చేయుట, ఉపదేశము, నిర్దేశించుట (అదిగో అని చూపుట), సన్నచేయుట మొదలగు సందర్భములందిది ప్రయోగింపనగును. (ఆకంపితము—1) 5

అదేరీతిగా పలుమారు వేగముగా ఆడించిన తల కంపితమందురు; ఊహించుట, రోషము, తెలియుట, ప్రతిజ్ఞ, బెదరించుట మున్నగువానియందు ఉపయోగించును. (కంపితము—2) 6

నెమ్మదిగా అడ్డముగా ఆడించు తల ధుతమనబడును; ప్రక్కకు చూచుట, ఆశ్చర్యము, కూడదనుట, ఇష్టములేకుండుట—ఇత్యాదులందిది ఉపయుక్తము. 7
(ధుతము—3)

అదే, వేగముతో ఆడించినప్పుడు విధుతమగును; మద్యమును త్రాగిన వెంటనే, భయపడినప్పుడు, చలికి తట్టుకోలేనప్పుడు, జ్వరముపడియున్నప్పుడు—ఇత్యాది సందర్భములందు ప్రయోగింపదగినది. (విధుతము—4) 8

ఈషదానమితం పార్శ్వే శిరో జ్ఞాతవ్యమంచితమ్
మత్తమూర్ఛిత రోగార్త చింతా పర్యాకులాదిషు. 9
(అంచితమ్—5)

పార్శ్వాత్ పార్శ్వం శిరోనీతం పర్యాయైః పరివాహితమ్
విచార విస్మయామర్ష హర్ష లీలాదిషు స్మృతమ్. 10
(పరివాహితమ్—6)

ఏకవారం సముత్క్షిప్తం తిర్యగాధూత ముచ్యతే
ఆత్మసంభావనా గర్వ పార్శ్వ స్థోర్ధ్వావలోకనే. 11
(ఆధూతమ్—7)

అధస్తాత్ సకృదాక్షిప్తమవధూతం నిగద్యతే
తదావాహన సందేశ సంజ్ఞాలాపాదిషు స్మృతమ్. 12
(అవధూతమ్—8)

గ్రీవాంచితా సముత్క్షిప్తౌ యత్రాంసౌ తన్నిహంచితమ్
తదేతత్ సుభ్రువాం గర్వ బిబ్బోక లలితాదిషు. 13
(నిహంచితమ్—9)

అధోగత మవాచీన స్థితానన ముదాహృతమ్
అభివందన మందాక్ష విషాద ప్రముఖేషు తత్. 14
(అధోగతమ్—10)

యత్రాననం పరాచీనం తత్ పరావృత్తమిష్యతే
పశ్చాద్విలోకనానిష్టోద్విగ్నాస్యాపనయాదిషు. 15
(పరావృత్తమ్—11)

ఉచ్చైరున్ముఖముత్క్షిప్తం భవే దంచితకంధరమ్
ప్రాంశు వ్యోమాగ్ర సూర్యేందు తారాద్యుల్లోకనేషు తత్. 16
(ఉత్క్షిప్తమ్—12)

కొంచెముగా ప్రక్కకు వాల్చిన తల అంచితము; మదించినవారు, మూర్ఛ పోయినవారు, రోగబాధగలవారు, చింతచే కలతచెందినవారు — మొదలగు వారి విషయమునందుపయోగించునది. (అంచితము—5) 9

ఒకప్రక్కనుండి వేరొకప్రక్కకు మార్చి మార్చి తలనాడించుట పరివాహితము; ఆలోచించుట, ఆశ్చర్యము, రోషము, సంతోషము, లీల మొదలగువానియందు ప్రయోగింపదగును. (పరివాహితము—6) 10

ఒకమారు అడ్డముగా తలమీదికెత్తుట ఆధూతమనబడును; స్వాభిమానము, గర్వము, ప్రక్కనున్నవానిని, మీదివానిని చూచుట—వీనికుపయోగించును. 11
(ఆధూతము—7)

ఒకసారి క్రిందికి తలదించుట అవధూతము; అది పిలుపు, చెప్పిపంపుట, సన్న చేయుట, సల్లాపము మొదలగు విషయములందు వచ్చును. 12
(అవధూతము—8)

మెడ ఇంచుక ప్రక్కకు వాల్చి, మూపులను మీదికెత్తిన శిరస్సు నిహంచితము; ఇది స్త్రీల గర్వము, బిబ్బోకము, లలితము మొదలగువానియందు ప్రయో గింపదగినది. (నిహంచితము—9) 13

మొగము క్రిందికి వాల్చుట అధోగతము; ఇది నమస్కరించుట, సిగ్గు, ఖేదము మున్నగు సందర్భములం దుపయోగించును. (అధోగతము—10) 14

ముఖమును వెనుకకు త్రిప్పుట పరావృత్తము; వెనుకదిక్కు చూచుట, ఇష్టములేమి, వెరపుగొనుట, ముఖము తప్పించుట మున్నగుచోట్ల నుపయో గించును. (పరావృత్తము—11) 15

మెడనించుక ప్రక్కకు వాల్చి యెదురుగా ముఖమును మిక్కిలి మీదికెత్తి నపుడు ఉత్క్షిప్తమగును; ఎత్తులో నున్నవానిని, ఆకాశము తుది, సూర్య చంద్ర నక్షత్రాదులను నిక్కిచూచుటయందు దీని యుపయోగము. 16
(ఉత్క్షిప్తము—12)

శిరో లోలితమాఖ్యాతం సర్వతః పరిలోలనాత్
మదమూర్ఛాగద స్వప్న గ్రహాగ్రస్తాదిషు స్మృతమ్. 17
(లోలితమ్—13)

"[1]ఏభ్యోఽన్యే బహవో భేదాః లోకాభినయసంశ్రయాః
తే చ లోకస్వభావేన ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః" 18

ఇత్యుక్తం మునినా యత్తదనుతంత్రవిధాయిభిః
కల్పితాః కతిచిద్భేదాః బ్రూమస్తానపరానపి. 19

సమం నైరాజితం తిర్యక్తతం తిర్యఙ్నతోన్నతమ్
పార్శ్వాభిముఖమున్నీతం సకంపపరివాహితమ్. 20

సకంపధుతనామాన్యత్ ఉద్ధుతం పార్శ్వకంపితమ్
పార్శ్వాకంపిత మిత్యేకాదశ భేదాః ప్రకీర్తితాః. 21

ప్రకృతిస్థం సమం ప్రోక్తం యతోభేదాః వినిస్సృతాః
తత్స్యాత్ సమనఖ ధ్యాన స్వభావాభినయాదిషు. (సమమ్—1) 22

ప్రదక్షిణక్రమేణైవ యత్రారాత్రికవత్ భ్రమః
నైరాజితం నృపాదీనాం తత్ స్యాన్నీరాజనావిధౌ 23
(నైరాజితమ్—2)

తిర్యక్తతం యథార్థాఖ్యం చింతా పీడాదిషు స్మృతమ్.
(తిర్యక్తతమ్—3)
తిర్యఙ్నతోన్నతం తద్వత్ సుభ్రువాం విభ్రమాదిషు. 24
(తిర్యఙ్నతోన్నతమ్—4)

పార్శ్వాభిముఖ మన్వర్థసంజ్ఞం పార్శ్వప్రలోకితే.
(పార్శ్వాభిముఖమ్—5)

---

1. ఈ శ్లోకము భరత నాట్యశాస్త్రము 8వ అధ్యాయమున 38వది.

అన్ని ప్రక్కలను శిరస్సును వణకించుట లోలితమనబడును; మత్తెక్కుట, మూర్ఛరోగము, స్వప్నము, దయ్యముపట్టుట ఇత్యాదులందిది చెప్పబడినది. 17

(లోలితము—13)

"ఇవిగాక ఇంకను పెక్కు శిరోభేదములు, లోకాభినయమున గలవు. లోక స్వభావము దెలిసి వానిని ప్రయోక్తలు ప్రయోగింపదగును." 18

అని భరతముని చెప్పియున్నందున తరువాతి శాస్త్రకర్తలు కొన్ని భేదములు కల్పించినారు. వానిని, మరికొన్నిటిని గూడ తెల్పుదుము. 19

సమము, నైరాజితము, తిర్యక్నతము, తిర్యఙ్నతోన్నతము, పార్శ్వాభిముఖము, ఉన్నతము, సకంపపరివాహితము, సకంపధుతము, ఉద్ధుతము, పార్శ్వకంపితము, పార్శ్వాకంపితము-ఇట్లు పదునొకండు శిరోభేదములు గలవు. 20-21

స్వాభావికముగా నుండు శిరస్సు సమమనబడును; తక్కిన భేదములన్నియు దీనినుండి వెలువడును; సమనఖమను కరణమునందు, ధ్యానమును, స్వభావమును అభినయించుట మొదలగు సందర్భములందు దీని ప్రయోగము. 22

(సమము—1)

ఆరతియెత్తినట్లు ప్రదక్షిణముగానే తల తిరుగుట నైరాజితము; అది రాజులు మున్నగువారికి ఆరతియెత్తుటయందుపయోగింపదగును. 23

(నైరాజితము—2)

పేరు సార్థకముగా, ప్రక్కకు చాచబడినది తిర్యక్నతము; చింత, నొప్పి మొదలగువానియందిది వచ్చును. (తిర్యక్నతము—3)

అట్లే ప్రక్కకువంచి యెత్తబడినది తిర్యఙ్నతోన్నతము; ఇది స్త్రీల విభ్రమము మొదలగు భావములందు తగినది. (తిర్యఙ్నతోన్నతము—4) 24

మొగము ప్రక్కకు త్రిప్పుట పార్శ్వాభిముఖము; సార్థకసంజ్ఞ గలది.; ఇది ప్రక్కచూపునందుపయుక్తము. (పార్శ్వాభిముఖము—5)

ఉన్నితం సకృదున్నితే పృచ్ఛాదౌ సముదీరితమ్. 25
(ఉన్నితమ్—6)

కంపితేన సమాయోగం సంప్రాప్తే పరివాహితే
లాస్యే తాలలయే ప్రోక్తం సకంపపరివాహితమ్. 26
(సకంపపరివాహితమ్—7)

సకంపధుతమప్యేవం[1]..............జనైః కృతమ్
(సకంపధుతమ్—8)

ధుతమేవోద్ధుతం కించిదుత్తానితముఖం భవేత్. 27

కందుకోల్లాలనాందోల సంచారాదిప్రలోచనే. (ఉద్ధుతమ్—9)
కంపితాభ్యంచితాభ్యాం స్యాదర్ధం[2] పార్శ్వముఖం యదా 28

స్యాత్పార్శ్వ కంపితం పార్శ్వాకంపితంచ క్రమాత్తదా
ప్రశ్నతాలలయోల్లాస హాస్యాదౌ తద్ద్వయం మతమ్. 29
(పార్శ్వకంపిత—10, పార్శ్వాకంపితే—11)

**దృష్టిలక్షణమ్**

కాంతా హాస్యాంచితాచైవ రౌద్రీచ కరుణాంచితా
తథా వీరాద్భుతే స్యాతాం బీభత్సా సభయానకా. 30
రసోత్పత్తిక్రమేణాష్టౌ మయోక్తాః రసదృష్టయః
స్నిగ్ధా హృష్టా తతః క్రుద్ధా దీనా దృప్తా సవిస్మయా. 31

జుగుప్సిత భయాంచితే స్థాయిష్వేవం దృగష్టధా
శూన్యా లజ్జాన్వితా శ్రాంతా విషణ్ణా మలినాభిధా. 32
శంకితా ముకులా గ్లానా కుంచితా లలితా తథా
అభితప్తార్ధముకులే విభ్రాంతా సవితర్కితా. 33
ఆకేకరా వికోశాఖ్యా జిహ్మా త్రస్తాఽథ విప్లుతా
మదిరాచేతి దృష్టీనాం వింశతిర్వ్యభిచారిషు. 34

---

1. 'ప్యేకవం చతుర్జైర్జనైః కృతం', 'ప్యకవం చతురైంజకైః కృతం' అని వ్రాతలో చెడిన పాఠములు. చాలా అస్పష్టము.
2. 'చాదర్ధం' వ్రాత. 'స్యాత్ సార్ధం' అని యుండునేమో ?

ఒకసారి మొగము మీదికెత్తునది ఉన్నీతము; ప్రశ్నించుట మున్నగువాని యందు దీని వినియోగము. (ఉన్నీతము—6) 25

పరివాహితము కంపితముతో కలిసినప్పుడు సకంపపరివాహితము; లాస్యమున, తాళలయము ననుభవించునప్పుడు ఇది వచ్చును. 26

(సకంపపరివాహితము—7)

ఇట్లే సకంపధుతమును; కంపితముతో ధుతము చేరినప్పుడు.

(సకంపధుతము—8)

మొగము కొంచెముగా మీదికెత్తిన ధుతమే ఉద్ధుతమగును. బంతి పుట మెగురుట, ఉయ్యాలయూపు మొదలగువానిని చూచునప్పుడు దీని యుపయోగము. (ఉద్ధుతము—9)

పార్శ్వముఖము కంపితముతోగూడి పార్శ్వకంపితమగును; అంచితముతో గూడినపుడు పార్శ్వాకంపితమగును; ప్రశ్నించుట, తాళలయము, ఉల్లాసము, హాస్యము మున్నగువానియందు ఈ రెండును పనికివచ్చును.

(పార్శ్వకంపితము-10, పార్శ్వాకంపితము-11) 27 - 29

**దృష్టిలక్షణము**

కాంత, హాస్య, రౌద్రి, కరుణ, వీర, అద్భుత, బీభత్స, భయానక — ఇట్లు ఎనిమిది దృష్టులు, రసోత్పత్తిక్రమము ననుసరించి నేను చెప్పునవి. స్నిగ్ధము, హృష్టము, క్రుద్ధము, దీనము, దృప్తము, సవిస్మయము, జుగుప్సితము, భయాంచితము—ఇట్లు స్థాయిభావములందు దృష్టి ఎనిమిది తెరగులు. 30-31

శూన్యము, లజ్జాన్వితము, శ్రాంతము, విషణ్ణము, మలినము, శంకితము, ముకుళము, గ్లానము, కుంచితము, లలితము, అభితప్తము, అర్ధముకుళము, విభ్రాంతము, వితర్కితము, ఆకేకరము, వికోశము, జిహ్మము, త్రస్తము, విప్లుతము, మదిరము — అని యిరువది దృష్టులు వ్యభిచారిభావములందలివి.

32, - 34

**ర స దృ ష్ట యః**

హర్షోత్ఫుల్లా ప్రసాదోత్థా కామం కామదశా[1]వశా
శృంగారేఽభిమతా కాంతా భ్రూక్షేపాపాంగసంగతా. 35
(కాంతాదృష్టిః—1)

చిత్రభ్రాంతాల్పతారా దృగాకుంచితపుటా క్రమాత్
కక్షాదిస్పర్శపాతాదౌ హాస్యే హాస్యా హి[2]......... 36
(హాస్యా—2)

(అత్ర మహాన్ గ్రంథపాతః)

[క్రూరా రూక్షారుణోద్వృత్తా నిష్టబ్ధపుటతారకా
భ్రుకుటీ కుటిలా దృష్టిః రౌద్రీ రౌద్రరసే స్మృతా. 37
(రౌద్రీ—3)

పతితోర్ధ్వపుటా సాస్రా మన్యుమంథరతారకా
నాసాగ్రానుగతా దృష్టిః కరుణా కరుణేరసే. (కరుణా—4) 38

దీప్తా వికసితాఽక్షుబ్ధా గంభీరా సమతారకా
ఉత్ఫుల్లమధ్యా దృష్టిస్తు వీరా వీరరసాశ్రయా. (వీరా—5) 39

యా త్వాకుంచితపక్ష్మాగ్రా సాశ్చర్యోద్వృత్త తారకా
సౌమ్యా వికసితాంతాచ సాఽద్భుతా దృష్టి రద్భుతే. 40
(అద్భుతా—6)

నికుంచితపుటాపాంగా ఘూర్ణోపప్లుతతారకా
సంశ్లిష్ట స్థిరపక్ష్మాచ బీభత్సా దృష్టిరిష్యతే. (బీభత్సా—7) 41

---

1. 'కామవశావశా' వ్రా. ముద్రి. పాఠము. మీది పాఠము నా సూచన.

2. ఇక్కడనుండి వ్రాతప్రతులలో పెద్దగ్రంథపాతము. విషయ వైచక్షణ్యమునకై భరతనాట్యశాస్త్రమునుండి [ ] ఈ గుర్తులలోని శ్లోకముల నెత్తి పరిష్కర్త చేర్చినారు.

## ర స దృ ష్టు లు

సంతోషముచే, ప్రసన్నతచే జనించినది, కామావస్థకు లోగినది, బొమ లాడించుచు ప్రేగంట చూచునదియునైన చూపు కాంత యగును. ఇది శృంగార మందు తగును. (కాంతము—1) 35

నల్లగ్రుడ్డును వింతగా కొంచెముగా త్రిప్పుచు క్రమముగా రెప్పలనించుక ముడుచుచు చూచుదృష్టి హాస్య; చక్కిలిగింత, జారిపడుట మొదలగు హాస్య సందర్భములందిది చేయదగినది. (హాస్యము—2) 36

క్రూరము, కనికరములేనిది, మీదికి క్రిందికి రాచుకొనునది, రెప్పలును గ్రుడ్డును కదలకుండునది, వంకర బొమలు గలదియు నగు దృష్టి రౌద్రి; ఇది రౌద్రరసమునకు తగినది. (రౌద్రము—3) 37

మీదిరెప్ప జారి, కన్నీరు గలిగి, శోకముచే నల్లగ్రుడ్డు మెత్తబడగా, ముక్కు తుదికి సాగిన దృష్టి కరుణ; ఇది కరుణరసమున చేయదగినది. (కరుణము—4) 38

దీప్తిగలిగి, వికవికమై, కలతలేక, గంభీరమై, నల్లగ్రుడ్డులు సరివరుసలోనుండి, నడిమి భాగము విచ్చుకొనిన దృష్టి వీర; ఇది వీరరసము నాశ్రయించినది. 39
(వీరము—5)

తుదిరెప్ప వెంట్రుకలు కొంచెముగా ముడుచుకొని, ఆశ్చర్యముచే నల్లగ్రుడ్లు క్రిందికి మీదికి కదలగా, సౌమ్యమై, కనుగొనలు విచ్చుకొన్నచూపు అద్భుత; ఇది అద్భుతరసమునందు చేయదగినది. (అద్భుతము—6) 40

కనురెప్పలును, కనుగొనలును ముడుచుకొని, గ్రుడ్లు నొచ్చి తిరుగుడువడి, రెప్ప వెంట్రుకలు కలిసి కదలక యుండు దృష్టి బీభత్స. 41
(బీభత్సము—7)

ప్రోద్వృత్త నిష్టబ్ధపుటా స్ఫురదుద్వృత్తతారకా
దృష్టిర్భయానకాఽత్యర్థం భీతా జ్ఞేయా భయానకే. 42
(భయానకా—8)

**స్థాయి దృష్టయః**

వ్యాకోశమధ్యా మధురా స్మితతారాఽభిలాషిణీ
సానందభ్రూలతా దృష్టిః స్నిగ్ధేయం రతిభావజా. (స్నిగ్ధా—1) 43

చలా హసితగర్భాచ విశత్తారా నిమేషిణీ
కించిదాకుంచితా హృష్టా దృష్టిర్హాసే ప్రకీర్తితా. (హృష్టా-2) 44

రూక్షా స్థిరోద్వృత్తపుటా నిష్టబ్ధోద్వృత్తతారకా
కుటిలభ్రుకుటీ దృష్టిః క్రుద్ధా క్రోధే విధీయతే. (క్రుద్ధా—3) 45

అవస్రస్తోత్తరపుటా రుద్ధతారా జలావిలా
మందసంచారిణీ దీనా సా శోకే దృష్టిరిష్యతే. (దీనా—4) 46

సంస్థితే తారకే యస్యాః స్థిరా వికసితా తథా
సత్వ ముద్గిరతీ దృప్తా దృష్టి రుత్సాహసంభవా. (దృప్తా—5) 47

విమలోద్వృత్తతారాఽత్ర హృష్టోభయపుటాంచితా
సమా వికసితా దృష్టిః విస్మితా విస్మయే స్మృతా (విస్మితా—6) 48

సంకోచితపుటా ధ్యామా దృష్టిర్మీలితతారకా
పక్ష్మోద్దేశాత్ సముద్విగ్నా జుగుప్సాయాం జుగుప్సితా. 49
(జుగుప్సితా—7)

విస్ఫారితోభయపుటా భయకంపితతారకా
నిష్క్రాంతమధ్యా దృష్టిస్తు భయభావే భయాన్వితా. 50
(భయాన్వితా—8)

రెప్పలు చాలా విరివియై కదలకుండి, గ్రుడ్లు అదరుచు రాచుకొనగా, మిగుల భయపడిన చూపు భయానక; ఇది భయానక రసమందగును. 42

(భయానకము—8)

## స్థాయి దృష్టులు

నడికన్ను విరివియై, తియ్యనిదై, కనుగ్రుడ్లు నవ్వుచుండగా, అభిలాషగలిగి, ఆనందించు కనుబొమలు గలది స్నిగ్ధదృష్టి; ఇది రతిస్థాయియందగును. 43

(స్నిగ్ధము—1)

చంచలమై, లోపల నవ్వు గలిగి, తారలు రెప్పలలో చొచ్చుచుండగా, రెప్ప లార్చుచు, కొంచెముగా ముడుచుకొను చూపు హృష్టము; ఇది హాస స్థాయిలో. (హృష్టము—2) 44

కనికరములేనిది, స్థిరమై మీదికెత్తిన రెప్పలు గలది, కనుపాప స్తబ్ధముగా మీదికెత్తినది, బొమలు ముడివడినది యగు దృష్టి క్రుద్ధము; ఇది క్రోధ స్థాయిది. (క్రుద్ధము—3) 45

పైరెప్ప జారి, కనుగ్రుడ్డు నిలబడి, కన్నీటిచే కలగి, మెల్లగా సంచరించు దృష్టి దీనము; ఇది శోకమునకు. (దీనము—4) 46

తారకలు చక్కగా నిలబడి, స్థిరమై, విప్ఫారి, సత్తువను వెలువరుచు చూపు దృప్తము; ఇది ఉత్సాహమున పుట్టునది. (దృప్తము—5) 47

నిర్మలమై, మీదతిరుగు నల్లగ్రుడ్డుతో, రెప్పలు రెండును విప్ఫారగా, సమమై వికసించిన దృష్టి విస్మితము; ఇది విస్మయమునందు. (విస్మితము-6) 48

రెప్పలు ముడుచుకొని తారకలను మూయగా, స్పష్టత లేక రెప్పల తుదల నుండి కంపించు దృష్టి జుగుప్సితము; ఇది జుగుప్సయందు. 49

(జుగుప్సితము—7)

విచ్చుకొన్న రెండు రెప్పలతో, నల్లగ్రుడ్లు భయముతో వణకుచుండగా, నడికన్ను ముందుకువచ్చిన దృష్టి భయాన్వితము; ఇది భయభావమునందు. 50

(భయాన్వితము—8)

సంచారిదృష్టయః

సమతారా సమపుటా నిష్కంపా శూన్యదర్శనా
బాహ్యార్థాగ్రాహిణీ ధ్యామా శూన్యా దృష్టిః ప్రకీర్తితా. 51
(శూన్యా—1)

కించిదంచితపక్ష్మాగ్రా పతితోర్ధ్వపుటా హ్రియా
త్రపాధోగతతారాచ దృష్టిర్లజ్జాన్వితా తు సా. (లజ్జాన్వితా-2) 52

క్రమాత్ ప్రమ్లాపితపుటా క్షామాంతాంచితలోచనా
సన్నా పతితతారాచ శ్రాంతా దృష్టిః ప్రకీర్తితా. (శ్రాంతా-3) 53

విషాదవిస్తీర్ణపుటా పర్యస్తాంతాని మేషిణీ
కించిన్నిష్టబ్ధతారాచ కార్యా దృష్టిర్విషాదినీ. (విషాదినీ-4) 54

ప్రస్పందమానపక్ష్మా యా నాత్యర్థముకులైః పుటైః
మలినాంతాచ మలినా దృష్టిర్విభ్రాంతతారకా. (మలినా-5) 55

కించిచ్చలా స్థిరా కించిదుద్గతా తిర్యగాయతా
గూఢా చకితతారాచ శంకితా దృష్టిరిష్యతే. (శంకితా—6) 56

స్ఫురదాశ్లిష్టపక్ష్మార్ధా ముకులోర్ధ్వపుటాంచితా
సుఖోన్మీలితతారాచ ముకులా దృష్టిరిష్యతే. (ముకులా—7) 57

మ్లానభ్రూపుటపక్ష్మా యా శిథిలా మందచారిణీ
క్రమ[1] ప్రవిష్టతారాచ గ్లానా దృష్టిస్తు సా స్మృతా. (గ్లానా-8) 58

ఆనికుంచితపక్ష్మాగ్రా పుటైరాకుంచితైస్తథా
సన్నికుంచితతారాచ కుంచితా దృష్టిరిష్యతే. (కుంచితా-9) 59

---

1. 'క్లమ' భ నా. శా. పాఠము. ఇది ముద్రాదోషము గాబోలు.

### సంచారి దృష్టులు

తారకలు రెప్పలును సమముగానుండి, కదలికలేక, ఏమియు చూచునట్లు తోపక, బైటి పదార్థము లేవియు గ్రహింపక, పొగగప్పినట్లుండు చూపు శూన్యము. (శూన్యము—1) 51

రెప్పతుదలు ఇంచుక ముడుచుకొని, మీదిరెప్ప సిగ్గుచేజారి, నల్లగ్రుడ్డు క్రిందికి దిగియుండు దృష్టి లజ్జాన్వితము. (లజ్జాన్వితము—2) 52

అలపుచే రెప్పలు వాడియుండి, కొనగన్నులు కృశించి వాలి, జారినతారకలు గలిగిన సన్నచూపు శ్రాంతము. (శ్రాంతము—3) 53

వగపుచే రెప్పలు విరివియై, కనుగొనలు సాగి, రెప్పలార్చుచు, కొంచెము తారకలు నిలబడిన దృష్టి విషాదిని. (విషాదిని—విషణ్ణము—4) 54

రెప్పవెంట్రుకలు వణకుచుండగా, ఇంచుకంత రెప్పలు ముడుచుకొని, కనుగొనలు మాసి, తారకలు చెదరినది మలినము. (మలినము—5) 55

కొంచెము కదలి, కొంచెము నెలకొని, మీదికెత్తుకొని, అడ్డముగా సాగి, గూఢమై, తారకలు బెదరిన దృష్టి శంకితమనబడును. (శంకితము—6) 56

సగము రెప్పలతుదలు అదరుచు కొంచెముగా కలసికొనగా, మీదిరెప్ప ముడిగి వంగియుండగా, సుఖముచే విచ్చిన తారకలు గలది ముకుళము. 57
(ముకుళము—7)

బొమలు, రెప్పలు, రెప్పల తుదలును వాడి, సడలి మందముగా సాగుచు శ్రమచే తారకలు రెప్పలలో చొచ్చుకొనియున్నదృష్టి గ్లానము. 58
(గ్లానము—8)

కొంచెము ముడిచిన పక్ష్మాగ్రములు, రెప్పలును గలిగి తారకలు బాగుగా ముడిచిన చూపు కుంచితము. (కుంచితము—9) 59

మధురాఽకుంచితాంతాచ సభ్రూక్షేపాచ సస్మితా
సమన్మథవికారాచ దృష్టిస్సా లలితా మతా. (లలితా-10) 60

మందాయమాన తారా యా పుటైః ప్రచలితై స్తథా
సంతాపోపప్లుతా దృష్టిరభితప్తాతు సవ్యథా. (అభితప్తా-11) 61

అర్ధవ్యాకోశపక్ష్మాచ హ్లోదార్ధముకులైః పుటైః
స్మృతాఽర్ధముకులా దృష్టిః కించిల్లులితతారకా. 62
(అర్ధముకులా—12)

అనవస్థితతారాచ విభ్రాంతాకులదర్శనా
విస్తీర్ణోత్ఫుల్లనేత్రాచ విభ్రాంతా దృష్టిరిష్యతే.(విభ్రాంతా—13) 63

వితర్కోద్వర్తితపుటా తథైవోత్ఫుల్లతారకా
అధోముఖవికారాచ దృష్టిరేషా వితర్కితా. (వితర్కితా—14) 64

ఆకుంచితపుటాపాంగా సంగతార్ధనిమేషిణీ
ముహుర్వ్యావృత్త తారాచ దృష్టి రాకేకరా స్మృతా. 65
(ఆకేకరా—15)

వికోశితోభయపుటా ప్రోత్ఫుల్లాచానిమేషిణీ
అనవస్థితతారాచ వికోశా దృష్టిరిష్యతే. (వికోశా—16) 66

లంబితా కుంచితపుటా శనై స్తిర్యఙ్నిరీక్షిణీ
నిగూఢా గూఢతారాచ జిహ్మా దృష్టిరుదాహృతా.(జిహ్మా—17) 67

త్రాసోద్వృత్తపుటా యా తు తథోత్కంపితతారకా
సంత్రాసోత్ఫుల్లమధ్యాచ త్రస్తా దృష్టిరుదాహృతా. 68
(త్రస్తా—18)

పుటౌ ప్రస్ఫురితౌ యస్య (స్యా ?) నిష్టబ్ధౌ పతితౌ పునః
విప్లుతోద్వృత్తతారాచ దృష్టిరేషాతు విప్లుతా. (విప్లుతా—19) 69

మధురముగా కనుగొనలు ఇంచుక ముడిచి, బొమలు దాటించుచు, నవ్వుచు, మన్మథవికారముతో గూడిన దృష్టి లలితము. (లలితము—10) 60

తారకలు మందముగానుండి, రెప్పలు కదలుచుండగా, వెతపడుచు సంతాపమున మునిగిన దృష్టి అభితప్తము. (అభితప్తము—11) 61

రెప్పలవెంట్రుకలు సగము విప్పారి, రెప్పలు ఆహ్లాదముతో సగము మొగుడ్చుకొనియుండ, తారకలు కొంచెముగా చెదరియున్న దృష్టి అర్ధముకుళము. 62
(అర్ధముకుళము—12)

తారకలు నిలుకడలేక, విరివిగా తెరచుకొన్న కన్నులతో చెదరి, కలగిన చూపు విభ్రాంతము. (విభ్రాంతము—13) 63

సంశయముచే రెప్పలు క్రిందుమీదాడగా, నల్లగ్రుడ్లు ముందుకు తోచి, ముఖవికారము క్రింది దిక్కు గలిగిన దృష్టి వితర్కితము (వితర్కితము—14) 64

రెప్పలను, కనుగొనలను ఇంచుక కుంచించి, సగము కలిసిన రెప్పపాట్లును, పలుమారు తిరుగు తారకలును గలది ఆకేకరము. (ఆకేకరము—15) 65

రెండు రెప్పలను తెరచుకొని వికసించి, రెప్పపాటులేక, నిలుకడలేని తారలు గలది వికోశమనబడును. (వికోశము—16) 66

ఇంచుక ముడుచుకొని వ్రేలుచున్న రెప్పలతో తిన్నని యడ్డచూపులు గలిగి, తారకలు గూఢములై భావము తెలియని దృష్టి జిహ్మము. 67
(జిహ్మము—17)

వెరపుతో రెప్పలు క్రిందుమీదాడుచుండగా, తారకలు వణకుచుండగా, నడిమి భాగముబికిన దృష్టి త్రస్తము. (త్రస్తము—18) 68

రెప్పలు మిక్కిలి యదరి, నిశ్చలములై, జారుచుండగా, క్రిందుమీదుగా కలగిన తారకలు గలది విప్లుతము. (విప్లుతము—10) 69

ఆఘూర్ణమానమధ్యా యా క్షామాంచితాంచితలోచనా
దృష్టిర్వికసితాపాంగా మదిరా తరుణే మదే. 70

కించిదాకుంచితపుటా కించిల్లులితతారకా
అనవస్థితసంచారా దృష్టి ర్మధ్యమదే భవేత్. 71

సనిమేషాఽనిమేషాచ కించిద్దర్శితతారకా
అధోభాగచరీ దృష్టి రధమే తు మదే స్మృతా. (మదిరా—20) 72

**ఏతాసాం దృష్టీనాం వినియోగః**

ఇత్యేవం లక్షితా హ్యేతాః షట్త్రింశద్దృష్టయో మయా
రసజాః భావజాశ్చాసాం వినియోగం నిబోధత. 73

రసజాస్తు రసేష్వేవ స్థాయిషు స్థాయిదృష్టయః
శృణుత వ్యభిచారిణ్యః సంచారిషు యథాస్థితాః. 74

శూన్యాదృష్టిస్తు చింతాయామభితప్తాఽపి కీర్తితా
నిర్వేదే చాపి మలినా వైవర్ణ్యేచ విధీయతే. 75

శ్రాంతా శ్రమార్తే స్వేదేచ, లజ్జాయాం లలితా తథా
అపస్మారే తథా వ్యాధౌ గ్లాన్యాం గ్లానా విధీయతే. 76

శంకాయాం శంకితా జ్ఞేయా, విషాదార్థే విషాదినీ
నిద్రా స్వప్న సుఖార్థేషు ముకులా దృష్టిరిష్యతే. 77

కుంచితాఽసూయితానిష్టదుష్ప్రేక్షావ్యథాసు చ
అభితప్తా చ నిర్వేదే వ్యాభిఘాతాభితాపయోః. 78

జిహ్మా దృష్టిరసూయాయాం జడతాఽలస్యయోస్తథా
ధృతౌ హర్షే సలలితా, స్మృతౌ తర్కే వితర్కితా. 79

నడికన్ను తిరుగుడువడగా, తుదలక్ష్యించిన కన్నులు వాలి, కడగంటిచూపులు విచ్చిన చూపు మదిరము: ఇది తొలిమత్తునందు. 70

కొంచెము రెప్పలు ముడిగి, కొంచెము తారకలు కలకగొని, నిలుకడలేని నడక దీనికి నడిమత్తునందు గలుగును. 71

రెప్పపాటు కలిగియు లేకయు, తారకలు కొంచెము కనుపట్టునట్లు క్రిందికి పారునది చెడుమత్తునందగును. (మదిరము—20) 72

### ఈ దృష్టుల వినియోగము

ఇట్లు రసములందును, భావములందును గలుగు ఈ ముప్పదియారు దృష్టులు నేను నిరూపించితిని. వీని వినియోగము తెలిసికొనుడు. 73

రసములందు జనించిన దృష్టులు రసములందే, స్థాయిభావజనితములు స్థాయులందే వినియోజ్యములు. వ్యభిచారిదృష్టులు సంచారిభావములందు వినియోగపడు రీతిని వినుడు : 74

చింతయందు శూన్యదృష్టి, అభితప్తదృష్టియు నగును. విసుగునందు, వన్నె మారుటయందు మలినదృష్టి విహితము. 75

శ్రమచే అలసినప్పుడు, చెమరించునపుడు, శ్రాంతదృష్టి; స్మృతి తప్పినపుడు, వ్యాధియందు, అలపునందును గ్లానదృష్టికి వినియోగము. 76

శంకించుచోట శంకితము; వగపునందు విషాదిని; నిద్ర, కల, సుఖానుభవము— వీనియందు ముకులదృష్టి రావలయును. 77

అసూయ, ఇష్టములేని స్థితి, కష్టముతో చూడవలసినచోటు, కంటి పోటు— ఈ సందర్భములందు కుంచితము; విసుగుకొనుట, దెబ్బతినుట, తాపము ఆవరించుట—వీనియందు అభితప్తము. 78

ఓర్వలేమి, జడత్వము, చేతగానితనము—వీనియందు జిహ్మదృష్టి; నిబ్బరమున, సంతోషమున లలితదృష్టి; జ్ఞప్తికి దెచ్చుకొనుట, ఊహించుట — వీనియెడ వితర్కితము. 79

ఆహ్లాదిష్వర్ధముకులా గంధస్పర్శ సుఖాదిషు.
విభ్రాంతాదృష్టి రావేగే సంభ్రమే విభ్రమే తథా. 80

విప్లుతా చపలోన్మాద దుఃఖార్తి మరణాదిషు;
ఆకేకరా దురాలోకే విచ్ఛేద ప్రేక్షితేషుచ. 81

విబోధ గర్వామర్షౌగ్ర్యమతిషు స్యాద్వికోశితా
త్రస్తా త్రాసే భవేత్‌దృష్టిః, మదిరాచ మదేష్వితి. 82
షట్త్రింశత్ దృష్టయో హ్యేతా యథావ త్సముదాహృతాః
రసజానాంతు దృష్టీనాం భావజానాం తథైవచ 83
తారాపుటభ్రువాంకర్మ గదతోమే నిబోధత.

**తారాకర్మ**

భ్రమణం వలనం పాతశ్చలనం సంప్రవేశనమ్. 84
వివర్తనం సముద్వృత్తం నిష్క్రామః ప్రాకృతం తథా

పుటాంతర్మండలావృత్తిః తారయోర్భ్రమణం స్మృతమ్ 85
వలనం గమనం త్ర్యశ్రం పాతనం స్రస్తతా తథా
చలనం కంపనం జ్ఞేయం ప్రవేశోంతః ప్రవేశనమ్ 86
వివర్తనం కటాక్షస్తు సముద్వృత్తం సమున్నతిః
నిష్క్రామో నిర్గమః ప్రోక్తః ప్రాకృతంతు స్వభావజమ్. 87

**తారాకర్మ వినియోగాః**

అథైషాం రసభావేషు వినియోగం నిబోధత,
భ్రమణం వలనోద్వృత్తే నిష్క్రామో వీరరౌద్రయోః 88

నిష్క్రామణం సచలనం కర్తవ్యంహి భయానకే,
హాస్యబీభత్సయోశ్చాపి ప్రవేశనమిహేష్యతే. 89

ఆహ్లాదము గలిగించు సుగంధస్పర్శాది సుఖములందు అర్ధముకులము; తొట్రుపాటు, సంభ్రమము, శృంగారమువలన చిత్తము నిలుకడలేమి — వీనికి **విభ్రాంతదృష్టి.** 80

**చపలత్వము, పిచ్చి, దుఃఖము,** నొప్పి, మరణము, మొదలగుచోట్ల విప్లుత **దృష్టి:** మిరుమిట్లుగొలుపుదానిని, చూడరానిదానిని చూచుట, పులుకుపులుకని చూపులు — వీనియందు ఆకేకరము. 81

తెలియుట, గర్వము, రోషము, క్రౌర్యము — వీనియెడ వికోశితదృష్టి; బెదరుగొన్నపుడు త్రస్తము; మదములందు మదిరము. ఇట్లు ముప్పదియారు దృష్టులు స్పష్టముగా చెప్పబడినవి. రసములందు, భావములందును గలుగు దృష్టులందలి **తారా**—పుట—భ్రూకర్మములు చెప్పుదును, వినుడు. 82, 83

### తా రా క ర్మ

భ్రమణము, **వలనము,** పాతము, చలనము, సంప్రవేశనము, వివర్తనము, సముద్వృత్తము, నిష్క్రామము, ప్రాకృతము — (అని తారకల నడక తొమ్మిది విధములు). 84

రెప్పలోపలి నల్లగ్రుడ్లు గుండ్రముగా తిరుగుట భ్రమణము; ముమ్మూలగా నడచుట వలనము; దిగజారుటపాతము; వడకుటచలనము; రెప్పలోపలికిచొచ్చుట ప్రవేశనము; కడగంటికి పోవుట వివర్తనము; మీదికెత్తుట సముద్వృత్తము; కానరాకపోవుట నిష్క్రామము; సహజమైన నడక ప్రాకృతము. 85, 86, 87

### తారాకర్మల వినియోగములు

ఇక వీనికి రస-భావములందు వినియోగము తెలిసికొనుడు :
భ్రమణము, **వలనము, ఉద్వృత్తము,** నిష్క్రామము — ఇవి వీరరౌద్రములందు;

భయానకమందు నిష్క్రామణము, చలనమును; ప్రవేశనము హాస్యబీభత్స ములలో;

పాతనం కరుణేకార్యం, నిష్క్రామణమథాద్భుతే,
ప్రాకృతం శేషభావేషు, శృంగారేచ వివర్తితమ్. 90

స్వభావసిద్ధమేవైతత్ కర్మలోకక్రియాశ్రయమ్
ఏవం రసేషు భావేషు తారాకర్మాణి యోజయేత్. 91

## దర్శనప్రకారాః

అథాత్రైవ ప్రవక్ష్యామి ప్రకారాన్ దర్శనస్యతు
సమం సాచ్యనువృత్తేచహ్యాలోకిత విలోకితే, 92

ప్రలోకితోల్లోకితే చాప్యవలోకిత మేవచ
సమతారాంచ సౌమ్యంచ యద్దృష్టం తత్సమంస్మృతమ్. 93

పక్ష్మాంతర్గత తారం యత్ త్ర్యశ్రం సాచీకృతంతు తత్
రూపనిర్వర్ణనాయుక్త మనువృత్త మితిస్మృతమ్. 94

సహసాదర్శనం యత్స్యాత్తదాలోకిత ముచ్యతే
విలోకితం పృష్ఠతస్తు పార్శ్వాభ్యాంతు ప్రలోకితమ్. 95

ఊర్ధ్వముల్లోకితం జ్ఞేయ మవలోకితమప్యధః
ఇత్యేషదర్శనవిధిః సర్వభావ రసాశ్రయః
తారాగతః...... 96

### పుటకర్మ

అస్యానుగతం పుటకర్మ నిబోధత;
ఉన్మేషశ్చ నిమేషశ్చ ప్రసృతం కుంచితం సమమ్ 97
వివర్తితం సస్ఫురితం పిహితం సవితాడితమ్
విశ్లేషః పుటయోర్యస్తు స ఉన్మేషః ప్రకీర్తితః 98

సమాగమో నిమేషః స్యాదాయామః ప్రసృతం భవేత్
ఆకుంచితం కుంచితం స్యాత్ సమం స్వాభావికం స్మృతమ్ 99

కరుణమున పాతనము, అద్భుతమున నిష్క్రామణము చేయదగును. శృంగారమున వివర్తితము; తక్కినభావములలో ప్రాకృతము (స్వాభావికము) ఉపయోగపడును. 88, 89, 90

స్వభావసిద్ధముగనే యీ తారావ్యాపారము లోకులనడతలోనుండును. ఇట్లు రస—భావములందు తారాకర్మములు చేర్పదగును. 91

### దర్శన ప్రకారములు

ఇక ఇక్కడనే దర్శించురీతులను తెల్పెదను: సమము, సాచి, అనువృత్తము, ఆలోకితము, విలోకితము, ప్రలోకితము, ఉల్లోకితము, అవలోకితము (అని యెనిమిది). తారకలు సమముగాచూచుట సమమనబడును.

తారకలు రెప్పలలోనుండి ముక్కోణముగా నడచుట సాచీకృతము (సాచి); రూపమును చక్కగా నిలిచిచూచునది అనువృత్తము; 92, 93, 94

తటాలునచూచుట ఆలోకితము; వెనుకకుచూచుట విలోకితము; ప్రక్కలందు చూచుట ప్రలోకితము. 95

పైకిచూచుట ఉల్లోకితము; క్రిందికిచూచుట అవలోకితము; ఇది అన్ని భావములను, రసములను ఆశ్రయించిన తారకల దర్శనవిధి. 96

### రెప్పల పని

దీని వెన్నంటవచ్చు రెప్పలనడక తెలిసికొనుడు : ఉన్మేషము, నిమేషము, ప్రసృతము, కుంచితము, సమము, వివర్తితము, స్ఫురితము, పిహితము, వితాడితము; (ఇట్లిది తొమ్మిదివిధములు). రెప్పలు విడిగానుండుట ఉన్మేషము; 97, 98

అవి కలియుట నిమేషము; నిడివిగాసాగుట ప్రసృతమగును; ఇంచుకవంచుట కుంచితము, సహాసస్థితి సమము; 99

వివర్తితం సముద్వృత్తం, స్ఫురితం స్పందితం తథా
స్థగితం పిహితం, ప్రోక్తమాహతంతు వితాలి(డి)తమ్. 100

అథైషాం రసభావేషు వినియోగం నిబోధత.
క్రోధేవివర్తితం కార్యం నిమేషోన్మేషణైః సహ. 101

విస్మయార్థేచ హర్షేచ వీరేచ ప్రసృతం స్మృతమ్
అనిష్టదర్శనే గంధే రసే స్పర్శేచ కుంచితమ్. 102

శృంగారేచ సమం కార్యం, మీర్ష్యాసు స్ఫురితం తథా
సుప్త మూర్ఛిత వాతోష్ణ ధూమ వర్షాంజనార్తిషు. 103

నేత్రరోగేచ పిహితమభిఘాతే వితాలితమ్
ఇత్యేష రసభావేషు తారకాపుటయోర్విధిః. 104

## భ్రూ కర్మ

కార్యానుగతమప్యేవభ్రువోః కర్మనిబోధత.
ఉత్క్షేపః పాతనంచైవ భ్రుకుటీ చతురం తథా. 105

కుంచితం రేచితం చైవ సహజంచేతి సప్తధా.
భ్రువోరున్నతిరుత్క్షేపః సమమేకైకశోఽపివా. 106

అనేనైవ క్రమేణైవ (?) పాతనం స్యాదధోముఖమ్.
భ్రువోర్మూలసముత్క్షేపాత్ భ్రుకుటీ పరికీర్తితా. 107

చతురం కించిదుచ్ఛ్వాసాత్ మధురాయతతాభ్రువోః
ఏకస్యాహి ద్వయోర్వాపి మృదుభంగస్తు కుంచితమ్, 108

ఏకస్యా ఏవ లలితాదుత్క్షేపాద్రేచితం భ్రువః
సహజాతం తు సహజం కర్మస్వాభావికం స్మృతమ్. 109

మీదికెత్తి అడ్డముగాకదలుట వివర్తితము; కంపించుట స్ఫురితము; మూయుట పిహితము; రెప్పలార్చుట వితాడితము. 100

ఇక వీనికి రసభావములందు వినియోగము తెలిసికొనుడు : క్రోధమున నిమేషోన్మేషములతో వివర్తితము చేయవలెను. 101

ఆశ్చర్యము, సంతోషము, వీరరసము — వీనియందు ప్రసృతము. ఇష్టములేని గంధ, రస, స్పర్శములందు కుంచితము. 102

శృంగారమందు సమపుటము; ఓర్వలేమికి స్ఫురితము; నిద్ర, మూర్ఛ, గాలి, వేడి, పొగ. వాన, కాటుకవలని వ్యథ, నేత్రరోగము - వీనియందు పిహితము; పెద్దదెబ్బ తగిలినప్పుడు వితాడితము. ఇట్లు ఇది రసభావములందు తారాపుటముల యేర్పాటు. 103, 104

### బొ మ ల ప ని

ఈ తారాపుటకర్మనే వెన్నంటినది బొమలనడక; దాని నెరుంగుడు.

ఉత్క్షేపము, పాతనము, భ్రుకుటి, చతురము, కుంచితము, రేచితము, సహజము అని బొమలు ఏడుతెగలు. జతగాగాని, వేరువేరుగాగాని బొమలు మీదికెత్తుట ఉత్క్షేపము; అదేరీతిగా క్రిందికిజార్చుట పాతనము; బొమల మొదళ్ళను పైకెత్తుట భ్రుకుటి. 105, 106, 107

ఇంచుక ఉబ్బించి అందముగా నిగిడించుట చతురము; ఒకటిగాని రెండును గాని మెల్లగావిరుచుట కుంచితము; 108

ఒకబొమనే లలితముగా పైకెత్తుట రేచితము; స్వభావముగా కలుగు కర్మ స్వాభావికమనబడును. 109

అథైషాం సంప్రవక్ష్యామి రసభావప్రయోజనమ్
కోపే వితర్కే హేలాయాం లీలాదౌ సహజే తథా. 110

దర్శనే శ్రవణేచైవ భ్రువమేకాం సముత్క్షిపేత్
ఉత్క్షేపో విస్మయే హర్షే రోషేచైవ ద్వయోరపి. 111

అసూయితే జుగుప్సాయాం హాసే ఘ్రాణేచ పాతనమ్
క్రోధస్థానేషు దీప్తేషు, యోజయేత్ భ్రుకుటీం బుధః 112

శృంగారే లలితే సౌమ్యే సుఖస్పర్శే ప్రబోధనే
ఏవం విధేషు భావేషు చతురంతు ప్రయోజయేత్. 113

స్త్రీపురుషయోశ్చ సల్లాపే నానావస్థాంతరాత్మకే
మోట్టాయితే కుట్టమితే తథాచ కిలికించితే. 114

నికుంచితంచ కర్తవ్యం నృత్తే యోజ్యంతు రేచితమ్
అనావిద్ధేషు భావేషు కుర్యాత్ స్వాభావికం తథా. 115

## నాసాకర్మ

ఇత్యేవంతు భ్రువోః ప్రోక్తం, నాసాకర్మనిబోధత.
నతా మందా వికృష్టా చ సోచ్ఛ్వాసాథ వికూణితా. 116

స్వాభావికా (కీ?) చేతిబుధైః షడ్విధా నాసికా స్మృతా
నతా ముహుః శ్లిష్టపుటా. మందాతు నిభృతాస్మృతా. 117

వికృష్టా ఫుల్లితపుటా, సోచ్ఛ్వాసాకృష్ణమారుతా,
వికూణితా సంకుచితా, సమా స్వాభావికీ స్మృతా. 118

నాసికాలక్షణం హ్యేతద్వినియోగం నిబోధత;
మదోత్కంపసమాయుక్తే నారీణామనురోధనే 119

నిశ్వాసేచ నతాకార్యా నాసికా నాట్యయోక్తృభిః
నిర్వేదౌత్సుక్య చింతాసు మందాం శోకేచ యోజయేత్. 120

ఇక వీని రసభావములందలి ప్రయోజనము వివరింతును :

కోపము, ఊహించుట, హేల, సహజములైన లీలాదిభావములు, చూచుట, వినుట — వీనియందు ఒకబొమను మీదికెత్తవలయును; విస్మయము, హర్షము, రోషము — వీనియందు రెండుబొమలును ఎత్తనగును. అసూయ, అసహ్యము, నవ్వు, మూర్కొనుట — వీనియందు పాతనము; ఎక్కువకోపము గల్గినపుడు, పెద్దవెలుతురు చూచునపుడు, భ్రుకుటి ప్రయోగింపదగును. 110, 111, 112

శృంగారమున, సౌమ్యమైన లలితమునందు, సుఖముగా తాకి మేలుకొల్పుట యందు, ఇంకను ఇట్టిభావములందు చతురమును ప్రయోగింపదగును. 113

వివిధములగు అవస్థాభేదములుగల ఆలుమగల సల్లాపము, మోట్టాయితము, కుట్టమితము, కిలికించితము_వీనియందు నికుంచితము చేయవలయును. రేచితము నృత్తమందు చేర్పదగును. సంకీర్ణములుకాని భావములందు స్వాభావికము చేయదగినది. 114, 115

### నాసాకర్మ

ఇట్లు బొమలపని చెప్పబడినది. ఇక ముక్కుపని తెలిసికొనుడు : నతము, మందము, వికృష్టము, సోచ్ఛ్వాసము, వికూణితము, స్వాభావికము — ఇట్లు ముక్కు ఆరువిధములు. ముకుపుటములు మాటిమాటికిని ఒండొంటితో ఒరయు నాసిక నతము; నిశ్చలముగానున్నది మందము;విప్పారిన దొప్పలుగలది వికృష్టము; గాలిపీల్చునది సోచ్ఛ్వాసము; అడచుకొన్నది వికూణితము; సమముగానున్నది స్వాభావికము. 116, 117, 118

ఇది నాసాలక్షణము. దీని వినియోగమునెరుగుడు: మత్తులో వడకునప్పుడు, స్త్రీలను సమదాయించుచోట, నిట్టూర్పు విడుచునెడ — నాట్యము చూపువారు నతనాసికను ప్రయోగింపవలయును. విసుగు, ఇష్టార్థమునుసాధించు ఆత్రము, చింత, శోకము — ఈ స్థితులందు మందమును యోజింపనగును. 119, 120

తీవ్రగంధే వికృష్టాం తాం రౌద్రే వీరే తథైవచ
ఇష్టఘ్రాణే తథోచ్ఛ్వాసే దీర్ఘోచ్ఛ్వాసాం ప్రయోజయేత్. 121

వికూణితాచ కర్తవ్యా జుగుప్సాసూయితాదిషు
కార్యా శేషేషు భావేషు తజ్ఞైః స్వాభావికా తథా.[1]] 122

ఓష్ఠలక్షణమ్

[2]వివర్తనం విసర్గశ్చ వేపనం వినిగూహనమ్
సందష్టకం సముద్గంచ కర్మ షోఢాఽధరే స్మృతమ్. 123

క్రియతే యత్తిరశ్చీనం తద్వివర్తనముచ్యతే
వేదనానాదరాసూయా హాసితప్రముఖే మతమ్. 124

విసర్గః స్యాద్వినిష్క్రాంతిర్యాఽలక్తాదికరంజనే
బిబ్బోకే చంచలాక్షీణాం సంభోగే వల్లభార్పణే. 125

వేపనం కంపనం శీతభీరోషార్తిజపాదిషు
వినిగూహన మాస్యాంతర్గతిః ప్రాణగతేషు తత్. 126

బలాచ్చుంబతి కాంతేచ క్రోధే బాలమృగీదృశామ్
సందష్టం దశనైర్దష్టం కథ్యతే క్రోధకర్మసు. 127

ఉత్తరేణ సహోద్గత్య సముద్గమభిదీయతే
పూత్కృతావనుకంపాయాం చుంబనే లాలనేఽపిచ. 128

చతురోఽన్యానపి బ్రూమో భేదానుక్తాన్ మతాంతరే
ఆయతో రేచితో వృత్తో వికాసీ తుర్య ఉచ్యతే. 129

1. ఇంతవరకు లుప్తగ్రంథమును పరిష్కర్త పూరించిన భరతనాట్యశాస్త్ర గ్రంథము.
2. ఈ అర్ధశ్లోకముగూడ లుప్తమే. తరువాతి లక్షణక్రమము ననుసరించి ఇది పరిష్కర్త పూరణము.

కటువైన గంధమును మూచూచుట, రౌద్రము, వీరము—వీనియందు వికృష్ట నాసిక; ఇష్టమైనవాసన మూర్కొనుట, గాలిపీల్చుట — ఇందు దీర్ఘమైన సోచ్ఛ్వాసనాసికను ప్రయోగింపవలయును. 121

అసహ్యము, అసూయ, మొదలగువానియందు వికూణితము; తక్కినభావములలో స్వాభావికమును ప్రాజ్ఞులు వాడుదురు. 122

ఓ ష్ఠ ల క్ష ణ ము

వివర్తనము, విసర్గము, వేపనము, వినిగూహనము, సందష్టము, సముద్గము— ఇట్లు అధరక్రియలు ఆరు. 123

పెదవులను అడ్డముగా ప్రక్కలకు త్రోయుట వివర్తనము; ఇది నొప్పి, అనాదరము, అసూయ, నవ్వు మొదలగుచోట్ల వచ్చును. 124

పెదవులు తెరచుకొనుట విసర్గము; ఇది లత్తుక మొదలగువాని పూతయందు, బిబ్బోకమునందు, స్త్రీలు సంభోగమున ప్రియుని కాత్మార్పణము చేయుటయందును తగినది. 125

వణకుట వేపనము; చలి, భయము, రోషము, నొప్పి, జపము మొదలగువానికిది తగును; పెదవులు నోటిలోనికి పోవుట వినిగూహనము; అది ప్రాణాపాయములందు, కాంతుడు బలాత్కారమున ముద్దుగొన్న బాలవనితల అలుకయందును ప్రయోక్తవ్యము. పండ్లతో పెదవి కొరకుట సందష్టము; ఇది క్రోధకార్యములందు తగినది. 126, 127

క్రిందిపెదవి మీదిదానితోగూడ పైకిలేచుట సముద్గమనబడును; 'ఫూ' యని ఊదుట, కనికరించుట, ముద్దుగొనుట, బుజ్జగించుట—వీనియందిది వర్తించును. 128

ఇతరులు చెప్పిన మరినాలుగు భేదములుగూడ పేర్కొందుము: ఆయతము, రేచితము, వృత్తము, వికాసి—అనునవి. 129

ఉత్తరేణాన్వితో దీర్ఘ ఆయతః కథితః స్మితే
చలనాత్ సృక్కదేశస్య రేచితః స్థిరవిభ్రమే. 130

యదా ముకులితావోష్ఠౌ నాసికోపాంతగామినౌ
తతోవృత్తః స్మృతస్తద్జ్ఞైరవజ్ఞా పరిహాసయోః.
వికాసీ హసితే యోజ్యః కించిల్లక్ష్యోత్తరద్విజః 131

## కపోల లక్షణమ్

కుంచితః కంపితః ఫుల్లః క్షామః పూర్ణస్తతస్సమః. 132

ఇతి భేదాః కపోలస్య మునినా షడ్వినిర్మితాః
కుంచితః కృతసంకోచః శీత త్రాస జ్వరాదిషు. 133

స్ఫురితః కంపితః కోపే ప్రమోదేచ విధీయతే
ఫుల్లో వికసితో హర్షే, తతః క్షామో రుజి స్మృతః. 134

పూర్ణస్సమున్నతో గర్వే ప్రోత్సాహేచ ప్రయుజ్యతే
సమః స్వాభావికః శేషభావేషు వినియుజ్యతే. 135

## చుబుక లక్షణమ్

చుబుకం సప్తధోద్దిష్టం జిహ్వా దంతోష్ఠకర్మభిః
కుట్టనం లేహనం ఛిన్నం ఖండనం చుక్కితం సమమ్. 136

దుష్టంచ, లక్షణం తేషాం వినియోగశ్చ కథ్యతే
కుట్టనం ద్విజసంఘృష్టిః క్రుద్భీశీతజ్వరాదిషు. 137

జిహ్వయా లేహనం లేహో లేహ్యే లౌల్యేచ తద్విదుః
ద్విజానాం గాఢ సంశ్లేషం ఛిన్నం వ్యాధౌ భయే మృతౌ. 138

పై పెదవిని గలిసి నిడివిగా సాగినది ఆయతము ; ఇది సన్న నవ్వునందు. సెలవులను కదలించుట రేచితము ; ఇది స్థిరమైన విభ్రమమందు; 130

మోవులు ముడుచుకొని ముక్కుదగ్గరకు చేరుట వృత్తమందురు ; ఇది తిరస్కారమున, పరిహాసమున ప్రయోజ్యము. మీది పలువరుస ఇంచుక తోచునట్లుండుట వికాసి ; ఇది నవ్వునప్పుడు చూపదగినది. 131

### కపోల లక్షణము

కుంచితము, కంపితము, ఫుల్లము, క్షామము, పూర్ణము, సమము — ఇట్లు భరతముని ఆరు చెక్కిళుల భేదములు కల్పించెను. చలి, భయము, జ్వరము మొదలైనవానియందు బిగబట్టుకొన్న కపోలము కుంచితము. 132, 133

చెక్కులు అదరుట కంపితము ; ఇది కోపమున, సంతోషమున చూపదగినది. విప్పారినది ఫుల్లము ; ఇది హర్షమందు. ప్రక్కకు లాగినది క్షామము ; ఇది రోగమందు. 134

ఉబ్బిన చెక్కు పూర్ణము ; ఇది గర్వమున, ఎక్కువైన యుత్సాహమున చూపబడును. స్వాభావికమైనది సమము ; ఇది తక్కిన భావములందు వినియోగింపబడును. 135

### చుబుక లక్షణము

నాలుక, దంతములు, పెదవులు—వీని వ్యాపారములచేత చుబుకము-గడ్డము-ఏడు తెగలగును ; కుట్టనము, లేహనము, ఛిన్నము, ఖండనము, చుక్కితము, సమము, దష్టము—అని; వాని లక్షణమును, వినియోగమును తెల్పుదుము :

క్రోధము, భయము, చలిజ్వరము మున్నగువానియందు పండ్లు రాచుకొనుట కుట్టనము. 136, 137

నాలుకతో తడవుట లేహనము; దానిని నాకవలసినప్పుడు, చాపల్యమందు ప్రయోగింతురు. గట్టిగా పండు కరచికొనుట ఛిన్నము : ఇది వ్యాధి. భయము.

వ్యాయామే రోదనే శీతే తన్మతం నాట్యవేదినామ్ ;
అసకృత్ ఖండనం దంతసంస్ఫోటో జపభక్షయోః. 139

సల్లాపేఽధ్యయనే చైతద్విజానంతి విచక్షణాః
దంతపంక్త్యోః స్థితిర్దూరం జృంభాయాం చుక్కితమ్ మతమ్. 140

మనాక్ సంశ్లేషణం దంతపంక్త్యోః స్వాభావికే సమమ్
సందష్టం దశనైర్దష్టం స్యాదేతత్ క్రోధకర్మసు. 141

హ ను ల క్ష ణ మ్

([1]లోలా శ్లథా చాపి చలసంహతా సంహతా తథా
స్ఫురితాచ హనుర్వక్త్రా) షోఢా, లక్షణముచ్యతే)
వ్యాదీర్ణా చలితా లోలా రోమంథే గ్రాసలోలనే
శ్వసితాద్భుత వీక్షాయామేకాంగులమధః శ్లథా. 142

చలా శ్లిష్టాధరా ఘోషితాహాసే చలసంహతా
నిశ్చలాస్యా యదా సైవ సంహతా మౌనతత్పరా. 143

స్ఫురితా వేపితా ప్రోక్తా శీత శీతజ్వరాదిషు
తిరశ్చీనగతా వక్రా గ్రహావేశేఽర్దితాఽమయే. 144

జి హ్వా క ర్మా ణి

ఋజ్వీ సృక్కానుగా వక్రా నతా లోలాఽథ లేహినీ
ఇతిషోఢా భవేజ్జిహ్వా, క్రమాల్లక్షణముచ్యతే. 145

1. విభేదములన్నిటిని సంగ్రహించి చూపు ఇట్టి శ్లోకము తక్కిన యన్నిచోట్లను గలదు. ఇక్కడ లేదు. లక్షణ క్రమమునుబట్టి మీది శ్లోకము నేనూహించి యుల్లిఖిది.

మృతి, వ్యాయామము, పడ్చుట, చలి — వీనియందు నాట్యవేదు లుపయోగింతురు.

పలుమారు పండ్లుకొట్టుకొనుట ఖండనము ; దీనిని విజ్ఞులు జపము, నమలుట, సల్లాపము, అధ్యయనము—వీనియందు వినియోగింతురు. పలువరుసలు మిక్కిలి ఎడముగానుండుట చుక్కితము ; ఇది ఆవులింతయందు. 138, 139, 140

పలువరుసలు కొంచెముగా కూడుకొనుట సమము; ఇది స్వాభావిక కర్మలందు. పండ్లతో గడ్డమును కొరుకుట దష్టము ; ఇది క్రోధకర్మలందు. 141

హనువు (కటమర) లక్షణము

(లోలము, శ్లథము, చలసంహతము, సంహతము, స్ఫురితము, వక్రము— ఇట్లు హనువు—కటమర—ఆరు విధములు ; లక్షణమిట్లు :)

తెరచుకొన్న నోటితో కదలునది లోలము ; ఇది నెమరువేయుట, నోటికడిని ఇటునటు కదలించుట — వీనియందుపయోగించునది. ఒక అంగుళమంత క్రిందికి సడలినది శ్లథము ; ఊపిరి విడుచుటయందు, ఆశ్చర్యకరమైనదానిని చూచుట యందును ఇది కలుగును. 142

పెదవులు మూసికొని కదలించునది చలసంహతము ; ఇది స్త్రీల ఆహారమున తగును. అదే నోరు మెదలింపకున్న సంహతమగును ; మౌనమునందుపయోగించును. 143

అదరెడు కటమర స్ఫురితము ; చలి, చలిజ్వరము మొదలగు చోటులందు. ప్రక్కకీడ్చుకొనునది వక్రము ; గ్రహముపట్టుట, రోగము, బాధ — వీనియందిది ప్రయోగింపనగును. 144

జిహ్వాకర్మములు

ఋజువు, సృక్కానుగము, వక్రము, నతము, లోలము, లేహిని — ఇట్లు నాలుక ఆరు తెరగులు. క్రమముగా లక్షణము చెప్పబడును. 145

ఋజ్వీ ప్రసారితా ప్రోక్తా వివృతే వదనే సతి
శ్వాపదానాం పిపాసాయాం శ్రమే చైషా విధీయతే. 146

లిహానా సృక్కణీ సృక్కానుగా మృష్టాదన క్రుధోః
ఉచ్చాగ్రా వివృతాస్యస్థా వక్రా నృహరి దర్శనే. 147

నతాగ్రా స్యాన్నతా జృంభా వదనాంతరవీక్షయోః
దంతానోష్ఠౌచ లిహతీ లేహనీ లేహనే మతా. 148

ద ం త క ర్మా ణి

చర్వణ చ్ఛేదనే స్యాతాం పీడన గ్రహణే దతామ్[1]
అంత్యం నిష్కర్షణం జ్ఞేయం తత్కర్మాణి చ పంచధా 149

ఏతాన్యన్వర్థ సంజ్ఞాని ; చర్వణం చణకాదిషు
తాంబూల వీటికాచ్ఛేదే ఛేదనం, పీడనం పునః. 150

స్ఫోటనే క్రముకాదీనాం కోపేచ పరికీర్తితం
ఖియాంగుళీ తృణాదీనాం గ్రహణం గ్రహణే రణే. 151
మతం నిష్కర్షణం కీళరోదనాభినయం ప్రతి.

గ్రీ వా ల క్ష ణా ని

సమాంచితా నతా త్ర్యశ్రా [[1]రేచితా కుంచితోన్నతా
వలితాచ నివృత్తాచ గ్రీవా నవవిధా స్మృతా.]

[[2]సమా స్వాభావికీ ధ్యాన స్వభావ జపకర్మసు
అంచితాపసృతోద్బద్ధ(ంధ?) కేశకర్షోర్ధ్వదర్శనే. 153

---

1. 'తతః' ముద్రితపాఠము. ఉద్దిష్టమేదో తెలియకపోవును గనుక ఈ చిరు మార్పు సూచించితిని. దతాం = దంతానామ్.

1. ఈ శ్లోక త్రిభాగము వ్రాతలో నష్టము. పరిష్కర్త యూహించి పూరించినది.
2 ఈ భాగమును వ్రాతలో నష్టము. భరతనాట్య శాస్త్రమునుండి పరిష్కర్త యెత్తి చేర్చినదిది.

తెరచుకొన్న నోటితో చాచిన నాలుక ఋజ్వి ; ఇది హింస్రజంతువుల దప్పి యందు, శ్రమగలిగినప్పుడును ప్రయోగింపవలెను. 146

సెలవులునాకు నాలుక సృక్కానుగము; ఇది రుచిగల తిండి తినునప్పుడు, క్రోధమందు, వాడదగును. తెరచిననోట కొన మీదికెత్తినది వక్రము ; ఇది నరసింహామూర్తిని చూపునప్పుడు. 147

కొనవంగినది నతము ; ఇది ఆవులింతకు, నోటి లోపలిభాగమును చూచుటకు ఉపయుక్తము. పండ్లను, పెదవులను తడవునది లేహని; ఇది నాకుటకు తగును. 148

## దంతకర్మములు

చర్వణము, ఛేదనము, పీడనము, గ్రహణము, నిష్కర్షణము — అని దంత కర్మములు ఐదు విధములు. 149

ఇవన్నియు సార్థకమైన పేళ్లు గలవి. చర్వణము (నమలుట) సెనగలు మొదలగువానియందు ; ఛేదనము (త్రుంచుట) తమలపాకు మడుపు మొదలగు వానిని కొరుకుటయందు ; పీడనము (ఒత్తుట) పోక వక్క మొదలైనవాని విషయమున, కోపమందును చూపదగును. గ్రహణము (కరచుట) యుద్ధమున, భయముచే పూరి, త్రేలు మొదలగువానిని నోటకరచునప్పుడు; నిష్కర్షణము (ఇగిలించుట) కోతులను, ఏడ్పును అభినయించునప్పుడు ప్రయోగింపనగును. 150, 151

## గ్రీవాలక్షణములు

సమము, అంచితము, నతము, త్ర్యశ్రము, రేచితము, కుంచితము, ఉన్నతము, వలితము, నివృత్తము—ఇట్లు కుత్తుక నవవిధము. 152

స్వాభావికమైనది సమము ; ధ్యానము, సహజరీతి, జపము_వీనియందుండును. వెనుకకు వంగినది అంచితము ; వెంట్రుకలెత్తి గంటువేయుట, పట్టియీడ్చుట,

నతా నతాస్యేఽలంకారబంధే కంఠావలంబనే]
త్ర్యస్రా పార్శ్వగతా స్కంధభారేణ పరిపీడితే. 154

రేచితా విధుతా భ్రాంతా భవేన్మథన నృత్తయోః
ఊర్ధ్వం సంకుచితే మూర్ధ్ని కుంచితా గలరక్షణే. 155

ఉన్నతాఽభ్యుద్గతా సా స్యాత్ గ్రైవేయాలోకనాదిషు,
ప్రలోకితే స్వభంగేచ వలితా పార్శ్వతోముఖీ
స్వస్థానం పునరానీతా నివృత్తాఽభిముఖాదిషు. 156

శిరఃకర్మానుగామిత్వం గ్రీవాయాః కర్మణో యతః
యత్కించిదస్తి తత్కర్మ తదస్యామఖిలం స్మృతమ్. 157

ముఖరాగః

సూచనే చ మనోవృత్తేః ముఖరాగస్య ముఖ్యతా
శరీరాభినయే యస్మాత్ కార్యస్తస్మాదిహాదరః. 158

స్వాభావికః ప్రసన్నాభ్యో రక్తః శ్యామశ్చతుర్థకః
మధ్యస్థాదిషు భావేషు స్వభావాభినయేషుచ. 159

సాభావికః; ప్రసన్నస్తు శృంగారాద్భుతహాస్యయోః
రక్తో మదేషు కరుణే వీరే రౌద్రేచ జాయతే. 160

శ్యామో భవతి బీభత్స భయానక సమాశ్రయః
నాంగికాభినయో భాతి ముఖరాగవినాకృతః. 161

కిము ధత్తే శ్రియం జాతు మధు పుష్పాయుధం వినా
సూర్యోదయం వినా పద్మం విభ్రమా యౌవనం వినా. 162

పైకిచూచుట — వీనియందు వర్తించును. ముఖము ముందుకు వంగినప్పుడు నతము ; సొమ్ములు తొడుగుట, కంఠము కౌగిలించుట—వీనికుపయోగించును. ప్రక్కకు వాల్చినది త్ర్యశ్రము ; మూపుమీది బరువుచే నొచ్చినప్పుడు ఇది గలుగును. 153, 154

అదరుచు తిరుగునది రేచితము ; త్రచ్చుట, నృత్తము—వీనికుపయోగించును. మీదినుండి శిరస్సును ఒత్తినప్పుడు కుంచితము ; ఇది కుత్తుకను రక్షించుకొనుటకు వచ్చును. 155

మీదికెత్తిన మెడ ఉన్నతము ; ఇది కంఠాభరణములు ధరించుటకు, తటాలున చూచుటకు తగును. మొగము ప్రక్కకు తిరిగినప్పుడు వలితము ; గ్రీవాభంగము (మెడమురిపెము) నందు, ప్రక్కకు చూచుటయందును పనికివచ్చును. మరల తన చోటికి తేబడిన గ్రీవ నివృత్తము ; ఇది ఎదురుపడుట మొదలగుచోట్ల గలుగును. 156

మెడనడక తలనడక ననుసరించి యుండును ; గనుక దాని నడకలన్నియు దీనియందును ఉండును. 157

ము ఖ రా గ ము

శరీరాభినయమందు మనోవృత్తిని సూచించు ముఖరాగము_మొగము వన్నె-ముఖ్యము. కనుక దీనియందు శ్రద్ధ వహింపవలయును. 158

స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామము — అని ముఖరాగము నలు దెరగులు : మధ్యస్థత మొదలగు భావములందు, స్వభావము నభినయించునప్పుడు స్వాభావికము; శృంగారాద్భుతహాస్యములందు ప్రసన్నము; మదములందు, కరుణ వీర రౌద్రములందు రక్తము; బీభత్స భయానకములందు శ్యామము గలుగును. ముఖరాగము లేనిది ఆంగికాభినయము రాణింపదు. 159, 160, 161

కామము లేక మద్యము, సూర్యోదయము లేక పద్మము, తారుణ్యము లేని శృంగార చేష్టలును ఎప్పుడైనను అందగించునా ? 162

ముఖరాగం వినాఽభిఖ్యాం భజతేఽభినయో న హి
ఆంగికాభినయస్యాస్య ముఖరాగో హి జీవితమ్
వినా తేన బిభర్త్యేష సాదృశ్యం పుస్తచేష్టితైః. 163

హ స్త ల క్ష ణా ని

చతురమకరరాజి ప్రోల్లసత్పద్మకోశమ్
భ్రమరలలితలీలం హంసపక్షాభిరామమ్
ప్రవిచలదలపద్మం కర్కటాద్యైరుపేతమ్
జలధిజలమివేదం బ్రూమహే హస్తలక్ష్మ. 164

అ సం యు త హ స్తాః

పతాకా త్రిపతాకాఖ్యౌ భుజంగ మృగశీర్షకౌ
కర్తరీ కటకా సూచీ శుక హంస ముఖాభిధాః. 165
కపిత్థ శిఖరౌ పద్మకోశ కాంగుల ముష్టయః
చతుర భ్రమ రారాల హంసప క్షార్ధచంద్రకాః. 166
సందంశ ముకులాభిఖ్యౌ ఊర్ణనా భాలపల్లవౌ
తామ్రచూడశ్చ వియుతాః చతుర్వింశతిరిత్యమీ. 167

సం యు త హ స్తాః

అంజలిః కటకావర్ధమాన స్వస్తిక కర్కటాః
కపోత నిష ధోత్సంగ గజదం తావహిత్థకాః. 168
డోలః పుష్పపుటో వర్ధమానో మకర ఇత్యమీ
త్రయోదశవిధాః యుగ్మహస్తాః స్యుర్మునిసంమతాః. 169

నృ త్త హ స్తాః

చతురశ్రా వథోద్వృత్తౌ తథా తలముఖాభిధౌ
స్వస్తికౌ విప్రకీర్ణాఖ్యౌ అరాల కటకాముఖౌ. 170

పైకిచూచుట — వీనియందు వర్తించును. ముఖము ముందుకు వంగినప్పుడు నతము ; సొమ్ములు తొడుగుట, కంఠము కౌగిలించుట—వీనికుపయోగించును. ప్రక్కకు వాల్చినది త్ర్యశ్రము ; మూపుమీది బరువుచే నొచ్చినప్పుడు ఇది గలుగును. 153, 154

అదరుచు తిరుగునది రేచితము ; త్రచ్చుట, నృత్తము—వీనికుపయోగించును. మీదినుండి శిరస్సును ఒత్తినప్పుడు కుంచితము ; ఇది కుత్తుకను రక్షించుకొనుటకు వచ్చును. 155

మీదికెత్తిన మెడ ఉన్నతము ; ఇది కంఠాభరణములు ధరించుటకు, తటాలున చూచుటకు తగును. మొగము ప్రక్కకు తిరిగినప్పుడు వలితము ; గ్రీవాభంగము (మెడమురిపెము) నందు, ప్రక్కకు చూచుటయందును పనికివచ్చును. మరల తన చోటికి తేబడిన గ్రీవ నివృత్తము ; ఇది ఎదురుపడుట మొదలగుచోట్ల గలుగును. 156

మెడనడక తలనడక ననుసరించి యుండును ; గనుక దాని నడకలన్నియు దీనియందును ఉండును. 157

ము ఖ రా గ ము

శరీరాభినయమందు మనోవృత్తిని సూచించు ముఖరాగము–మొగము వన్నె-ముఖ్యము. కనుక దీనియందు శ్రద్ధ వహింపవలయును. 158

స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామము — అని ముఖరాగము నలుదెరగులు : మధ్యస్థత మొదలగు భావములందు, స్వభావము నభినయించునప్పుడు స్వాభావికము; శృంగారాద్భుతహాస్యములందు ప్రసన్నము; మదములందు, కరుణ వీర రౌద్రములందు రక్తము; బీభత్స భయానకములందు శ్యామము గలుగును. ముఖరాగము లేనిది ఆంగికాభినయము రాణింపదు. 159, 160, 161

కామము లేక మద్యము, సూర్యోదయము లేక పద్మము, తారుణ్యము లేని శృంగార చేష్టలును ఎప్పుడైనను అందగించునా ? 162

అవిద్ధవక్రౌ సూచ్యాస్యౌ రేచితా వర్ధరేచితౌ
ఉత్తానవంచితాభిఖ్యౌ పల్లవౌ సనితంబకౌ. 171

కేశబంధౌ లలితాసంజ్ఞౌ కరిహస్తాభిధౌ తతః
పక్షవంచితకౌ పక్షప్రద్యోతౌ తార్క్ష్యపక్షకౌ. 172

దండపక్షాహ్వయౌ వూర్ధ్వమండలౌ పార్శ్వమండలౌ
ఉరోమండల నామానౌ ఉరః పార్శ్వార్ధమండలౌ. 173

ముష్టిక స్వస్తికావన్యౌ నలినీపద్మకోశకౌ
అలపల్లవ నిష్పన్నావుల్బణౌ లలితౌ తథా. 174

వలితౌచ కరాః నృత్తే వింశతిః స్యుర్నవాధికాః
యద్యేవం మిలితాస్సర్వే షట్షష్టిస్త్రివిధా అపి. 175

"[1]చతుష్షష్టికరాహ్యేతే నామతోఽభిహితాః మయా"
ఇత్యుక్తం బ్రహ్మపుత్రేణ భరతేనాపి తత్కథమ్. 176

అయుక్తేషు చ సూచ్యాస్యః స్వస్తికస్సంయుతేష్వపి
తావేవాత్ర సమానాఖ్యౌ నృత్తహస్తౌ ప్రకీర్తితౌ. 177

యత్తు 'నామత' ఇత్యాహ మునిః సత్యం నచాన్యథా
పల్లవావేవ లలితౌ లతాఖ్యౌ వలితావితి. 178

నిశ్చిత్య నృత్తహస్తేషు హిత్వా తద్ద్వితయం పునః
సోమేశ్వరాదయః కేచిత్ సప్తవింశతిమూచిరే. 179

స్వస్తికౌ విప్రకీర్ణౌ[2]చ రేచితావర్ధరేచితౌ
నామభేదాన్మిథో భిన్నౌ తద్వదత్రాపి మన్యతామ్. 180

---

1. భ. నా. శా. 9—17. కాశీ ముద్రణము.
2. 'విప్రకీర్ణేచ' అను పాఠము అచ్చు పొరపాటు కాబోలును.

ములు, అర్ధరేచితములు, ఉత్తానవంచితములు, పల్లవములు, నితంబములు, కేశ బంధములు, లతలు, కరిహస్తములు, పక్షవంచితములు, పక్షప్రద్యోతములు, తార్క్ష్యపక్షములు, దండపక్షములు, ఊర్ధ్వమండలములు, పార్శ్వమండలములు, ఉరోమండలములు, ఉరఃపార్శ్వార్ధమండలములు, ముష్టికస్వస్తికములు, నళినీ పద్మకోశములు, అలపల్లవో(పద్మో)ల్బణములు, లలితములు, వలితములు — ఇట్లు నృత్తహస్తములు ఇరువదితొమ్మిది. అప్పటికి అన్నిహస్తములును — (అసంయుత సంయుత, నృత్తహస్తములు ముత్తెగలును) వెరసి అరువదియారు కాగలవు.
170, 171, 172, 173, 174, 175

"ఈ అరువదినాల్గు హస్తములు పేర్లతో నేను వచించితిని" అని బ్రహ్మ కుమారుడైన భరతముని చెప్పినాడుగదా, అది యెట్లు ? 176

అసంయుతహస్తములలోని సూచ్యాస్యము, సంయుతహస్తములందలి స్వస్తికము అను రెండే ఆ పేర్లతోనే ఇక్కడ పేర్కొనబడినవి. భరతముని 'పేర్లతో' అని వచించినది సరియే; అందు పొరబాటేమియు లేదు.

మరి సోమేశ్వరుడు మొదలగు కొందరు, నృత్తహస్తములందలి పల్లవములే లలితములని, లతలే వలితములని నిశ్చయించి ఆ లలిత - వలితములను వదలి ఇరువది యేడు హస్తములన్నారు. 177, 178, 179

స్వస్తికములు, విప్రకీర్ణములు, రేచితములు, అర్ధరేచితములును నామభేదము చేత పరస్పరభిన్నములై యున్నవి. వానివలెనే యిక్కడను గ్రహింప దగును. 180

[1]స్యాతాం యేషాం మతే భిన్నా వుల్బణావలపల్లవౌ
మండలానాంచ సామాన్య(ం?) మండలత్వ మితి ధ్రువమ్. 181

సంత్యజ్యతే త్రయం తేషు నృత్తవిద్యావిశారదైః
ఏవంచేన్న పృథక్ స్యాతాం రేచితావర్ధరేచితౌ ; 182

ఉల్బణావలపద్మౌచ భిన్నౌ యది మునేర్మతే
బహుత్వం ప్రాప్నుతశ్చైతౌ వలపద్మోల్బణా వితి(ణాఇతి ?) 183

అంజల్యాదేః కరద్వంద్వ ప్రయోజ్యస్య కథం మునిః
ఉక్త్యైకవచనం నృత్తహస్తే ద్వివచనం వ్యధాత్. 184

నృత్యే సంయుక్తయోస్సిద్ధిః హస్తత్వే సతతం భవేత్
నృత్తహస్తేషు హస్తాభ్యాం హస్తేనైకేనవా భవేత్. 185

హస్తత్వసిద్ధిరిత్యస్మాత్ కారణాత్ ఉభయోరపి
ప్రాధాన్యం వక్తుకామోఽసౌ మునిర్ద్వివచనాజ్జగౌ. 186

అసంయుతహస్తాః

ప్రకృతిత్వాత్ పతాకస్య ప్రవృత్తిస్సర్వకర్మసు
జాయతేహి స్వభావేన వినియోగోఽస్య తన్మహాన్. 187

ప్రసూతిర్బహుహస్తానాం అతఏవాస్యముఖ్యతా
తర్జనీ మూలగోంగుష్ఠః కుంచితః కుంచితాంఘ్రివత్. 188

అంగుల్యో యత్ర జాయంతే సమశ్లిష్ట ప్రసారితాః
సపతాక ఇతి ఖ్యాతః పతాకాకారధారణాత్. 189

హర్ష గర్వ ప్రహారాదౌ ఫాలదేశస్థితో భవేత్
చపేటే తాలికాయాంచ స్యాద్వరాభయదానయోః. 190

1. ఈ 181, 182 శ్లోకముల పాఠము సరిగా తోపదు. వీని తెలుగు తాత్పర్యము చూఛాయగానే చేసినది.

కొందరి మతమున ఉల్బణములు, అలపల్లవములును భిన్నములు ; మరియు మండలములన్నిటియందును మండలత్వము సమానమే గనుక వానిలో నృత్త విద్యావిశారదులచే మూడు విధములు త్యజింపబడును. అట్లైనపక్షమున రేచితములు, అర్ధరేచితములును వేరు కాజాలవు. 181, 182

ఉల్బణములు, అలపద్మములును భరతముని మతమున భిన్నములై యుండెనేని 'అలపద్మోల్బణాః' అని బహువచనముండియుండునుగాని 'అలపద్మోల్బణౌ' అని ద్వివచనముండియుండదు. 183

అంజలి మొదలగు సంయుతహస్తములు రెండుచేతులతో ప్రయోగింపవలసినవి. భరతముని వానిని ఏకవచనముతో నిర్దేశించి నృత్తహస్తములందు ద్వివచనము నేల ప్రయోగించెను ? 184

(పై శంకకు సమాధానము :) నృత్యమునందెప్పుడును రెండుచేతులును గలసియే హస్తములగును. నృత్తహస్తములందు రెండుచేతులుగాని, ఒకచేయిగాని హస్తమనుటకు చాలును. కనుక ఇక్కడ రెంటికిని ప్రాముఖ్యమును తెలుపదలచి భరతముని ద్వివచనము చెప్పెను. 185, 186

### అసంయుతహస్తములు

పతాకము మూలభూతము గనుక స్వాభావికముగా అన్నికర్మములందును ప్రవర్తించును. కావున దీని వినియోగము గొప్పది. 187

అనేకహస్తములు దీనినుండి పుట్టును. కనుకనే దీని ప్రాముఖ్యము.

వంచిన యడుగువలె, బొటనవ్రేలు వంగి చూపుడువ్రేలిమూలమును తాకవలెను; తక్కిన వ్రేళ్ళన్నియు సమముగా కూర్చి చాచబడవలెను. అప్పుడాచేయి పతాకవలె—జెండావలె - కానవచ్చును గాన పతాకమనబడును. 188, 189

హర్షము, గర్వము, దెబ్బకొట్టుట మున్నగువానియందీహస్తము నొసటియందుండదగును; అరచేతిపెట్టు, వరమునిచ్చుట, అభయప్రదానము — వీని

పుష్పాదే స్సంయుతో వర్షే[1], విశ్లిష్ట, చలితాంగులిః
లలాటోర్ధ్వగతోఽధస్తాత్ వర్షధారా నిరూపణే. 191

పుష్పోపహార శష్పాదౌ స్వస్తికీభూయవిచ్యుతః
మిథోఘృష్టతలో మృష్ట పిష్ఠ ధౌతాదిషు స్మృతః. 192

మిథస్సంముఖవిశ్లిష్టః శిలావ్యుత్పాటనాదిషు
పక్షోత్క్షేపే కటే క్షేత్రాత్ గచ్ఛన్నవిరలాంగులిః. 193

ఉత్సాహన బహు ప్రాంశుప్రముఖేషు సరేచకః
నిషేధే చలితః పార్శ్వే స్యాదధః పుష్కరాహతౌ. 194

తిర్యగగ్రోచ్ఛ సర్పి స్యా చ్చలాంగులిరధస్తలః
సమీరే లహరీ వేగే వేలాక్షోభేఽప్యయంక్రమాత్. 195

సపవోత్తానితో హస్తో భవేదోఘప్రదర్శనే. (పతాకః—1)
అనమ్రానామికస్సోఽయం త్రిపతాకః కరో భవేత్. 196

యతోఽత్రాంగులయస్తిస్రః పతాకాకార సంస్థితాః
ఆవాహనావతరణ ప్రణామోన్నామనేష్వయమ్. 197

మాంగల్యవస్తు సంస్పర్శప్రవేశాదౌచ శస్యతే
అనుకృత్యా యథార్థాఖ్యాః భవేయుః ప్రాయశః కరాః. 198
(త్రిపతాకః—2)

పతాకస్య యదానిమ్నం తలం సర్పశిరాస్తదా
ప్రతిగ్రహే ప్రదానేఽథ తోయధారణసేకయోః. 199

1. 'హర్షే' అను ముద్రి పా. వ్రాతప్రతిలోని పొరబాటుగాదగును.

యందును ఇది ప్రయుక్తము; పూవులు మొదలగునవి వర్షించునప్పుడు సంయుత మైన దీని వ్రేళ్లు విడివిడిగా కదలుచుండవలెను; వర్షధారలను నిరూపించుచోట ఇది నొసటిమీద అధోముఖముగా నుండవలెను. 190, 191

పువులు, గరిక మొదలైనవి సమర్పించుట యందిది స్వస్తికమై విడివడి ప్రయోగింపబడును; శుద్ధిచేయుటకు, పిండిచేయుటకు, కడుగుటకు ఈ హస్తములను ఒండొంటితో రాచుచు చూపనగును. 192

రాతిని పెరికియెత్తుట మున్నగుచోట్ల ఎదురుబదురుగా ఎడమై ఈ హస్తము ప్రయోజ్యము; రెక్కలు మీదికాడించుట యందిది కదిసినవ్రేళ్ళతో కటిప్రదేశము నుండి సాగును. 193

పురికొల్పుట, అనేకములు, పొడుగైనవి మున్నగువానియందు ఇది రేచకముతోగూడి వచ్చును. పార్శ్వమునందు అల్లాడుచు నిషేధమును-కాదు, లేదు. వలదు అను నర్థమును—తెలుపును; మృదంగాదివాద్యముల ముఖమును తట్టునపుడు క్రిందిమొగమై యుండును. 194

క్రిందిమొగమై, కదలెడువ్రేళ్ళతో, కొనలడ్డముగా మీదికిసాగుచు—ఇది క్రమముగా గాలి, తరంగవేగము, సముద్రపునీటిపోటు—వీనిని దెలుపును. 195

ఇదేహస్తము మీదిమొగమై జలప్రవాహమును దెలుపును. (పతాకము—1)

అనామిక—ఉంగరపువ్రేలు—పూర్తిగా వంగినపుడు ఈ హస్తము త్రిపతాకమగును: దీనియందు తక్కిన మూడువ్రేళ్లును పతాకారూపముతో నిలుచును గనుక; దేవతావాహనము, దిగుట, మ్రొక్కుట, పైకెత్తుట, మంగళద్రవ్యములను తాకుట, ప్రవేశించుట మున్నగు సందర్భములందిది చెప్పబడినది.

ప్రాయికముగా ఆయాపదార్థములను అనుకరించుటచేత హస్తముల పేళ్లు అర్థము గలవై యుండును. (త్రిపతాకము—2) 196, 197, 198

పతాకహస్తముయొక్క అడుగుభాగము గుంతగానున్నచో అది సర్పశిరమగును; పుచ్చుకొనుట, ఇచ్చుట, నీళ్లుపట్టుకొనుట, తడపుట, పాము ప్రాకుట,

గతా సర్పస్య మల్లోరుబాహ్వాస్ఫోటనయోర్భవేత్
కుంభికుంభద్వయస్కంధబంధురాస్ఫోటనాదిషు. 200
(సర్పశిరాః—3)

అస్యాంగుష్ఠ కనిష్ఠే చేదూర్ధ్వకే మృగశీర్షకః
ద్యూతాక్షపాతనే శక్త్యా ఉల్లాసే[1] స్వేదమార్జనే
ఇహ సాంప్రతమత్రాస్తీత్యాదౌ చైవ ప్రయుజ్యతే. 201
(మృగశీర్షకః—4)

త్రిపతాకస్య మధ్యాయాస్తర్జనీ పృష్ఠదర్శినీ
యదా భవేత్తదా విద్భిః జ్ఞేయోఽసౌ కర్తరీముఖః. 202

అలక్తకాదినా పాదరంజనాదావధోముఖః
ఉత్తానో దృష్టి శృంగాదౌ తథా లేఖాదివాచనే. 203
(కర్తరీముఖః—5)

తలస్థా సమితా మధ్యా ముఖేంగుష్ఠనిపీడితా
వక్రాప్రదేశినీ శేషే వక్రోర్ధ్వే కటకాముఖే. 204

స్రగ్దామ ప్రగ్రహ చ్ఛత్ర వ్యజనాదర్శ ధారణే
శరవస్త్రాంచలాకర్షే[2]...................... 205
(కటకాముఖః—6)

భవేత్సూచీముఖోహస్తః తర్జన్యస్యా యతా యది
ఊర్ధ్వాననా నతా లోలా కంపితా జృంభితా తథా
ఉద్వాహితా చలేత్యస్మిన్ తర్జనీ సప్తధా మతా. 206

ఊర్ధ్వాననా భవేదూర్ధ్వా, క్రియతేఽధోముఖీ నతా,
లోలా పార్శ్వాంతరం యాతా, కంపితా స్పందితా స్మృతా. 207
జృంభితాఽభిమతా కించిత్ కుంచయిత్వాప్రసారితా
ఉద్వాహితా వ్రజంత్యూర్ధ్వం, గచ్ఛంతీ కామతశ్చలా. 208

1. 'శక్త్యా ఉల్లాసే' అనుటకు అర్థము అస్పష్టము.
2. ఇక్కడ శ్లోకపాదము పోయినది.

జెట్టులు తొడలను, భుజములను తట్టుట, ఏనుగుల కుంభములను, మూపును అప్పళించుట—ఇత్యాదులందు దీని యుపయోగము. 199. 200

(సర్పశిరము—3)

దీని బొటనవ్రేలును మీదికెత్తినచో మృగశీర్షకమగును. జూదమున పాచికలు పడవేయుట, శక్తిని ప్రోత్సహించుట, చెమటను తుడుచుట, 'ఇక్కడ-ఇప్పుడు-ఇందున్నది' మున్నగు మాటలు — వీనియందు వచ్చును. (మృగశీర్షకము—4) 201

త్రిపతాక హస్తమునందు చూపుడువ్రేలు నడివ్రేలి వీపును చూచుచున్నచో అది కర్తరీముఖమని తెలియవలయును. 202

ఇది క్రిందిమొగమై లత్తుక మొదలగువానిచే పాదముల పూత మున్నగువాని కుపయోగించును; వెలిమొగమై దృష్టి, కొమ్ములు మొదలగువానిని సూచించును; జాబులు మొదలగువానిని చదువుటయందుపయోగింపదగును. 203

(కర్తరీముఖము—5)

లోనికి వంగిన నడిమివ్రేలికొనను బొటనవ్రేలొత్తిపట్టగా, చూపుడువ్రేలు వంగి, తక్కిన రెండువ్రేళ్లును వక్రములై మీదికి నిలుచు హస్తము కటకాముఖము; ఇది, పూలసరమును, పగ్గమును, గొడుగును, విసనకఱ్ఱను, అద్దమును పట్టుకొనుట, బాణమును, వస్త్రాంచలమును పట్టిలాగుట—వీనియందు వచ్చును.

(కటకాముఖము—6) 204, 205

ఈ హస్తమునందు తర్జనివ్రేలు దీర్ఘముగా నున్నచో సూచీముఖహస్తమగును; దీనియందలి తర్జని ఊర్ధ్వాననము, నతము, లోలము, కంపితము, జృంభితము, ఉద్వాహితము, చలము అని యేడు రీతులగును. 206

మీదికెత్తినది ఊర్ధ్వాననము; మొగము వంగినది నతము; ప్రక్కకు పోయినది లోలము; కదలుచున్నది కంపితము; కొంచెముగా వంచి చాచినది జృంభితము; మీదికి పోవునది ఉద్వాహితము; ఇచ్ఛానుసారముగా పోవునది చలము. 207, 208

పృథక్స్మిథః ప్రభేదాయ వినియోగేషు యుజ్యతే ;
ఊర్ధ్వాస్యా తర్జనైకత్వ యష్టి ఘోణ గ్రహాదిషు. 204

ఊర్ధ్వావలోలాచ భవేత్ వామమండలవర్తినీ
చక్రే తథాభిదే శస్త్ర కులాల రథ దేహినామ్. 210

గ్రహణే సర్వలోకస్య వృత్తమండలయోరపి
గండేఽనుకుండలే సౌదామన్యాం స్ఫురితకంపితా. 211

ఉత్కృష్టాతు పతాకాయాం, మంజర్యాం కంపితా మతా
మీనాది వక్రసంచారే పార్శ్వాత్ పార్శ్వాంతరం గతా. 212

అంగుష్ఠోపహితా ధూపదీపయోః కాకపక్షకే
అలాబ్వాదిషు వల్లీషు ద్రాక్షాదిషు లతాస్వపి. 213

పల్లవే పతనే వక్రభావే బాలభుజంగమే ;
వినతా సృక్కసంపన్నా వరాహాదిషు దంష్ట్రిషు. 209

వామతో దక్షిణం యావత్ ప్రోన్నతా వినతా క్రమాత్
ఉదయాస్తమయా దీర్ఘగమనాత్ సూచయత్యసౌ. 215

వాక్యం నిరూపయత్యాస్యాభ్యగ్రే కుంచితజృంభితా
కుండలాంగదయోః స్పర్శే కుంతలానాం ప్రసాధనే. 216

స్వేదస్యమార్జనే పత్రభంగాదౌ చ ప్రసారితా[1]
ఉత్కంపనసహితా సైవ భ్రామితా రోషదర్శనే. 217

1. 'ప్రసారితః' అనునది అపపాఠము.

పరస్పరభేదమేర్పడుటకై వినియోగములందు దీనిని ప్రత్యేకముగా చూప దగును.

ఊర్ధ్వాననతర్జని—బెదరించుట, ఒక సంఖ్యను దెలుపుట, చేతికర్రను, ముక్కును పట్టుకొనుట మున్నగువాని కుపయోగించును. 209

ఎడమునుండి కుడికి వలయాకారముతో కదలుచు సాగి యీ వ్రేలు, చక్రాయుధము, కుమ్మరిసారె, బండిచక్రము, దేహమండలి చక్రములు(?), అన్నిలోకములను సూచించుట, వర్తువతనము, గుండ్రన — వీనియందు వచ్చును. కుండలములతో గూడిన చెక్కిలి, మెరుపు—వీనియందు అదరు, వణకులతో దీనిని చూపదగును. 210, 211

జెండాను సూచించుటకు తర్జని చక్కగా మీదికెత్తదగును; పొటమరించిన చిగురుమొలకయందు ఇది కంపితము గావలయును; చేపలు మున్నగువాని వంకర నడకకు దీనిని ఒకప్రక్కనుండి వేరొకప్రక్కకు సాగింపవలెను. 212

బొటనవ్రేలిమీద ఒరగియున్న యీ వ్రేలు ధూపదీపములిచ్చుట, కాకిరెక్కలవంటి జులుపాలు, సొర మొదలగు అలములు, ద్రాక్ష మొదలగు తీగలు, చిగురాకు, క్రిందపడుట, వంకరతనము, పాముపిల్ల—వీనికి తగును; పంది మొదలైన కోరలుగల జంతువులకు సెలవివద్ద వంగిన యీ వ్రేలుపయోగింపదగును. 213, 214

మీదికి లేచిన, వంగిన తర్జని ఎడమనుండి కుడిప్రక్కకు క్రమముగా దీర్ఘముగా పోవుచు ఉదయాస్తమయములు తెల్పును. 215

ముఖసమీపమున వంగిసాగిన యిది మాటను నిరూపించును. కుండలములను, భుజకీర్తులను తాకుట, తలవెండ్రుకలను సవరించుట — వీనియందుపయోగించును. 216

ఇది చాచబడినచో చెమటతుడుపుసకు, పత్రభంగములు మొదలగునవి వ్రాయుటకు తగును; దీనినే వడకించుచు త్రిప్పినపుడు రోషమును సూచించును. 217

స్యాత్తదేతి స ఇత్యాదౌ సైవోత్తానీ కృతా పునః
క్రోధేన రిపునిర్దేశే కోఽసావితి నిరూపణే. 218

అగ్రగా కథితా తత్ర వస్తునశ్చ దవీయసః,
తిరశ్చ కర్ణకండూతౌ, సంగమే సంగతాఽన్యయా. 219

విశ్లేషితా వియోగే స్యాత్ కలహే స్వస్తికీ కృతా;
[1]మిథః శృంఖలితా బంధే తాలమాత్రాంతరాలయోః. 220

స్వసంముఖ పరాఙ్ముఖ్యోః దక్షిణం గతయోర్ద్వయోః
[2]సూర్యస్యాస్తమయ స్సూర్యో భాగ స్తస్య హి దక్షిణః. 221

ఏవం వామే శశాంకస్య భాగ స్తస్య హి సమ్మతః
భ్రాంతాగ్రాధోముఖీ యత్ర కూపావర్త శిలాదిషు. 222

సంగతాధోముఖీ ఫాలే త్ర్యంబకస్య నిరూపణే
తత్రైవ తిర్యగుత్తానా సహస్రాక్షస్య సూచనే. (సూచీ–7) 223

---

1. ఇది నృత్తహస్తవినియోగమగును గాని నృత్తహస్త వినియోగముగా తోపదని పరిష్కర్త యభిప్రాయము. విస్తరమునకు మూలమున వారి సూచిక చూడుడు. (పు. 39)

2. ఈ శ్లోకార్థము స్పష్టమే కాని వాక్యరచన ఒడుదుడుకుగా నున్నది. 'సూర్యస్యాస్తమయే సూర్యేః తస్యహి సవ్యత–' అని యుండదగునని పరిష్కర్త సూచన.

అదే మీదికెత్తినపుడు, 'కానీ—అప్పుడు—వాడు' ఇత్యాదులందు, క్రోధముతో శత్రువును చూపునపుడు, 'ఎవఁడువాఁడు?' అని నిరూపించుటకును ప్రయోగింప దగును 218

ముందరికి సాగినది దూరముననున్న వస్తువును, అడ్డముగానుండినది చెవి గోకి కొనుటను తెలుపును; ఇంకొక చూపుడువ్రేలితో కలిసినప్పుడు కూడికను సూచించును, వేరుపడినపుడు వియోగమును, ఒకదానిపై ఇంకొకతర్జని స్వస్తికమువలె నిలచినపుడు కలహమును దెలుపును, రెండు హస్తముల నడిమి కొలత ఒక తాల మంతగలిగి (అంగుష్ఠ మధ్యమాంగుళులు చాచిపట్టినప్పటి నిడివి తాలము) చూపుడువ్రేళ్లు రెండును సంకెలవలె ఒకదానినొకటి పట్టుకొనినప్పుడు బంధమును వెలువరుచును 219, 220

నర్తకులకెదురుగా వెనుదిరిగిన రెండు తర్జనివ్రేళ్లును కుడిప్రక్కకు తార్చినచో సూర్యునిని, అతని యస్తమయమును దెలుపును, కుడిభాగము సూర్యునిదిగనుక, ఇట్లు ఎడమప్రక్కకు చేర్చినపుడు చంద్రునిని, అతని యస్తమయమును సూచించును, అది అతనిభాగముగనుక.

వ్రేలితుది తిరుగుచు క్రిందిమొగమైనపుడు నూయి, సుడిగుండము, బండ మున్నగువాని కుపయోగించును. 221, 222

రెండువ్రేళ్లును కలిసి క్రిందుమొగమైనప్పుడు ఫాలమును, ముక్కంటిని సూచించును, అట్లే అడ్డముగా మీదికి తిరిగినచో సహస్రాక్షుని దెలుపును 223

(సూచి—సూచీముఖము—7)

అంచితాఽంగుష్ఠసంలగ్నా చంద్రలేఖేవ తర్జనీ
నిమితాఽనామికా, మధ్యాకనిష్ఠే వలితోర్ధ్వగే. 224

యత్రాసౌ శుకతుండః స్యాత్ యథార్థాఖ్యో, విసర్జనే
ఆవాహనే ధిగిత్యుక్తౌ నాహమిత్యాది దర్శనే. 225
(శుకతుండః—8)

అంగుష్ఠతర్జనీమధ్యాః సంగతాగ్రాః పరస్పరమ్
విరలోర్ధ్వే పరేయత్ర మతో హంసాస్య ఇత్యసౌ. 226

శ్లక్ష్ణత్వం మృదుతాఽల్పత్వం మర్దనక్షేపణాదిషు
కించిత ప్రస్పందమానాదౌ యథాయోగం విధీయతే. 227
(హంసాస్యః—9)

కటకాముఖమధ్యాది కనిష్ఠాంతాః అధో యదా
తలమధ్యస్థితాగ్రాః స్యుః కపిత్థోఽసౌ నిగద్యతే. 228

తోమరాసి గదా చక్ర కుంత సాయక శక్తిషు
[1]చురికాస్ఫోటనే సత్యే పథ్యే శ్రేయసి వేష్యతే. (కపిత్థః—10) 229

తర్జన్యపి తలస్థాగ్రా కపిత్థస్య సముచ్ఛ్రితః
అంగుష్ఠస్తు యదా హస్తః శిఖరః కీర్తిత స్తదా 230

గ్రహణే కుశపాశాదౌ[2] శక్తితోమరమోచనే
కాంతానాం కుంతలోత్క్షేపే చరణాధర రంజనే. (శిఖరః—11) 231

అంగుల్యో యత్ర సాంగుష్ఠాః విరలా కుంచితోర్ధ్వగాః
ఆసన్నాగ్రప్రదేశాః స్యుర్దరహాస సరోజవత్. 232

---

1. 'ఛదికాస్ఫోటనే' అని ఒక వ్రాత ప్రతి; వస్త్రమును విదిలించుట అను నర్థము వచ్చును. ఇదే సరియైనది గాబోలు
2. 'కాశపాశాదౌ' ముద్రితపాఠ 'కాశ' అస్పష్టము. 'రశ్మికుశాంకుశధనుషాం' అని భరతనాట్యశాస్త్ర పాఠము. (కాశీము 116-51) కనుక నాయీమార్పు సూచన.

బొటనవ్రేలితో చంద్రరేఖవలె వంకరగానున్న తర్జని చేరుకొని, అనామిక వంగి, నడిమి—చిటికెనవ్రేళ్లు వలితములై మీదికి సాగియున్నచో అది శుక తుండము — చిలుకముక్కు — అను సార్థకనామము గల హస్తము; ఇది విడిచి పుచ్చుట, ఆవాహించుట, చీగొట్టుట, నేను గాననుట—ఇత్యాదులను చూపుట కుపయోగించును. (శుకతుండము—8) 224, 225

బొటన-చూపుడు-నడిమివ్రేళ్లు తుదలం దొండొకటితో కూడియుండి, తక్కిన రెండును విడిగా పైకెత్తుకొనియున్న హస్తము హంసాస్యము;

ఇది సన్నదనము, మెదువు, కొంచెము, పిసుకుట, తీసివేయుట, ఇంచుక కదలు వస్తువులు—మొదలగువానిని సూచించుటకు యథాసంభవముగా విధింప బడును. (హంసాస్యము—9) 226, 227

కటకాముఖ హస్తమందు నడిమి, అనామిక, చిటికెన-వ్రేళ్ళకొనలు అడుగు భాగము నడిమిదాక వంగియుండిన అది కపిత్థమనబడును; ఇది ఇనుపగుదియ, కత్తి, గద, చక్రాయుధము, ఈటె, బాణము, పొడుగైన బల్లెము—వీనియందు, చురకత్తితో పగులగొట్టుటయందు (?) సత్యము, పథ్యము, శ్రేయస్సు — వీని యందును తగును. (కపిత్థము—10) 228, 229

కపిత్థహస్తమందలి తర్జనిగూడ కొన క్రిందికివంగియున్న, అంగుష్ఠము పైకెత్తి యుండిన, అది శిఖరహస్తము; దర్భలు, త్రాడు మొదలగువానిని పిడికిలించు టకు, శక్తిని, తోమరమును విసరుటకు, స్త్రీల కురులను విదిలించుటకు, పాదము లకు, అధరములకు వన్నెపూయుటకు ఇది తగినది. (శిఖరము—11) 230, 231

అంగుష్ఠముతోడ అన్నివ్రేళ్లును విడివడి, కొంచెము వంగి, మీదిమొగమై, కొసలొండొంటికి చేరువగా, ఇంచుక విచ్చిన తామరపూవువలె, ఉండెనేని అది

పద్మకోశః స విజ్ఞేయో బాలికాకుచదర్శనే
కపిత్థశ్రీఫలాదీనాం గ్రహణేచాఽయమిష్యతే. (పద్మకోశః—12) 233

హంసాస్యస్య నతాఽనామా విశ్లిష్టాగ్రా త్రికాగ్నివత్
యత్రాంగుష్ఠాదయస్త్రిస్రః స కాంగూలోఽభిధీయతే. 234

శిశూనాం చిబుకస్పర్శే స్వల్పకే తరుణేఫలే
స్యాద్వధూరోషవాక్యేషు సోఽంగులిక్షేపణైః పునః. 235
(కాంగూలః—13)

శిఖరస్య యదాంగుష్ఠో మధ్యమాం పీడయన్ స్థితః
తదా ముష్టిరితి ఖ్యాతః, ఖడ్గకుంతాది ధారణే. 236

ప్రహారే గాత్రసంవాహే రసనిష్పీడనాదిషు
నిష్పీడే దోహనేఽంగుష్ఠః తాసాం గర్భస్థితోఽపి చ. 237
(ముష్టిః-14)

శ్లిష్టప్రసారితా స్తిస్రః కనీయస్యున్నతా తథా
మధ్యమా మూలగోంగుష్ఠో యద్యేవం చతురస్తదా. 238

స్యాదేకేనాల్పమధ్యాది ద్వాభ్యాం పద్మదలాక్షిణీ
కించిన్మండలగత్యాతు తాభ్యాం తత్త్వత్రపాదికమ్. 239

ఊర్ధ్వగేన సితం, రక్తం మండలేన కరేణ తు
పీతం నీలం తథావర్ణం మృదితేన ప్రదర్శయేత్. (చతురః—15) 240

లగ్నాగ్రౌ మధ్యమాంగుష్ఠౌ తర్జనీ కుంచితా మనాక్
విరలోర్ధ్వే పరేయత్ర భ్రమరస్యోఽభిధీయతే. 241

దీర్ఘనాలాబ్జ కహ్లార కుముదోత్పల ధారణే
ప్రసాధనే మృగాక్షీణాం కర్ణపత్రప్రధారణే. (భ్రమరః—16) 242

పద్మకోశము ; ఇది బాలికల స్తనములను చూపుట, వెలగ, మారేడు మున్నగు పండ్లను పట్టుకొనుట — వీనియందుపయోగించును. 232, 233

(పద్మకోశము—12)

హంసాస్యహస్తమందలి ఉంగరపు వ్రేలు వాలి, అంగుష్ఠము మొదలైన మూడువ్రేళ్లును, మూడగ్నులవలె, కొనలు విడివడియుండినచో అది కాంగూల హస్తమనబడును ; ఇది చిన్నబిడ్డల గడ్డము పుడుకుటకును, స్వల్పవిషయము లకును, క్రొత్తఫలములకును, ఉపయోగించును ; స్త్రీల రోషవాక్యములందు వ్రేళ్లు విదిలించుచు దీనిని ప్రయోగింపవలయును. 234, 235

(కాంగూలము—13)

శిఖరహస్తమందలి బొటనవ్రేలు నడిమివ్రేలి నొత్తిపట్టిన హస్తము ముష్టి యనబడును ; కత్తి, యీటె, మున్నగువానిని పట్టుకొనుట, గ్రుద్దుట, ఒడలు పిసుకుట, రసముసు పిండుట, మొదలగునవి, ఒత్తుట, పాలు పితుకుట — వీని యందుపయోగించును ; ఈ హస్తమున అంగుష్ఠము వ్రేళ్ళలోనికి చొచ్చుటయు కలదు. (ముష్టి—14) 236, 237

మూడు వ్రేళ్లు చేరికగానుండి చాచబడి, చిటికెనవ్రేలు పైకిలేచి, అంగుష్ఠము నడిమివ్రేలి మొదటిని చేరియున్న హస్తము చతురము.

ఒకచేత చిన్ననడుము మొదలగునవి, రెండు చేతులతో తామరరేకులను, కన్నులను సూచింపదగును ; రెండు చేతులను ఇంచుక గుండ్రముగా త్రిప్పుచు తత్వము, సిగ్గు మొదలగునవి చూపనగును ; హస్తమును మీదికెత్తి తెల్లవన్నె, త్రిప్పి ఎరుపు పసపులను, రెండు చేతులను రాచి నీలవర్ణమును ప్రదర్శింపనగును. (చతురము—15) 238, 239, 240

మధ్యమాంగుష్ఠముల కొనలు తగులుకొనియుండి, తర్జని ఇంచుక వంగి, తక్కిన రెండు వ్రేళ్లును విరళములై ఎగుమొగముగా నుండెనేని అది భ్రమర హస్తము ; పొడువైన కాడగల కమలము, సౌగంధికము, తెల్ల-నల్ల కలువ పూవులను పట్టుకొనుట, స్త్రీల తిలకము వంటి యలంకారము, చెవికమ్మలను ధరించుట - వీని కుపయోగించును. (భ్రమరము—16) 241, 242

విరలే వలితోర్ధ్వాశ్చేత్ మధ్యాద్యాః ఫణిమస్తకే
అరాలః సత్త్వశౌండీర్య ధైర్యగాంభీర్య కాంతిషు. 243

వారణే సౌరభాఘ్రాణే స్వేదాపనయనాదిషు
కేశసంగ్రహణోత్కర్ష లీలయోశ్చ నతభ్రువామ్. 244

(అరాలః—17)

పతాకాంగులయస్త్రిస్రో మూలేష్వవనతా మనాక్
కనీయసూర్ధ్వగా యత్ర స కరో హంసపక్షకః. 245

స్పర్శేఽనులేపనే గండసంశ్రయే స్యాత్ ప్రతిగ్రహే
ఆవాపే గాత్రసంవాహే రోమాంచ ప్రముఖేష్వసౌ. 246

(హంసపక్షకః—18)

భుజంగశిరసోంగుష్ఠో యదాస్యాద్ద్విర విచ్యుతః
ఖ్యాతోఽర్ధ చంద్రనామాసౌ బలనిర్ఘాటనే తదా 247

కలశేందుకలా కాంచీ మధ్య కుండల కంబుషు
యథాయోగం కృశాంగీనాం లీలాదౌచ విధీయతే. 248

(అర్ధచంద్రః—19)

అరాలస్య యదాంగుష్ఠ తర్జన్యోస్సంగతిస్తదా
సందంశస్త్రివిధః సోఽపి స్యా దగ్రముఖపార్శ్వజః. 249

అన్యోన్య నఖసంశ్లేషా దగ్రసందంశకో భవేత్
గ్రథనేఽపచయే సూక్ష్మపుష్పాణాం, గ్రహణే పునః 250

సూత్రకేశ తృణాదీనాం, శల్యాద్యుత్పాటనాదిషు,
ముఖసందంశకస్తద్వత్ సంశ్లేషాదగ్రపర్వణోః. 251

వితర్కేఽసౌ ధిగిత్యుక్తౌ వృంతాత్ ప్రసవమోచనే,
ప్రవాలరచనావర్తిశలాకాలేఖ్య కర్మసు. 252

లాక్షానిష్పీడనే నేత్రరంజనాదౌ ప్రజాయతే
ముక్తాదివేధనే బాణే బ్రహ్మసూత్రస్య మార్జనే 253

సర్పశీర్షహస్తము విరళముగానుండి, నడిమివ్రేలు మొదలగునవి వంగి ఊర్ధ్వముగానుండిన అది అరాళము, ఇది సత్తువ, గర్వము, ధైర్యము, గాంభీర్యము, కాంతి, నివారించుట, సుగంధము, మూర్కొనుట, చెమట తుడుచుట మున్నగు వానియందు, స్త్రీల కురులు లీలగా పట్టుకొనుట, మీదికెత్తుటలయందు తగినది.
(అరాళము—17) 243, 244

పతాకహస్తమునందలి మూడువ్రేళ్ళు కొంచెముగా మొదళ్ళయందు వంగియుండి, చిటికెనవ్రేలు మీదికెత్తియుండిన అది హంసపక్షహస్తము; తాకుట, చెక్కులపూతపూయుట, పుచ్చుకొనుట, చెట్లపాది, ఒడలు పట్టుట, పులకరించుట మున్నగువానికిది ప్రయుక్తము. (హంసపక్షము—18) 245, 246

సర్పశీర్షహస్తపు బొటనవ్రేలు దూరముగా విడివడినచో అది అర్ధచంద్రమనబడును; ఇది బలవంతముగా వెడలగొట్టుట, కలశము, చంద్రకల, మొలనూలు, మొల, కుండలములు, శంఖము — వీనియందును, యథాయోగముగా స్త్రీల లీల మొదలగు భావములందును ప్రయోజ్యము. (అర్ధచంద్రము—19) 247, 248

అరాళహస్తమందలి అంగుష్ఠతర్జనులు కలిసినచో సందంశమగును. అది మూడు తెరగులు; అగ్ర-ముఖ-పార్శ్వసందంశములని.

రెండు వ్రేళ్ళ గోళ్లు ఒకటొకటితో చేరినది అగ్రసందంశము; చిన్నపువ్వులను కూర్చుట, చిదుముట, దారము, వెంట్రుక, కసవు మొదలగువానిని పట్టుకొనుట, ములికి మొదలగువానిని పెరుకుట మున్నగు పనులు — వీనియందిది ప్రయోగింపదగును.

అట్లే కడపటి గణుపులు రెండును గలిసినది ముఖసందంశము; ఇది సంశయించుట, చీగొట్టుట, తొడిమనుండి పూవు మొదలగువానిని విడిపించుట, చిగుళ్ళ పనితనము, కుంచె-వాగరలచే చిత్తరువు వ్రాయుట, లత్తుకరసము పిండుట, నేత్రరంజనము మున్నగుచోట్ల సంభవించును; ముత్యము మున్నగు వానికి తూటు వేయుట, బాణప్రయోగము, జందెమును తుడుచుట, గురి

లక్ష్యే ధ్యానే గుణాదౌ చ సద్వితీయో భవేదసౌ
తథైవ పార్శ్వ సంశ్లేషాత్ సందంశః పార్శ్వజో మతః. 254

సదోషవచనం కుత్సామసూయా పేలవాదిచ
హస్తప్రయోగనిపుణో వామేనానేన దర్శయేత్. 255

(సందంశః—20)

పంచాప్యంగులయో యత్ర సంగతాగ్రాః సముచ్ఛ్రితాః
ముకులోఽసౌ సరోజాది ముకులానాం నిరూపణే. 256

అర్చనే దేవతాదీనాం బలౌ కాముక చుంబనే
వలయామోచనే పంచసంఖ్యాయాంచాయ మిష్యతే. 257

(ముకులః—21)

అంగుల్యః పద్మకోశస్య నితాంతావనతా యది
ఊర్ణనాభో భవేదేషాం (దేష?) శిరః కండూయనే కరః. 258

కషాశ్మ చౌర్య కేశాదిగ్రహే కుష్ఠస్య దర్శనే
చిబుకే, స్వస్తికీభూతా శ్వాపదానాం నిరూపణే. 259

(ఊర్ణనాభః—22)

ఆవర్తిన్యః కనిష్ఠాద్యాః విరలాః పృష్ఠగాః క్రమాత్
యస్మిన్నంగులయః సోఽయం సముద్దిష్టోఽలపల్లవః. 260

కస్యత్వమితి నాస్తీతి ప్రతిషేధాయ భాషణే
శూన్యే చ వచనే స్త్రీణామాత్మ సంభావనేఽపి చ ;
అలపద్మమముం ప్రాహుశ్చలపద్మానుకారతః. (అలపల్లవః—23) 261

భ్రమరస్య యదాఽనామ కనీ.చుస్యా తలే స్థితే
తామ్ర మూడ స్తదాజ్ఞేయః కుక్కుటేఽల్ప నిరాకృతా. 262

సశబ్ద విచ్యుతస్తాలే శైఘ్ర్యే విశ్వాసనే తుణే
ఆహ్వానే బాలకాదీనాం భర్త్సనే నృపజృంభణే. 263

(తామ్రచూడః—24)

చూచుట, ధ్యానము, దారము - మున్నగుచోట్ల రెండవచేతితో గూడుకొని వచ్చును;

అట్లే వ్రేళ్ళప్రక్కలు కలిసినది పార్శ్వసందంశము; తప్పు చూపిచెప్పుట, గర్హించుట, అసూయ, పనికిరానివస్తువు మున్నగువానిని, హస్తప్రయోగమున నైపుణ్యముగలవాడు, ఎడమచేత దీనితో చూపవలెను.
(సందంశము—20) 249, 250, 251, 252, 253, 254, 255

ఐదువ్రేళ్లను కొనలు కలిసి యెగు మొగముగా నున్నది ముకులహస్తము; ఇది తామర మొదలగు మొగ్గలను చూపుట, దేవతాదులను అర్చించుట, పూజా ద్రవ్యములర్పించుట, కాముకుల ముద్దు, గాజులు తొడుగుట, ఐదను లెక్క—వీనియందుపయోగించును. (ముకులము—21) 256, 257

పద్మకోశహస్తాంగుళులు చాల వంగియున్నచో అది ఊర్ణనాభము; ఇది తల గోకుకొనుట, సానరాయి, దొంగలించుట, వెంద్రుకలు మొదలగువానిని పట్టు కొనుట, కుష్ఠరోగము సూచించుట, గడ్డము — వీనికుపయోగించును; హింస్ర జంతువులను చూపునపుడు రెండుచేతులను స్వస్తికము చేయవలెను. 258, 259
(ఊర్ణనాభము—22)

చిటికెన మొదలుగా వ్రేళ్ళు విడివిడిగా, క్రమముగా లోనికి ముడుచుకొను చున్నచో అది అలపల్లవము; 'నీవెవరివాడవు?' అను ప్రశ్న, 'లేదు', 'వలదు' అనుమాట, శూన్యవాక్యము, స్త్రీలు తమ్ముగూర్చి గొప్పగా చెప్పుకొనుట— వీనికి ఇది వచ్చును. కదలుచున్న కమలమువలె నుండును గనుక దీనిని 'అలపద్మము' అనియు నందురు. (అలపల్లవము—23) 260, 261

భ్రమరహస్తముయొక్క ఉంగరపు-చిటికెనవ్రేళ్లు అరచేతి నంటియున్నచో తామ్రచూడహస్తము; ఇది కోడి, అల్పజంతువులనదలించుట, చిటికెవేసి విడి వడినప్పుడు తాళము, త్వర, నమ్మించుట, క్షణము, బాలకులు మొదలైనవారిని పిలుచుట, దొరగారి ఆవులింత-వీనికి తగును. 262, 263
(తామ్రచూడము—24)

## సంయుక్తహస్తాః

పతాకతలయోః శ్లేషాదంజలిః ప్రణతౌ క్రమాత్
భూదేవ గురుదేవానాం వక్షోవక్త్రశిరః స్థితః. 264
క్రోధేచ పరిహాసేచ నాస్త్యయం నియమః పునః. (అంజలిః—1)

స్వస్తికాకారతాశ్లిష్టౌ భవేతాం కటకాముఖౌ. 265
మణిబంధప్రదేశే చేత్ కటకావర్ధమానకః
అన్యోన్యాభిముఖంచైనం కేచిదాహుర్మనీషిణః. 266
అసౌ శృంగారకార్యేషు తాంబూలగ్రహణాదిషు
రుష్టప్రాణేశ్వరీపాదప్రణామేష్వపి చేష్యతే. 267
(కటకావర్ధమానః—2)

స్యాదరాళీకృతసోఽయం వామపార్శ్వగతో యదా
ఉత్తానశ్చ తదా జ్ఞేయః స్వస్తికో మునిసమ్మతః 268
దీర్ఘవస్తు వనోత్తుంగ భూపి స్త్రీర్ణాంబుదావ్యయోః
విచ్యుతేన నృణాం యోజ్యాః పతాకేన తు యోషితామ్. 269
(స్వస్తికః—3)

కరయోః కరశాఖాః స్యురన్యోన్యాంతర నిర్గతాః
యత్రాసౌ కర్కటో జ్ఞేయో, జృంభితే హనుధారణే
స్థూలాంగే గ్రహణే కంబోః అలస్యాచ్చాంగమోటనే. 270
(కర్కటః—4)

అన్యోన్య పార్శ్వ సంశ్లేషాత్ కపోతస్సర్వ శీర్షయోః
వృక్షస్థశ్చావగంతవ్యో గురుసంభాషణే తు సః. 271
వినయే ప్రాఙ్ముఖః స్త్రీభిః కంపితో భయశీతయోః
కూర్మకం కథయంత్యేనమపరే కూర్మకాకృతిమ్. (కపోతః—5) 272

## సంయుక్తహస్తములు

పతాకహస్తమునందలి అరచేతులు కలిపినచో అంజలి; ఇది ప్రణామమునందు—బ్రాహ్మణుల విషయమున పెస్సునను, గురువువిషయమున ముఖమునను, దేవతల విషయమున తలమీదను—చూపదగును; కాని కోపమున, పరిహాసమున ఈ నియమము లేదు. (అంజలి—1) 264

కటకాముఖహస్తములు మనికట్టుమీద ఒకటిపైనొకటి స్వస్తికాకారముతో నుండిన అది కటకావర్ధమానము; రెండుచేతులు ఎదురుబదురుగా ఉండవలెనని కొందరు పండితులు చెప్పుదురు; ఇది తాంబూలము పుచ్చుకొనుట, మొదలగు శృంగారకార్యములందు, అలిగిన ప్రియురాండ్ర పాదములకు మ్రొక్కుటలందును ప్రయోగింపదగినది. (కటకావర్ధమానము—2) 265, 266, 267

ఇదే అరాళముగా చేసి, వెలికిలిగా ఎడమప్రక్కకు తీసికొనిపోయినచో స్వస్తికహస్తమగునని భరతముని మతము; పురుషులు దీనితో పొడువైన వస్తువులు, అడవి, ఎత్తైనవి, భూమి, వెడలుపైనవి, మేఘములు, ఆకాశము - వీనిని, చేతులు విడదీసి చూపవలెను; స్త్రీలు పతాకహస్తములతో సూచింపనగును. (స్వస్తికము—3) 268, 269

రెండుచేతుల వ్రేళ్ళు ఒండొంటి సందులలో దూరి బైటికి వెడలియున్న హస్తము కర్కటము; ఇది ఆవులింత, కటమరను పట్టి నిలుపుట, స్థూలాంగము, శంఖమును పట్టుకొనుట, సోమరితనముతో ఒడలు విరుచుకొనుట - వీనియందు వర్తించును. (కర్కటము—4) 270

సర్పశీర్షహస్తములు రెండును ఒండొంటి ప్రక్కలను చేరియుండిన అది కపోతము; గురువులతో మాటలాడునప్పుడు, వినయమునందు, ఇది రొమ్మమీద ముందుమొగముగా నుండదగును; భయమందు, చలియందు స్త్రీలు దీనిని వడకించుచు ప్రయోగింపనగును. ఇది తాబేటివలె నుండును గాన ఇతరులు దీనిని కూర్మకమని పేర్కొనిరి. (కపోతము—5) 271, 272

కూర్పరాభ్యంతరే ధృత్వా భుజం వామేన దక్షిణమ్
అన్యం ముష్టికృతం వామే కూర్పరాభ్యంతరే న్యసేత్. 273

యద్వైతన్నిషధః సోయం స్తంభాశ్లేషే భయే భవేత్
ఔత్సుక్య సౌష్ఠవాటోప స్థైర్య గర్వమదాదిషు. 274

భట్టాభినవగుప్తోఽస్య లక్ష్మ దూరాంతరం జగౌ
వేష్టితః స్యాత్కపిత్థేన ముకులో నిషధస్త్వితి,[1]
నిరుక్తి వినియోగాభ్యాం వ్యాఖ్యాయాం వ్యక్తమబ్రవీత్. 275

అనేన వర్త్మనా యాతా స్త్వన్యతంత్రవిధాయినః
పూర్వలక్షణమేవాస్య మేనే కీర్తిధరః పునః. (నిషధః—6) 276

అరాలౌ సర్పశీర్షౌ వా వ్యత్యాసాద్భుజయోః స్థితౌ
ప్రకోష్ఠ స్వస్తికౌ తావదుత్సంగః స్యాత్ స్వసమ్ముఖౌ. 277

నిష్పీడామర్ష రోషేషు పరోక్షస్పర్శశీతయోః
కంఠాశ్లేషే వరోరూణాం ఈర్ష్యాయాం కుచగోపనే. 278
(ఉత్సంగః—7)

అంసకూర్పరయోర్మధ్యే ధారయేతే పరస్పరం
భుజంగ శిరసీ యత్ర గజదంత స్సకీర్తితః
భారస్తంభగ్రహేచైవ శైలాద్యుత్పాటనే మతః. 279
(గజదంతః—8)

అధివక్షోంచితౌ స్యాతాం శుకతుండౌ పరాఙ్ముఖౌ
శనైర్వర్తనయాఽధస్తాత నీతౌ యస్మిన్నధోముఖౌ
సోఽవహిత్థో భవేత్ కార్శ్య శ్వాసోత్కంఠాదితానవే. 280
(అవహిత్థః—9)

ఆస్కంధాభ్యామధః స్యాతాం పతాకౌ పార్శ్వలంబినౌ
యస్మిన్నేష భవేద్దోలో విషాదే సంభ్రమే మదే
అభిఘాతామయావేగ మూర్ఛాశస్త్రక్షతాదిషు. (దోలః—10) 281

---

1. భ. నా. శా. అభి. భా., సం. 2. పు. 60.

ఎడమచేతితో కుడిభుజమును మోచేతివద్ద పట్టుకొని, కుడిచేతిని ముష్టిగా చేసికొని యెడమ మోచేతిలోపల నిలుపవలెను ; అప్పుడది నిషధము ; ఇది భయ పడి కంబమును తబ్బుకొనుట, విళంబమునోర్వలేమి, నిండుటుందనము, పెద్దరికము, దిట్టతనము, పొగరు, మదము మొదలగువాని కుపయోగింపదగును. 273, 274

'కపిత్థహస్తముచే ముకులహస్తమును చుట్టిపట్టుట నిషధహస్తము' అని అభి నవగుప్తభట్టాచార్యుడు దీనిలక్షణమును చాల భిన్నముగ వచించెను ; టీకలో దీనిపేరు నిర్వచనముచేసి వినియోగమును తెలిపి స్పష్టపరచినాడు. 275

ఈ త్రోవనే యితరగ్రంథకర్తలును నడిచినారు ; కాని కీర్తిధరాచార్యుడు మొదటిలక్షణమే దీనికంగీకరించెను. (నిషధము—6) 276

అరాళహస్తములు గాని, సర్పశీర్షములు గాని, మనికట్టులమీద స్వస్తికముగా నుండి అభినేతకెదురుగా, తారుమారుగా భుజములందు నిలిచినచో అది ఉత్సంగము ; ఇది గట్టిగా ఒత్తుట, అక్కసు, రోషము, పరోక్షమందు తాకుట, చలి, స్త్రీల కంఠాలింగనము, ఈర్ష్య, స్తనములను మరుగుపరుచుట—వీనియందు వచ్చును (ఉత్సంగము—6) 277, 278

సర్పశీర్షహస్తములు రెండును తారుమారుగా మూపు-మోచేతుల మధ్యమును పట్టుకొన్నచో అది గజదంతహస్తము ; భారము మోయుట, కంబమును పట్టు కొనుట, కొండ మొదలగువానిని పెరికియెత్తుట—వీనికుపయోగించును. 279
(గజదంతము—8)

శుకతుండహస్తములు రెండును ఎదమీద కొంచెమేటవాలుగా, వెనుకమొగ ముగా నిలిపి, తిన్నగా క్రిందికి దించుట అవహిత్థము ; ఇది దౌర్బల్యము, నిట్టూర్పు, ఉత్కంఠ మున్నగువానివలన కలుగు కృశత్వము — వీని కుప యుక్తము. (అవహిత్థము—9) 280

మూపులనుండి పతాకహస్తములు పార్శ్వములందు దిగబడియుండునది దోలము ; ఇది విసుగు, సంభ్రమము, మదము, దెబ్బ, రోగములవలన కలిగిన తొందర, మూర్ఛ ఆయుధపుపెట్టు మున్నగుచోట్ల నగును. (దోలము—10) 281

మిథః కరభయోః శ్లిష్టౌ భుజంగ శిరసౌ యదా
తదా పుష్పపుటః ప్రోక్తో యాఙ్ఞాయాం దేవతార్పణే
పుష్పపానీయ ధాన్యానాం ఫలాన్యాణామపిధారణే. 282
(పుష్పపుటః—11)

పరాఙ్ముఖౌ హంసపక్షౌ వర్ధమానః స ఉచ్యతే;
ద్వారవాతాయనోద్ఘాటే స్వస్తికే భూయ విచ్యుతః. 283

రిపూరఃపాటనాద్యేషు నైకట్యాత్ విచ్యుతస్సమః
భుజంగశిరసాచైనం కీర్తయంత్యపరే బుధాః. (వర్ధమానః—12) 284

పతాకావున్నతాంగుష్ఠౌ స్యాదీర్ఘాగ్రావధః స్థ(స్త?)లౌ
మణిబంధాగ్ర విన్యాసౌ స్యాతాం చేన్మకరః స్మృతః. 285

తరక్షువ్యాలసింహానాం నక్రాద్యంబునివాసినాం
క్రవ్యాదానాం నదీపూరప్రభృతీనాం చ దర్శనే. (మకరః—13) 286

**హ స్తా నా మ న ం త త్వ మ్**

అభినేయం జగత్సర్వమనంతోऽభినయోऽప్యయమ్
య ఏవ యుజ్యతే హస్తో[1]...తత్తేషామప్యనంతతా. 287

మత్వేతి ప్రాయికం యద్యద్రూపం తత్తత్ జగౌ మునిః
అభినేయపదార్థానామాభిముఖ్యస్య సిద్ధయే. 288

అభీష్టానాంతు దృష్టార్థం(?) యస్మాదేతే కరాస్తతః
అన్యేऽపి బహవో లోకవిదితాస్సంతి తాన్ సుధీః. 289

1. ఇక్కడ రెండు పాదములంత లోపించియుండునని పరిష్కర్త యభిప్రాయము. ఉన్నట్లే అన్వయించుట కష్టము వారూహించిన లుప్తగ్రంథార్థము తెలుగులో నియ్యబడినది

చిటికెనవ్రేళ్ళక్రింది అరచేతియంచులు—కరజములు—ఒండొంటిని చేరిన సర్పశీర్ష హస్తములు పుష్పపుటము ; ఇది యాచించుట, దేవతలకు సమర్పించుట, పూలు, నీళ్లు, ధాన్యములు, తినుబండములు — వీనిని పట్టుకొనుట — ఇట్టిచోట్ల వర్తించును. (పుష్పపుటము—11) 282

హంసపక్షములు పరాఙ్ముఖములు (చూచువారి మొగము ?) గా నుండినచో అది వర్ధమానము. ఇది స్వస్తికాకారముగా విడివడియున్నచో తలుపులు, కిటికీలు తెరచుటకుపయోగించును. సమముగా, వేరుగా విడివడియున్నప్పుడు, శత్రువులయెదలను చీల్చుట మున్నగుచోట్ల పనికివచ్చును

సర్పశీర్ష హస్తమును దీనికుపయోగింపవలెనని ఇతరపండితులు వచింతురు.
(వర్ధమానము—12) 283—284

పతాకహస్తములు ఒకదానిపై నొకటి బోర్లబడి మనికట్టు మొదటనుండి, బొటనవ్రేళ్లు మీదికెత్తుకొని, తక్కినవ్రేళ్ళకొనలు విడివడియుండినచో మకర హస్తము ; సివంగి, సర్పము, సింహము, మొసలి మొదలగు జలజంతువులు, రాక్షసుడు, నదీప్రవాహము—మున్నగువానిని దెల్పును. 285, 286
(మకరము—13)

హ స్త ము ల న ం త ము లు

జగత్తునంతటిని అభినయింపవచ్చును. ఆ యభినయరీతియు అనంతమే. ఏ హస్తము దేనికితగునో [దానినే దానికుపయోగింపదగును. ఎన్నో హస్తములు తగినవై యుండును]. కనుక ఆ హస్తములును అనంతములే. 287

ఇది గమనించి భరతముని అభినయింపదగిన పదార్థములు అభిముఖములగుటకై ప్రాయికముగానున్న ఆయాహస్తరూపములను పేరుకొనెను; ఈ హస్తములు ఇష్టమువచ్చిన వస్తువులను చూపుటకే యుపయోగించునవి గనుక. లోకమున ఇంకను కొన్నిరూపములు తెలిసినవి గలవు ; వానిని దేశము, కాలము, ప్రయోగము, ప్రయోజనము — వీనినెరిగిన బుద్ధిమంతుడు, అనుకూలములై

దేశకాలప్రయోగార్థవేదీ నేత్రాదిచేష్టితైః
అనుకూలైః ప్రయుంజీత స్థాయిసంచారిసూచకైః. 290

క్వాపి నామ్నః క్వచిల్లోకాత్ కుత్రచిత్ ద్వి(త్రయోగతః
లక్ష్యం క్వచన నిశ్చేయం సంప్రదాయవశాదిహ. 291

పతాకా త్రిపతాకాద్యాః జ్ఞేయా నామతో బుధైః
ముష్టిప్రభృతయో లోకాత్, కాంగూల చతురాదయః
ద్వియోగాత్, నిషధారాలప్రముఖాః సంప్రదాయతః. 292

శ్రేష్ఠ మధ్యక నీచానాం విదధీత ప్రయోగవిత్
క్రమేణ ఫాల వక్షోఽరః క్షేత్ర చారిణః కరాన్.
యథావల్లక్షణోపేతాః ప్రయోజ్యాః శ్రేష్ఠమధ్యమైః
అధమైర్లౌకికా హస్తా అవస్థావశతః పునః. 293

ఉత్తమైరపి దర్పాది దర్శనే నీచపాత్రవత్
ప్రాప్యకాలం ప్రయోగంచ నీచైరుత్తమ మధ్యవత్,
హస్తాః కార్యా న వా కార్యాః మునేరాశయవేదిభిః. 294

### హ స్త క ర్మా ణి

వికర్షాకర్షణోత్కర్షాః నిగ్రహోఽథ పరిగ్రహః
మోక్షరక్షణ విక్షేపాః విసర్గశ్ఛేద భేదనే. 295

సంశ్లేషాహ్వాన విశ్లేషాః తోదస్తాడన తర్జనే
ధూననామోటన స్ఫోటా ఇత్యాఖ్యాతాని వింశతిః
కోవిదైః కరకర్మాణి దధత్యన్వర్థసంజ్ఞతామ్. 296

స్థాయి—సంచారిభావములను సూచించు నేత్రాది చేష్టలతోగూడ ప్రయోగింప దగును. 288, 289, 290

ఒకచో పేరు, ఇంకొకచో లోకవ్యవహారము, మరొక్కచో రెండో మూడో కలియుట, వేరొక్కచో సంప్రదాయము—వీని మూలమున ఇందు లక్ష్యమును నిశ్చయింపవలయును. 291

పతాకము, త్రిపతాకము మున్నగునవి పేరునుబట్టి, ముష్టి మొదలైనవి లోక వ్యవహారమునుండి, కాంగూలము చతురము మున్నగునవి రెంటి చేరికచేత, నిషధము అరాళము ఇత్యాదుల సంప్రదాయమువలన—తెలియదగినవి. 292

ప్రయోగమెరిగినవాడు హస్తములను, ఉత్తములకు ఫాలము, మధ్యములకు నోరు, అధములకు ఎద — ఈ క్షేత్రములందు సంచరించునట్లు చేయదగును.

ఉత్తములును మధ్యములును లక్షణము ప్రకారమే హస్తములను ప్రయో గింపవలయును ; అధములు లౌకికహస్తములను ఆయా యవస్థల ననుసరించి చూపవలెను. 293

దర్పము మొదలగువానిని చూపునప్పుడు ఉత్తములును నీచులవలె, నీచులును ఉత్తమ మధ్యములవలె, కాలమును ప్రయోగమును గమనించి, హస్తములను ప్రయోగింపవచ్చును, లేక మానవచ్చును. ఇది భరతముని యభిప్రాయము. 294

## హ స్త క ర్మ ము లు

వికర్షము (అడ్డముగా ఈడ్చుట), ఆకర్షణము (తన వద్దికి లాగుకొనుట), ఉత్కర్షము (లేవనెత్తుట), నిగ్రహము (పట్టినిలుపుట), పరిగ్రహము (స్వీక రించుట), మోక్షము (పట్టువిడుపు), రక్షణము (కాపాడుట), విక్షేపము (విసరి వేయుట), విసర్గము (క్రిందికి విడుచుట), ఛేదము (నరుకుట), భేదనము (పగుల్చుట), సంశ్లేషము (కూడుట), ఆహ్వానము (పిలుచుట), విశ్లేషము (విడివడుట), తోదము (క్రుచ్చుట), తాడనము (దెబ్బవేయుట), తర్జనము (వెరపించుట), ధూననము (విదిలించుట), ఆమోటనము (నలచుట), స్ఫోటము (చీల్చుట) — ఇట్లు సార్థకసంజ్ఞలుకల యిరువది హస్తకర్మములు కోవిదులు పేర్కొందురు. 295, 296

హ స్త క ర ణా ని

యేన క్రియావిశేషేణ విశేషోఽభినయాశ్రయః
స్వసిద్ధావనపేక్షాయాం అంగులీ చాలనాత్మనా,
క్రియతే కరణం తస్మాత్, తచ్చతుర్విధ ముచ్యతే. 297

అపవేష్టన ముద్వేష్టో వ్యావర్త పరివర్తనే
హస్తానాం కరణాన్యేవం జన్యాని జనకానిచ. 298

తర్జన్యాద్యంగులీనాం తు పూర్వమావేష్టనక్రమాత్
అంతః పాణిర్నిజాత్ పార్శ్వాత్ వక్షో గచ్ఛత్యధస్తలః
యత్ర తత్కరణం ప్రోక్తం నృత్తజ్ఞైరపవేష్టితమ్. 299

తథైవోద్వేష్టనం తాసాం కుర్వన్నుత్తానితో బహిః
వక్షసః పార్శ్వమాయాతి యస్మిన్నుద్వేష్టితం తు తత్. 300

కనిష్ఠాద్యంగులీనాం చేదంతరావర్తనం క్రమాత్
ఉత్తానితస్య హస్తస్య వక్షః ప్రాప్తస్య పార్శ్వకః (తః?)
వ్యావర్తితం తదాఖ్యాతం నృత్తవిద్యావిశారదైః. 301

తథైవ బాహ్యతస్తాసాం యత్రస్యాత్ పరివర్తనమ్
అధస్త(స్థ)స్యతు హస్తస్య వక్షసా పార్శ్వగామినః. 302

నృత్తవిద్యా రహస్యజ్ఞైః తదుక్తం పరివర్తితమ్ ;
ఏతచ్చతుష్టయం హస్తం (హస్తే) ప్రయోజ్యం నాట్యనృత్తయోః. 303

యుక్తం [1]భ్రూముఖరాగాద్యైః కరణం కుర్వతః క్వచిత్
హస్తస్యానుచరీ భూత్వా దృష్టిర్ధావతి ధావతః. 304

1. 'యుక్తా' వ్రా. ప్ర. పాఠము. అప్పుడది దృష్టికి విశేషణమగును అదే యుచిత తరముగా నున్నది.

### హ స్త క ర ణ ము లు

పతాకాది హస్తములకు ఇతరాపేక్షలేక లక్షణముచేతనే స్వరూపమేర్పడు చుండగా, అభినయమున కొక విశేషమును — మేల్మిని — చేకూర్చుటకై ప్రేళ్ళను కదలించు క్రియావిశేషము చేయుట కరణమనబడును ; అది నాలుగు తెరగులు. 297

అపవేష్టనము, ఉద్వేష్టనము, వ్యావర్తము, పరివర్తనము — ఇట్లు హస్తకరణములు ; ఇవి హస్తములనుండి పుట్టునవి, వానిని పుట్టించునవియును.

అరచేయి అభినేతకెదురుగా, తన పార్శ్వమునుండి యెదవరకు సాగునప్పుడు, మొదలు క్రమముగా తర్జని మొదలైన ప్రేళ్ళను కొంచెముగా వక్రీకరించుచు సాగినచో దానిని నృత్తమెరిగినవారు అపవేష్టనమందురు.

అట్లే ఆ ప్రేళ్ళను చక్కనచేయుచు వెలికిలిగా హస్తము ఎదనుండి తన ప్రక్కకు వచ్చుట ఉద్వేష్టితమగును. 298, 299, 300

బోరలుగా హస్తము పార్శ్వమునుండి వక్షస్సును చేరునపుడు ప్రేళ్లు చిటికెన మొదలుగా తర్జనిదాక లోనికి క్రమముగా వక్రించుట, వ్యావర్తనమని నృత్తవిద్యయందు నేర్పరులందురు. 301

అట్లే వక్షస్సునుండి పార్శ్వమునకు పోవునపుడు క్రిందిమొగమైన చేతిప్రేళ్లు, చిటికెనప్రేలు మొదలు తర్జని వరకు వక్రత్వమును వదలుట పరివర్తనమని నృత్తవిద్యారహస్యజ్ఞులందురు ; హస్తమునందలి యీ నాల్గు తెరగులును నాట్య—నృత్తములందు ప్రయోగింపదగును. 302, 303

ఒకప్పుడు కరణమును చేయుచున్న హస్తము త్వరగా నడచినచో దృష్టిగూడ బొమల నడకతో, ముఖరాగముతోగూడి త్వరగానే వెన్నంటుచు నడచును. 304

హ స్త ప్ర చా రాః

ఉత్తానోఽధస్తలః తిర్యక్ తథోర్ధ్వాధోముఖా ఇ(వి)తి
ప్రచారాః పంచహస్తస్య యథార్థాః మునిసంమతాః. 305

ఊర్ధ్వాధస్తిర్యగగ్ర స్వసమ్ముఖోపపదాస్తలాః
స్యుః పంచోపపదై రేభి రేవం పంచముఖా అపి,
ఏవం దశవిధం చారం కరస్యాభిదధుః పరే. 306

ఊర్ధ్వాధోముఖయోర్లీనౌ సమ్ముఖాగ్రతలావుభౌ
తలభేదేషు సంసృష్టమవశిష్టం ముఖత్రయమ్
ఇత్యాశ్రయపరో భేదాన్ పంచైవ మునిరబ్రవీత్. 307

ఊర్ధ్వగోఽధోగతస్తిర్యగ్గతోఽన్యస్త్వగ్రతో గతః
సంముఖాగత ఇత్యన్యే పంచహస్తగతీర్జగుః
ఇత్యేవం గతిభేదాత్ తత్పంచధా హస్తపంచకమ్. 308

ఉత్తమైః సత్త్వభూయస్త్వాత్ హస్తాః స్వల్పప్రచారిణః
మధ్యప్రచారిణః కార్యాః మధ్యమైర్మధ్యమత్వ(సత్త్వ?)తః
నీచైరత్యంత విక్షిప్తాః సత్త్వహీనోఽధమో యతః. 309

బా హు ప్ర కా రాః

ఊర్ధ్వగః పృష్ఠగస్తిర్యగ్గతః స్వస్తికమండలౌ
అపవిద్ధాంచితావిద్ధ కుంచితాధోముఖా ఇతి,
ఆహుర్దశవిధం బాహుం నాట్యే నృత్తేచ తద్విదః 310

ఊర్ధ్వగః శిరసోఽప్యూర్ధ్వం గచ్ఛన్, స్వస్యైవ పృష్ఠతః
పృష్ఠగః, పార్శ్వగస్తిర్యగ్గతో బాహుః, పరేణచేత్. 311

స్వస్తికః స్వస్తికీభూతో, మండలః పరితో భ్రమన్
తతో మండలవన్నిర్యన్ అపవిద్ధస్తు వక్షసః. 312

## హ స్త ప్ర చా ర ము లు

ఉత్తానము (వెలికిలినది), అధస్తలము (బోరగిలినది), తిర్యక్కు (అడ్డము), ఊర్ధ్వముఖము (మీదిమొగమైనది), అధోముఖము (క్రిందిమొగమైనది), ఇట్లు ఐదు సార్థకములైన హస్తప్రచారములు భరతముని సమ్మతములు. 305

ఊర్ధ్వతలము, అధస్తలము, తిర్యక్తలము, అగ్రతలము, స్వసమ్ముఖతలము, ఇట్లే ఊర్ధ్వముఖము, అధోముఖము, తిర్యఙ్ముఖము, అగ్రముఖము, స్వసమ్ముఖ ముఖము—అని కరప్రచారములు పది తెరగులని ఇతరులు చెప్పుదురు. 306

సమ్ముఖతలము, అగ్రతలము రెండును ఊర్ధ్వముఖము, అధోముఖము అను రెంటిలో కలిసిపోవును ; తక్కిన మూడు 'తలము'లలో అణగినవి—ఇట్లు భావించి భరతముని ఐదు భేదములే చెప్పెను. 307

ఊర్ధ్వగతము, అదోగతము, తిర్యగ్గతము, అగ్రగతము, సమ్ముఖాగతము—అని మరికొందరు ఐదు హస్తగతులు చెప్పిరి. ఇట్లు గతిభేదము చేత ఆ యైదు హస్తములు ఐదు విధములగును. 308

సత్త్వము — ఆత్మసంయమనశక్తి — ఎక్కువగా గలవారు గనుక ఉత్తముల హస్తగతి స్వల్పముగా నుండదగును ; సత్వము తక్కువగాగలవారు గావున నడితరమువారు హస్తచారములను నడితరముగా చేయదగును ; సత్తువలేనివారు గనుక నీచుల చేతి నడకలు చాలా విసురుగా నుండవలయును. 309

## బా హు ప్ర కా ర ము లు

ఊర్ధ్వగతము, పృష్ఠగతము, తిర్యగ్గతము, స్వస్తికము, మండలము, అపవిద్ధము, అంచితము, ఆవిద్ధము, కుంచితము, అధోముఖము — ఇట్లు నాట్య నృత్తములందు, తెలిసినవారు, బాహువు పది విధములందురు. 310

శిరస్సుకంటె మీదికి పోవునది ఊర్ధ్వగతము ; తన వెనుకకే పోవునది పృష్ఠ గతము ; ప్రక్కకు సాగినది తిర్యగ్గతము ; ఇతరబాహువుతో స్వస్తికముగా చేరినది స్వస్తికము ; ఇరుప్రక్కలును తిరుగునది మండలము ; వక్షమునుండి వెడలి మండలముగా-సాగునది అపవిద్ధము. 311, ~~312~~

ప్రాహుర్వ్యస్తః శిరః క్షేత్రముర ప్రత్యావృత్తోఽంచితః
స్యాదావిద్ధోఽంతరాక్షేపాత్, కుంచితః తీక్ష్ణకూర్పరమ్
భవేత్ ద్విగుణతాం నీతోఽధోముఖః క్షితిసమ్ముఖః. 313

సరలాందోలితౌ నమ్రోద్వేష్టితోత్సారితాస్తథా
ప్రసారిత ఇతిప్రాహుః బాహుమన్యే తు షడ్విధమ్. 314

ప్రసృతః పార్శ్వయోరూర్ధ్వ మధో వా సరలః స్మృతః
షవేదాందోలితోఽన్వర్థః, నమ్రః స్యాద్వక్రితో మనాక్. 315

భవేదుద్వేష్టితస్తిర్యక్ మణిబంధవివర్తితః
స్వ స్వ పార్శ్వాంతరాత్ పార్శ్వం గచ్ఛన్నుత్సారితో మతః 316

అనుధావన్ పురోదేశం సమాఖ్యాతః ప్రసారితః
స్వోక్తావాంతరభేదత్వాదిమాన్ మునిరముంచత. 317

ద్రుత మధ్యాది వైచిత్ర్యాత్ సమస్త వ్యస్తయోజనాత్
పర్యాయశో హి బహూనాం కరణేషు చతుర్ష్వపి,
వర్తనాః క్రియమాణాస్తు సంభవంతు పరశ్శతమ్. 318

యచ్చత్వారింశతం కేచిత్ శతం కేచిదిమాన్ జగుః
సంఖ్యాయాః నియమస్తస్మాదితి కర్తుమసాంప్రతమ్. 319

చింతా శోక జరారోగ శీత ప్రాలేయ వృష్టిభిః
తంద్రామూర్ఛా జుగుప్సాభిః పీడితేషు విషాదిని. 320

[1]ప్లవోదన్వత్తపఃస్థేషు హ్రీతే గ్లానే నభశ్చ్యుతే
సంగ్రామత్రస్త నిశ్చేష్ట హస్తహీనేషు హర్షితే. 321

స్వప్నే స్వప్నాయితే మత్తే ప్రమత్తోన్మత్తయోర్జడే
నాభినేయాః కరాః బాహ్యాన్ ద్రవ్యాదీన్ గమయంతియే. 322

యథా సర్పశిరాః సర్పం యథాచ మకరో ఝషం
సూచయత్యాంతరీం చిత్తవృత్తిం సాత్త్వికభావవత్. 323

---

1. 'ప్లవోద' అను పాఠము ముద్రాదోషము.

వక్షమునుండి శిరస్సుభాగముదాక పోయి మరల ఎదకు వచ్చునది అంచితము : బాహువులనడుమ ఆడించినది ఆవిద్ధము ; మోచేతిని బిగబట్టి మడిచినది కుంచితము ; నేలను దించినది అధోముఖము. 313

సరళము, ఆందోళితము, నమ్రము, ఉద్వేష్టితము, ఉత్సారితము, ప్రసారితము— ఇట్లు బాహువు ఆరువిధములని మరికొందరు వచించిరి. 314

ప్రక్కలలోగాని, పైకిగాని, క్రిందికిగాని సాగినది సరళము ; తూగునది ఆందోళితము ; కొంచెము వంకరయైనది నమ్రము , అడ్డముగా మనికట్టుమీదుగా వెడలించినది ఉద్వేష్టితము ; తనప్రక్కనుండి ఇంకొక పార్శ్వమునకు పోవునది ఉత్సారితము ; చక్కగా ఎదురుగా చాచినది ప్రసారితము. తాను చెప్పినవానికే యివి చిల్లరభేదములు గనుక భరతముని వీనిని వదలెను. 315, 316, 317

నాలుగు హస్తకరణములందును, ద్రుతము, మధ్యము మొదలగు కాలభేదము చేత, చేర్చి-విడదీసి ప్రయోగించుటచేత, బాహువులను మార్చి మార్చి నడపుట చేత—చేయబడు వర్తనలు నూర్లకొలదిగావచ్చును. కనుక ఈ భేదములు కొందరు నలువది యని, మరికొందరు నూరని చెప్పినట్లు సంఖ్యను నియమించుట తగదు. 318, 319

చింత, శోకము, ముదిమి, రోగము, చలి, మంచు, వాన, తూగడింపు, మూర్ఛ, అసహ్యము — వీనిచే పీడింపబడినవారియెడల , తెప్ప, సముద్రము, తపస్సు—వీనియందున్న వారియెడ ; సిగ్గుపడిన, శ్రమించియలసిన, ఆకాశమునుండి జారిన—వారి విషయమున ; యుద్ధమందుభయపడిన, చేష్టలుడిగిన, మొండిచేయి గల—వారియందు ; నిద్ర, కలవరింపు, మత్తు, లాహిరి, పిచ్చి, జడత్వము — వీని విషయమునను, వెలుపలివస్తువులను సూచించు హస్తములతో అభినయింపరాదు. 320, 321, 322

సర్పశీర్ష హస్తము పామును, మకరహస్తము చేపను సూచించినట్లు ఏయే భావము సహజమై సాత్త్వికభావములవలె లోపలి చిత్తవృత్తిని సూచించునో అట్టి దాని నభినయింపదగును.

యోయోభావః స్వభావత్వాత్ తేషామభినయో మతః
శుకాస్యస్య యథేర్ష్యాయాం పతాకస్య యథా ముది. 324

యథాత్రాసే కపోతస్య శోకే డోలస్యవా యథా
ఏవంభావ విశేషేఽపి కార్యం హస్తానుకూల్యతః. 325

నృ త్త హ స్తాః

చతురశ్రత్వ సంగస్య నృత్తే జీవితముచ్యతే
తదాకరతయా పూర్వం చతురశ్రావుదాహృతౌ,
ప్రాయేణ నృత్తహస్తానాం ప్రభవత్వాచ్చ సూరిభిః. 326

[1][బ్రహ్మ?] బింబసూత్ర సమస్కంధ కూర్పరౌ కటకాముఖౌ
పరాఙ్ముఖౌ యదాస్యాతాం వక్షసోఽష్టాంగులాంతరౌ. 327

చతురశ్రౌ తదాజ్ఞేయౌ సౌష్ఠవేనాపి సంయుతౌ
ఆకర్షణే స్రగాదీనాం విష్ణోరభినయే పునః. (చతురశ్రౌ—1) 328

చతురశ్రౌ కరౌపూర్వం కృతోద్వేష్టితకర్మణా
హంసపక్షీకృతౌ వక్షః క్షేత్రే వైచిత్ర్యతస్తయోః. 329

ఏకో వ్యావర్తనేఽన్యశ్చ యుగపత్పరివర్తనే
యదోద్వృత్తౌ తదాస్యాతాముర్ధ్వవర్తయాత్వివమౌ. 330

తాలవృంతస్య తుల్యత్వాత్ తాలవృంతాపరాభిధౌ
అతఏవ మతావేతౌ తాలవృంత నిరూపణే. (ఉద్వృత్తౌ—2) 331

చతురశ్రౌ కరౌ హంసపక్షౌ కృత్వైవ పూర్వవత్
అన్యోన్యాభిముఖౌ త్ర్యశ్రౌ సమాప్తౌ స్వస్వపార్శ్వగౌ
కార్యౌ తలముఖావేవం హృద్యమర్దల వాదనే. (తలముఖౌ—3) 332

1. 'బ్రహ్మసూత్ర' అని పాఠమున్నచో మేలని పరిష్కర్త సూచన. (Notes P-II) ఇక్కడ ఇచ్చిన యర్థము వారి సూచనమే; బ్రహ్మసూత్రము జందెము.

ఈర్ష్యయందు శుకతుండమువలె, సంతోషమందు పతాకమువలె, భయమందు కపోతమువలె, శోకమందు డోలహస్తమువలె, హస్తముల అనుకూల్యమునుబట్టి భావవిశేషమును సూచించునపుడును చేయనగును. 223, 324, 325

## నృత్తహస్తములు

శరీరము చతురశ్రముగా—చదరముగా—ఉండుట నృత్తమునకు ప్రాణమువంటి దందురు; కనుక నృత్తమునకు గనివంటిదని, ప్రాయికముగా నృత్తహస్తము లందుండి పుట్టునని, పండితులు చతురశ్రహస్తములను మొదలు గ్రహింతురు. 326

మూపులును, మోచేతులును బింబ (బ్రహ్మ ?) సూత్రమువలె — చిత్రకారులు మొదలగువారు వేసికొను చక్కనిగీతలవలె, సమముగా తీర్చిన కటకాముఖ హస్తములు, సౌష్ఠవము గలిగి, యెదనుండి యెనిమిదంగుళముల యంతరముతో, చూచువారి మొగమైయున్నచో అవి చతురశ్రములనబడును; పూలసరములు మున్నగువానినీడ్చి సవరించుటకును, విష్ణుమూర్తి నభినయించుటకును తగినది.
(చతురశ్రములు—1) 327, 328

చతురశ్రములైన హస్తములను హంసపక్షములుగా మొదలుతీర్చి, వక్షః ప్రదేశ మందు ఉద్వేష్టితకర్మముచేత నిలిపి, ఒకటి వ్యావర్తనమును ఇంకొకటి పరివర్తన మును ఏకకాలముననే విచిత్రముగా ఊర్ధ్వవర్తనతో చేయునట్లు నడపినవి ఉద్వృత్తములు; తాళవృంతము — తాటాకువీవన-తో సమానముగానుండుటచే తాళవృంతములని వీనికింకొక పేరు; కావుననే తాళవృంతమును చూపుటకివి తగినవి. (ఉద్వృత్తములు—2) 329, 330, 331

పూర్వమువలెనే చతురశ్రకరములను హంసపక్షములుగాచేసి, యెదురుబదు రుగా ముమ్మారులగా నడపి, ముగింపునందు తమ తమ పార్శ్వములకు చేర్చినచో అవి తలముఖములు; ఇవి యింపుగా మద్దెల వాయించుటయందుపయోగించును.
(తలముఖములు—3) 332

స్వస్తికౌ మణిబంధాంతే భూత్వైవ వైతౌ స్వలక్షణౌ
(స్వస్తికౌ—4)
స్వస్తికోఽధస్తథావాఽశు విచ్యుతౌ విప్రకీర్ణకౌ
(విప్రకీర్ణకౌ—5)
పూర్వపూర్వోపజీవిత్వ మేతేషాం విద్యతే క్రమాత్. 333

పతాకస్వస్తికౌ పూర్వమలపద్మవిధానతః
వ్యావృత్త పరివృత్తౌచ కృత్వోర్ధ్వౌ పద్మకోశకౌ. 334

వ్యావృత్త పరివృత్తౌచ తతః కృత్వా తయోః పునః
అరాలమేకమన్యంతు విదధ్యాత్కటకాముఖమ్. 335

చతురశ్రేణచేత్ స్యాతా మరాలకటకాముఖౌ[1]
ఆచార్యాః స్వస్తికేనేతి కేచిత్ ప్రాహురిమౌ పునః
ప్రాగరాలౌ పరేప్రాహుః కటకాస్యావతః పరమ్. 336
(అరాలకటకాముఖౌ—6)

అంసాభ్యాం కూర్పరాభ్యాంచ భుజాభ్యాంచ క్రమాద్యథా
కుటిలాభ్యాం విలాసేన పతాకౌ వర్తితౌ యదా
అవాఙ్ముఖతలౌ జ్ఞేయౌ బుధైరావిద్ధ వక్రకౌ. 337
(ఆవిద్ధవక్రకౌ—7)

వ్యావృత్త పరివృత్తాభ్యాం ప్రథమం చతురశ్రగౌ
పతాకౌ భవతః పశ్చాత్ తథాస్తః ఫణిమస్తకౌ. 338

తతస్తథైవ సూచ్యాస్యౌ పార్శ్వే తిర్యక్ ప్రసారితౌ
పర్యాయేణచ సూచ్యాస్యౌ జ్ఞేయౌ నృత్తప్రయోక్తృభిః. 339
(సూచ్యాస్యౌ—8)

---

1. 'అరాలం కటకాముఖం' అను పాఠము అనన్వితము. కనుక ఈ మార్పు సూచించినాను.

మీదిహస్తములే స్వస్తికాకారముతో మనికట్టుమీద నిలిచినచో స్వస్తికము లగును. (స్వస్తికములు—4)

స్వస్తికము అధోముఖముగాగాని ఉన్నట్లుగానేకాని తటాలున విడివడి పోయిన విప్రకీర్ణములగును. (విప్రకీర్ణములు—5)

[ఈ హస్తములు క్రమముగా తొలి తొలి హస్తముల ననుసరించియే తరువాతివి రూపొందును.] 333

మొదలు అలపద్మరూపమున పతాక-స్వస్తికహస్తములను వ్యావర్తనము, పరివర్తనమునుచేసి, తరువాత ఊర్ధ్వముఖములైన పద్మకోశములనుగా వానినే మలచి, వ్యావర్తన పరివర్తనములుచేసి, ఆమీద ఒక హస్తమును అరాళముగా, రెండవదానిని కటకాముఖముగా, చతురశ్రముచేత తీర్చుట అరాళకటకాముఖము లగును ; స్వస్తికముచేతనే వీనిని తీర్చవలెనని కొందరాచార్యులందురు ; మరి కొందరు మొదలు అరాళములుగా, తరువాత కటకాముఖములుగా చూపదగు నన్నారు. (అరాళకటకాముఖములు—6) 334, 335, 336

వక్రములైన మూపులు, మోచేతులు, భుజములు — వీనినుండి క్రమముగా పతాకహస్తములను అరచేతులు తనదిక్కుగా నడపినచో అవి ఆవిద్ధవక్రములు. (ఆవిద్ధవక్రములు—7) 337

మొదలు పతాకహస్తములు వ్యావర్తన పరివర్తనములచే చతురశ్రములందు నిలుచును ; తర్వాత అట్లే సర్పశీర్షములగును ; ఆపైని అట్లే సూచీముఖము లుగా, అడ్డముగా ప్రక్కకు మార్చి సాగింపబడును ; అవి సూచ్యాస్యములని నృత్తప్రయోక్త లెరుగదగును. (సూచ్యాస్యములు—8) 338, 339

భ్రమితౌ రేచితౌ సంతౌ హంసపక్షౌ ద్రుతం యది
ప్రసృతోచ్చలత్వేన విఖ్యాతావితి రేచితౌ,
ఉక్తౌ నరహరేరేతౌ దైత్యోరస్తటపాటనే. (రేచితౌ—9) 340

యద్యేకో రేచితస్తద్వదపరశ్చతురశ్రగః
పర్యాయేణ కరావేవమర్ధరేచిత సంజ్ఞకౌ. (అర్ధరేచితౌ—10) 341

అంసగండకపోలానాం సమక్షేత్రే క్వచిత్ స్థితౌ
త్రిపతాకౌ మనాక్ తిర్యగుత్తానౌ సమ్ముఖౌ తథా
కూర్పరాంసం చలత్కించిత్ స్యాతాముత్తానవంచితౌ. 342
(ఉత్తానవంచితౌ—11)

వ్యావర్తేన[1] భుజాదూర్ధ్వం ప్రసార్య పరివర్తనాత్
పతాకౌ మణిబంధస్థౌ శిథిలౌ స్వస్తికీ కృతౌ. 343

సంపద్యేతే యదావిద్ధః కథితౌ పల్లవౌ తదా ,
కేచిత్ పతాకయోః స్థానే త్రిపతాకావిహాబ్రువన్. 344
(పల్లవౌ—12)

ఉత్తానితౌ ముఖార్ధేన విచిత్రౌ స్కంధదేశతః
నిష్క్రాంతౌ పూర్వవచ్చేతౌ కేశబంధావుదాహృతౌ. 345
(కేశబంధౌ[2]—13)

---

1. 'వ్యావర్తేత' అనునది అపపాఠమని, నా సూచన యీ మార్పు.

2. ఇక్కడ నితంబములను సృత్తహస్తముల లక్షణము మూలమున తప్పిపోయి నట్లున్నది పరిష్కర్తయు ఆ విషయముల సూచింపలేదు. సంగీత రత్నాకరమున నితంబలక్షణమిట్లున్నది (అధ్యా. 2—శ్లో. 238).

"ఉత్తానాధోముఖత్వాభ్యాం క్రమేణ స్కంధదేశతః
పతాకౌ యది నిష్క్రమ్య నితంబక్షేత్రవర్తినౌ
రేచకం కురుతో హస్తౌ నితంబావుదితౌ తదా."

(పతాకహస్తములు క్రమముగా వెలికిలబడి, అధోముఖములై మూపులనుండి వెడలి, పిరుదులదగ్గరకు చేరి, విదిలించునేని అవి నితంబహస్తములనబడును.)

అరచేతులు వెలికిలిగా సాగిన హంసపక్షహస్తములు విడివడి వేగముగా తిరుగుచున్నచో రేచితములగును; ఇవి నరసింహుడు దైత్యుని వక్షస్సు చీల్చుటకు చెప్పబడినవి. (రేచితములు—9) 340

ఒకహస్తము రేచితమై, ఇంకొకటి చతురశ్రగతముగా మార్చిమార్చి నడచుట అర్ధరేచితములు. (అర్ధరేచితములు—10) 341

మూపులు, చెక్కులు, నుదురు — వీనిలో ఏదోయొకదానికి సమమైన ప్రదేశమందు నిలిచి త్రిపతాకహస్తములు, అడ్డముగా ఇంచుక వెలికిలబడి యెదురుబదురుగానుండి, కొంచెముగా మూపులును, మోచేతులును కదలుచున్నచో ఉత్తానవంచితములగును. (ఉత్తానవంచితములు—11) 342

వ్యావర్తనకరణముచే పతాకహస్తములను భుజములమీదికి చాచి, పరివర్తనముతో మనికట్టుమీద శిథిలస్వస్తికములుగా నిలుపుట పల్లవములు అని పండితులందురు; ఇక్కడ కొందరు పతాకములకు ప్రతిగా త్రిపతాకములుండవలెనందురు. (పల్లవములు—12) 343, 344

ఈ హస్తములు ముఖమునకు సగమెత్తున మూపులనుండి వెలికిలిగా సాగి మరల మొదటివలె దిగుట కేశబంధములు. (కేశబంధములు—13) 345

ప్రలంబితభుజౌ తిర్యక్ పతాకౌచేత్ ప్రసారితౌ
లతాఖ్యావితి విజ్ఞేయౌ నృత్తాభినయగోచరౌ
నితంబప్రభృతిష్వేషు త్రిపతాకౌ జగుః పరే. (లతాఖ్యౌ—14) 346

లతాహస్తో భవేత్ పార్శ్వాత్ పార్శ్వం దోలావదున్నతః
కర్ణేఽన్యః త్రిపతాకశ్చేత్ కరిహస్తం విదుర్బుధాః. 347
కటకాముఖమత్రాన్యే కేచిత్పూర్వం లలాటకమ్.
(కరిహస్తౌ—15)

త్రిపతాకౌ కటీమూర్ధ్ని దత్తాగ్రౌ పక్షవంచితౌ. 348
(పక్షవంచితౌ—16)

కటీ పరాఙ్ముఖాగ్రేణ పక్షప్రద్యోతకావిమౌ
ఏతౌ శోభావహౌ నిత్యం పక్షవంచిత[1]పూర్వకౌ. 349
(పక్షప్రద్యోతకౌ—17)

తౌ పతాకీకృతౌ సంతౌ అధస్తలమధోగతౌ
ఉత్ప్లుతం తౌ చ తరసా తార్క్ష్యపక్షావుదాహృతౌ. 350
(తార్క్ష్యపక్షౌ—18)

---

దీని సంపూర్ణ వివరమునకు కల్లినాథుని వ్యాఖ్య చూచునది భరతనాట్య శాస్త్రమున ఈ హస్తముల లక్షణ మిట్లు సంగ్రహముగా నున్నది.

'బాహుశీర్షాది (ద్వి ?) నిష్క్రాంతౌ నితంబావితి కీర్తితౌ'
(కాశీ. ము. 9—184)

మూపులనుండి వెడలిన పతాకములు నితంబములనబడును.

1. 'పక్షప్రద్యోతపూర్వకౌ' అని ముద్రితము ; నా కర్థముకాని పాఠము. "ప్రాగాఖ్య మనంతరమ్" అను సంగీతరత్నాకరలక్షణమునకు (7-225) కల్లినాథుని వివరణ ననుసరించి యీ సవరణ నా సూచన.

పతాకహస్తములు అడ్డముగా సాగిన భుజములతో వ్రేలుచుండుచో లత లగును ; ఇవి నృత్తమునందును అభినయమునందును వచ్చును : నితంబములు మొదలగు ఈ హస్తములందు ఇతరులు త్రిపతాకహస్తములను వచించినారు. 346

(లతాఖ్యములు—14)

ఒక పార్శ్వమునుండి వేరొకపార్శ్వమునకు ఉయ్యాలవలె ఉన్నతమైన ఒక హస్తము వర్తింపగా, ఇంకొకటి చెవివద్ద త్రిపతాకముగా నుండుట కరిహస్తమని బుధులందురు ; త్రిపతాకముచోట కటకాముఖమును కొందరు చెప్పిరి ; మరి కొందరు త్రిపతాకముననే లలాటకమని మొదటిపేరన్నారు. 347

(కరిహస్తములు—15)

ఒక త్రిపతాకము కటిని, ఇంకొక్కటి శిరమును, కొనలతో తాకియుండిన పక్షవంచితహస్తములగును. (పక్షవంచితములు—16) 348

వ్రేళ్ళకొనలు దీనివి కటిప్రదేశమునకు వెనుదిరిగియున్నచో పక్షప్రద్యోతక ములు. మొదలు పక్షవంచితములు చూపి, పిదప వీనిని ప్రదర్శించుట యెప్పుడును శోభాకరములగును. (పక్షప్రద్యోతకములు—17) 349

హస్తములు పతాకములై బోరగిల్లి, వేగముగా క్రిందికి దూకి మీదికెగురు చుండిన అవి తార్క్ష్యపక్షములు. (తార్క్ష్యపక్షములు—18) 350

వక్షః క్షేత్రం శ్రయత్యేకో యేనకాలేన పార్శ్వతః
వ్యావృత్త్యా హంసపక్షాఖ్యః తేనైవ పరివర్తితః[1]. 351

ప్రసారిత భుజోఽన్యస్తు తిర్యక్, పర్యాయశః పునః
ఏవమంగాంతరేణాపి క్రియా స్యాద్దండపక్షయోః. 352

ఉభయోర్యౌగపద్యేన ప్రాహుర్బాహ్వోః ప్రసారణమ్
వ్యావృత్త పరివృత్తంచ క్రమేణాత్ర క్రియావిదః. 353

(దండపక్షౌ—19)

వ్యావృత్త వక్షసౌ ఫాలవర్త్మనా పార్శ్వమాగతౌ
తతో మండలవద్ భ్రాంతౌ ప్రసారిత కరౌ భుజౌ. 354

పతాకౌ చేన్మతావూర్ధ్వమండలౌ నృత్తకోవిదైః;
చక్రవర్తనికేత్యన్యత్ ప్రథితం నామ లోకతః
ప్రాహ కీర్తిధరాచార్యః కరయోరనయోరితి. 355

(ఊర్ధ్వమండలౌ—20)

తౌ మిథస్సంముఖౌ పార్శ్వ విన్యస్తౌ పార్శ్వమండలౌ
స్కంధక్షేత్రాదధః స్వ స్వ పార్శ్వయోర్భ్రమణం పరే. 356

ఆవిద్ధభుజయో రూచుః తయోరన్వర్థవాదినః
కక్షవర్తనికే త్యన్య దనయోర్నామ కల్పితమ్. 357

(పార్శ్వమండలౌ—21)

ఉద్వేష్టశ్చాపవేష్టశ్చ స్యాతాం చేదేకకాలతః
హస్తయోగురసః స్థానాత్ పార్శ్వయోర్భ్రాంతయః(యోః?) క్రమాత్
ఉరో మండలినౌ, అన్యే ప్రాహుర్వక్షఃస్థయోరితి 358

ఏతద్భేదద్వయం కేచిదురోవర్తనికాం విదుః ;
ఊర్ధ్వదిఙ్మండలేష్వేషు హంసపక్షౌ విదుః పరే. 359

(ఉరోమండలౌ—23)

---

1. 'పరికీర్తితః' అను పాఠము అనన్వితము, అనావశ్యకము. కనుక లక్షణసౌష్ఠవము నకై యీ సవరణ.

ఎప్పుడు హంసపక్షహస్తము పార్శ్వమునుండి వ్యావర్తింపబడి — (లోమొగముగా కొనిరాబడి)—వక్షఃప్రదేశము చేరునో, అదేసమయమందే పరివర్తితమైన మరొకహస్తముతో భుజమును అడ్డముగా చాచినచో దండపక్షములగును; ఇట్లు చేతులు మార్చి మార్చి క్రియ నడపదగును. 351, 352

ఇచట రెండుబాహువులును జతగా ఏకకాలమందే చాచవలెననియు, వ్యావృత్తి, పరివృత్తులు క్రమముగా ఒకదానితర్వాత మరొకటిగా చేయవలెననియు క్రియావిదులు చెప్పుదురు. (దండపక్షములు—19) 353

పతాకములు వ్యావృత్తితో వక్షమునుచేరి, ఫాలమార్గముగా పార్శ్వమునకు వచ్చి, ఆపై భుజములు సాగినహస్తములతో మండలాకారముగా తిరిగినచో, నృత్తకోవిదులు ఊర్ధ్వమండలములందురు; ఈ హస్తములకు లోకమున 'చక్రవర్తనిక' అని ఇంకొకపేరు ప్రసిద్ధముగా గలదని కీర్తిధరాచార్యుడు చెప్పినాడు. (ఊర్ధ్వమండలములు—20) 354, 255

ఆ హస్తములను పార్శ్వములందు పరస్పరము ఎదురుగా నిలుపుట పార్శ్వమండలములు; ఈ హస్తములపేరు సార్థకము గావలయునని ఇతరులు మూపులక్రింద ఆవిద్ధములైన భుజములతో తమ తమ ప్రక్కలందు హస్తములు తిరుగవలెనని చెప్పిరి. వీనికి 'కక్షవర్తనిక' అని మరొకపేరును కల్పించిరి. 356, 357

(పార్శ్వమండలములు—22)

హస్తములు ఏకకాలమందు ఉద్వేష్టనమును, అపవేష్టనమును చేసి వక్షస్సునుండి ప్రక్కలలో క్రమముగా తిరుగుచున్నచో అవి ఉరోమండలములగును; ఇతరులు వీనిని వక్షస్సునందే నిలుపవలెననిరి. ఈ రెండురీతులకును 'ఉరోవర్తనిక' అని కొందరు పేర్కొన్నారు; మరికొందరు మీదిదిక్కుగా తిరుగు ఈ హస్తములు హంసపక్షములుగా ఉండవలెనందురు. 358, 359

(ఉరోమండలములు—23)

వ్యావర్తితేన హస్తశ్చేదలపల్లవశంసినా
పార్శ్వంచ వక్షసః ప్రాప్య ప్రసారితభుజో భ్రమన్. 360

అరాలం దధదావేష్టకరణేన శ్రయత్యురః
తదానీమేవ పార్శ్వం స్వమతో(న్యో?)[1]గచ్ఛతి పూర్వవత్,
మండలేన తతోఽప్యేవ మురః పార్శ్వార్ధమండలౌ. 361

(ఉరః పార్శ్వార్ధమండలౌ—24)

కరణేనాపవేష్టేన స్యాదేకః కుంచితోయదా
తదాఽన్యోఽప్యంచితో భూత్వోద్వేష్టితేన ముహుః క్రమాత్. 362

స్వస్తికౌ కటకాస్యౌచేత్ ముష్టికస్వస్తికౌ మతౌ;
యత్ పరంపరయా ముష్టేర్జాతౌ తౌ మునినా తతః. 363

తథోక్తౌ[2] ముష్టిశిఖరకపిత్థకటకేష్వపి
స్యాతామన్యతమావేతావిత్యాశయవతాఽమునా. 364

ఏకః స్యాత్ కుంచితా ముష్టిః కటకాస్యేఽ(స్యో?)[3]ంచితః పరః
ఇతి కీర్తిధరః ప్రాహ ముష్టికస్వస్తికౌ కరౌ
ఖడ్గవర్తనికేత్యన్యత్ నామధేయంచ కల్పితమ్. 365

(ముష్టికస్వస్తికౌ—25)

పద్మకోశాభిధౌ హస్తౌ వ్యావర్తాది క్రియాకృతౌ
ఆశ్లిష్టౌ స్వస్తికక్షేత్రే వ్యావృత్తపరివర్తితౌ
మిథః పరాఙ్ముఖౌ స్యాతాం నలినీపద్మకోశకౌ. 366

---

1. వినియోగము భిన్నహస్తములకు గనుక 'అతో గచ్ఛతి' అను పాఠమిట్లుండునని నా సూచన. 'మనోగచ్ఛతి' అను వ్రా ప్ర పాఠము ఈ సూచన కాధారము. ఈ హస్తముల విశేష వివరణమునకు సంగీతరత్నాకర టీకలను చూచునది.
(౭—౨౬౭, ౬౮, ౬౯)

2. 'తయోక్తౌ' అనునది ముద్రాదోషము కాగలదు.

3. 'కటకాస్యో అంచితః' అని సవరించుట మేలు.

అలపల్లవహస్తమొకటి యెదనుండి పార్శ్వమునకు వ్యావర్తితకరణముచే చేరగా, ఇంకొకటి అరాళమై, చాచినభుజముతో తిరుగుచు ఆవేష్టితకరణముచే మండలాకారముగా ఎదకుచేరి, వెంటనే మునుపటివలె తనప్రక్కకు పోయినచో ఉరః పార్శ్వార్ధమండలము అగును. 360, 361

(ఉరః పార్శ్వార్ధమండలములు—24)

ఒకహస్తము అపవేష్టనకరణముచే కుంచితమై, మరొక్కటి ఉద్వేష్టితకరణముచే అంచితమై క్రమముగా పలుమారు కటకాముఖముతో స్వస్తికములుగా ఏర్పడునవి ముష్టికస్వస్తికములు. ముష్టి, శిఖరము, కపిత్థము, కటకాముఖము — ఈ నాలుగింటిలో ఏ హస్తమైనను ఇందు ప్రయోగింపనగును, పరంపరగా ముష్టి నుండియే తక్కినమూడును జనించినవి గనుక. ఈ యభిప్రాయముతోనే భరతముని ఈ హస్తములను ముష్టికస్వస్తికములని పేర్కొనెను. 362, 363, 364

ఒకహస్తము కుంచితమై ముష్టిగా నుండి, ఇంకొకటి అంచితమై కటకాముఖముగా నుండినచో ముష్టికస్వస్తికహస్తములగునని కీర్తిధరాచార్యుడు వచించెను. 'ఖడ్గవర్తనిక' అని వీనికింకొక నామధేయముకు కల్పింపబడినది. 365

(ముష్టికస్వస్తికములు—25)

పద్మకోశహస్తములు వ్యావర్త పరివర్తనములు చేయునపుడు ఇంచుక చేరువగా నుండి స్వస్తికప్రదేశమందు వ్యావర్తితములు, పరివర్తితములు నై పరస్పరము వెడమొగముగా నున్నచో నలినీపద్మకోశములగును. 366

మణిబంధసమాశ్లిష్టౌ కనిష్ఠాంగుష్ఠ సంముఖౌ
శ్లిష్ట[1] (శిష్ట?) లక్షణ సంయుక్తావేతావన్యైరుదీరితౌ. 367

ఏతావన్యతమక్షేత్రే స్కంధ వక్షోజ జానుషు
ప్రోక్తౌ వివర్తితౌ కైశ్చిన్నలినీ పద్మకోశకౌ
ఏతౌ కీర్తిధరాద్యాస్తు పద్మవర్తనికాం జగుః. 368
(నలినీపద్మకోశకౌ—26)

ఉద్వేష్టితేన నిష్పన్నౌ స్యాతాంచేదలపల్లవౌ
వక్షసః స్కంధయోరూర్ధ్వం ప్రసారితభుజౌ విమౌ. 369

స్కంధాభిముఖమావిద్ధౌ చలితౌ చాంగులీదలైః
అలపద్మోల్బణావాహుః వాతవర్తనికాం పరే. 370
(అలపద్మోల్బణౌ—27)

ఏతావేవ కరా వూర్ధ్వ (కరౌమూర్ధ?)క్షేత్రగౌ[2] లలితౌ మతౌ;
కటకాఖ్యౌ శిరోదేశలగ్నాగ్రౌ తౌ పరేజగుః. (లలితౌ—28)
లతాఖ్యౌ వలితౌ ప్రోక్తౌ కూర్పర స్వస్తికీ కృతౌ. 371
(వలితౌ—29)

ప్రోక్తం హస్తద్వయం కైశ్చిదసంయుక్తో నికుంచకః
యుక్తో ద్విశిఖరో, నృత్తహస్తకౌ వరదాభయౌ. 372

అనామా పార్శ్వసంలగ్నా చతురస్య కనీయసీ
యస్మిన్ నికుంచకో, వేదభాషణే స్వల్పదర్శనే. (నికుంచకః—30) 373

---

1. 'శ్లిష్ట' అను పాఠము అనన్వితము.
2. 'వాచలామూర్ధ్వ' అని వ్రాతప్రతి. 'వాచలౌమూర్ధ అని యుండబోలును; 'కరాదూర్ధ్వ ' అని తిరుపతి ప్రతి. సంగీతరత్నాకరలక్షణము నా యీ సవరణ సూచించుచున్నది. (౭—౨౭౮, ౨౭౯)

పై హస్తములు కనిష్ఠాంగుష్ఠముల కెదురెదురై మనికట్టువద్ద కలిసి ఇతర లక్షణములతో గూడవలెనని కొందరు చెప్పుదురు. 367

అవే, మూపులు, స్తనములు, మోకాళ్లు — ఈ మూటిలో ఏచోటనైనను వివర్తితములైనచో నలినీపద్మకోశములని మరికొందరందురు ; కీర్తిధరప్రముఖులు వీనిని 'పద్మవర్తనిక'గా పేర్కొన్నారు. (నలినీ పద్మకోశములు—26) 368

అలపల్లవహస్తములు వక్షస్సునుండి ఉద్వేష్టితకరణముచే ఏర్పడి, మూపులపైన భుజములు సాచి, వ్రేళ్ళు కదలుచుండగా, మూపులకెదురుగా లోపలికివంగినచో అలపద్మోల్బణములగును. వీనిని 'వాతవర్తనిక' యని ఇతరులందురు. 369, 370

(అలపద్మోల్బణములు—27)

ఇవే హస్తములు శిరోభాగమున నుండినచో లలితములగును. కొనలు శిరోదేశమున లగ్నములైన కటకాముఖములుగా నుండదగునని ఇతరులందురు.

(లలితములు—2[illegible])

లతాహస్తములు మోచేతిపై స్వస్తికముగా నుంచినచో వలితములగును. 371

(వలితములు—29)

కొందరు నికుంచకమను అసంయుతహస్తము, ద్విశిఖరమను సంయుతహస్తము అను రెంటిని, వరదాభయములు అను నృత్తహస్తములను చెప్పినారు. 372

చతురహస్తపు చిటికెనవ్రేలు అనామికప్రక్కకు చేరినచో నికుంచకము. ఇది వేదాధ్యయనమున, స్వల్పమని చూపుటకు, తగును. 373

(నికుంచకము—30)

సమం శిఖరయోర్యోగాత్ భవేత్ ద్విశిఖరాభిధః
శాపార్థమంగులీస్ఫోటే భామినీ కోపకర్మణి.
అస్య విశ్లేషణాదిష్టా[1] నాస్త్రీత్యభినయే బుధైః. 374
(ద్విశిఖరః—31.)

పరాఙ్ముఖతలౌ భిన్నౌ పతాకౌ కటిపార్శ్వగౌ
అధ ఊర్ధ్వముఖౌ స్యాతాం క్రమేణ వరదాభయౌ. 375
(వరదాభయౌ—32)

వ క్షో ల క్ష ణ మ్

సమముద్వాహితాభుగ్న నిర్భుగ్నాని ప్రకంపితమ్
ఇత్యుక్తం పంచధా వక్షో లక్షణాని ప్రచక్ష్మహే. 376

చతురశ్రకృతం సర్వైరంగైః సౌష్ఠవశాలిభిః
సమం సమ్మత మేతస్య స్వభావేఽభినయో[2] భవేత్. (సమమ్—1) 377

ఉత్తుంగత్వంతు[3] బభ్రాణముద్వాహితముదీరితమ్
జృంభాయా మాయతాఘ్రాణే దీర్ఘోచ్ఛ్వాసాదికేషుచ. 378
(ఉద్వాహితమ్—2)

అధః పతదివ స్కంధద్వితయం దధదానతమ్
మధ్యే మధ్యే శ్లథీభావం భజత్ పృష్ఠే సమున్నతమ్. 379

ఆభుగ్నం; సంభ్రమే భీతే విషాదగదయోః శుచి,
మూర్ఛా హృచ్ఛల్య మందాతు శీతస్పర్శన వృష్టిషు. 380
(ఆభుగ్నమ్—3)

1. 'దిష్టా' అనునది అపపాఠము.

2. 'స్వభావాభినయే' ముద్రి. అన్వయము చాలదు. 'స్వభావోభినవే' వ్రా ప్ర. ఇక్కడిది నా సవరణ.

3. ఇది వ్రా. ప్ర. పాఠము; 'ఉత్తుంగత్వే' ముద్రి.

శిఖరహస్తములు రెండు సమముగా కలిసినచో ద్విశిఖరమగును. ఇది శపించు నపుడు, నెటిక విరుచుటకు, అలిగిన స్త్రీల విషయమున, ప్రయోజ్యము. 'లేదు' అనుటకు ఈ హస్తమును విడదీసి చూపవలెనని బుధులందురు. 374

(ద్విశిఖరము—31)

పతాకహస్తములు వేరువేరుగా, కటిపార్శ్వములందు బోరగిల్లి, ఒకటి క్రింది మొగము, మరొకటి మీది మొగముగా నిలిచినచో, మొదటిది వరదము, రెండవది అభయమును అగును. (వరదాభయములు—32) 375

## వ క్షో ల క్ష ణ ము

సమము, ఉద్వాహితము, ఆభుగ్నము, నిర్భుగ్నము, ప్రకంపితము — ఇట్లు ఎద యైదు విధములు; వీని లక్షణము చెప్పుదుము. 376

అంగములన్నియు సౌష్ఠవముతోనుండి చతురశ్రముగా తీర్చబడినది సమము; స్వభావమునందు దీని నభినయింపదగును. (సమము—1) 377

మీదికి లేచిన యెద ఉద్వాహితము; ఆవలింత, దీర్ఘముగా వాసనచూచుట, పెద్దగా ఊపిరి పీల్చుట మొదలగువానియందిది వచ్చును. 378

(ఉద్వాహితము—2)

క్రిందపడిపోవునట్లు వంగిన మూపులు గలిగి, నడుమ నడుమ సడలుచు, ఎత్తిన వీపుగలది ఆభుగ్నము; సంబరము, భయము, దైన్యము, రోగము, దుఃఖము, మూర్ఛ, హృదయశల్యము, సిగ్గు, చలిశాకు, వాన — వీనియం దుపయోగించును. (ఆభుగ్నము—3) 379, 380

నిర్భుగ్నాంసం నమత్పృష్ఠం స్తంభశోభి ధృతోన్నతి
నిర్భుగ్నం కథ్యతే మానగ్రహణే సత్యభాషణే
విస్మయాలోకితే స్తంభే దర్పోత్క్రాన్తావహా మిత్యదః. 381
(నిర్భుగ్నమ్—4)

ప్రకంపితం కృతం జ్ఞేయ మూర్ధ్వోత్క్షేపైః నిరంతరైః
హసిత క్రందిత త్రాస శ్రమ శ్వాసామయాదిషు. 382
(ప్రకంపితమ్—5)

పార్శ్వ లక్షణమ్

ఉరోలక్ష్మాభిధాయేతి బ్రూమహే పార్శ్వలక్షణమ్
వివర్తితాపసృతే తద్వత్ ప్రసారిత సమున్నతే. 383

నతంచేతి మతం పార్శ్వకర్మ పంచవిధం బుధైః;
త్రికస్య పరివర్తేన పరావర్తో వివర్తనమ్. (వివర్తితమ్—1) 384

వివర్తిత పరిత్యాగాత్ నివృత్తేఽపసృతమ్ స్మృతమ్
(అపసృతమ్—2)
ఆయామాత్ పార్శ్వయోః ప్రోక్తం ప్రక(హ)ర్షాదౌ ప్రసారితమ్.
(ప్రసారితమ్—3) 385

కటీ పార్శ్వ భుజస్కంధే దధత్యున్నతిమున్నతమ్
అభ్యధాయి బుధైరస్య వినియోగోఽపసర్పణే. 386
(సమున్నతమ్—4)

ఉన్నతాదపరం పార్శ్వముపసర్పే నతం మతమ్ (నతమ్—5)
ఇత్యుక్తం పార్శ్వయోర్లక్ష్మ వినియోగైస్సమన్వితమ్. 387

వక్షసః పార్శ్వయోః పృష్ఠలక్ష్మణోఽంతర్గతేర్మునిః
నోవాచేతిమయాప్యుక్తం న పృథక్ పృష్ఠలక్షణమ్. 388

మూపులు క్రుంగి, వీపులోపలికి వంగి, కదలక నిటారుగా ఎత్తుగా శోభిల్లు ఎద నిర్భుగ్నము: స్త్రీల యీర్ష్యాకోపము, నిజముచెప్పుట, ఆశ్చర్యముతో చూచుట, ప్రమానుపాటు, 'నేను' అని దర్పముతో చెప్పుట — వీనియందిది చూపదగును. (నిర్భుగ్నము—4) 381

ఎడతెగక యెగవేయుట ప్రకంపితమగును; ఇది నవ్వు, ఏడ్పు, భయము, అలపు, ఉబ్బసము — మున్నగువానికి తగును. (ప్రకంపితము—5) 382

## పా ర్శ్వ ల క్ష ణ ము

ఇట్లు వక్షస్సులక్షణము వచించి యిక పార్శ్వలక్షణము చెప్పుదుము; వివర్తితము, అపసృతము, ప్రసారితము, సమున్నతము, నతము — అని పార్శ్వకర్మ ఐదువిధములుగా పండితులు పేర్కొనిరి. వెన్నెముకక్రిందిభాగమును వెనుకకు త్రిప్పుట వివర్తనము. (వివర్తితము—1) 383, 384

వివర్తితమును వదలి మరలినచో అపసృతమగును. (అపసృతము—2)

పేరిమి (గొప్పసంతోషము) మొదలగు భావములందు ప్రక్కలు మీదికీడ్చుట, ప్రసారితము. (ప్రసారితము—3) 385

కటి, పార్శ్వములు, భుజములు, మూపులు — ఉన్నతములైనచో ఉన్నతము; తొలగిపోవునప్పుడు దీని వినియోగమని బుధులందురు. 386

(సమున్నతము—4)

మీదియంగములు క్రుంగియున్నచో నతము; వినయముతో ఒకరిని సమీపించుట కిది యుపయుక్తము. (నతము—5)

ఇట్లు వినియోగములతోగూడ పార్శ్వలక్షణము చెప్పబడినది. 387

వక్షః పార్శ్వముల లక్షణములలో చేరిపోయినది గనుక, పృష్ఠలక్షణము వేరుగా భరతముని చెప్పలేదు; అందుచే నేనును చెప్పలేదు. 388

### జఠరకర్మాణి

క్షామం ఖల్వం తతః పూర్ణమిత్యుక్తం జఠరం త్రిధా ;
తను క్షామం స్మృతం హాస్య జృంభా నిశ్వాస రోదనే. 389

నతం ఖల్వం మతం శ్రాంతే క్షుధి రోగే తపస్యపి
పూర్ణమాధ్మాతముచ్ఛ్వాసాత్యశన స్థూలభోగిషు. 390

### కటిలక్షణమ్

రేచితా కంపితా చ్ఛిన్నా నివృత్తోద్వాహితా తతః
పంచధేతి కటిర్నాట్యే నృత్తేచ పరికీర్తితా. 391

రేచితా పరితో భ్రాంతా భ్రమణేషు విధీయతే ;
యాతాయాతై స్తిరశ్చీనైః వేగితైః కంపితా మతా. 392

నీచవామనకుబ్జానాం గతానుకరణేష్వియమ్
మధ్యస్య వలనాత్ ఛిన్నా శ్రమే పృష్ఠవిలోకితే. 393

పృష్ఠతో వలనాత్ పూర్వకాయే సతి పరాఙ్ముఖే
నరస్యాభిముఖీ యా సా నివృత్తావర్తనే మతా. 394

సమకాలం శనైః పార్శ్వకట్యోరుద్వాహనాద్భవేత్
ఉద్వాహితా, పృథుశ్రోణ్యా గమనేఽపి పరస్యవా. 395

### ఊరుకర్మాణి

కంపనం వలనం స్తంభః ఉద్వర్తన నివర్తనే
ఇత్యూర్వోః పంచధాకర్మ విజ్ఞేయం నటనర్తకైః 396

పతనోత్పతనైః పార్ష్ణేః కంపనం వేపనం విదుః
స్యాద్గతౌ కాందిశీకానాం నీచపాత్ర పరిక్రమే. 397

## జ ఠ ర క ర్మ ము లు

క్షామము, ఖల్వము, పూర్ణము — అని కడుపు మూడువిధములు ; పలచనిది క్షామము; ఇది నవ్వు, ఆవలింత, నిట్టూర్పు, ఏడ్పు—వీనికి తగినది. 389

అక్కళించినది ఖల్వము ; శ్రమ, ఆకలి, రోగము, తపస్సు — వీనియందు తగినది. ఉబ్బినది పూర్ణము; వెలియూర్పు, అతిభోజనము, స్థూలవ్యక్తి, భోగి— వీనియందిది వచ్చును. 390

## క టి ల క్ష ణ ము

రేచితము, కంపితము, ఛిన్నము, నివృత్తము, ఉద్వాహితము — ఇట్లు కటి-మొలఐదు తెగలుగా నాట్య-నృత్తములందు చెప్పబడినది. 391

చుట్టును తిరుగునది రేచితము; ఇది భ్రమణములందు విహితము ; వేగముతో అడ్డముగా రాకపోకలు చేయునది కంపితము. 392

నీచుల, పొట్టివారి, గూనివారి—నడక ననుకరించుటయందు ఇది ప్రయోజ్యము. నడుమును త్రిప్పుట ఛిన్నము ; ఇది శ్రమ పడుటకు, వెనుదిరిగి చూచుటకు తగినది. 393

వెనుకకు తిరిగినప్పుడు దేహపూర్వభాగము పెడమొగముకాగా, చూచు నరుని కెదురైన కటి నివృత్తము; ఇది వర్తనమున(?) ఉపయోగించునది. 394

పార్శ్వమును, కటిని సమకాలమందు తిన్నగా మీదికెత్తుట, ఉద్వాహితము; ఇది గొప్పపిరుదులుగల స్త్రీనడకయందు, పురుషుని నడకయందైనను, వచ్చును. 395

## ఊ రు క ర్మ ము లు

కంపనము, వలనము, స్తంభము, ఉద్వర్తనము, నివర్తనము, అని తొడల నడక ఐదు విధములని నట—నర్తకులెరుగదగును. 396

మడమ పడుచు, లేచుచు, వణకుట కంపనమందురు ; దిక్కుదోపక పారిపోవునపుడు, నీచపాత్రముల పారాడుటయందు దీనిని చూపదగును. 397

జానునోఽభ్యంతరగతా వలనం సముదీరితమ్;
స్వేచ్ఛాసంక్రమణే స్త్రీణాం కరణే వలితోరుకే. 398

పరిత్యక్తక్రియం ప్రోక్తం స్తంభనం భీవిషాదయోః,
యదూర్వోరుః వలితావిద్ధో భవేదుద్వర్తనం తదా. 399

వ్యాయామే తాండవే, పార్ష్ణావభ్యంతరగతేపునః
నివర్తనం సముద్దిష్టం సంభ్రమాది పరిక్రమే. 400

జానుకర్మాణి

ఉన్నతం వివృతం నమ్రం అర్ధకుంచితకుంచితే
సంహతం సమమిత్యేవం సప్తధాజానుకథ్యతే. 401

శైలాద్యారోహణే నృత్తేచోన్నతం స్తనసంమితమ్
జానునోఽశ్లిష్టతో[1] హస్త్యారోహణే వివృతం మతమ్. 402

భూమౌ చేచ్చుంబనం నమ్రం నమస్కృతినిపాతయోః
భవేత్ నృత్తే నితంబస్య నమనాదర్ధకుంచితమ్. 403

ఊరుజంఘస్య సంశ్లేషాత్ కుంచితం మనుజాసనే
సంహతం జానునోశ్లేషాత్ స్త్రీణామీర్ష్యాత్రపాదిషు,
స్వభావస్థం సమం స్థానే సమపాదే ప్రయుజ్యతే. 404

జంఘాకర్మాణి

పరివృత్తం నతం క్షిప్తావర్తితోద్వాహితాన్యథ
ఇతి పంచవిధం కర్మ జంఘాయాః కథ్యతే స్ఫుటమ్. 405

పరివృత్తం గతం ప్రోక్తం పృష్ఠతస్తాండవాదిషు,
స్థానాసనగతాద్యేషు కుంచనాత్ జానునోర్నతమ్. 406

1. ఈ పాఠము విచార్యము. 'జానువిశ్లేషతో' అని యుండునా ?

మోకాలు తొడక్రిందికి చేరుట వలనము ; ఇది స్త్రీలు స్వేచ్ఛగా సంచరించునపుడు, వలితోరుకమను కరణమునందును చేయునది. 398

కదలక నిలుచుట స్తంభము ; ఇది భయవిషాదములందు రాదగును ; వలితముచేసి దాటించినచో ఉద్వర్తనము. 399

ఇది వ్యాయామమందు, తాండవమందును, వచ్చును ; మడమ లోనికి పోవుట నివర్తనము ; ఇది సంభ్రమముమున్నగువానితో తిరుగాడుచో వచ్చును. 400

## జానుకర్మములు

ఉన్నతము, వివృతము, నమ్రము, అర్ధకుంచితము, కుంచితము, సంహతము, సమము, — ఇట్లు జానువు—మోకాలు - ఏడు తెగలు. 401

స్తనముదాక ఎత్తినది ఉన్నతము ; ఇది కొండలు మొదలగువానియెక్కుట యందు, నృత్తమునందును వచ్చును. చేరికలేక వేరుగానున్నది. వివృత్తము, ఇది గజారోహణమందుండును. 402

నేలను సోకిన జానువు నమ్రము ; ఇది నమస్కారమున, పడినప్పుడు. వచ్చునది ; నితంబమును వంచుటచే అర్ధకుంచితమగును ; ఇది నృత్తమున వచ్చును. 403

తొడ పిక్కతో చేరినచో కుంచితము ; ఇది మనుష్యులు కూర్చున్నపుడు వచ్చును. మోకాళ్లు రెండును కలిసినది సంహతము ; ఇదిస్త్రీల యీర్ష్య, సిగ్గుమున్నగువానియందగును. సహజముగా నిలిచినది సమము ; ఇది సమపాదమను స్థానమున ప్రయోగింపదగును. 404

## జంఘాకర్మములు

పరివృత్తము, నతము, క్షిప్తము, ఆవర్తితము, ఉద్వాహితము, — ఇట్లు జంఘ, — పిక్క — పని యైదువిధములు. అవి స్ఫుటీకరింపబడును. 405

తాండవము మున్నగువానియందు వెనుకకు పోయినది పరివృత్తము. నిలుచుట, కూర్చుండుట, నడక మొదలగువానిలో మోకాళ్లు వంచినప్పుడు కుంచితము. 406

పాదవిక్షేపణాత్ క్షిప్తం వ్యాయామోద్ధతనృత్తయోః
పర్యాయాదన్యపార్శ్వాభ్యాం గచ్ఛతశ్చరణౌయది. 407

ఆవర్తితం తదా ప్రోక్తం విమూషకగతాగతే
ఆవిద్ధగమనాదౌ స్యాదుద్వాహితముదంచితమ్. 408

భ్రామితం నిస్సృతం కంపః తిరశ్చీనం బహిర్గతమ్
ఇత్యేతదపి జంఘాయాః కర్మోక్తపంచధా పరైః 409

భ్రామితం మండలభ్రాంత్యా వాద్యేడమరుకాభిధే
ఛత్రభ్రమరికాద్యేషు ; నిస్సృతం (నిర్గతం)[1]పురః ; 410

కంపః స్యాద్ధూననం త్రాసే ఘర్ఘరీణాంచవాదనే ;
పార్శ్వగామి తిరశ్చీనముక్తం పద్మాసనాదిషు
బహిర్గతం క్షితేః[2] పార్శ్వనిర్గతం ఖండసూచకే. 411

## పాదలక్షణమ్

సమాగ్రతలసంచార కుంచితోద్ఘట్టితాంచితాః
ఇతి పాదభిదాః పంచభవేయు ర్మునిసంమతాః. 412

సమస్థానే స్వభావేచ భూమిసంస్థః సమోమతః ;
యత్రోత్క్షిప్తో భవేత్ పార్ష్ణిః అంగుష్ఠాంగులయోఽంచితాః. 413
స్యాదగ్రతల సంచారీ సవిక్షేపే నికుట్టనే,
[3]..........................
అతిక్రాంతక్రమోదార గత్యుద్వర్తిత వర్తితే. 414

1. ఈ లుప్త పూరణము పరిష్కర్తది.

2. 'క్షితౌ' అను ర్వా. ప్ర. పాఠమును పరిష్కర్త యిట్లు సవరించిరి.

1. ఇక్కడ అగ్రతలసంచారిపాదమునకు వినియోగములు - తోదనము, స్థితము, పీడనము మున్నగునవి తెలిపెడు శ్లోకభాగము లొకటిరెండును, కుంచితపాదమును వివరించు

వ్యాయామమందు, ఉద్ధతనృత్తమునందును, పాదమును విసిరినప్పుడు క్షిప్తము. ఒకప్రక్కనుండి మరొక్కటికి పాదములు మార్చిమార్చి వేసినది ఆవర్తితము; ఇది విదూషకుని రాకపోకలలో. మీదికెత్తినది ఉద్వాహితము; ఇది దెబ్బతిన్నవడక మున్నగువానియందు. 407—408

భ్రామితము, నిస్సృతము, కంపము, తిరశ్చీనము, బహిర్గతము, — ఇట్లు మరియైదు జంఘాకర్మలు ఇతరులు చెప్పినారు. 409

మండలభ్రమణముచే తిరుగునది భ్రామితము; డమరుకవాద్యమందు, ఛత్రభ్రమరియనుకరణమందు ఇది వచ్చును. ముందుకు చాచినది నిస్సృతము. 410

విదిలించుట కంపము; ఇది భయమందు, చిరుగజ్జెలను వాయించుటయందును తగును. పిక్క ప్రక్కకు పోవుట తిరశ్చీనము; ఇది పద్మాసనాదులందుక్తము. నేల విడిచి ప్రక్కకు సాగినది బహిర్గతము; ఇది ఖండసూచకమను స్థానము నందుపయోజ్యము. 411

### పాదలక్షణము

సమము, అగ్రతలసంచారము, కుంచితము, ఉద్ఘట్టితము, అంచితము, అని పాదభేదములైదు భరతముని సమ్మతములు. 412

నేలమీద చక్కగా ఊనినయడుగు సమము; ఇది సమస్థానమను కరణమున, స్వభావస్థితియందు వచ్చును.

మడమను మీదికెత్తి వ్రేళ్లు ఇంచుక వంచిన పాదము అగ్రతల సంచారి; ఇది ప్రక్కకుత్రోయుచు దంచుటకు ఉపయోగించును.

(మడమ మీదికెత్తి, వ్రేళ్ళును, నడిమిభాగమును కుంచించినది కుంచిత పాదము.) ఇది అతిక్రాంతమను చారియందు, ఉదాత్తమైన నడకయందు, ఉద్వర్తితవర్తితములందు (క్రిందుమీదులుచేయుటలందు)[1]—వర్తించును. 413

---

1. ఇది శ్రీ పోణంగి శ్రీ రామఅప్పారావుగారు సూచించిన యర్థము. (వారి నాట్యశాస్త్రము — పుట 321)

స్థిత్వా యత్ర తలాగ్రేణ పార్ష్ణితో ఘట్ట్యతే క్షితిః
ఉద్ఘట్టితః , తదాఖ్యేషు కరణేషు సకీర్తితః. 415

ప్రయోగానుకృతా చారీప్రసారేచాసకృత్ సకృత్
ఊర్ధ్వమగ్రతలం భూమౌ పార్ష్ణిరంగులయోఽంచితాః. 416

యస్మిన్ పాదేఽంచితః సస్యాత్ ; పదాగ్రక్షత చంక్రమే
వర్తితోద్వర్తితే పాదాహతా భ్రమరకేఽపిచ. 417

తాడితో ఘట్టితోత్సేధో ఘట్టితో మర్దితోఽగ్రగః
పార్ష్ణిగః పార్శ్వగః సూచీసంజ్ఞకోఽంగులిపృష్ఠగః. 418
తలాహతిరితి ప్రాహురస్య భేదాన్ పరే దశ
పార్ష్ణినా భువమాలంబ్య తలస్యాగ్రేణ తాడయన్. 419
తాడితః కోపగర్వాదౌ ఘర్ఘరాణాంచ వాదనే
పార్ష్ణినా తాడయన్నగ్రతలేనాపి ముహుర్ముహుః. 420
ఘట్టితోత్సేధ సంజ్ఞః స్యాత్ ఘర్ఘరీవాదనాదిషు.
ఘట్టితః పార్ష్ణినా విఘ్నన్ కరభాశ్వాది నోదనే.[1] 421

ఘృష్యన్[2]తిర్యక్ తలేనోర్వ్యాం మర్దితః కింకిణీవిధౌ
పురతః స్ఖలితః శీఘ్రమగ్రగః పథిపిచ్ఛిలే. 422

---

గ్రంథమును పడిపోయినవని పరిష్కర్త సూచన (Note below). వారుద్ధరించిన కుంచిత లక్షణము భరతమునిది, ఇది :—

"ఉత్క్షిప్తా యస్యపార్ష్ణిః స్యాత్ అంగుల్యః కుంచితాస్తథా
తథా కుంచిత మధ్యశ్చ సపాదః కుంచితః స్మృతః"

(భరతనా. శా. ౧౦-౩౦. కాశి ముద్రణము.)

1. ఇది పరిష్కర్త సవరించిన పాఠము. 'కరపార్శ్వా దినే దినే', కరపార్శ్వాది నోదనే' అని వ్రా ప్ర.
2. 'ఘృష్య త్తిర్యక్' ఈ ముద్రిత పాఠము సరికాదు. సవరణ నాది.

కొనయడుగుమీద నిలచి మడమచేత నేలను తట్టుట ఉద్ఘట్టితము; ఇది ఆ పేరుగల కరణములందు, ప్రయోగముననుకరించుటయందు, చారీప్రసారము నందు, ఒకమారుగాని పలుమార్లుగాని వచ్చును.

పాదాగ్రమును పైకెత్తి, నేలపై మడమనూని, వ్రేళ్ళువంగియున్నది అంచితము; *ఇది గాయపడిన తుదికాలితో నడచునపుడు, వర్తితో ద్వర్తితము నందు, కాలితో తన్నునపుడు, భ్రమరకమను మండలమునందు, వచ్చును. 416, 417

తాడితము, ఘట్టితోత్సేధము, ఘట్టితము, మర్దితము, అగ్రగము, పార్ష్ణిగము, పార్శ్వగము, సూచి, అంగుళిపృష్ఠగము, తలాహతి — ఇట్లు ఇతరులు పదిపాదభేదములు చెప్పుదురు.

మడమచేత నేలను పట్టుకొని తుది యడుగును తట్టుట తాడితము; ఇది కోపము, గర్వము, మొదలగువానియందు, చిరుగజ్జెలను వాయించుటకును, ఉపయోగించును. 418, 419, 420

మడమను తుదియడుగును పలుమారు తట్టుచున్నది ఘట్టితోత్సేధము; ఇది ఘర్ఘరుల వాదనమున వచ్చును. మడమచేకొట్టుట ఘట్టితము; ఇది గాడిద, గుఱ్రము, మున్నగువానినదలించుటయందు. 421

అరకాలితో అడ్డముగా రాచుట మర్దితము; ఇది గజ్జెలనాడించుటకు; త్వరగా ముందుకు జారునది అగ్రగము; ఇది నున్నని నేలమీది నడక యందు. 422

పృష్ఠతః పార్ష్ణినా గచ్ఛన్[1]పార్ష్ణిగః కింకిణీవిధా
తిష్ఠన్ పార్శ్వేన గచ్ఛన్వా పార్శ్వగః కంటకోద్ధృతా. 423

ఆసనేచ భవేన్నృత్తే సస్ఫురో బహుభంగిభిః
పార్ష్ణిముత్క్షిప్య యో భూమావంగుష్ఠాగ్రేణ తిష్ఠతి. 424

ససూచీతి మతో నృత్యే విలాసావస్థితావపి
తిష్ఠన్ సర్వాంగులీపృష్ఠైరంగులీపృష్ఠగో భవేత్
స్ఫురితాయాం తథాస్థానే బుధైర్నృత్యే విధీయతే. 425

సశబ్దం తాడనం భూమేః తలేనస్యాత్ తలాహతిః,
తాండవే ధావనే కోపే ఘర్ఘరీణాంచ వాదనే. 426

**పాదాంగులీలక్షణమ్**

బ్రూమః పాదాంగులీలక్ష్మ పాదలక్ష్మప్రసంగతః
ఉత్క్షిప్తాః కుంచితాః స్తబ్ధాః అవక్షిప్తాః స్వభావజాః. 427

అనంగుష్ఠయుతాంగుష్ఠసంయుక్తాశ్చేతి సప్తధా.
ఉత్క్షిప్తా ముహురున్నీతాః త్రపాయాం ముగ్ధయోషితః. 428

(ఉత్క్షిప్తాః—1)

యదా సంకోచరూపేణ నామితాః కుంచితాస్తదా
మూర్ఛిత త్రస్త శీతార్త గ్రహావిష్టేషు కీర్తితాః. 429

(కుంచితాః—2)

కాష్ఠవన్నిశ్చలాః స్తబ్ధాః, మృతా స్తంభేఽంగమోటనే (స్తబ్ధాః—3)
అవక్షిప్తాః సమాఖ్యాతాః అధోనీతాః పునః పునః, 430
పృష్ఠతస్సరణే స్త్రీణాం బిబ్బోకే కిలికించితే. (అవక్షిప్తాః—8)
ప్రకృత్యైవ స్థితాః భూమౌ ప్రకృతా స్యుః స్వభావజాః. 431

(స్వభావజాః—5)

1. 'గచ్ఛత్' ఈ ముద్రిత పాఠము సరికాదు. సవరణ నాధి.

మడమ వెనువెనుకకు నడుచుట పార్ష్ణిగము; ఇది గజ్జెలనాడించుటకు. ప్రక్కవాటుగా నిలిచినగాని, నడిచినగాని పార్శ్వగము; ఇది ముల్లుదీయుట యందు వచ్చును; నృత్తమున కూర్చున్నప్పుడు ఇది పలురీతులుగా అదరు చుండును.

మడమ మీదికెత్తి బొటనవ్రేలి తుదిమీద నిలిచిన పాదము సూచియనబడును; ఇది నృత్యమందు, సవిలాసమైన నిలుకడయందును, వచ్చును. అన్నివ్రేళ్ళ వీపులమీద నిలుచునది అంగుళీపృష్ఠగము; ఇది 'స్ఫురితా' అను దేశీపాద భేదమునందును, నృత్యమున నిలుచుటయందును పండితులు విధింతురు. 423, 424, 425

చప్పుడగునట్లు అరకాలితో నేలనుమెట్టుట తలాహతి; ఇది తాండవమున, పరువెత్తుటకు, కోపమునందు, ఘర్ఘరుల వాయించుటకు వినియోగింపదగును. 426

### పా దాం గు ళీ ల క్ష ణ ము

పాదలక్షణము చెప్పిన ప్రసంగవశమున పాదాంగుళుల లక్షణమును చెప్పు దుము.— ఉత్క్షిప్తములు, కుంచితములు, స్తబ్ధములు, అవక్షిప్తములు, స్వభావ జములు, అనంగుష్ఠయుతములు, అంగుష్ఠసంయుక్తములు — ఇట్లు కాలివ్రేళ్ళు ఏడువిధములు. మాటిమాటికిని మీదికెత్తినవ్రేళ్ళు ఉత్క్షిప్తములు; ఇవి ముగ్ధ స్త్రీలు సిగ్గుపడినప్పుడు చూపదగినవి. (ఉత్క్షిప్తములు—1) 427, 428

ముడిగినట్లు వంచబడినవి కుంచితములు; మూర్ఛపోయినవారు, భయపడిన వారు, చలికోర్వనివారు, దయ్యముపట్టినవారు, — వీరి విషయమున ఇవి ప్రయోగింపదగినవి. (కుంచితములు—2) 429

కట్టెవలె కదలకుండునవి స్తబ్ధములు; ఇవి మృతి, ప్రమానుపాటు, ఒడలి విరుపు—వీనియందువచ్చును. (స్తబ్ధములు—3)

మరిమరి క్రిందికి దించినవి అవక్షిప్తములు; ఇవి వెనుకకు జరుగుటయందు, స్త్రీల బిబ్బోక కిలికించితములందును వచ్చును. (అవక్షిప్తములు—4)

సహజముగా ఉన్నట్లే నేలమీదనుండునవి స్వభావజములు. 430, 431
(స్వభావజములు—5)

అనంగుష్ఠయుతాః ప్రోక్తాః త్యక్తాంగుష్ఠామిథః శ్రితాః
పాదత్రారోహణే పూగదండాదిగ్రహణే ఋతేః. 432
(అనంగుష్ఠయుతాః—6)

అంగుష్ఠసంయుతాః ప్రోక్తాః సహాంగుష్ఠాః మిథః శ్రితాః
అంఘ్రేః స్తంబేరమస్యేవ, రజ్జుగర్భప్రవేశనే, 433

ఆముక్తౌ నూపురాదీనాం దూరస్థాకర్షణేఽపిచ.
(అంగుష్ఠసంయుతాః—7)
అంగుష్ఠః సర్వసంయోగాదంగులిత్వం క్వచిద్భజేత్. 434

ఉత్క్షిప్తోఽవనతోఽంగుష్ఠః సహజశ్చేతి సత్రిధా ;
ఉన్ముఖీకృతముత్క్షిప్తం[1] ప్రాహుర్నఖముఖాదిషు. 435
(ఉత్క్షిప్తః—8)

నామితోఽవనతోఽధస్తాత్ క్రియా భూమ్యాదిలేఖనే. (అవనతః—9)
సహజస్తు స్వభావస్థః ప్రస్థితా పరికీర్తితః. (సహజః—10) 436

అంగానాం లక్షణం సర్వం వినియోగసమన్వితమ్
ప్రోక్తం జాయచమూపేన మునేరాశయవేదినా. 437

ఇతి
శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక జాయసేనాపతి
విరచితాయాం నృత్తరత్నావల్యాం అంగనిరూపణం నామ
ద్వితీయోఽధ్యాయః

1. 'ఉత్క్షిప్తః' అను ముద్రిత పాఠముకన్న 'ఉత్క్షిప్తం' అను ప్రా. ప్ర. పాఠమే సరసము.

బొటనవ్రేలిని విడిచి తక్కినవి ఒండొంటి చేరికతోనున్నవి అనంగుష్ఠయుత
ములు ; ఇవి పాదరక్షలు తొడుగుకొనుట, తీసికొనుట—వీనియందువచ్చును.
(అనంగుష్ఠయుతములు—6) 432

ఏనుగుకాలివలె బొటనవ్రేలితోగూడ ఒండొంటి చేరువగానున్నవి అంగుష్ఠ
యుతములు ; తలుగులోపల దూర్చుట, అందెలు మున్నగువానిని తొడుగుట,
దూరమందున్న వస్తువు నీడ్చుకొనుట, వీనికివి యుపయుక్తములు.
(అంగుష్ఠసంయుతములు—7)

అంగుష్ఠము తక్కినయన్నివ్రేళ్ళతోను గలసి ఒక్కప్పుడు వానిలో నొకటిగా
గ్రహింపబడును (అంగుళీ లక్షణములన్నియు దీనికిని చెల్లునన్నమాట).
433, 434

ఉత్క్షిప్తము, అవనతము, సహజము, - అని అంగుష్ఠము, మూడుతెగలు ;
మీదిమొగమైనది ఉత్క్షిప్తము ; ఇది నఖముఖాదులందు (?) 435
(ఉత్క్షిప్తము—8)

క్రిందికివంచినది అవనతము ; సిగ్గుచే నేల మున్నగువానిని గోకుటయందిది
వచ్చును. (అవనతము—9)

స్వభావముతోనుండునది సహజము ; ఇది నడుచునపుడు. 436
(సహజము—10)

భరతమునియాశయమెరిగిన జాయసేనాపతి వినియోగముతోడి అంగలక్షణము
లన్నియు స్పష్టముగా ఇట్లు వచించెను. 437

ఇది

శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుడగు
జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు
అంగనిరూపణ మను రెండవ యధ్యాయము.

# అథ తృతీయోఽధ్యాయః

లీలోల్లసచ్చాపగతి ప్రబంధమృగీప్లుతోద్యద్భ్రమరీమనోజ్ఞామ్
సస్యందితాఙ్గాం జనితోరుశోభాం వక్ష్యామి చారీం వనరాజితుల్యాం. 1

## చా రీ ల క్ష ణ మ్

భవేదౌణాదికత్వాదిఞ్ చరేః కరణభావయోః
కృదికారాత్ కృతే ఙీషి సిద్ధం చారీత్యతః పదమ్. 2

చార్యః కట్యాది పాదాంత చేష్టయైవ భవంతి యత్
వినియోగః పృథక్తాసాం నప్రత్యేకం భవేత్తతః. 3

ధ్రువం పాదస్య యత్కర్మతత్ జంఘోరుకృతం యతః
పాద జంఘోరుకరణం తతః కుర్యాద్ధ్రువం సమమ్. 4

[1](ప్రవర్తయేతే) చరణావూరుజంఘే యతస్తతః
తుల్యత్వకరణాదేషాం పాదచారీ ప్రశస్యతే. 5

పాదస్యైకస్య యశ్చారః స చారీతి నిగద్యతే
కరణం పాదయోశ్చారః ఖండస్తుకరణైస్త్రిభిః. 6

ఖండైః త్రిభిశ్చతుర్భిర్వా మండలం మిలితైర్మతమ్
గతౌయుద్ధే నియుద్ధేచ చక్రశక్త్యాదిమోచనే
నృత్తే నాట్యేచ చారీభిర్వినా కించిత్ [నవర్తతే]. 7

1. ఇది లుప్తపూరణము. 'ప్రవర్తతే' వంటి దేదో యుండదగునని పరిష్కర్త సూచన. (Notes P. 19). 'చరణౌ' అనుదానికి తగినట్లు ఈ చిరుమార్పు నా సూచన.

# ఇక మూడవ యధ్యాయము

లీలతో ఎగురాడు పాలపక్షులు, గుంపుగట్టిన లేళ్ళు, లేచి తిరుగు తుమ్మెదలు—వీనిచే మనోహరమైనది, నదులు, తామరలను గలది, గొప్పశోభగలదియు నగు వనశ్రేణివలెనుండు — (అదియు చాషగతి, మృగప్లుతము, భ్రమరి — వీనితో అందమైనది ; స్యందిత, జనిత అనువానిచే శోభాజనకమైనది) చారిని వివరింతును. 1

## చారుల లక్షణము

'చర'ధాతువుపై ఉణాదిసూత్రముచే 'ఇఙ్'(ఇ) ప్రత్యయము, కరణము—భావము—అనునర్థములందు వచ్చి, ఆపై 'కృదికారాదక్తినః' అను పాణిని సూత్రముచే ఙీష్ (ఈ) ప్రత్యయముచేరి 'చారీ' అను పదము సిద్ధించినది. 2

చారులు కటిమొదలు పాదములవరకుగల యంగముల చేష్టచేతనే యేర్పడును గనుక వానికి ప్రత్యేకముగా వినియోగము గలుగదు. 3

పాదము చేయుపనియంతయు నిజముగా జంఘలును తొడలును చేయునదే. కనుక పాదజంఘోరువుల వ్యాపారమును దిట్టముగా సమముగా చేయదగును. 4

చరణములు పిక్కలను, తొడలను, నడపును. కనుక ఈ మూటిని సమానముగా నడపుటచే పాదచారి ప్రశస్తమగును. 5

ఒకకాలిపని చారి యనబడును ; రెండుపాదములది కరణమగును; మూడు కరణముల చారము ఖండమనబడును. 6

ఖండములు మూడో. నాలుగో చేరి చేయుట, మండలమగును. నడకయందు, యుద్ధమున, బాహుయుద్ధమున, చక్రము, శక్తి మున్నగు వానిని ప్రయోగించుటయందును చారులులేక, నృత్తమందుగాని, నాట్యమందుగాని యేమియు సాగదు. 7

షోడశ భూచార్యః

సమపాదా స్థితావర్తా జనితా స్యందితా మతా. 8

తథాఽవస్యందితా బద్ధా శకటాస్యాఽథ విచ్యవా
ఏలకాక్రీడితా చాషగతి రుత్స్యందితాఽడ్డితా. 9

సమో సరితమత్తల్లీ మత్తల్ల్యధ్యర్ధికా తతః
ఊరూద్వృత్తేతి భూచార్యః షోడశైతాః ప్రకీర్తితాః. 10

షోడశ ఆకాశచార్యః

అతిపార్శ్వాపసూర్వాః స్యుః క్రాంతాః సూచీమృగప్లుతా[1]
భుజంగత్రాసితాఽలాతాఽవిద్ధా నూపురపాదికా. 11

ఆక్షిప్తా భ్రమరీ దండా విద్యుద్భ్రాంతాభిధా తతః
ఊర్ధ్వజాను రథోద్వృత్తాదోలాపాదేతి షోడశ. 12

ఆకాశిక్యః స్మృతాశ్చార్యః[2] ప్రోక్తాస్తైః భరతాదిభిః
భూమ్యాకాశచరత్వేన ప్రాయశస్తాస్తదాహ్వయాః. 13

భౌ మ చా ర్యః

స్థిత్వైవ సమపాదేన భౌమిమాకాశికీమపి
యతః కుర్యాత్ తతశ్చారీ సమపాదా నిగద్యతే. 14

[3]శ్లిష్ట పార్ష్ణినఖం (యస్మాత్)[4] తిష్ఠంత్యేకైకశో వ్రజేత్
సమం పాదద్వయం తస్మాత్ సమపాదేతి సంస్మృతా. 15

మునేరాశయమజ్ఞాత్వా కైశ్చిత్ శాస్త్రవిధాయిభిః
సమపాదయుగస్థానమాత్రేణైషా ప్రకీర్తితా. 16

---

1, 2, 3. 'ప్లుతాః', 'చార్యాః', 'శ్లిష్టః' అనునవి ముద్రాదోషములు.
4. పరిష్కర్త లుప్తపూరణము.

### పదునారు భూచారులు

సమపాదము, స్థితావర్తము, జనితము, స్పందితము, అవస్పందితము, బద్ధము, శకటాస్యము, విచ్యవము, ఏలకాక్రీడితము, చాషగతి, ఉత్స్యందితము, అడ్డితము, సమోసరితమత్తల్లి, మత్తల్లి, అధ్యర్ధికము, ఊరూద్వృత్తము—ఇట్లు భూచారులు పదునారు. 8, 9 10

### పదునారు ఆకాశచారులు

అతిక్రాంతము, పార్శ్వక్రాంతము, అపక్రాంతము, సూచి, మృగప్లుతము, భుజంగత్రాసితము, అలాతము, ఆవిద్ధము, నూపురపాదిక, ఆక్షిప్తము, భ్రమరి, దండము, విద్యుద్భ్రాంతము, ఊర్ధ్వజానువు, ఉద్వృత్తము, దోలాపాదము—అని పదునారు ఆకాశచారులను భరతముని మొదలగు ప్రాచీనులు చెప్పినారు.

ఎక్కువగా భూమియందును, ఆకాశమందును చరించుటచేత ఆ పేళ్ళు వానికి కలిగినవి. 11, 12, 13

### భూచారులు

సమపాదముతో నిలిచియే భౌమ—ఆకాశికచారులను చేయవలయునుగాన ఈచారి సమపాదమని చెప్పబడుచున్నది. 14

మడమలును, కాలిగోళ్ళును చేరికాగానుండునట్లు నిలుచుండి, రెండుపాదములును సమముగా ఒక్కొక్కటిగా నడచునది సమపాదచారి. 15

కొందరు శాస్త్రకారులు, భరతముని యభిప్రాయము తెలిసికొనక, రెండడుగులును సమానముగా నిలుచుట మాత్రమే దీని లక్షణమనిరి. 16

యద్యేవం కరణం నస్యాత్ భి[న్నం సమనఖాభిధమ్][1]
అస్యాశ్చలనశీలత్వాత్ పాదై రిత్యబ్రవీన్మునిః. (సమపాదా-1) 17

పాదస్యాగ్రతలేనోర్వీం ఘర్షన్ పార్శ్వేఽన్యతః క్షిపేత్
జానుభ్యాం స్వస్తికం యావత్ కుర్యాదంతరమండలమ్. 18

తదన్యముత్క్షిపన్ స్వస్య పార్శ్వేఏవ నివేశయేత్
స్థితావర్తా భవేత్ [చారీ][2] స్థిత్వాస్థిత్వా ప్రవర్తనాత్, 19
అనుక్తాస్తు బుధై రేవ జ్ఞేయాః చారీ నిరుక్తయః (స్థితావర్తా-2)

వక్షోజప్రణయీ ముష్టిః అన్యోఽప్యావర్తితఃకరః 20
యస్యాం సాజనితాజ్ఞేయా పాదస్తుతలసంచరః
ఏతాం దేశీవిదః కేచిదూచుః మునలఘూటికామ్. (జనితా-3) 21

నిషణ్ణోరుః సమోవామః తిర్యగంఘ్రిః ప్రసారితః
పంచతాలాంతరం యస్యాం స్యందితేయం నిగద్యతే. 22

తాలస్తత్కరాంగుష్ఠమధ్యయోః తతయోర్మితిః (స్యందితా-4)
స్యాదవస్యందితా తద్వదస్యా ఏవ విపర్యయాత్; 23

యద్యపి స్ఫుటమాలీఢ ప్రత్యాలీఢ సమే ఇమే
[3][తయోరచలయోర్భిన్నే] తథాప్యేతే యతశ్చలే. 24
(అవస్యందితా-5)

భవేత్ స్వస్తికరూపేణ సంవేధో జంఘయోర్మిథః
తతో వలనమూరుభ్యాం యస్యాం బద్ధేతి సాస్మృతా. 25

1, 2, 3. పరిష్కర్త లుప్తపూరణములు

అట్లైనచో 'సమనఖ' మను కరణము దీనికంటె వేరుగా నుండకపోవును. ఈ చారి నిలుచునదికాక చలించునదిగనుక భరతముని 'పాదాభ్యాం' అని ద్వివచనము చెప్పక 'పాదైః' అని బహువచనముతో నిర్దేశించెను.[1] (సమపాదము—1) 17

తుదియరకాలితో నేలను రాచుచు, మోకాళ్ళు రెండును స్వస్తికముగా నేర్పడునట్లు ఇంకొకప్రక్కకు కాలు సాగించవలయును; ఇట్లు లోపలి మండల మేర్పరుపవలెను; తరువాత రెండవకాలిని విడదీసి యెత్తి, అట్లే తన పార్శ్వము నందే చేర్పవలయును. ఇది స్థితావర్తము, నిలిచి నిలిచి ప్రవర్తించును గనుక. 18, 19

చారీ నిర్వచనములతో చెప్పనివానిని పండితులే తెలిసికొనదగును.
(స్థితావర్తము—2)

ఒకచేయి పిడికిలిపట్టి స్తనములకు చేరువగానుంచి, ఇంకొకహస్తము త్రిప్పుచు అడుగు తలసంచరముగా నడపుట జనితము; దేశిమార్గము నెరిగిన కొందరు దీనిని 'ముసలఘూటిక' అని పేర్కొనిరి. (జనితము—3) 20, 21

తొడలు క్రిందికి దించి, యెడమకాలి యడుగు సమముగా నుండగా, కుడి యడుగు ఐదుతాలముల నడిమికొలత యుండునట్లు చాచిన చారి స్యందితము; తాలమనగా వారి వారి చేతుల బొటన—నడిమి వ్రేళ్ళు చాచిన కొలత.
(స్యందితము—4)

అట్లే కాళ్ళు మార్చి చేసినచో ఆ చారి అవస్యందితము; ఇవి నిజముగా ఆలీఢ - ప్రత్యాలీఢ స్థానములతో సమానములే; కాని అవి నిశ్చలములు, ఇవి చలములు; గనుక భిన్నములు. (అవస్యందితము—5) 22, 23, 24

చిరుదొడలు పరస్పరము స్వస్తికముగా తగులుకొని, తరువాత మోకాళ్ళు తొడల క్రిందికి చేరుట బద్ధము. 25

---

1. భ. నా. శా. 11—14.

అస్యాం స్వస్తిక విశ్లేషం యావత్పాదతలాగ్రయోః
మండలభ్రమణాత్ స్వస్వపార్శ్వయోర్గ [మనం...][1]
ఇత్యూర్ధ్వోర్వ్వలనం యుక్తం కేచిదూచు ర్విపశ్చితః. (బద్ధా—6) 26

ఉద్వాహితమురః పూర్వ నిషణ్ణాంగః స్వపార్శ్వతః
తిర్యక్ ప్రసారయేదేకం చరణం తలసంచరమ్
స్థితేఽన్యస్మిన్ సమేపాదే శకటాస్యాఽభిధీయతే. 27

ఏతయా శకటం క్షేప్యమితి ప్రాప్తా యథార్థతా
...కల్ప్యతే కైశ్చిద (ది ?)యం పాదస్య రేచనాత్. 28
(శకటాస్యా—7)

క్రమాత్ పాదతలాగ్రాభ్యాం మహీతల నికుట్టనైః
విచ్యుతేః సమపాదాఙ్గం విచ్యవేత్యభిధీయతే. (విచ్యవా—8) 29

తలసంచరయోర్యస్యాం పాదయోః క్రమశో భవేత్
ఉత్ప్లుత్య పతనం సేయమేలకా క్రీడితా (మతా) 30
(ఏలకాక్రీడితా—9)

పురః ప్రసారితస్సవ్యం (వ్యః ?) తాలమాత్రం తతః పునః
ద్వితాలం కించిదుత్ప్లుత్య వామేన సహ పృష్ఠతః
శ్లిష్టః స్యాదేవమభ్యాసీ పాదశ్చాషగతిర్భవేత్ (చాషగతిః—11) 31

కనిష్ఠాంగుష్ఠభాగాభ్యాం బాహ్యాభ్యంతరతః క్రమాత్
పాదస్స్పృశన్ శనైర్య [త్ర కురుతేచ గ][2]తా గతమ్. 32

రేచకస్యానుసారేణ సేయముత్స్యందితామతా,
రేచితః కైశ్చిదత్రోక్తో నృత్తహస్తో విచక్షణైః. 33
(ఉత్స్యందితా—12)

---

1, 2. ఇది పరిష్కర్త లుప్త పూరణము.

ఈ చారిలో స్వస్తికమును విడదీసి అరకాళ్ళకొనలతో మండలభ్రమణము చేసి తమ తమ పార్శ్వములకు చేర్చుట ఊరువుద్వృత్తమనదగునని కొందరు పండితు లన్నారు. (బద్ధము—6) 26

పూర్వాంగము దిట్టముగా నిలుపుకొని, యెదను ఎత్తి, ఒక కాలిని తల సంచరముగా అడ్డము చాచి, ఇంకొక కాలిని సమముగా నుంచుకొనుట శకటాస్యము 27

దీనితో బండిని తోలుదురు గాన ఈ పేరు సార్థకము. కొందరు దీనియందు పాదమును అటునిటు కదలింపవలెనని కల్పింతురు. (శకటాస్యము—7) 28

సమపాదచారియందు క్రమముగా అరకాలికొనలతో నేలను తట్టుచు పాదము లకు విచ్యుతి - విడివడుట - గలిగించినచో అది విచ్యవము అనబడును. 29
(విచ్యవము—8)

తలసంచారపాదములు క్రమముగా ఎగిరెపడుట గలది ఏలకాక్రీడితము. 30
(ఏలకాక్రీడితము—10)

కుడికాలొకతాలమంత ముందుకు చాచి ఆపై రెండుతాలములంత వెనుకకెత్తి యీడ్చి యెడమకాలితోగూడి నిలుచుట, ఇట్లు పలుమారు చేయుట చాషగతి.
(చాషగతి—11) 31

చిటికెనవ్రేలి మీదిభాగముతోను, బొటనవ్రేలి యడుగు భాగముతోను క్రమ ముగా, రేచకానుసారముగా, పాదము సాగుచు రాకపోకలు తిన్నగా చేయుట ఉత్స్యందిత మనబడును; కొందరు పండితులు దీనియందు రేచితమను నృత్తహస్త మును ప్రయోగింపవలె నందురు. (ఉత్స్యందితము—12) 32, 33

సమస్థితస్య పాదస్య ద్వితీయస్తలసంచరః
అగ్రేపృష్ఠేచ సుశ్లిష్టః క్రమాత్ సాచాడ్డితా మతా:
అగ్రథేతి ప్రసిద్ధేతి గురుః కీర్తిధరోఽబ్రవీత్. (అడ్డితా—13) 34

తలసంచరమేకేన ఘూర్ణమానేన కుర్వతా
అన్యేన స్వస్తికం యస్యాం పశ్చాద్యేణోపసర్ప్యతే. 35

సమోసరితమత్తల్లి మతేయం మధ్యమే మదే;
అన్యేతు స్వస్తికం హిత్వా యుగపద్ఘూర్ణమానయోః 36

పాదయోర్వలనాదస్యాం కథయంత్యుపసర్పణమ్;
మత్తపాదేతి లోకేఽస్యాః ప్రసిద్ధమభిధాంతరమ్. 37
(సమోసరితమత్తల్లీ—14)

జంఘా స్వస్తికయోగేన లగ్నా ఖిలతలౌ భువి,
ఘూర్ణమానౌ ముహుః, కించిత్ త్ర్యశ్రితా వుపసర్పతః. 38

పాదౌ, హస్తౌ తథోద్వేష్టైరపవేష్టైశ్చ సంయుతౌ
భవేతాం యత్రమత్తల్లీ (ం ?) నామ్నాఽహుస్తరుణే మదే.
అపసర్పణమిత్యేకే స్ఖలత్పాదాభిధాం పరేం. (మత్తల్లీ—15) 39

సవ్యస్య పృష్ఠదేశే స్యాత్వా[1]... ... ...
... ... ... నృత్తజ్ఞైరూరూద్వృత్తపదేరితా. 40

['సవ్యస్య పృష్ఠతో వామశ్చరణస్తుయదాభవేత్
తస్యాపసర్పణం చైవ జ్ఞేయాసాఽధ్యర్ధికా బుధైః
తలసంచరపాదస్య పార్ష్ణిః బాహోర్న్యస్మఖి యదా
జంఘాఽంచితా తథోద్వృత్తా ఊరూద్వృత్తేతి సాస్మృతా']
(ఊరూద్వృత్తా—16)

1. ఈ గ్రంథపాతమందు అధ్యర్ధికచారి తరువాతి లక్షణము, ఊరూద్వృత్తచారి పూర్ణ లక్షణమును పోయినవి. కుండలీకృతములు, ఆ రెంటి భరతనాట్యశాస్త్ర లక్షణ శ్లోకములు; విషయపూర్తికై పరిష్కర్త యుద్ధరించినవి.
(భ. నా. బరోడా ముద్ర. 10-17, 22).

ఒకపాదము సమస్థితిలో నుండగా రెండవది తలసంచరమై క్రమముగా ముందు వెనుకభాగములతో ఒరయుచున్నది అడ్డితచారి, దీనికి 'అగ్రగథ' యని పేరు ప్రసిద్ధముగా నున్నదని ఆచార్యకీర్తిధరుడు వచించెను. (అడ్డితము—13) 34

ఒకపాదము తలసంచరమై యదరు చుండగా, ఇంకొకటి అట్లే స్వస్తికము చేయుచు చేరవలయును. ఇట్లు మార్చి మార్చి చేయునది సమోసరితమత్తల్లి; ఇది నడుమంత్రపు మత్తును సూచించుచు.

స్వస్తికమును వదలి యేకకాలమందే అదరుచున్నపాదములు రెండును మరిమరి చేరుకొనుట దీనిలక్షణముగా మరికొందరు చెప్పుదురు. దీనికి 'మత్తపాదము' అని యింకొక పేరు లోకమున ప్రసిద్ధముగానున్నది. 35, 36, 37

(సమోసరితమత్తల్లి—14)

స్వస్తికము చేసిన చిరుదొడలును, నిండుగా నేలమోచిన అరకాళ్ళను గల పాదములు, కొంచెము ఎడముగా అదరుచు చేరుట, అప్పుడు హస్తములు ఉద్వేష్టితములును, అపవేష్టితములునుగా సాగుచుండుట—ఇది మత్తల్లి. నిండు మత్తులో దీని వినియోగము; అపసర్పణమని కొందరు, స్ఖలత్పాదమని మరికొందరు దీనిని పేర్కొనిరి. (మత్తల్లి—15) 38, 39

(ఎడమపాదము కుడికాలిమడమ వద్దికి చేరినప్పుడు ఆ కుడికాలు ప్రక్కకు జరుగవలయును. అది అధ్యర్ధికమని బుధులందురు. (అధ్యర్ధికము)

తలసంచరముగానున్న ఒక కాలిమడమ ఇంకొకకాలి మీది బాగమును చూచుచుండగా, దాని చిరుదొడ వంకరగా నుండి రెండవకాలి చిరుదొడ వంకకు సాగియుండునది ఊరూద్వృత్తము.) (ఊరూద్వృత్తము—16) 40

**ఆకీశికాచార్యః**

ప్రసార్య పురతః కించిత్ పాత్రప్రకృతిభేదతః
యత్రోత్క్షిప్తం [చతుస్తాలాద్యంతరం ......
అగ్రేణ పాతయేత్ భూమా]వతిక్రాంతేతి తాం విదుః. 41

అనుక్తత్వాద్విశేషస్య మునినా తస్య చిత్తవిత్
పాదస్య పార్శ్వపవేతి న్యాయాత్ కీర్తిధరోఽబ్రవీత్. 42
(అతిక్రాంతా—1)

కుంచితం చరణం తిర్యక్ గత్వా పార్శ్వే సముత్థితమ్
యదాచోద్ఘట్టితం న్యస్యేత్ [పార్శ్వాద్యే]² యమితి శ్రుతా. 43

ఊరుక్షేత్రే ద్వితీయస్య యావదుత్క్షిప్య పాతయేత్
పాదముద్ [ఘాటి (ఘట్టి ?) తే]³ నాస్య (స్యా ?) లక్ష్మ కీర్తి
ధరోఽభ్యధాత్.
తత్రాబ్రవీత్ పార్ష్ణి చండఘాతేతి కిల లోకతః (పార్శ్వక్రాంతా—2) 44

బద్ధాం చారీం [విధాయాదౌ]⁴పాదముద్ధృత్య కుంచితమ్
స్వపార్శ్వే నిక్షిపేద్య స్యామపక్రాంతేతి సాస్మృతా. 45

... ... ఉత్క్షిప్యపాదం తత్ పార్శ్వతో న్యసేత్
ఇతికీర్తిధరస్త్వాహ విక్షేపవలనాభిధామ్ (అపక్రాంతా—3) 46
పాదం కుంచితముత్క్షిప్య పురోజంఘాం ప్రసారితామ్
జాన్వంతా మధవోర్వంతాం అగ్రయోగేన పాతయేత్. (సూచీ—4)⁵ 47
అతిక్రాంతోదితం పాదముత్క్షిప్యోత్ప్లుత్యపాతయన్
పృష్ఠదేశే పరాం జంఘా మంచితాంఘ్రి(ం ?) సముత్క్షిపేత్
యస్యామేవం భవేత్సేయం వృద్ధైః జ్ఞేయా మృగప్లుతా. 48
(మృగప్లుతా—5)

---

1 ఈ లుప్తపూరణము 'అభినవ భారతి' ననుసరించి పరిష్కర్త చేసినది. వారు వదలిన ఐదక్షరములు 'చరణం తతః' అనిచేర్చి శ్లోకము పూర్తి చేయవచ్చును.

2, 3, 4. పరిష్కర్త పూరించినవి.

5. ఇక్కడ శ్లోకార్థము లుప్తము. లక్షణమున చారిపేరును లేదు.

ఆ కా శ చా రు లు

పాదమును కొంచెముగా ముందుకు చాచి, పాత్రస్వభావభేదమును గమనించి నాలుగు తాలములు మొదలుకొని అంతరముండునట్లు మీదికెత్తి, తుది కాలితో నేలపై పడవేయవలెను; దానిని అతిక్రాంతమందురు. 41

భరతముని విశిష్టముగా చెప్పలేదు గాన ఆతని చిత్తమెరిగిన కీర్తిధరుడు, పాదమును పార్శ్వమునందే పడవేయవలెనని చెప్పెను. (అతిక్రాంతము—1) 42

ముడిచిన పాదమును అడ్డముగా ప్రక్కలో మీదికెత్తి, ఉద్ఘట్టితముగా మోపుట పార్శ్వక్రాంతము. 43

రెండవకాలితొడ సరిగా పాదమెత్తి ఉద్ఘట్టితముచే పడవేయవలెనని కీర్తిధరుడు దీని లక్షణము చెప్పెను; మరియు లోకవ్యవహారమందు దీనికి 'పార్ష్ణిచండ ఘాతము' అను పేరు గలదనెను. (పార్శ్వక్రాంతము—2) 44

మొదలు బద్ధచారిని చేసి ముడిచిన పాదము మీదికెత్తి దాని ప్రక్కలో పెట్టునది అపక్రాంతము. 45

... ... పాదము మీదికెత్తి దాని ప్రక్కలో న్యాసము చేయవలెను. దీని పేరు విక్షేపవలనము - అని కీర్తిధరుడు చెప్పినాడు. (అపక్రాంతము-3) 46

పాదమును ముడిచి, మోకాలివరకుగాని, తొడవరకుగాని, జంఘను ముందరికి చాచి పాదాగ్రముతో నేలపై పడవేయవలయును (అది సూచియగును). 47 (సూచి—4)

అతిక్రాంతచారికి చెప్పిన పాదమునెత్తి ఎగిరి పడవేయవలయును; ఇంకొక కాలి పిక్కను వంకరయైన యడుగుతో వెనుకకెత్తి వేయవలెను; ఇట్టిది మృగ ప్లుతమని పెద్దలందురు. (మృగప్లుతము—5) 48

ఉత్క్షిప్య కు[ంచితం పాదం స్వపా][1]ర్శ్వ గత జానుకమ్
త్ర్యశ్రమేవోరు మూలస్య సమక్షేత్రే వివర్తయేత్. 49

యస్యామేషా సమాఖ్యాతా భుజంగత్రాసితా మతా,
పాదోపాంత భుజంగార్ధత్రాస నిష్పాది తాయతః 50
(భుజంగత్రాసితా—6)

పృష్ఠప్రసారితం పాదం వలనాభ్యంతరీకృతమ్
తలస్య సంముఖానోర్యురుం స్వపార్శ్వే పార్ష్ణినా క్షిపేత్,
యస్యాం సేయమలాతేతి కీర్తితా నృత్తకోవిదైః (అలాతా—7) 51

పాదో విశ్లిష్ట జంఘస్య స్వస్తికస్యైన కుంచితః
అగ్రే ప్రసారితో యత్ర విద్ధః పార్శ్వేనిజే పునః. 52

అన్యపార్ష్ణి నిజేక్షేత్రే పార్ష్ణినా పాతితో భవేత్
ఆవిద్ధా సా భవేత్ కేచిదాక్షిప్తా పూర్వికాం విదుః. (ఆవిద్ధా—8) 53

స్ఫిక్పార్ష్ణి శ్లేష పర్యంత మంచితం పృష్ఠతో నయన్
పాద (మంచిత)[2] జంఘంచ పార్శ్వ ఏవ భువి క్షిపేత్ 54

తరసాయత్ర విజ్ఞేయా సేయం నూపురపాదికా
యథాశోభం స్ఫిజ (చ?) స్త్వర్వాక్ స్వయం మన్యామహే పునః. 55
(నూపురపాదికా—9)

త్రితాలంతర ముత్క్షిప్య కుంచితం చరణం పునః
స జంఘా స్వస్తికం భూమౌ వామతః పార్ష్ణినా క్షిపేత్
యస్యామేషా మతాఽఽక్షిప్తా ఖండే చింతా పరాభిధా (?) 56
(ఆక్షిప్తా—10)

భుజంగత్రాసితాం కుర్వన్ ద్వితీయేన తలేన చేత్
శరీరం భ్రామ్యతే వేగాత్ భ్రమరీసా ప్రకీర్తితా (భ్రమరీ—11) 57

---

1 ఇది పరిష్కర్త పూరించినది

2 'పాదమిన్వీత' అనునది ముద్రాదోషము గాబోలు 'అంచిత' అనియే ఇతర లాక్షణిలు-అభినవగుప్త, శార్ఙ్గదేవులు-చెప్పినారు (అభి భా౧౦-౩౫ సం రత్నా ౭-౯౫౩)

ముడిచిన పాదమును దాని పార్శ్వమున మోకాలుండునట్లుగా ఎత్తి త్ర్యశ్ర ముగానే తొడ మొదటి ప్రదేశమునకు త్రిప్పవలయును; అది భుజంగత్రాసితచారి; కాలిదగ్గర చేరిన పాములని భయమును ఇది చూపును గనుక. 49, 50

(భుజంగత్రాసితము—6)

వెనుకకు చాచిన పాదము త్రిప్పి లోపలికి దార్చి దాని యరకాలికి ఇంకొక కాలి తొడ ఎదురగునట్లు చేసి, మడమతో తన ప్రక్కలో నేలకు వేయవలెను; దీనిని నృత్తజ్ఞులు అలాత మందురు. (అలాతము—7) 51

ముడిచిన పాదమును చిరుదొడలు విడివడిన స్వస్తికమువలె చేసి, ముందుకు చాచి, దాని ప్రక్కకు మరల త్రోసి, ఇంకొకకాలి మడమ చెంతకు తన మడమతో వేయుట ఆవిద్ధమనబడును, కొందరు దీనిని ఆక్షిప్తావిద్ధమని పేర్కొనిరి. 52, 53

(ఆవిద్ధము—8)

వంచిన పాదమును మడమ పిరుదు దిన్నెను తాకువరకును వెనుకకు తీసికొని పోయి, దాని పార్శ్వమునందే వంచిన పిక్కతో వేగముగా నేలబడవేయవలెను. ఇది నూపురపాదిక; అందము ననుసరించి, పాదము పిరుదు దిన్నె కీవలనే యుండ దగునని మా యభిప్రాయము. (నూపురపాదిక—9) 54, 55

మూడు తాలముల యెత్తు ముడిచిన కాలెత్తి మరల జంఘా స్వస్తికముచేసి మడమతో ఎడమ ప్రక్కకు వేయవలయును; ఇది ఆక్షిప్తము. దీనికి 'ఖండే చింత' (?) అను మారు పేరు గలదు. (ఆక్షిప్తము—10) 56

ఒక పాదముచే భుజంగత్రాసితము చేయుచు రెండవ యరకాలితో వేగముగా శరీరమును త్రిప్పుట భ్రమరి. (భ్రమరి—11) 57

కుర్వన్ నూపురపాదోక్తం కుంచితం చరణం పునః
దేహసమ్ముఖ జాన్వగ్రక్రియం వేగాత్ ప్రసారయేత్
యత్ర సా దండపాదేతి పండితైః పరికీర్తితా. (దండపాదా—12) 58

పృష్ఠతో వలితాశ్లిష్ట పృష్ఠః పాదః ప్రసార్యతే
ఊర్ధ్వాధః పార్శ్వదేశేషు భ్రాంతో మండల వద్యదా
కీర్తితేయం తదా విద్యుద్భ్రాంతా, లక్ష్యేఽతి దుష్కరా.[1] 59
(విద్యుద్భ్రాంతా—13)

జానుస్తన సమం యావత్ కుంచిత పాద ముద్ధరేత్
యత్రస్తబ్ధీకృతోఽన్యోఽంఘ్రిః ఊర్ధ్వజానురియం మతా 60
(ఊర్ధ్వజానుః—14)

ఆవిద్ధం పాదమన్యోరుక్షేత్రే పార్ష్ణిర్యథా భవేత్
భ్రాంతోద్వృత్య యదా బాహ్యభ్రమర్యుత్ప్లావయేద్భువి
తదోద్వృత్తా మనోవర్తా లోకే భూచార పూర్వికా (?)[2] 61
(ఉద్వృత్తా—15)

ఉత్క్షిప్య కుంచితం పాదం పార్శ్వయోర్లోలయన్ క్షిపేత్
స్వపార్శ్వే పార్ష్ణినా యస్యాం డోలాపాదేతి సాస్మృతా. 62
(డోలాపాదా—16)

పాదస్య ముఖ్యతా క్వాపి హస్తస్యాపి క్వచిద్భవేత్
ఉభయోః కుత్రచిత్ జ్ఞేయా యథాశోభం ప్రయోగతః. 63

హస్తావవనతౌ స్యాతాం యదా పాదస్య ముఖ్యతా,
అగ్రగాస్తః స్వముఖ్యత్వే, ద్వయోశ్చేత్ సమగౌ పునః. 64

---

1. ఈ లక్షణము నాకు స్ఫుటముకాదు అపపారమేమో యని సందేహము భరత నాట్యశాస్త్రము, అభినవ భారతి, రత్నాకరములందు దీని లక్షణమును చూచునది (భ నా శా కాశీ ముద్రణ ౧౧-౩౮, అభి భా ౧౦-౪౦, సం రత్నా, ౭-౧౦౦౧)
2. అస్పష్టము

నూపురపాదమున చెప్పిన క్రియచేసి మరల ముడిగిన కాలిని, తన దేహమున కెదురుగా మోకాలి మొదలు క్రియసాగునట్లు, వేగముగా చాచవలయును. దీనిని పండితులు దండపాద మందురు. (దండపాదము—12) 58

అడ్డము తిరిగి వీపును దాకిన పాదము వెనుకకు చాచి, మీది క్రింది ప్రక్కలలో మండలాకారముగా త్రిప్పినచో అది విద్యుద్భ్రాంతము; ఇది చేసి చూపుట చాలా కష్టము. (విద్యుద్భ్రాంతము—13) 59

ముడిగిన పాదము, మోకాలును, స్తనములును సరికొలతలోనుండునట్లు ఎత్తవలెను; అప్పుడు రెండవపాదము కదలకుండవలెను; ఇది ఊర్ధ్వజానువు. 60
(ఊర్ధ్వజానువు—14)

ఇంకొక తొడ మీదికి మడమ చేరునట్లు ఆవిద్ధపాదమును పెట్టి, యెగిరి, బాహ్యభ్రమరి చేసి నేలమీద వేయవలయును; ఇది ఉద్వృత్తము. ఇది వ్యవహారమున 'భూచార మనోవర్తి' అనబడుచున్నది (?) (ఉద్వృత్తము—15) 61

కుంచితపాదమును మీదికెత్తి ప్రక్కలలో ఊచుచు, మడమతో తన ప్రక్కన నేలపై పెట్టుట డోలాపాదము. (డోలాపాదము—16) 62

ఒకప్పుడు పాదము ప్రధానముగా, మరొకప్పుడు హస్తము ప్రధానముగా, ఇంకొకప్పుడు రెండును ప్రధానముగా నుండును. ఇది అందము ననుసరించి, ప్రయోగముచే తెలిసికొనవలయును. 63

పాదము ముఖ్యముగా నున్నచో హస్తములు తగ్గియుండ దగును; తమకే ముఖ్యత్వమున్న యెడల అవి ముందుగా నడుచును; రెండును ముఖ్యములేని సమముగానైతె సాగును. 64

యతశ్చారీ ప్రయోగేఽంఘ్రి తతో హస్తౌ, యతః కరః
తతస్త్రికం, యతస్తత్ స్యాత్ నేత్రాద్యం యోజయేత్తతః. 65

పాదచార్యాం కృతార్థో వా పాదో యాతి భువం యథా
హస్తః స్వకార్య నిష్పత్తౌ కటిమాశ్రయతే తథా. 66

హస్తః స్యాదర్ధచంద్రోఽత్ర నాట్యే, నృత్త విధౌ పునః
పక్ష వంచితకౌ పక్షప్రద్యోతౌ వా మతౌ సతామ్,
ఏతత్ త్రయమపి బ్రూమో నృత్యే లక్ష్యనిరీక్షణాత్. 67

అనంతేషు విభేదేషు గతీనాం లలితాత్మికాః
చార్యో ద్వాత్రింశదేవోక్తాః మునినాఽన్వర్థ సంజ్ఞకాః. 68

చరితమివ సురాజ్ఞాం యుక్తదండాభిరామం,
గిరిశమివ భుజంగత్రాసితాలోకనీయమ్,
జలదమివ సవిద్యుద్భ్రాంతమశ్రాంతలక్ష్మి
వ్యరచయదిహ చారీలక్షణం జాయనార్యః. 69

స్థా నా ని

ఆసామాద్యంత భావార్థమధునా స్థానముచ్యతే
కరణాధారభావేషు స్థానశబ్దో నిరుచ్యతే. 70

భావిగత్యనుకూలేన స్థానకేనేహ కేనచిత్
స్థిత్వా గచ్ఛేత్ తదంతేఽపి తిష్ఠేదిత్యత్ర కల్పన,
ప్రయోగో నవినా తేన తస్మాదేతన్నిరూపయేత్. 71

శరీరస్యాంగవిన్యాసవిశేషో భావ [యోగవత్][1]
నేత్రయోః సహగః కోఽపి నిశ్చలః స్థానముచ్యతే. 72

1. 'యోర్విపత్' అని త్రా. ప్ర; నా త్రా. ప్ర. లో 'పోవిపత్'. ఈ పవరణ పరిష్కర్త సూచితము. 'భావపోషకృత్' అని తిరుపతి ప్రతిలో సవరణ సూచన ; మా. రా. కవి గారిది-గాబోలు.

చారిని ప్రయోగించునపుడు అడుగులున్న దిక్కులో హస్తముండవలెను; హస్తమున్న దిక్కు త్రికము - వెన్నెముక క్రింది భాగము - తిరుగ వలయును; అది తిరిగిన దిక్కుననే కన్ను మొదలగువానిని దార్చవలయును. 65

పాదచారియందు తన పని ముగించి పాదము నేలపై నిలుచునట్లే హస్తము గూడ తన పని ముగియగానే కటినాశ్రయించును. 66

ఇక్కడ నాట్యమందు అర్ధచంద్రహస్తము; నృత్తమందు పక్షవంచితములో, పక్షప్రద్యోతములో హస్తములుండును; లక్ష్యమును గమనించి మేము నృత్యమందు ఈ మూడును గలవందుము. 67

గతుల భేదములనంతములై యుండగా వానిలో లలితస్వరూపముగల ముప్పది రెండు చారులు మాత్రమే భరతముని చెప్పెను. 68

చారీలక్షణము మంచిరాజుల నడవడివలె యుక్తమైన దండనీతిగలిగి రమ్యమైనది (దండపాదచారిచే అందమైనది); శివునివలె పాములకు వెరచి చూడదగినది (భుజంగత్రాసితచారిచే దర్శనీయమైనది); మేఘమువలె మెఱుపుల సంచారము గలది (విద్యుద్భ్రాంతచారి గలది); తరుగని శోభగలది; అట్టి దానిని జాయనార్యుడిక్కడ విరచించెను. 69

## స్థానములు

ఈ చారుల ఆద్యంతములెరుగుటకు ఇప్పుడు స్థానము చెప్పబడును. కరణము, ఆధారము, భావము అను మూడర్థములందు స్థానశబ్దము నిర్వచింపబడినది. 70

చేయబోవు చారికనుకూలమైన ఏదో యొక స్థానమందు నిలిచిపోవలయును; పోయి నిలువవలయును; కనుక స్థానము లేనిది యే ప్రయోగమును ఉండదు. కావున దానిని నిరూపింపవలయును. 71

ఒక భావమును చూపుటకై కనుచూపులు వెన్నంటి చేయు శరీరాంగముల నిశ్చలమైన ఒకానొక నిలువు స్థానమనబడును. 72

పు రు ష స్థా నా ని

వైష్ణవం సమపాదాఖ్యం వైశాఖం మండలాభిధమ్
ఆలీఢసంజ్ఞితం ప్రత్యాలీఢాఖ్యంచేతి షట్ నృణామ్ 73

ఏకః పాదస్సమో యత్ర త్ర్యశ్రః పార్శ్వముఖోఽపరః
అనయోరంతరం సార్ధతాలద్వితయసంజ్ఞకమ్ 74

జంఘాయామంచితం కించిత్ సౌష్ఠవేనోపశోభితమ్
వైష్ణవం స్థానకం, యస్మాద్విష్ణురత్రాధిదైవతమ్. 75

అనేనాభినయో విష్ణోః నరయోః శ్రేష్ఠమధ్యయోః
కర్తవ్యః సూత్రధారాదా (దేః ?) సంలాపోఽపి స్వభావజః. 76
(వైష్ణవమ్—1)

తాలమాత్రాంతరౌ స్యాతాం స్వభావాత్ చరణౌ సమౌ
సౌష్ఠవం సహజం యత్ర సమపాదం తదుచ్యతే 77

విమాన స్యందనాకాశప్రవశలింగస్థితేష్వతత్
వివాహా (హే) పక్షినిర్దేశే విప్రమంగలవాచనే
అధిదైవతమేతస్య కీర్తితః కమలాసనః (సమపాదమ్—2) 78

సార్ధతాలత్రితయవత్ త్ర్యశ్ర పక్షస్థపాదయోః
అంతరం స్యాద్వ్యవస్థేయం ఊర్వోరపి నిషణ్ణయోః 79

యస్మిన్ వైశాఖమాఖ్యాతం తద్విశాఖాధిదైవతమ్
వ్యాయామే నిర్గమే స్థూలభంగే (ఖగే ?)[1] వాహనవాహనే. 80
(వైశాఖమ్—3)

1 'స్థూలభంగే' అను ముద్రితపాఠము అస్పష్టము ఈ స్థానము వినియోగములందు 'స్థూలపక్షి నిరీక్షణం' అని భ నా శా, 'పక్షిణోఽత్ర గరుడాదయో మంతవ్యాః' అని అభినవ భారతి (౧౦-౬౪), సం రత్నాకరమునను 'స్థూలపక్షీక్షణే' అనియే (౭-౧౦౪౫), కనుక ఈ సవరణ నా సూచన

## పురుషల స్థానములు

వైష్ణవము, సమపాదము, వైశాఖము, మండలము, ఆలీఢము, ప్రత్యాలీఢము, — అని మగవారి స్థానములు ఆరు. 73

ఒక పాదము సమముగానుండి, రెండవది ప్రక్క మొగముగా, పటవాలుగా నుండవలెను; ఈ రెంటి నడుమ రెండున్నర తాలముల యంతరముండదగును. చిరుదొడ కొంచెము వంకరగావలయును; సౌష్ఠవముతో శోభిల్లవలెను, ఇది వైష్ణవస్థానకము — దీనికి విష్ణువు అధిదేవత గనుక. 74, 75

దీనిచే విష్ణువును, ఉత్తమ, మధ్యమ పురుషులను, సూత్రధారుడు మొదలగు వారిని, స్వాభావికమైన సల్లాపమును అభినయింపదగును. 76

(వైష్ణవము—1)

ఒక తాలమంతయంతరముతో స్వభావముగా సమములైన పాదములు గలిగి సహజమైన సౌష్ఠవముగల నిలుకడ సమపాదమనబడును; ఇది విమానము, రథము, ఆకాశము, — వీని యందున్నవారికి, వ్రతముపట్టిన - శైవాది చిహ్నములు ధరించిన-వారికి, పెండ్లియందు, పక్షులను చూపునప్పుడు, బ్రాహ్మణాశీర్వాదము నందు, ప్రయోగింపనగును; దీని అధిదేవత బ్రహ్మ. 77, 78

(సమపాదము—2)

పటవాలుగా, ప్రక్కమొగముగా, తిరిగిన పాదముల నడుమ మూడున్నర తాలములంత సందుండవలయును; ఇట్లే దిగబడిన తొడల విషయమునను వ్యవస్థ; అది వైశాఖమన బడును; దానికి దేవత కుమారస్వామి వ్యాయామమునందు, వెలువడునప్పుడు, పెద్దపక్షులను నిరూపించునప్పుడు, గుఱ్ఱము మొదలగువాని స్వారియందు — ఉపయోగించునది. (వైశాఖము—3) 79, 80

త్ర్యశ్రౌ పార్శ్వముఖౌ పాదౌ చతుస్తాలాంతరాన్వితౌ
నిషణ్ణోరూ, కటీయత్ర జాయతే జానునోస్సమా 81

బుధైర్మండలమాఖ్యాతం తదాఖండల దైవతమ్;
ప్రయోగే చాపవజ్రాదేః స్కంధే (?) సింధుర వాహనే,
గరుడాది మహోస్థూల పక్షిణాంచ నిరూపణే. (మండలమ్—4) 82

వామః పాదో నిషణ్ణోఽత్ర కుంచితో జానునా పునః
తేన తుల్యే కటీపృష్ఠే త్ర్యశ్రః సవ్యః ప్రసారితః. 83

పంచతాలమితస్తిష్ఠన్ అనయోః పార్ష్ణిగుల్ఫయోః
ఆలీఢ మిదమాఖ్యాతం, రుద్రస్తస్యాధిదైవతమ్. 84

ఉత్తరోత్తరతో జల్పే రోషామర్ష సముద్భవే
వీరరౌద్రకృతే మల్లాస్ఫోటే రిపునిరూపణే,
తదభిద్రవణే శస్త్రమోచనే చేదముచ్యతే. (ఆలీఢమ్—5) 85

అస్యైవాంగ[1] పరివర్తే ప్రత్యాలీఢం ప్రకీర్తితమ్;
విముంచేదమునా శస్త్రం సర్వమాలీఢసంహితమ్
ఆలీఢస్యైవ భేదత్వాత్ రుద్రోఽస్యాప్యధిదైవతమ్. 86
(ప్రత్యాలీఢమ్—6)

**న్యాయాః**

శస్త్రాణాం మోచనే న్యాయాః చత్వారః కథితా బుధైః;
రణే స్వపరశస్త్రాణాం కర్తుం పాతనసారణే
ఉచితా వర్తనాఽంగానాం న్యాయోఽత్ర పరికీర్తితః 87

భారతః సాత్వతో వార్షగణ్యః కైశిక ఇత్యమీ
క్రమాత్ న్యాయాః కటీ పాద వక్షో మూర్ధ్నాం విభేదనే. 88

1. 'అంగః పరి' అనునది ముద్రాదోషము.

ప్రక్కమొగములుగా త్ర్యశ్రములుగానున్న పాదములు; నడుమ నాలుగు తాలములయంతరము; కదలని తొడలు, కటిభాగము, మోకాళ్ళకు సరిగా నిలిచినది— ఇవిగల స్థానము మండలమని ప్రాజ్ఞులందురు; దీనికి ఇంద్రుడు దేవత. ఇది, విల్లు, వజ్రము మొదలగువానిని ప్రయోగించుటయందు, స్కంధమున (?), ఏనుగునెక్కి నడపు నపుడు, గరుత్మంతుడు మొదలైన చాలా పెద్దపక్షులను చూపు నపుడు — వచ్చును. (మండలము—4) 81, 82

ఎడమకాలు కదలని మోకాలితో ముడుగబడి యుండవలెను; దానితో సమానముగా పిరుదులు, వీపును ఉండవలెను; ఈ పిక్క మడమల నుండి ఐదుతాలము లంత అంతరమున ఓరగా కుడికాలు చాచుకొని యుండదగును; ఇది ఆలీఢ స్థానము; దీనికి రుద్రుడు దేవత. 83, 84

రోషము, అక్కసు — వీనిచే గలిగి, వీరరౌద్రభావములచే ఏర్పడి, ఉత్తరోత్తరముగా సాగునట్టి పెడుసు మాటలాడు నప్పుడు, జెట్టీలు పరస్పరము తాకొన్నప్పుడు, శత్రువును నిరూపించునప్పుడు, శత్రువును ఎదుర్కొనునపుడు, శస్త్రమును వదలునపుడు — దీని వినియోగము. (ఆలీఢము—5) 85

దీనినే అవయవములు మార్చుకొని చేయుట ప్రత్యాలీఢమనబడును; ఆలీఢ స్థానములో సంధించిన ఆయుధము లన్నియు దీనితో విడువదగును. ఇది ఆలీఢమునకే మార్పు గనుక దీనికిని రుద్రుడే దేవత. (ప్రత్యాలీఢము—6) 86

### న్యా య ము లు

శస్త్రములను ప్రయోగించుటయందు నాలుగు న్యాయములు బుధులు వచించినారు. యుద్ధమున తమ శస్త్రములు గురితాకుటకును, ఎదుటివారి శస్త్రములను తప్పించుటకును తగిన అంగవ్యాపారము న్యాయమని ఇక్కడ పేర్కొనబడును. 87

భారతము, సాత్వతము, వార్షగణ్యము, కైశికము, — అని న్యాయములు నాలుగు; ఇవి క్రమముగా కటి, పాదములు, వక్షస్సు, తల — వీనిని భేదించుటకుపయోగించును. 88

ఖేటం వామేన హస్తేన పరశస్త్ర నివారణం
ధృత్వా, శస్త్రం తదన్యేన ప్రసార్యైతే పునః పునః. 89

ఆక్షిప్య భ్రామయేత్ పశ్చాత్ పార్శ్వాత్ పార్శ్వం తతః పరమ్
ధృతశస్త్రేణ హస్తేన మస్తకం పరివేష్టయేత్. 90

మణిబంధవివర్తేన కపోలప్రాంతయోః పునః
కుర్యాదుద్వేష్టనం భూయో మస్తకం పరివేష్టయేత్.
లలితే వేష్టనే ద్వాభ్యాం యత్రాసౌ భారతః స్మృతః. 91

(భారతః—1)

సాత్వతే సర్వమేతత్ స్యాత్ కరశస్త్రంతు పృష్ఠతః 92

(సాత్వతః—2)

వార్షగణ్యే తదా (థా ?) కుర్యాత్ ప్రక్రియాం సాత్వతే యథా
ఉద్వేష్టనంతు శస్త్రేణ వక్షస్యంగేషుచ స్మృతమ్. 93

(వార్షగణ్యః—3)

కైశికే ప్రవిచారస్తు సర్వో భారతవన్మతః
భ్రామయిత్వా ద్విషన్మూర్ధ్ని శస్త్రం తావన్నిపాతయేత్. 94

(కైశికః—4)

ప్రవిచారాః

నానా చారీభవాః స్యాయై రమీభిరుపలక్షితాః
ప్రవిచారాః భవంత్యత్ర శస్త్రమోచనగోచరాః 95

హస్తేనైకేన హస్తాభ్యాం ప్రయోజ్యమితి తద్ద్విధా;
తత్రాద్యం ఖడ్గశక్త్యాది, ధనుఃకుంతాదికం పరమ్,
ప్రకృష్టత్వాత్ విశిష్టత్వాత్ అన్వర్థా తద్గతాఽభిధా. 96

ఎడమ చేతితో ఎదుటివాని శస్త్రమును తొలగించు కేడెమును, ఇంకొకచేత శస్త్రమును ధరించి, వానిని మరి మరి చాచవలయును; తరువాత శస్త్రమును ఈడ్చియెత్తి ఒక ప్రక్కనుండి యింకొకప్రక్కకు త్రిప్పవలయును; ఆ పై శస్త్రముతోడి చేతిని తలచుట్టును త్రిప్పవలెను; తర్వాత మనికట్టును ఆడించుచు చెక్కిళ్ళ ప్రాంతమున త్రిప్పి మరల తలచుట్టును త్రిప్పవలెను; రెండు చేతుల త్రిప్పులును లలితముగా నుండదగును ఇది భారతము. 89, 90, 91

(భారతము—1)

సాత్వతమందు పై వ్యాపార మంతయు జరుగవలెను; మరి చేతి శస్త్రము మాత్రము పృష్ఠభాగమందుండవలెను. (సాత్వతము—2) 92

వార్షగణ్యమందు సాత్వతనుందెట్లో అట్లే ప్రక్రియ; శస్త్రమును త్రిప్పుట మాత్రము వక్షుస్సునందు, అంగములందు (?) చేయవలెను. 93

(వార్షగణ్యము—3)

కైశికమున భారతము వలెనే ప్రవిచారమంతయు జరుగవలెను; శస్త్రమును త్రిప్పి శత్రువు తలమీద పడవేయవలెనంతే (కైశికము —4) 94

## ప్ర వి చా ర ము లు

పలువిధముల చారులనుండి కలిగి, యీ న్యాయములచే ఏర్పడునట్టి ప్రవిచారము లిందుండును; అవి శస్త్రములను ప్రయోగించుటకు తగినవి. 95

శస్త్రములు రెండు తెగలు; ఒక చేతితో వేయదగినవి, రెండు చేతులతోను వేయదగినవి; కత్తి, శక్తి మున్నగునవి మొదటి రకము; విల్లు, ఈటె మున్నగునవి రెండవ విధము. ప్రవిచారములను పేరు ప్రకృష్టముగా, విశిష్టముగా నుండునవి గనుక సార్థకము. 96

రంగనిషిద్ధాని

రంగే ప్రహారణైః భేదశ్ఛేదః శోణితవిస్రుతిః,
వ్యక్తఘాతశ్చ నో కార్యః చిత్తోద్వేగకరం చ యత్. 97

కార్యంవాఽభినయైరేవ భేదనాద్యం విధానతః
దర్శనాదేవ జానాతి యేన సామాజికోజనః. 98

వ్యాయామః

వ్యాయామం సౌష్ఠవోపేతైః రంగహారైర్మనోహరమ్
లయ తాల సమాయుక్తం కారయేత యథాబలమ్. 99

సౌష్ఠవమ్

సుతరాం సౌష్ఠవే యత్నః కార్యో వ్యాయామకారిభిః
సాధకస్తేన హీనాంగో నాట్యే నృత్తే న శోభతే. 100

యత్ర నాంగమతీవోచ్చం నాతిఖర్వమచంచలమ్
విశ్రాంతావయవం లోలపాదం వక్షః సమున్నతమ్. 101

సమ కంఠ కటీ శీర్ష కూర్పరాంసం ప్రయుజ్యతే
సౌష్ఠవం తత్ సమాఖ్యాతం బుధైః వ్యాయామగోచరమ్. 102

ఖర్వతా

చతుర్భిరథవాఽష్టాభిరథ ద్వాదశభిర్మతా (ర్మితః ?)
జాను వంణ సన్నామాస్త్వంగులేః (మః స్వాంగులైః ?)
ఖర్వతామతా. 103

ఇచ్ఛయా భూమిపాలానాం తత్తద్దేశానుసారతః
అతః పరం నఖర్వత్వం, పరం నృత్తే న శోభతే 104

### రంగనిషిద్ధములు

రంగముమీద ఆయుధములతో చీల్చుటచేత, నరకుటచేత, నెత్తురు కార్చుట, స్పష్టముగా గాయ పరచుట, చిత్తమున కుద్వేగము గలిగించు ఏ పనిగాని చేయ గూడదు. 97

లేదా, పగుల్చుట మొదలగు వానిని శాస్త్రీయమైన అభినయములచేతనే చేయవలెను; ఎందుకనగా సామాజికులకు చూపినజాలును, తెలిసికొందురు. 98

### వ్యాయామము

సౌష్ఠవముతోగూడిన అంగవిక్షేపములచే మనోహరముగా నుండునట్లు, లయ తాళములు చేర్చి, బలమునకు తగినంత వ్యాయామము చేయింపదగును. 99

### సౌష్ఠవము

వ్యాయామము చేయువారు సౌష్ఠవమునకై చాల ప్రయత్నపడవలెను; అదిలేని యంగములుగల సాధకుడు నాట్యమందును, నృత్తమందును శోభింపడు. 100

దేహము మిక్కిలి నిగిడియుండక, అట్లే క్రుంగియుండక, వణకులేక, అంగము లన్నియు నెమ్మదిగా నుండి, అడుగులు కదలుచు, ఎదయెత్తుగా, కంఠము, కటి, తల, మోచేయి, మూపులు — ఇవి సమరేఖలో నుండునట్లు ప్రయోగించుట సౌష్ఠవమని పండితులందరు; ఇది వ్యాయామమున గమనింపదగినది. 101, 102

### పొట్టితనము

దొరల యిష్టముననుసరించి, ఆయా దేశపద్ధతుల ప్రకారము, మోకాళ్ళను, తొడ సందిని, నాలుగుగాని, ఎనిమిదిగాని, పంద్రెండుగాని తన అంగుళములంత క్రిందికి దించవచ్చును; అంతకుమించి చేయరాదు. చేసినచో నృత్తమున మాత్రము శోభింపదు. 103, 104

చ తు ర శ్ర మ్

వైష్ణవం స్థానకం యత్ర సమున్నత మురః స్థలమ్,
కటి నాభి చరౌ హస్తౌ యుగపత్ క్రమశోఽథవా,
చతురశ్రమిదం ప్రోక్తమంగం నేత్రసుఖావహమ్. 105

ధ ను ః క ర ణా ని

[1]అసియుద్ధే యథాన్యాయా ధనుషః కరణం తథా
పరిమార్జనమాదానం [సంధానం మోక్షణం తథా][2] 106
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...
... ... ... ... ఉత్కట ముదాహృతమ్[3]
దేవాదితర్పణే సంధ్యాజపహోమాదిషు స్మృతమ్. 107
(ఉత్కటమ్–1)

చిబుకం కర్కటే న్యస్య హస్తే స్కంధాశ్రితం శిరః
యత్రేంద్రియాణి ఖర్వాణి స్యుస్తద్యోగకృతం[4]స్మృతమ్. 108

---

1. ఇది అభినవభారతి ననుసరించి (సం.' 2-పు. 115) పరిష్కర్త సవరించినది.
2. ఇక్కడ గ్రంథము లుప్తము ; ధనుఃకరణములు కడపటి రెంటిని పేర్కొను శ్లోక భాగము, వానిని వివరించు గ్రంథము, తరువాత గ్రంథకర్త స్వీకరించినట్లు తోచు 'ఉపవిష్టాసనములు' పేర్కొను భాగము, 'ఉత్కటము' అనుదాని నిరుక్తి శ్లోక పూర్వపాదమును, పోయినవి. — పరిష్కర్త.
3. ఉత్కటాసన లక్షణము భ. నా. శా, లో ఇట్లున్నది. (బరోడా ము. II పు, 170; ప. 208) (పరి)
"తథాచోత్కటికాస్థానం స్ఫిక్ పార్ష్ణినాం సమాగమః" (మడమలు పిరుదుల అంచులను తాకునట్లు లోనికి మడిచి కూర్చుండుట ఉత్కటికాస్థానము )
4. 'శోకకృతం' అని యుండబోలునని పరిష్కర్త సూచన (చూ. Notes P. 20)

చతురశ్రము

వైష్ణవస్థానమున వక్షఃస్థల మున్నతముగానుండి, రెండు హస్తములు ఏకకాల మందుగాని, మార్చి మార్చికాని, కటినాభులందు చేరుచుండినచో ఆయంగము చతురశ్రమనబడును. ఇది చూచుటకు అందమైనది. 105

ధనుఃకరణములు

కత్తితోడి యుద్ధమునందు న్యాయములెట్లో, అట్లే ధనుర్యుద్ధమునందు కరణములు (నాలుగు): పరిమార్జనము, ఆదానము, సంధానము, మోక్షణము. 106

(పరిమార్జనము వింటిని తడవి చూచుట; ఆదానము తీసియెత్తు కొనుట; సంధానము అమ్ము తొడుగుట; మోక్షణము ఈడ్చి విడుచుట)

... ... ... ... ఉత్కట మనబడును. అది దేవతలు మొదలగు వారికి తర్పణములిచ్చునపుడు, సంధ్యాజపహోమాదులందు, తగినది. 107

(ఉత్కటము—1)

గడ్డము కర్కటకహస్తమందు పెట్టుకొని, ఇంద్రియములన్నియు దుర్బలములై యుండగా, మూపుపై తలనిడుకొనియుండునది యోగకృతము. యుద్ధ

రణరంగపరాభూతే శోకవ్యాకులతాదిషు
క్రాంతమిత్యభిధామస్య కథయంత్యపరే పునః. 109
(యోగకృతమ్—2)

ఆసనే ద్విగుణః పాదోఽమనాగన్యః ప్రసారితః
శిరోఽఞ్చితతయా యత్ర కించిత్ పార్శ్వముపాగతమ్. 110

తత్స్యాత్ చింతాకృతం, చింతావిప్రలంభమదాదిషు
అన్యైః పునస్సమాఖ్యాతం మదాలససమాఖ్యయా. 111
(చింతాకృతమ్—3)

భుజాలింగితయోః న్యస్య జానునోశ్చిబుకం యదా
పిండీకృత్య స్థితో దేహమవహిత్థం మతం తదా
అవహిత్థామయ వ్రీడా ధ్యాన నిద్రాదికేషు తత్. 112
(అవహిత్థమ్—8)

1... ... ... ... ... ... ...

సు ప్త స్థా నా ని

సమం ప్రసారితాభిఖ్యముద్వాహిత వివర్తితే
నత [మాకుంచితం] చేతి స్థానం సుప్తస్య షడ్విధమ్. 113

కృత్వా వదనముత్తానం పాణిపాదం ప్రసార్య చేత్
శయీత సమమామ్నాతం స్వస్య సంవేశనే తదా. (సమమ్—1.) 114

ఉపధానం భుజం కృత్వా ప్రసార్యయది జానునీ
సుప్యాత్ ప్రసారితాభిఖ్యం తదాస్యా త్సుఖనిర్వృతే. 115
(ప్రసారితమ్—2)

స్కంధే మూర్ధానమాధాయ సుప్యాత్ భూమిష్ఠ కూర్పరః
యస్మిన్నుద్వాహితం తత్ స్యాత్ లీలయా శ్రితమాస్థితా. 116
(ఉద్వాహితమ్—3)

1. గ్రంథపాతము. తక్కిన యాసనముల వివరణము పోయినది. విశేషములకు పరిష్కర్త క్రింది సూచనలు చూడుడు.

మున ఓడినవానికి, శోకము, వ్యాకులత మున్నగు భావములందు, దీని నుపయోగింపదగును. దీనిని 'క్రాంతము' అని ఇతరులు పేర్కొనిరి. 108, 109

(యోగకృతము—2)

ఒకకాలు మడిచి, రెండవదానిని కొంచెము చాచి, శిరస్సును కొంచెము వంకరగా పార్శ్వమునకు దార్చి కూర్చున్నది చింతాకృతమగును; ఇది చింత, వియోగము, మత్తు మున్నగువాని యందు వాడవలయును. ఇతరులు దీనిని 'మదాలసము' అను పేర బిలిచిరి. (చింతాకృతము—3) 110, 111

భుజములచే మోకాళ్ళను కౌగిలించుకొని వానిమీద గడ్డమునానించి, దేహమును ముద్దగించుకొని యున్నది, అవహిత్థమనబడును. ఇది ఆకారగోపనము, సిగ్గు, ధ్యానము, నిద్ర, మొదలగుచోట్ల వర్తించును. (అవహిత్థము—4) 112

## సుప్తస్థానములు

సమము, ప్రసారితము, ఉద్వాహితము, వివర్తితము, నతము, ఆకుంచితము, అని పరున్నవాని స్థానములు ఆరు. 113

ముఖము వెలికిలిగా కాలుసేతులు చక్కగా చాచి పరుండునది సమము. (దీని వినియోగము స్పష్టముగా లేదు) (సమము—1) 114

భుజమును తలదిండుగా చేసికొని మోకాళ్ళను చాచి శయనించునది ప్రసారితము; ఇది సుఖముచే నెమ్మదిగలవాని యందు వచ్చును. 115

(ప్రసారితము—2)

మూపున శిరస్సును చేర్చుకొని, మోచేతిని నేలమీద నిలుపుకొని పరున్నది, ఉద్వాహితము; ఇది ఆస్థానమందు లీలగా చేయబడును. 116

(ఉద్వాహితము—3)

అధోవదనమాధాయ సంవిశేద్యత్ర తత్ స్మృతమ్
వివర్తితాభిధం తత్ [స్యాత్ ?] రోగశస్త్రాదిపీడితే. 117
(వివర్తితమ్—4)

ప్రసస్త హస్తద్వయో జంఘే ప్రసార్యచ మర్యాదా
నిద్రాయేన్నతముద్దిష్టం తదాలస్యశ్రమాదిషు. (నతమ్—5) 118

ఆవిద్ధే జానునీ బిభ్రత్ వపుశ్చాకుంచితం యదా
సుప్యాదాకుంచితం ప్రోక్తం తదాశీతేన పీడితే. 119
(ఆకుంచితమ్—6)

స్త్రీణాం స్థానాని

ఆయతాఖ్యావహిత్థాశ్వక్రాంతాని త్రీణి యోషితామ్
స్థానాని మునినోక్తాని, తేనైవాధాపి చేతి తు. 120

బ్రువతాఽన్యాని కతిచిత్ సూచితాని, గతాగతమ్
వలితం మోటితాభిఖ్యం వినివర్తితనామకమ్,
ప్రోన్నతం చేతి సంభూయ స్యురష్టౌ తాని చక్షుహే. 121

యత్రపాదస్సమస్సవ్యః, వామస్త్ర్యశ్రోన్నతో భవేత్
గుల్ఫపార్ష్ణ్యోః స్థితో మధ్యే తాలేనోరః సమున్నతమ్. 122

ప్రసన్నో ముఖరాగః స్యాత్, నితంబే పాణిరున్నతే
అర్ధచంద్రో, లతాహస్తో వామః, తన్మతమాయతమ్. 123

కాయస్యాయమనాత్; అస్య దైవతం కమలాలయా;
నిర్వర్ణనేషు చింతాయామావాహన విసర్గయోః 124

ప్రవేశే రంగమధ్యస్య పుష్పాంజలి విమోచనే
గాంభీర్యప్రభవే మౌనే తర్జనాదావిదం భవేత్. (ఆయతమ్—1) 125

ముఖము బోరగిలబెట్టి, శయనించునది వివర్తితము; ఇది రోగము, గాయము ఇత్యాదులచే నొప్పిదిన్నవారికి వచ్చునది. (వివర్తితము—4) 117

బిగువుదప్పి జారిన చేతులతో ఇంచుక చిరుదొడలను చాచుకొని నిద్రించుట నతము; అది ఆలస్యము, శ్రమ మున్నగువాని యందు. (నతము—5) 118

మోకాళ్ళు కరచుకొని, దేహము ముడుచుకొని నిద్రించునది ఆకుంచితము; ఇది చలిచే పీడితుడైనవాని విషయమున. (ఆకుంచితము—6) 119

## స్త్రీల స్థానములు

ఆయతము, అవహిత్థము, అశ్వక్రాంతము, అని స్త్రీల స్థానములు మూడు భరతముని వచించెను; కాని అతడే 'అథాపిచ' (ఇంకను) అని (భ.నా.శా. బరోడా ము. అధ్యా. 12 - శ్లో. 160) మరికొన్ని సూచించెను; అవి గతాగతము, వలితము, మోటితము, వినివర్తితము, ప్రోన్నతము, — అనునవి; మొత్తము ఎనిమిది స్థానములు; వానిని వివరింతుము. 120, 121

కుడిపాదము సమముగా, ఎడమపాదము పటవాలుగా మీదికెత్తుకొని యుండవలెను; చీలమండ - మడమలసందు ఒకతాలమంత యుండదగును. ఎదయెత్తుగా నుండవలెను; ముఖరాగము ప్రసన్నము; ఉన్నతమైన నితంబముమీద అర్ధచంద్రముగా కుడిచేయి, ఎడమచేయి లతాహస్తము — ఇట్లున్నది ఆయితమనబడును — శరీరము నిట్టనిలువుగానుండును గనుక. దీనికి దేవత కమలవాసిని లక్ష్మి. ఇది — చక్కగా చూచుటలందు, చింతించునపుడు, ఆవాహనవిసర్జనములందు, రంగమధ్యమును ప్రవేశించుపట్టున, పుష్పాంజలి సమర్పించునపుడు, గాంభీర్యమువలన కలిగిన మౌనమున, బెదరించుట మున్నగు సందర్భములందు వచ్చును.

(ఆయతము—1) 122, 123, 124, 125

అస్య పాదకటీ హ_స్త వ్యత్యాసాదవహిత్థకమ్
అన్వర్థమవహిత్థాఖ్యం (ఖ్యభా ?)[1]భావ సంసూచనాద్భవేత్. 126

అధిదై_వతమేతస్య దేవీ మహిషమర్దనీ
సల్లాపే సహజే తర్కే పరితోషే వినిశ్చయే. 127

లజ్జాయాం సాంద్రసౌభాగ్యగర్వాదాత్మనిరూపణే
వరస్యాగమనోత్కంఠా పీడాదావిదమిష్యతే. (అవహిత్థమ్—2) 128

అంచింత దక్షిణం పాదం యదాసూచీసమాహ్వయమ్
సమస్థితస్య పాదస్య పార్ష్ణిభాగే వినిక్షిపేత్. 129

యద్వా సమాఖ్యమేవాత్మ పార్శ్వే తాలేన సమ్మితే
యత్రాశ్వక్రాంతమేతత్ స్యాదేతేనాశ్వాధిరోహణాత్. 130

పాదోఽత్రానియతః ప్రో_క్తః కై_శ్చిత్ సంశయితాత్మభిః
అంచితోఽత్రాథవా సూచీ మతో దక్షిణ ఏవ నః. 131

యతోఽశ్వారోహణారంభే మంగలస్యాభివృద్ధయే,
దక్షిణేనాంఘ్రిణా పాదకటకాక్రమణం పరమ్. 132

అధిదైవతమేతస్య స్మృతాదేవీ సరస్వతీ.
పుష్ప_స్తబక సంగ్రాహే విటపస్యావలంబనే
నీచానాం విక్రమేచై_తన్న రాణాం వినియోజ్యతే. 133
(అశ్వక్రాంతమ్—3)

గంతుం చరణముత్క్షిప్య మధ్యేగీతాదిహేతునా
హస్తాద్యభినయం యత్ర న_ర్తకీ ప్రవితన్వతీ. 134

గతిస్థితి నిరుద్ధాత్మా తిష్ఠేత్ తత్స్యాద్గతాగతమ్,
సంభ్రమ ప్రభృతావస్య వినియోగః ప్రకీ_ర్తితః. 135
(గతాగతమ్—4)

---

1, 'హిత్థాఖ్యం' అను ముద్రితపాఠముకంటె నావద్ది వ్రా. ప్ర. లోని యీ పాఠము సుగమము.

ఆయతమందలి పాద-కటి-హస్తముల కుడియెడమలు మార్చినది అవహిత్థము. అవహిత్థమను భావమును సూచించుటచే దీని పేరు సార్థకము. దీనికి దేవత మహిష మర్దనీదేవి. సహజసల్లాపము, ఊహించుట, సంతోషము, నిశ్చయము, లజ్జ, మిక్కిలి సౌభాగ్యగర్వముచే తన్నుతాను చూచుకొనుట, వరునిరాకకై ఉత్కంఠతో చూచుట, — ఇత్యాదులందిది ప్రయోజ్యము 126, 127, 128

(అవహిత్థము—2)

అంచితమైన కుడియడుగు సూచిగాచేసి, సమస్థితిలో నున్న యెడమ కాలి మడమ ప్రక్కలో పెట్టవలయును; లేదా కుడికాలు సమముగానే యుంచుకొని, ఒకతాలమంత విడదీసి, దానిప్రక్కలో నిలుపవలయును. దీనితో గుర్రమునెక్కు దురుగనుక ఇది అశ్వక్రాంతమనబడును. 129, 130

ఇక్కడ కొందరు సంశయస్వభావముగలవారు, అంచితసూచీపాదముల విషయ మున కుడి - యెడమలను నియయము లేదన్నారు, కాని మాయభిప్రాయమున కుడికాలే తగినది. ఎందుకనగా, గుర్రము నెక్కునపుడు ముందుగా మంగళాభి వృద్ధికై కుడియడుగుతో కాలి కడియమును - అంకవన్నెను - మెట్టుట మంచిది గనుక. 131, 132

దీనికి సరస్వతీదేవి యధిదేవత. పూగుత్తిని గ్రహించుట, చెట్టుకొమ్మను పట్టు కొనుట, నీచులగు నరులు విశ్రమించుట — ఈ సందర్భము లందిది ప్రయోగింప దగినది. (అశ్వక్రాంతము—3) 133

గమనమునకై పాదమెత్తి, పాట మొదలగు కారణములచే, నర్తకి హస్తాద్య భినయము చేయుమనే, గతి, స్థితి-రెండును గాకుండునట్లు నిలుచుట గతాగతమన బడును; సంభ్రమము మున్నగువానియందు దీనిని ప్రయోగింపనగును.

(గతాగతము—4) 134, 135

కించిద్వివలమానాంగం పదం వలనపార్శ్వగమ్
భూమిస్పృష్టకనిష్ఠంచ భూమిగాంగుష్ఠకం పరమ్
కుర్వీత వలితం ప్రోక్తం సాభిలాషవిలోకితే. (వలితమ్—5) 136

అర్ధాంగులితలః పాదః కుంచితోఽన్యః సముత్థితః (సమస్థితః ?)[1]
ఊరోః కుంచితపాదస్య పురతః కర్కటః కరః
యత్ర తన్మోటితాభిఖ్యం కామావస్థాసు కీర్తితమ్ 137
(మోటితమ్—6)

అస్మిన్నంగపరావృత్త్యా పృష్ఠతో వినివర్తనమ్
తద్భేదః స్యాదముష్యాపి వినియోగస్తు పూర్వవత్ 138
(వినివర్తనమ్—7)

సమపాదతలాగ్రాభ్యామంగులీనాం తలైరపి
ఆయతీకృత్య గాత్రంచేత్తిష్ఠేత్ స్యాత్ ప్రోన్నతం తదా 139

నాసికాద్వయసేతోయే [హూర్ధ్వానా][2] మంతరీక్షణే
ప్రాంశు ప్రాప్యప్రమాణ [స్థ] ఫలాది గ్రహణాదిషు. 140
(ప్రోన్నతమ్—8)

**మ ం డ లా ని**

విచిత్రభూషా లలితాంగయష్టి -
కా (రా ?)[3] వర్తనాల (భిః ?)[4] భ్రమరాలకాభా
సంక్రాంతకాంతిః విహృతాభిరామా
నిరూప్యతే మండలరాజిరామా. 141

---

1. 'ఏకః సమోఽంఘ్రిరన్యస్తు కుంచితోర్ధ్వతలాంగులిః' అని సం రత్నా. (౭—౧౦౭౧) 'సముత్థితః' అను ముద్రి. పా. సరిగా తోపదు కనుక నా యీ సవరణ సూచన.
2. 'చేదూర్ధ్వాతా' వ్రా. ప్ర. పరిష్కర్త సూచన యిది
3, 4. సవరింపు సూచన నాది.

దేహము కొంచెము ప్రక్కకు తిరిగియుండి, తిరిగిన ప్రక్కకే కాలు మొగమై చిటికెన వ్రేలు నేల సోకునట్లుండగా, ఇంకొకకాలు బొటనవ్రేలు నేలతాకునట్లుండుట, వలితము; ఇది అభిలాషతో చూచునపుడు ప్రయోజ్యము. 136
(వలితము—5)

ఒకపాదము వంగి వ్రేళ్ళుసగమూనిన అరకాలితోనుండి, ఇంకొకటి సమస్థితిలో నుండి, వంగిన పాదము తొడముందు కర్కట హస్తమున్నచో అది మోటితము; కామావస్థలందు దీని ప్రయోగము. (మోటితము—6) 137

ఈ స్థానమందు అంగములను వెనుకకు త్రిప్పినచో వినివర్తనము. ఇది దాని భేదమగును; వినియోగము దానివలెనే. (వినివర్తనము—7) 138

సమపాదముల అరకాళ్ళ తుదలందు, వ్రేళ్ళయడుగు భాగములమీద, దేహమును పొడిగించి నిలుచుట, ప్రోన్నతమగును; ముక్కుదాక వచ్చిన నీటియందు, ఎత్తైన పాత్రల లోపలిభాగము చూచునపుడు, పొడుగరికి దొరకదగిన యెత్తులో నున్న పండు మొదలగువానిని తీసికొనుట, మున్నగుచోట్ల దీని వినియోగము.
(ప్రోన్నతము—8) 139, 140

## మండలములు

వింతసొమ్ములు గలిగి, సుకుమారమైన శరీరము గలిగి, సుడివంటి నాభియు, తుమ్మెదలవంటి అలకలును గలిగి, నడకసొంపులుగల, విహారముచే అభిరామమైన రమణివంటి మండలపంక్తిని (విచిత్రము, లలితము, ఆవర్తము, భ్రమరము, క్రాంతము, విహ్వృతము — అనుభేదములచే రమ్యమైనది మండలపంక్తి) నిరూపింతుము. 141

పారంపర్యేణ చారిణాం మండలం చారు గుంఫితమ్
దామేవ పుష్పజాతీనాం న కస్య నయనోత్సవః. 142

హేతోశ్చారీ ప్రయోగస్య ప్రాచుర్యాత్ మండలాన్యపి
భౌమాన్యాకాశగానీతి ప్రసిద్ధాని తదాఖ్యయా. 143

యథాయోగం యథాశోభం సర్వశస్త్రవిమోచనే
సర్వాణ్యపి గదాయుద్ధే ప్రయోజ్యాని యథోచితమ్. 144

భ్రమరాస్కందితే పిష్టకుట్టం చాషగతాడ్డితే
ఏలకాక్రీడితాధ్యర్ధే అవర్తం శకటాస్యకమ్. 145

సమోసరితమిత్యేవం భౌమాని బ్రూమహే దశ;
సూచీవిద్ధ మతిక్రాంతం దండపాదమలాతకమ్. 146

విచిత్రం విహృతం వామబంధం లలితసంచరమ్
క్రాంతం లలితమేతాని దశాకాశభవాన్యపి.
[1]అంఘ్రేర్విశేషం నిభృతాః [?] చార్యః పుంస్యత్ర సమ్మతాః. 147

దశ భౌమ మండలాని

దక్షిణం జనితం, వామం స్యందితం, దక్షిణం పునః
శకటాస్యం, తతో వామమపస్యందిత మాచరేత్. 148

దక్షిణాం భ్రమరీం తత్ర ద్విః త్రికం పరివర్తయేత్
వామంతు స్యందితం, సవ్యం శకటాస్యాభిధం తతః. 149

వామం చాషగతిం సవ్యం భ్రమరీం స్యందితామపి
ఆదధ్యాచ్చరణం యత్రభ్రమరం తదుదాహృతమ్. 150

(భ్రమరమ్—1)

1. ఈ శ్లోకపాదము వ్రా. ప్ర. లో చాలా చెడినది. పరిష్కర్త ఊహించి సూచించిన అర్థమే యిక్కడ తెలిగింపబడినది

పరంపరగా చారులను అందముగా కూర్చిన మండలము, వేరు వేరు జాతుల పూవులతో కూర్చిన సరమువలె, ఎవరికన్ను తనియింపదు ? 142

ప్రయోగించిన చారియొక్క ప్రాచుర్యమునుబట్టి మండలములుగూడ భౌమములని, ఆకాశగములని, ఆ పేరితో ప్రసిద్ధికెక్కినవి. 143

అన్ని శస్త్రములు వేయుటయందును, సందర్భము ననుసరించి, అందముగా నుండునట్లు వీనిని ప్రయోగింపదగును; గదాయుద్ధమందు అన్నిటిని ఔచిత్యము కొలది వాడవచ్చును. 144

భ్రమరము, ఆస్కందితము, పిష్టకుట్టము, చాషగతము, అడ్డితము, ఏలకాక్రీడితము, అధ్యర్ధము, ఆవర్తము, శకటాస్యము, సమోసరితము, — ఇట్లు పది భౌమ మండలములను చెప్పుదురు.

సూచీవిద్ధము, అతిక్రాంతము, దండపాదము, అలాతకము, విచిత్రము, విహృతము, వామబంధము, లలితసంచరము, క్రాంతము, లలితము—ఈ పదియు ఆకాశగ మండలములు.

అడుగుల ప్రత్యేకతను లక్షణములందు నిర్దేశింపవలసియుండుటచేత చారీనామములు ఇందు పుంలింగములుగా అడుగులకు వాడబడినవి. 145, 146, 147

### పది భౌమమండలములు

కుడికాలు జనితముగా, ఎడమది స్యందితము చేసి, మరల కుడిపాదము శకటాస్యముగా, ఎడమది అపస్యందితముగా చేసి, కుడిప్రక్క భ్రమరి చేయుచు, రెండు మారులు త్రికమును త్రిప్పి, వామపాదమును స్యందితముగా, దక్షిణ పాదమును శకటాస్యముగా, వామమును చాషగతి కలదిగా, ఇతరమును భ్రమరిగాను, స్యందితముగాను చేయుట భ్రమరమనబడును. 148, 149, 150

(భ్రమరము — 1)

దక్షిణే భ్రమరీ, వామే మతం (మేఽడ్డితం ?)[1] భ్రమరకంచ తత్
దక్షిణం శకటాస్యాఖ్య మూరూద్వృత్తం తమేవచ. 151

వామమధ్యర్ధకం తంచ భ్రమరీం, దక్షిణం పునః
స్యందితం, దక్షిణాదన్యం శకటాననమేవతు
ఆస్ఫాలిత మహీపృష్ఠం పాదమాస్కందితం విదుః. 152
(ఆస్కందితమ్—2)

సూచీ (చీం ?) సవ్యమపక్రాంతం వామం, తదనుదక్షిణమ్
భుజంగత్రాసితం, వామమపి తం రచయన్ ముహుః
మండలం పూరయేద్యత్ర, పిష్టకుట్టం తదీరితమ్. (పిష్టకుట్టమ్—3) 153

సవ్యైశ్చాపగతైః పాదైః మండలం పరిపూరయేత్
భ్రామ్యం తత్ర చతుర్దిక్కమిదం చాపగతం మమ.[2] 154
(చాపగతమ్—4)

పార్శ్వక్రాంతక్రమం సవ్యమావర్తం స్యందితంచ తమ్
శకటాస్యం తతోవామం, సవ్యం చాపగతిం తతః. 155

వామమడ్డిత, మన్యత్తు (ంతు ?) కుర్యాదధ్యర్ధికం తతః
వామంతు భ్రమరం, చాన్యత్ (న్యం ?) స్యందితం తేన భూతలమ్
యస్మిన్నాస్ఫాలయేదేతత్ పరికీర్తిత మడ్డితమ్. (అడ్డితమ్—5) 156

సూచీవిద్ధైర్మహీసంస్థై రేలకాక్రీడితైరపి
పూర్ణైః త్రిక వివర్తైశ్చ సూచీవిద్ధాపవిద్ధకైః
మండలం తత్క్రమాత్కార్యమేలకాక్రీడితాభిధమ్. 157
(ఏలకాక్రీడితమ్—6)

---

1. 'వామశ్చైవాడ్డితో భవేత్ కార్యస్త్రిక వివర్తశ్చ' అని భ. నా. శా, (౧౦—౪౭), సం. రత్నా. కూడ ఇట్లే (౭-౧౧౫౧). మా. రా. కవిగారి భరతకోశముదాహరించిన వేమభూపాలుని సంగీతచింతామణియందును లక్షణమిట్లే. కనుక ఈ సవరణ సూచించితిని.

1. 'గతమ్ మతమ్' అని నావద్ది వ్రా. ప్ర; అదే యుక్తము.

కుడిపాదమున భ్రమరి, వామపాదమున అడ్డితమును, భ్రమరమును, ఆపై కుడిది శకటాస్యముగాను, ఊరూద్వృత్తముగాను, ఎడమది అర్ధ్యర్ధముగాను, భ్రమరిగాను నడిపి, మరల కుడికాలు స్యందితముగా, ఎడమది శకటాస్యముగా, ఆ కాలితోనే నేలను స్ఫుటముగా అప్పళించుట ఆస్కందిత మందురు.

(ఆస్కందితము—2) 151, 152

వలకాలు సూచిగా, డాకాలు అపక్రాంతముగా చేసి, ఆమీద కుడి యెడమ పాదములు రెండును భుజంగత్రాసితములుగా నడపి, ఇట్లు పలుమారు చేయుచు, ముగింపవలెను. అది పిష్టకుట్టము. (పిష్టకుట్టము—3) 153

అడుగులన్నియు చాషగతములుగానే నడపి, మండలములను ముగింపవలెను. ఇందు నాల్గు దిక్కులను తిరుగవలెను. ఇది చాషగతమని (నా) మతము. 154

(చాషగతము-4)

దక్షిణపాదము పార్శ్వక్రాంతముగా, ఆవర్తముగాను స్యందితముగాను చేసి, ఆపై వామము శకటాస్యముగా, దక్షిణము చాషగతిగాతీర్చి, తరువాత వామము అడ్డితముగా ఇతరము అధ్యర్ధికముగా సాగించి, అందుమీద వామము భ్రమరముగా, దక్షిణము స్యందితముగా నడపి దానితో నేల నప్పళింపవలయును; ఇది అడ్డితమనదగును. (అడ్డితము—5) 155, 156

నేల నంటుకొన్న పాదములతో క్రమముగా సూచీ విద్ధములు, ఏలకాక్రీడితములు, పూర్ణముగా భ్రమరములు, మరల సూచీవిద్ధములు, అపవిద్ధములును నడిపి, మండలము తీర్పవలయును. ఇది ఏలకాక్రీడితము. 157

(ఏలకాక్రీడితము—6)

విధాయ చరణం సవ్యం జనితం స్యందితం క్రమాత్,
వామమధ్యర్ధికం, సవ్యం శకటాస్యమనంతరమ్. 158

విదధీత చతుర్దిక్కమండలభ్రమణం క్రమాత్
యత్రాధ్యర్ధమిదం ప్రాహుః యుద్ధే ప్రాయేణ కీర్తితమ్. 159
(అధ్యర్ధమ్—7)

ప్రథమం జనితం వామమూరూద్వృత్తమథేతరమ్
శకటాస్యం తమేవోరూద్వృత్తం చాషగతిం పరమ్. 160

దక్షిణం స్యందితం వామం శకటాస్యం తథేతరమ్
భ్రమరీం చరణం కుర్యాత్ కృతత్రికవివర్తనమ్,
వామం చాపగతిం యత్ర తదావర్తముదాహృతమ్. 161
(ఆవర్తమ్—8)

దక్షిణం జనితం కుర్యాదూరూద్వృత్తం తమేవచ
శకటాస్యం క్రమేణాథ వామం స్యందితసంజ్ఞితమ్. 162

శకటాస్యైస్తతః పాదైర్మండలం పరిపూరయేత్
యస్మిన్నేతత్సమాఖ్యాతం శకటాస్యాభిధం బుధైః. 163
(శకటాస్యమ్—9)

సమపాదైః స్థితస్థానే (సమపాదే స్థితః స్థానే ?)[1] సంప్రసార్య తథాకరౌ
శి (శ్లి ?)[2] ష్టమూర్ధతలావేతావావేష్ట్యోద్వేష్టితౌ క్షిపేత్. 164

కటీతటే తతస్సవ్య వామాభ్యాం క్రమశోఽథ జేత్
చరణాభ్యాం స్థితావర్తాం వామంత్వగ్రే ప్రసారయేత్
చతుర్దిక్కం తతోభ్రామ్యేత్ సమోసరితసంజ్ఞితః. 165
(సమోసరితమ్—10)

---

1. ముద్రితపాఠము అనన్వితము. సవరణ నా సూచన.

2. 'శిష్ట' అర్థము లేనిది. ఇతరగ్రంథములందలి 'నిరంతర' శబ్దమునుబట్టి యీ సవరణ సూచించినాను. (భ. నా. శా. ౧౧-౫౪; సం. రత్నా. ౭-౧౧౬౪; భర. కో. వేమ భూపతి సంగీతచింతామణి లక్షణము, 'సమోత్సారితం-మండలం' క్రింద.)

కుడిపాదమును జనితముగా, స్యందితముగా క్రమముతో చేసి, తరువాత వామ పాదమును అధ్యర్ధికముగా, కుడిపాదమును శకటాస్యముగా నడిపి, క్రమముగా నలుదిక్కులను మండలభ్రమణము చేయుట అధ్యర్ధమగును; ఇది ప్రాయికముగా యుద్ధమున ప్రయోగింపదగినదందురు. (అధ్యర్ధము—7) 158, 159

మొదట ఎడమకాలిని జనితముగా ఊరూద్వృత్తముగా, తరువాత కుడికాలిని శకటాస్యముగా, ఊరూద్వృత్తముగా, మరి యెడమకాలిని చాషగతిగా, కుడి కాలిని స్యందితముగా, ఆపై ఎడమకాలిని శకటాస్యముగా, కుడికాలిని త్రికము త్రిప్పుచు భ్రమరిగా, ఎడమకాలిని చాషగతిగా, నడపవలయును; అది ఆవర్తము. (ఆవర్తము—8) 160, 161

దక్షిణపాదమును క్రమముగా జనితము ఊరూద్వృత్తము, శకటాస్యమునుగా చేసి, ఆపై వామపాదము స్యందితము చేసి, శకటాస్యపాదములతో మండలము ముగింపవలయును; ఇది శకటాస్యము. (శకటాస్యము—9) 162, 163

సమపాదస్థానమందు నిలిచి, అరచేతులు మీదుగా హస్తములను చేరికగా కూర్చి, ఆవేష్టితమును, ఉద్వేష్టితమును చేసి, కటితటములందు పెట్టవలెను; ఆపై క్రమముగా కుడియెడమ పాదములచే స్థితావర్తచారిని చేయదగును; ఆపై ఎడమ కాలిని ముందుకు చాచి, నలుదిక్కులను చుట్టవలయును; ఇది సమోసరితము. (సమోసరితము—10) 164, 165

దశ ఆకాశమండలాని

వామం సూచీం ప్రకుర్వీత తదేవభ్రమరీమపి
దక్షిణం పార్శ్వతః క్రాంత మతిక్రాంతం తతోఽపరమ్. 166

అన్యతస్సూచీ, మపక్రాంతం వామం, వామేతరంపునః
పార్శ్వక్రాంతాభిధం యత్ర సూచీవిద్ధం తదుచ్యతే. 167
(సూచీవిద్ధమ్—1)

జనితం చరణం కృత్వా శకటాస్యంచ దక్షిణమ్,
అలాతమపరం, పార్శ్వక్రాంతం దక్షిణ మాచరేత్. 168

వామం సమాచరేత్సూచీం, పార్శ్వక్రాంతంతు దక్షిణమ్,
వామపాదం తతస్సూచీం, అపక్రాంతంతు దక్షిణమ్. 169

సూచీం వామేఽను[1]కుర్వీత, సవ్యేన భ్రమరీమపి
తేనోద్వృత్త, మలాతంతు వామేన కరణం తతః. 170

ఛిన్నం సవ్యేన వామేన బాహ్యాతో భ్రమరీం భజేత్
అతిక్రాంతం తమేవాంఘ్రిం దండపాదంతు దక్షిణమ్
యస్మిన్నిదమతిక్రాంతం వ్యాయామే పరికీర్తితమ్. 171
(అతిక్రాంతమ్—2)

దక్షిణే జనితం కుర్యాః దండపాదం తమేవచ,
వామం సూచీం భ్రమర్యాచ, సవ్యముద్వృత్త సంజ్ఞకమ్. 172

అలాతం వామతః పాదం, పార్శ్వక్రాంతంతు సవ్యతః
భుజంగత్రాసితం తద్వదతిక్రాంతం తథేతరమ్. 173

దక్షిణం దండపాదంతు, వామం సూచీమనంతరమ్
తమేవ భ్రమరీం కుర్యాః, దండపాదం తదీరితమ్. 174
(దండపాదమ్—3)

---

1. 'వామేన' అను నావద్ది వ్రా. ప్ర. పారము మేలైనది

**పది ఆకాశమండలములు**

ఎడమకాలు సూచిగా, భ్రమరిగా చేసి, కుడికాలిని పార్శ్వక్రాంతముగా, ఎడమకాలిని అతిక్రాంతముగా, కుడిది సూచిగా, ఎడమది అపక్రాంతముగ, కుడిది మరల పార్శ్వక్రాంతముగ చేయుట సూచీవిద్ధమనబడును. 166, 167

(సూచీవిద్ధము—1)

దక్షిణచరణము జనితమును, శకటాస్యమునుగా జేసి, వామము అలాతముగ, దక్షిణము పార్శ్వక్రాంతముగ చేయవలెను; ఆపై వామము సూచి, దక్షిణము పార్శ్వక్రాంతము, మరల వామము సూచి, దక్షిణము అపక్రాంతము, వామము సూచి, దక్షిణము భ్రమరి చేసి, దానిచే ఉద్వృత్తకరణమును, వామముచే అలాతకరణమును, దక్షిణము చేత ఛిన్నకరణమును చేసి, వామమున బాహ్యభ్రమరి చేయవలెను; వామమును అతిక్రాంతముగా, దక్షిణమును దండపాదముగా తీర్పవలెను; ఇది అతిక్రాంతము. వ్యాయామమున ఉపయోజ్యము.

(అతిక్రాంతము—2) 168, 169, 170, 171

వలకాలు జనితమును, దండపాదమునుగా చేసి, డాకాలు సూచియు, భ్రమరియుగా చేసి, వలకాలు ఉద్వృత్తము, డాకాలు అలాతమునుగ చేసి, వలకాలు పార్శ్వక్రాంతముగను, భుజంగత్రాసితముగను సాగించి, డాకాలు అతిక్రాంతముగ వలకాలు దండపాదముగ నడిపి దానితోనే తరువాత భ్రమరి చేయవలయును. ఇది దండపాదము. (దండపాదము—3) 172, 173, 174

విదధ్యాద్దక్షిణం సూచీ, మతిక్రాంతం తథేతరమ్
పార్శ్వక్రాంతం తతస్సవ్యం, తస్మాదన్య మలాతకమ్. 175

షట్ కృత్వః సప్తకృత్వోవా చారీరావర్తయన్నిమాః[1]
చతుర్దిక్కం పరిభ్రమ్య లలితైః పాదవిక్రమైః. 176

అపక్రాంతం పునస్సవ్యమతిక్రాంతం తథాஉపరమ్
భ్రమర్యాఖ్యంచ కుర్వీత యత్రాలాతముశంతి తత్. (అలాతమ్—4) 177

దక్షిణం జనితం కుర్యాదూరూద్వృత్తం తమేవచ,
అపరం స్యందితం, పార్శ్వక్రాంతం తదనుదక్షిణమ్. 178

వామం సూచీమపక్రాంతం దక్షిణం చరణం పునః,
భుజంగత్రాసితం వామ,మతిక్రాంతం తతోஉపరమ్. 179

ఉద్వృత్తమముమేవాంఘ్రి, మలాతం వామమాచరేత్
పార్శ్వక్రాంతక్రమం సవ్యం సూచీమన్యమనంతరమ్. 180

నిక్షిప్య దక్షిణం వామమపక్రాంతోక్తమాచరేత్
యత్ర తత్స్యాత్ విచిత్రాఖ్యం యోగ్యాయాం వినియుజ్యతే. 181
(విచిత్రమ్—5)

కుర్వీత జనితం సవ్యమూరూద్వృత్తం తమేవచ
స్యందితం వామ, ముద్వృత్తం సవ్యం, వామమలాతకమ్. 182

సవ్యం సూచీం, పునర్వామం, పార్శ్వక్రాంతమనంతరమ్,
ఆక్షిప్తం భ్రమరీ (రీం ?) దండపాదం సవ్యం క్రమాత్తతః. 183

వామం సూచీం భ్రమర్యాచ, భుజంగత్రాసితాభిధమ్
[2]సవ్యం, వామమతిక్రాంతం, యస్మిన్ తద్విహృతం మతమ్. 184
(విహృతమ్—6)

---

1. 'యంత్విమాః' అని ముద్రి. పా; సీదిది 'విదధ్యాత్-కుర్వీత' అను ఇందలి యేకవచన క్రియలకు తగినది; నావద్ది వ్రా. ప్ర. లోనిది.
2. 'సవ్యావామమతిక్రాంతా' అను ముద్రి. పా అన్వయింపదు ఇతరలాతుణికుల ననుసరించి యీ సవరణ సూచించితిని.

కుడిపాదమును సూచిగా, ఇతరమును అతిక్రాంతముగా చేయవలయును; ఆపై కుడికాలిని పార్శ్వక్రాంతముగా, ఇంకొకకాలిని అలాతముగా చేయదగును; ఈ చారులను ఆరు మారులో, ఏడు మారులో ఆవర్తించుచు, లలితములైన పాద గతులచే నాల్గుదిక్కులను చుట్టివచ్చి, మరల కుడిపాదమును అపక్రాంతముగా, ఎడమదానిని అతిక్రాంతముగా చేసి దానితోనే భ్రమరి చేయవలయును; ఇది అలాతమందురు. (అలాతము—4) 175, 176, 177

దక్షిణపాదము జనితము, ఊరూద్వృత్తమును, వామము స్యందితము, దక్షిణము పార్శ్వక్రాంతము, వామము సూచి, దక్షిణము అపక్రాంతము, వామము భుజంగత్రాసితము, దక్షిణము అతిక్రాంతము, ఉద్వృత్తమును, వామము అలాతము, దక్షిణము పార్శ్వక్రాంతము, వామము సూచి—ఇట్లు నడపి దక్షిణపాదము మెట్టి, వామము అపక్రాంతముగా చేయవలెను; ఇది విచిత్రమనబడును; వ్యాయామమున దీని వినియోగము. (విచిత్రము—5) 178, 179, 180, 181

కుడిపాదము జనితము, ఊరూద్వృత్తమును, ఎడమది స్యందితము, కుడిది ఉద్వృత్తము, ఎడమది అలాతము, కుడిది సూచి, ఎడమది పార్శ్వక్రాంతము, ఆపై కుడిది క్రమముగా ఆక్షిప్తము, భ్రమరి, సూచియు, ఎడమది సూచి, భ్రమరియు, కుడిది భుజంగత్రాసితము, ఎడమది అతిక్రాంతము — ఇట్లు నడుపుట విహృతమగును. (విహృతము—6) 182, 183, 184

సూచీం వామేతరం కుర్యురపక్రాంతమథాపరమ్
దండపాదం తతస్సవ్యం, సూచీపాదంతు వామతః. 185

తమేవ భ్రమరీం, పార్శ్వక్రాంతం వామేతరం తతః
ఆక్షిప్తం దండపాదంచ వామం సవ్యం యథా క్రమమ్. 186

ఊరూద్వృత్తం తతస్సవ్యం సూచీంచ భ్రమరీ మపి
అలాతంచ తథావామం పార్శ్వక్రాంతంచ దక్షిణమ్,
అతిక్రాంతం పరం యత్ర వామబంధం తదీరితమ్. 187

(వామబంధమ్—7)

ఊర్ధ్వజానుకృతం కుర్యాత్ పాదసూచీంచ దక్షిణమ్
అపక్రాంతం తతోఽప్యన్యం పార్శ్వక్రాంతంతు దక్షిణమ్. 188

అతిక్రాంతం తతోఽప్యన్యం పాదసూచీంచ దక్షిణమ్
అతిక్రాంతం తతోవామం పార్శ్వక్రాంతంతు దక్షిణమ్. 189

వామం పునరతిక్రాంతం ఛిన్నాఖ్యం కరణం తతః
బాహ్యభ్రమరకం వామమస్మిన్ లలితసంచరే. 190

(లలితసంచరమ్—8)

దక్షిణం చరణం సూచీమతిక్రాంతం తథాఽపరమ్
కుర్యాత్ సవ్యంచ వామంచ పార్శ్వక్రాంతక్రమం తతః. 191

పర్యాయేణాథ చారీభిరేతాభిః పరితో భ్రమన్
సూచీం వామమపక్రాంతం కుర్యాత్సవ్యమనంతరమ్. 192

తతః సహజయా గత్యా మండలాకారతో భ్రమేత్
యత్రకాంతతరం క్రాంతం వ్యాయామే నృత్తకోవిదైః. 193

(క్రాంతమ్—9)

దక్షిణము సూచి, ఎడమకాలు అపక్రాంతము, ఆపై కుడికాలు దండపాదము, ఎడమది సూచియు, భ్రమరియు, తరువాత కుడిపాదము పార్శ్వక్రాంతము, ఎడమది ఆక్షిప్తము, కుడిది దండపాదము ఊరూద్వృత్తమును, వామపాదము సూచి, భ్రమరి, అలాతమును, దక్షిణము పార్శ్వక్రాంతము, వామము అతిక్రాంతము — ఇట్లు నిర్వహించుట వామబంధమనబడును 185, 186, 187

(వామబంధము—8)

కుడికాలు ఊర్ధ్వజానువై పాదసూచి చేయదగును; ఆపై ఎడమది అపక్రాంతము, కుడిది పార్శ్వక్రాంతము, ఎడమది అతిక్రాంతము, దక్షిణము పాదసూచి, తరువాత వామము అతిక్రాంతము, దక్షిణము పార్శ్వక్రాంతము, మరల వామము అతిక్రాంతము, తరువాత ఛిన్నమను కరణము చేసి, యెడమపాదముతో బాహ్యాభ్రమరి చేయవలయును; ఇది లలితసంచరము. 188, 189, 190

(లలితసంచరము—8)

దక్షిణపాదము సూచి, వామపాదము అతిక్రాంతము, తరువాత దక్షిణపాదమును, వామపాదమును మార్చి మార్చి పార్శ్వక్రాంతము చేయవలయును; ఈ చారులతో చుట్టును దిరుగుచు ఎడమపాదము సూచిగా, కుడిది అపక్రాంతముగా తీర్పవలయును; ఆపై స్వాభావికమగు గతితో మండలాకారముగా మనోహరముగా చుట్టవలయును; ఇది క్రాంతము; నృత్తకోవిదులు దీనిని వ్యాయామమునందు వినియోగింతురు. (క్రాంతము—9) 191, 192, 193

చరణం దక్షిణం సూచీమపక్రాంతం తతోఽపరమ్
పార్శ్వక్రాంతం తతః పూర్వం భుజంగత్రాసితంచ తత్. 194
అతిక్రాంతం తతో వామమాక్షిప్తం దక్షిణం పునః
అలాతం వామకం పార్శ్వక్రాంతం వామేతరం తతః, 195
అతిక్రాంతం తథాచోరూద్వృత్తం సూచీంచ వామకమ్
అపక్రాంతం పునర్వామం యత్ర తల్లలితం భవేత్. 196
(లలితమ్—10)

ఏతాని మండలానీహ[1]దర్శితాని సమాసతః
అన్యోన్యయోజనాద్యోగ్యచారీణాం చతురాశయైః. 197

అతః పరమపి స్వైరం కల్పనీయాని కాన్యపి
తాని; పూర్వోక్త లక్ష్యాణి[2]చారీభిస్తైకజాతిభిః. 198

ఏతాని ఖండసహితాన్యపి మండలాని
లీలాంగయష్టి మధురాణి మనోహరాణి
వాద్యానుగాని వివిధాని బుధోనియుద్ధే
యుద్ధేఽథ నర్తనవిధౌ విధివద్విదధ్యాత్. 199
ఆవర్తకాంతం లలితం విచిత్ర
మాస్కందితం కాంత (క్రాంత ?) విధిం దధానమ్
ఇత్యబ్రవీన్మండల లక్ష్మసుశ్రీః
తురంగతుల్యాం గజసైన్యనాథః. 200

ఇతి
శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
చారీస్థానక మండలలక్షణం నామ
తృతీయోఽధ్యాయః.

---

1. ముద్రితపాఠమున ఒక యక్షరము చాలకున్నది. కాని మీది పూర్ణపాఠము నావద్ది వ్రా. ప్ర. లోనిది.
2 'పూర్వోక్త లక్ష్మాణి?' అని పరిష్కర్త పాఠసందేహమును సూచించిరి. ఉన్నదానిని ఇట్లు అన్వయింపవచ్చునని నా సూచన.

దక్షిణపాదము సూచి, వామపాదము అపక్రాంతము, దక్షిణపాదము పార్శ్వ క్రాంతము భుజంగత్రాసితమును, ఆమీద వామము, అతిక్రాంతము, దక్షిణము ఆక్షిప్తము, వామము అలాతము, దక్షిణము పార్శ్వక్రాంతము, వామము అతి క్రాంతము, ఊరూద్వృత్తము, సూచియుగా చేసి, మరల వామపాదము అప క్రాంతము చేయుట లలితమగును. (లలితము–10) 194, 195, 196

ఇట్టి మండలములు ఇక్కడ సంగ్రహముగా చూపబడినవి; బుద్ధిచాతుర్యము గలవారు యోగ్యములైన చారులను పరస్పరముగా (భౌమాకాశచారులను) కలిపి మరికొన్ని మండలములను స్వతంత్రముగా కల్పింపవచ్చును. ఇంచాక చెప్పిన లక్ష్యములు ఒక జాతి చారులు గూర్చినవి మాత్రమే. 197, 198

ఈ మండలములు ఖండము ( కరణములు మూడు ) గలిగినవియు, శీలతోడి అంగయష్టిగలిగి ఇంపై, మనోహరములై యుండునట్లు, వాద్యముల పొందికతో, వివిధములుగా, యుద్ధమందు, బాహుయుద్ధమున, నర్తనమున, శాస్త్రప్రకారము పండితుడు చేయనగును. 199

అందమైన నుడులు గలిగి, విలాసముతో విచిత్రమైన రవగాలి నడక గలిగిన గుఱ్ఱమువలె, ఆవర్తము, లలితము, విచిత్రము, ఆస్కందితము, క్రాంతము, అను భేదములుగల మండలముల లక్షణమును శ్రీమంతుడగు గజసేనానాథు డిట్లు వచించెను. 200

ఇది

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుడగు
జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు
చారీ స్థానక మండలముల లక్షణమను
మూడవ యధ్యాయము.

చరణం దక్షిణం సూచీమపక్రాంతం తతోఽపరమ్
పార్శ్వక్రాంతం తతః పూర్వం భుజంగత్రాసితంచ తత్. 194
అతిక్రాంతం తతో వామమాక్షిప్తం దక్షిణం పునః
అలాతం వామకం పార్శ్వక్రాంతం వామేతరం తతః, 195
అతిక్రాంతం తథాచోరూద్వృత్తం సూచించ వామకమ్
అపక్రాంతం పునర్వామం యత్ర తల్లలితం భవేత్. 196
(లలితమ్—10)

ఏతాని మండలానీహ[1]దర్శితాని సమాసతః
అన్యోన్యయోజనాద్యోగ్యచారీణాం చతురాశ్రయైః. 197

అతః పరమపి స్వైరం కల్పనీయాని కాన్యపి
తాని; పూర్వోక్త లక్ష్యాణి[2]చారీభిస్త్వేకజాతిభిః. 198

ఏతాని ఖండసహితాన్యపి మండలాని
లీలాంగయష్టి మధురాణి మనోహరాణి
వాద్యానుగాని వివిధాని బుధోనియుద్ధే
యుద్ధేఽథ నర్తనవిధౌ విధివద్విదధ్యాత్. 199
ఆవర్తకాంతం లలితం విచిత్ర
మాస్కందితం కాంత (క్రాంత ?) విధిం దధానమ్
ఇత్యబ్రవీన్మండల లక్ష్మసుశ్రీః
తురంగతుల్యం గజసైన్యనాథః. 200

ఇతి

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
చారీస్థానక మండలలక్షణం నామ
తృతీయోఽధ్యాయః.

1. ముద్రితపాఠమున ఒక యక్షరము చాలకున్నది. కాని మీది పూర్ణపాఠము నావద్ది వ్రా. ప్ర. లోనిది.
2 'పూర్వోక్త లక్ష్మాణి?' అని పరిష్కర్త పాఠసందేహమును సూచించిరి. ఉన్నదానిని ఇట్లు అన్వయింపవచ్చునని నా సూచన.

# ఇక నాలవ యధ్యాయము

కౌగిలించునపుడు తొడ మలచి గౌరి విదిలించిన కాలి యందియ మెరయుచు తనకాలికి తగులు కొనియుండగా, చేతిలో జింక యెగురాడు చుండగా, కదలాడు పాదములు తన్ను గొలిచియుండగా, ప్రక్కన పాదమును తాకుచు నంది గోరాడు చున్న మోకాలుఱ మీదికెత్తుకొన వేడుకపడుచున్న శివునివలె — వలితోరువు, ఆక్షిప్తము, క్రాంతము, హరిణప్లుతము, భుజంగాంచితము, పార్శ్వక్రాంతము, అపవిద్ధము, వృషభక్రీడము, ఊర్ధ్వజానువు, అనుభేదములు గలిగియుండు కరణ సమూహమును జాయన వివరించుచున్నాడు. 1

## నృత్త కరణములు

స్థానకములు, నృత్త హస్తములు, చారులు - ఇవి తగినట్లు కూడుకొనుట కరణములకు మాతృక (మూలాధారము). 2

మీది - క్రింది దేహమునకు చేరిన హస్తములు, పాదములు మొదలైన అంగములు తమ తమ చోటినుండి వేరొకచోటికి విలాసపూర్ణముగా చేరుట నృత్తకరణ మనబడును. 3

భీమసేనుని పేరు ఏకదేశముగా భీముడన్నట్లు నృత్త కరణమును కరణమని పేర్కొందురని యెరుగదగును. 4

తలపుష్పపుటము, క్రాంతము, ఛిన్నము, సమనఖము, అంచితము, శకటాస్యము, కటిచ్ఛిన్నము, ఉద్ఘట్టితము, నికుట్టకము, 5

లలితము, వలితము, లీనము, స్ఖలితము, చక్రమండలము, నివేశము, స్వస్తికము, సూచి, సూచీవిద్ధము, అర్ధసూచి, 6

వక్షఃస్వస్తికము, ఉన్మత్తము, అర్ధరేచితము, అర్గళము, అర్ధస్వస్తికము, ఆవర్తము, పృష్ఠస్వస్తికము, వర్తితము, 7

భుజంగాంచితము, విష్కంభము, విక్షిప్తము, దండరేచితము, అర్ధమత్తల్లి, మత్తల్లి; మదస్ఖలితము, లోలితము, 8

ప్రేంఖోలిత నితంబోర్ధ్వజాను పార్శ్వనికుట్టకమ్,
పార్శ్వక్రాంతమపక్రాంత మతిక్రాంతం నికుంచితమ్. 9

విద్యుద్భ్రాంతం కటిభ్రాంత మురోమండల సన్నతే
వినివృత్త నివృత్తా[1]పవిద్ధాని గరుడప్లుతమ్. 10

లలాటతిలకం దోలపాదం తలవిలాసితమ్
తలసంస్ఫోటితం దండపక్షమాక్షిప్తరేచితమ్. 11

జనితోపసృతోద్వృత్తాన్యవహిత్థ నిశుంభితే
విక్షిప్తాక్షిప్తమాక్షిప్తం భుజంగత్రస్తరేచితమ్. 12

మండలస్వస్తికం దండపాదం పాదాపవిద్ధకమ్
భుజంగత్రాసితం విష్ణుక్రాంతం స్వస్తికరేచితమ్. 13

ఫలకాక్రీడ సంభ్రాంతే సింహాకర్షితసర్పితే
నాగాపసర్పితం పార్శ్వజాను వృశ్చికరేచితమ్. 14

లతావృశ్చిక వైశాఖరేచితే హరిణప్లుతమ్
దిక్ స్వస్తిక గజక్రీడా చతురాణి కటీసమమ్. 15

మయూరస్ఖలితాలాతే సింహవిక్రీడకుంచితే
వృశ్చికం వ్యంసితం కంపపరివృత్త వివర్తితే. 16

రేచకాది నికుట్టోరూద్వృత్తే వృశ్చికకుట్టితమ్,
తలసంఘట్టితం గండసూచీ భ్రమరనూపురే. 17

ఘూర్ణితం వృషభక్రీడం కరిహస్తం ప్రసర్పితమ్
వలితోరుక గృధ్రావలీనే అర్ధనికుట్టితమ్
గంగావతరణం చైవ ముక్తాన్యష్టోత్తరం శతమ్. 18

---

1. నివృత్తమును వివృత్తమనియే - రత్నాకరాభినవభారతులు పఠించినవి.

ప్రేంఖోలితము, నితంబము, ఊర్ధ్వజానువు, పార్శ్వనికుట్టకము, పార్శ్వ క్రాంతము, అపక్రాంతము, అతిక్రాంతము, నికుంచితము. 9

విద్యుద్భ్రాంతము, కటిభ్రాంతము, ఉరోమండలము, సన్నతము, వినివృత్తము, నివృత్తము, అపవిద్ధము, గరుడప్లుతము. 10

లలాటతిలకము, దోలపాదము, తలవిలాసితము, తలసంస్ఫోటితము, దండ పక్షము, ఆక్షిప్త రేచితము. 11

జనితము, ఉపసృతము, ఉద్వృత్తము, అవహిత్థము, నిశుంభితము, విక్షి ప్తాక్షిప్తము, ఆక్షిప్తము, భుజంగత్రస్తరేచితము 12

మండలస్వస్తికము, దండపాదము, పాదాపవిద్ధము, భుజంగత్రాసితము, విష్ణు క్రాంతము, స్వస్తిక రేచితము. 13

ఏలకాక్రీడము, సంభ్రాంతము, సింహాకర్షితము, సర్పితము, నాగాపసర్పితము, పార్శ్వజానువు, వృశ్చిక రేచితము. 14

లతావృశ్చికము, వైశాఖ రేచితము, హరిణప్లుతము, దిక్ స్వస్తికము, గజక్రీడ, చతురము, కటీసమము. 15

మయూరస్ఖలితము, అలాతము, సింహవిక్రీడము, కుంచితము, వృశ్చికము, వ్యంసితము, కంపపరివృత్తము, వివర్తితము. 16

రేచకనికుట్టము, ఊరూద్వృత్తము, వృశ్చికకుట్టితము, తలసంఘట్టితము, గండ సూచి, భ్రమరము, నూపురము. 17

ఘూర్ణితము, వృషభక్రీడము, కరిహస్తము, ప్రసర్పితము, వలితోరుకము, గృధ్రావలీనము, అర్ధనికుట్టితము, గంగావతరణము — ఇట్లు కరణములు నూట యెనిమిది చెప్పబడినవి. 18

ఏతేషామేవ ముఖ్యత్వం వాక్యార్థాభినయే సతి;
పదార్థాభినయేఽప్యేకవాక్యార్థానుప్రవేశతః. 19

ఆదౌ మధ్యేఽవసానే వా కుర్యాత్తాని యథోచితమ్
ప్రాధాన్యఖ్యాపనాయేతి రహస్యమిదమీరితమ్. 20

యత్రాభినయహస్తానాం ప్రాధాన్యం కరణే భవేత్
వాక్యార్థాభినయస్తత్రకార్యో, నృత్తేన కేవలే
నృత్తహస్తప్రధానంతు కరణం తత్రశస్యతే. 21

సమపాదం లతాహస్తౌ అంగస్య చతురశ్రతా
సాధారణమిదం నృత్యప్రయోగారంభ ఇష్యతే. 22

కరణేషూరసి ప్రాయో వామః స్యాత్ కటకాముఖః
చరణస్యానువాదీతు కరౌ వామేతరౌ భవేత్. 23

యదా వామకరస్యాదౌ ప్రయోగః స్యాత్తదా పునః
[1]వక్షః క్షేత్రే విధాతవ్యో లతాహస్తస్తు దక్షిణః 24

చతురశ్రత్వ హేతుత్వాత్ వైష్ణవం కేచిదూచిరే,
కరణాభినయేష్వేషు హస్తోవా చరణోఽథవా
ప్రాథమ్యాత్ దక్షిణః ప్రోక్తో విశేషో యత్రనోచ్యతే. 25

**అష్టోత్తరశతకరణ లక్షణాని**

తలపుష్పపుటం తత్ స్యాత్ యత్రాధ్యర్ధికయా పదమ్
నిష్క్రామేద్దక్షిణం పార్శ్వవ్యావృత్త్యా సమాగాకరౌ. 26

పరివృత్త్యా తయోర్వామం సన్నతం పార్శ్వమాగతౌ
వామస్తన సమక్షేత్రే స్యాతాం పుష్పపుటీ కృతౌ
తలసంచరపాదశ్చ కర్తవ్యః ప్రోక్తలక్షణః. 27

1. 'పక్షక్షేత్రే' అని ఒక వ్రా. ప్ర. అప్పుడు దక్షిణ లతాహస్తము పార్శ్వభాగ మందుండవలయునని అన్వయము [పరిష్కర్త] (చూ. క్రిందిసూచిక)

అపరనర్తనము

అర్ధకుంచితలాస్యకుతుపము-శివప్రియము



వాక్యార్థము నభినయించునపుడు, ఇవే ముఖ్యములై యుండదగును : పదార్థ ముల నభినయించునపుడును, ఒక వాక్యార్థమునకే చేరియుండునేని, వీనిని ఉచితమునెరిగి మొదటనో, నడుమనో, తుదనో చేయవలయును, ప్రాధాన్యమును ప్రకటించుటకు, ఇది రహస్యము. 19, 20

ఏకరణమందు అభినయహస్తములకు ప్రాధాన్యముండునో అక్కడ వాక్యార్థము నభినయింపవలెను; వట్టి నృత్తమున చేయగూడదు; అచ్చోట కరణమున నృత్తహస్తము ప్రధానముగా నుండుట మంచిది. 21

నృత్యప్రయోగము నారంభించునపుడు, సమపాదము, లతాహస్తములు, చతురశ్రమైన దేహమును సామాన్యముగా నుండదగును. 22

కరణములందు ప్రాయికముగ కటకాముఖమైన యెడమచేయి వక్షమునందుండును; కుడిచేయి పాదము ననుసరించును. 23

వామహస్తమును మొదట ప్రయోగింపవలసినప్పుడు, వక్షః ప్రదేశమందు దానిని బెట్టవలయును; దక్షిణము లతాహస్తముగ నుండును. 24

ఇక్కడ కొందరు చతురశ్రముగా నుండునది గనుక వైష్ణవస్థానకమును చెప్పినారు. ఈ కరణముల నభినయించుటలో హస్తముగాని, పాదముగాని, ప్రత్యేకముగా ఇతరమును పేర్కొననిచోట్ల, మొదలు కుడివిగా నుండవలయును. 25

**నూటయెనిమిది కరణముల లక్షణములు**

తలపుష్పపుటకరణ మెట్టిదనగా : కుడికాలిని అర్ధ్యర్ధికచారిచే వెనుకకు జరిపి, సమముగా కూడిన చేతులను వ్యావర్తనక్రియచే మరల పరివర్తనక్రియచే సన్నతమైన యెడమప్రక్కకు చేర్చి, పుష్పపుటముగా చేసి, వామస్తనమునకు సరియగు ప్రదేశమున చూపవలెను. పాదము తలసంచరముగా జరుపదగును; దాని లక్షణము వెనుక చెప్పబడినది. 26, 27

తలమిత్యేకదేశేన జ్ఞేయోఽత్ర తలసంచరః
తేనపుష్పపుటం యుక్తం తలపుష్పపుటం విదుః. 28

ఏవం సర్వత్ర విజ్ఞేయాః కరణేషు నిరుక్తయః;
దీయతే నర్తనారంభే దేవేభ్యః కుసుమాంజలిః. 29

అనేన కరణేనేతి పూర్వమస్య ప్రకీర్తనమ్;
అంతే మంగలరూపత్వాత్ గంగావతరణం స్మృతమ్. 30
(తలపుష్పపుటమ్—1)

కృత్వా చారీమపక్రాంతాం పాత్యమానం నికుంచితమ్
పృష్ఠతః స్థాపయిత్వాంఘ్రిం పురతస్తం ప్రసారయన్. 31

వ్యావర్తితేన నిష్క్రాంతమాక్షిప్త పరివర్తితమ్
కరం వక్షసి తద్దిక్కం విదధ్యాత్ కటకాముఖమ్;
యదాఽంగాంతరమప్యేవం తదాక్రాంతముదీరితమ్. 32
(క్రాంతమ్—2)

వైశాఖ స్థానకం యత్ర చ్ఛిన్నా స్యాత్ క్రమశః కటీ
అలపద్మస్తథా పార్శ్వక్షేత్రే తస్యాః కరో భవేత్
తత్తాలభంజనే ఛిన్నమంగస్యప్రతిసారణే. (ఛిన్నమ్—3) 33

పాదౌ సమనఖశ్లిష్టౌ స్యాతాం యత్ర లతాకరౌ
స్వభావావస్థితః కాయః స స్యాత్ సమనఖాభిధః. 34

నృత్యప్రవేశనారంభే వినియోగోఽస్య సమ్మతః
జవాది విషయే ప్రోక్తో విచారవిముఖైః పరైః. 35

ప్రలంబితావితి ప్రోక్తౌ భరతేనాత్ర యౌ కరౌ
తౌ దోలావితి మన్యంతే యత్తత్ కేచిన్నసాంప్రతమ్;
శ్లోకైక విషయావేతావితి మన్యామహే వయమ్. 36
(సమనఖమ్—4)

తలము అను ఏకదేశపదముచే తలసంచరమును గ్రహింపవలయును; దానితో గూడిన పుష్పపుటమును తలపుష్పపుటమందురు. 28

ఇట్లే అన్నికరణముల పేళ్ళకును నిర్వచనవులు తెలిసికొనునది. నర్తనారంభమునందు దేవతలకు పుష్పాంజలి యీకరణముతో సమర్పింతురు; కావున మొదలు దీనిని పేర్కొన్నారు; ముగింపునందు మంగళరూపముగాన గంగావతరణము గ్రహింపబడినది. (తలపుష్పపుటము—1) 29, 30

అపక్రాంతచారి చేసి నికుంచితమైన పాదమును వెనుకకు పడవేయుచు నిలిపి ముందుకు చాచి, హస్తమును వ్యావర్తితముగా వెలికిదీసి, ఆక్షిప్తముగా పరివర్తితము చేసి, ఆదిక్కుననే కటకాముఖముగా ఎదమీద నిలుపవలెను; ఇంకొకప్రక్క యంగమును ఇట్లే తీర్పవలయును: అది క్రాంతమనబడును. 31, 32 (క్రాంతము—2)

వైశాఖస్థానకమందుండి క్రమముగా కటిని ఛిన్నము చేసి, ఆ కటీ పార్శ్వమునందే అలపద్మహస్తము నుంచవలయును; అది ఛిన్నము; దీనిని తాలభంజనమునందును, అంగప్రతిసారణమందును ఉపయోగింపదగును. (ఛిన్నము—3) 33

పాదములు సమనఖములుగా చేరికగానుండి లతాకరములతో దేహము స్వాభావికరీతిగా నిలుచుట సమనఖము; నృత్యమునకై మొదలు ప్రవేశించునపుడు దీనిని వినియోగింపదగును. కొందరు విచారింపక జపము మొదలగువాని విషయమున దీని వినియోగమనిరి. 34, 35

ఈ కరణమునందు భరతుడు 'ప్రవిలంబిత' కరములని చెప్పగా కొందరు దోలాకరములని ఆ పదమున కర్థము భావించిరి; అది యుక్తముగాదు: దోలాహస్తనులు శోకమునందు మాత్రము వినియోగింపదగునని మా యభిప్రాయము. 36 (సమనఖము—4)

ఉక్తోఽర్ధస్వస్తికే హస్తౌ దక్షిణో యస్సఏవచేత్
వ్యావృత్త్యా పరివృత్త్యాచ నాసాదేశేఽల పద్మవత్. 37

అంచితాంఘ్ర్యనుసారీస్యాత్ తదంచితముదాహృతమ్;
ఏతస్య సమ్ముఖీనాత్మవిషయే భృశకౌతుకాత్
వాక్యార్థే వినియోగః స్యానమ్రతో నిర్వర్ణనాత్మకే. 38
(అంచితమ్—5)

పాదేన శకటాస్యాయాం సమం హస్తం ప్రసారయే
తద్దిక్కమపరం కుర్యాత్ వక్షఃస్థం కటకాముఖమ్. 39

యత్ర స్యాత్ శకటాస్యం తత్ [క్రీడాదౌ బాలఖేలనే][1]
అభ్యధత్త కరావత్ర భట్టతండుస్తు రేచితౌ. 40

పాదావాదాయ హస్తాభ్యాం ద్విస్త్రిః కుర్యాద్గతాగతమ్
శకటాకారతాం బిభ్రదితి కీ[కై]ర్తిధరం మతమ్. 41
(శకటాస్యమ్—6)

పార్శ్వాభ్యాం భ్రమరీం కృత్వా, మండలస్థానకం భజన్,
దధత్ ఛిన్నాం కటిం, ఛాయా మలపద్మ పతాకయోః 42

స్కంధేచ విదధత్ హస్తం కుర్యాదంగాంతరేణచ
ద్విశ్చతుర్వా క్రియా యత్ర తత్కటిచ్ఛిన్న మిష్యతే,
విస్మయాత్మని వాక్యార్థే విద్ధి రేతద్వినియతే. 43
(కటిచ్ఛిన్నమ్—9)

యస్మిన్నుద్ఘట్టితావంఘ్రీ క్రమాత్ పార్శ్వేచ సన్నతే
దత్తతాలతలౌ హస్తావేతదుద్ఘట్టితం మతమ్,
ఉత్సవానందనృత్తేఽస్య ప్రయోగః పరికీర్తితః. 44
(ఉద్ఘట్టితమ్—8)

---

1. 'క్రీడాగోపాలఖేలనే' అను వ్రా ప్ర. పాఠమునకు ఇట్లు సవరణ పరిష్కర్త సూచించినది.

అర్ధస్వస్తికకరణమున ఏదక్షిణహస్తము చెప్పబడినదో అదే వ్యావృత్తి పరివృత్తులు చేసి ముక్కుదగ్గర అలపద్మముగా, అంచితపాదమునననుసరించి నిలిచినచో అది అంచితకరణమగును. దీనికి సమ్ముఖీనాత్మ విషయమున (?) ఎక్కువ కుతూహలముతో పరికించు వాక్యార్థమున (?) వినియోగము. 37, 38

(అంచితము—5)

శకటాస్యచారియందలి పాదముతో సరిగా హస్తమును ఆదిక్కుననే చాచవలయును; ఇంకొక హస్తమును కటకాముఖము చేసి వక్షస్సునందుంచవలెను; ఇది శకటాస్యము; ఆటలాడు బాలకుల క్రీడ మొదలగువానియందు దీనివినియోగము. దీనియందు తండు భట్టాచార్యుడు రేచితహస్తము లుండదగునని చెప్పెను. రెండు చేతులతో రెండు కాళ్ళను పట్టుకొని రెండు మూడు మార్లు ముందు వెనుకలుగా ఊగవలెనని కీర్తిధరుని మతము. 39, 40, 41

(శకటాస్యము—6)

రెండుప్రక్కలను భ్రమరిచేసి, మండల స్థానకమందు నిలిచి, కటిని ఛిన్నము చేసి, అలపద్మ పతాకల ఛాయగల హస్తమును [పల్లవ హస్తమును][1] మూపున పెట్టుకోవలెను; ఇట్లు ఇంకొకయంగముచేగూడ చేయదగును; ఇట్లు రెండుసారులు గాని, నాలుగుసార్లుగాని చేయుట కటిచ్ఛిన్నము; ఆశ్చర్య ప్రధానమైన వాక్యార్థములందు విజ్ఞులు దీనిని ఏర్పరచిరి. (కటిచ్ఛిన్నము—7) 42, 43

పాదములు క్రమముగా ఉద్ఘట్టితములై, పార్శ్వములు సన్నతములై అరచేతులు తట్టబడుట ఉద్ఘట్టితము. పండుగలలో ఆనందముతో చేయు నృత్తమున దీని ప్రయోగము. (ఉద్ఘట్టితము—8) 44

---

1. ఈ తాత్పర్య సూచన పరిష్కర్తది (చూ. క్రింది సూచిక)

మండలస్థానకే స్థిత్వా చాతురశ్ర్యాదనంతరమ్
హస్తముద్ఘట్టితం సవ్యం స్కంధోద్దేశే నికుట్టయేత్. 45

తమేవోద్ఘట్టితం పాదం కుర్యాద్వామం యథాస్థితమ్,
పాణిపాదమథావిద్ధ వక్ర వర్తనయాఽకరమ్. 46

తమేవ చతురశ్రంచ తస్యైవ సమకాలతః
అంగం నికుట్టయేదన్యత్ పూర్వవద్యత్ర తత్ స్మృతమ్. 47

నికుట్టకం, ముహుర్వాక్యే స్వస్య శ్లాఘా ప్రధానకే;
అలపద్మకనీయస్యాః పతనోత్పతనాత్మకమ్
నికుట్టక మిహాక్షేయం స్కంధే కోహాల సమ్మతమ్. 48
(నికుట్టకమ్—9)

కేశబంధ నితంబాఖ్య హస్తయోరనుసారతః
అసకృద్దక్షిణం హస్తమపవర్తిత మాచరేత్. 49

పాదం చోద్ఘట్టితం కుర్యాద్వామం కరికరం పరమ్[1]
ముహురంగద్వయేనైష యత్ర తల్లలితం మతమ్;
స్యాన్నృత్య నృత్తయోరస్య ప్రయోగస్సవిలాసయోః. 50
(లలితమ్—10)

అపక్రామతి దేహస్య క్షేత్రాత్ సూచీముఖే కరే
సూచీపాదోఽప్యపక్రామేత్ తద్దిక్కోక్రమరీ తతః
పునరంగాంతరేణైవ (వం ?) యత్ర తద్వలితం మతమ్, 51
(వలితమ్—11)

ఊర్ధ్వమండలినౌ కృత్వా తతో వర్తనయాఽనయోః
వక్షః స్థలేఽంజలిం కుర్యాత్ శిరోయత్ర నిహంచితమ్
తల్లీనమితి విజ్ఞేయం ప్రియాయాః ప్రార్థనం ప్రతి. (లీనమ్—12) 52

1. 'వామః కరికరః పరః' ముద్రి. మీదిది నావద్ది వ్రా ప్ర లోనిది సుగమము

చతురశ్రపూర్వకముగా మండలస్థానకమందు నిలిచి, ఉద్ఘట్టితమైన కుడిచేతిని మూపు దగ్గర నికుట్టనము చేయవలయును; కుడి పాదమునే ఉద్ఘట్టితము చేసి యెడమకాలు చేతులను ఉన్నట్టుగా నుంచవలెను; ఆమీద అదే హస్తమునే ఆవిద్ధ వక్రవర్తనచే చతురశ్రపరచవలెను; దానితో సమకాలముగా ఇతరాంగమును పూర్వమువలె నికుట్టనము చేయదగును; అది నికుట్టకము; తన్నుతాను శ్లాఘించు మాటయందు దాని వినియోగము. ఇక్కడ మూపునందు అలపద్మహస్తపు చిటికెన వ్రేలు క్రిందికి మీదికి పడుచుండుట నికుట్టనమని కోహలమతము.
(నికుట్టకము—9) 45, 46, 47, 48

కేశబంధ నితంబహస్తముల ననుసరించి దక్షిణహస్తమును పలుమారు అపవర్తితము చేయవలెను; ఎడమపాదమును ఉద్ఘట్టితముగా, ఎడమహస్తమును కరిహస్తముగా చేయవలెను; ఇట్లు అంగద్వయమునను పలుమారు చేయనగును; ఇది లలితము; దీనిని సవిలాసముగా చేయు నృత్య నృత్తములందు ప్రయోగింపదగును.
(లలితము—10) 49, 50

సూచీముఖహస్తము దేహక్షేత్రమునుండి అపక్రమింపగా సూచీపాదముగూడ ఆదిక్కునకే అపక్రమింపవలెను; ఆపై భ్రమరి; ఇట్లే మరల ఇంకొక యంగమునందును జరుగవలెను. అది వలితము. (వలితము—11) 51

హస్తములు ఊర్ధ్వమండలములుగా చేసి, ఆపైని వర్తనచే వక్షఃస్థలమందు అంజలి కూర్పవలయును. ఇందు శిరస్సు నిహంచితముగా నుండదగును; ఇది లీనము; ప్రియురాలిని వేడుకొనుటయందు దీని వినియోగము. 52
**(లీనము—12)**

గమనాగమనే దోలాపాదపాదం సమాచరేత్
తద్వద్బాహుశ్చ తద్దిక్కో హంసపక్షోపలక్షితః,
ఏవమంగాంతరం యత్ర స్ఖలితం తదుదాహృతమ్. (స్ఖలితమ్—13) 53

[అడ్డితా][1] ప్రథమం చారీ దోలాలంబితబాహుకః
పూర్వకాయో నతోయత్ర చక్రవద్భ్రమణం భవేత్
అభ్యంతరాపవేధేన తద్విద్యాచ్చక్రమండలమ్. 54
(చక్రమండలమ్—14)

మండల స్థానకం వక్షో నిర్భుగ్నమవహిత్థకః
కరో వక్షః స్థితో యత్ర నివేశో గజవాహనే. (నివేశమ్—15) 55

నిష్క్రామయ్య కరౌ యస్మిన్నుద్వేష్టిత పురస్సరౌ
వ్యావర్తనే సహోత్ప్లుత్య కరయోః పాదయోరపి. 56

స్వస్తికౌ యుగపత్ కుర్యాః తత్స్వస్తిక ముదాహృతమ్;
అపరాన్వేషణే వేగాత్ [గే ?] నిషేధేచ ప్రయుజ్యతే. 57
(స్వస్తికమ్—16)

ఉత్థాప్య స్థాప్యతే సూచీ చరణోఽస్పృష్టభూః పురః
తద్దిక్కః కటకో వక్షస్యన్యః శీర్షేఽ[2]లపల్లవః
యస్మిన్నంగాంతరేణైవం సూచీ తత్[3]...విస్మయే. (సూచీ—17) 58

---

1. 'స్ఖలితా' అను వ్రా. ప్ర. పాఠము 'అడ్డితా' అని యుండదగునని పరిష్కర్త సవరణ (చూ. Notes P. 23).

2. 'శీర్షో' ముద్రి. అచ్చు తప్పు.

3. 'తత్కాలవి' నా వద్ది వ్రా. ప్ర.

దోలాపాదచారితో పాదము రాకపోకలు చేయగా, ఆ ప్రక్కలోని బాహువును హంసపక్షహస్తముతో అట్లే చేయవలెను. ఇట్లు మరొక యంగముగూడ చేయనగును. అదిస్ఖలితము. (స్ఖలితము—13) 53

మొదట అడ్డితచారి చేసి, దోలవలె వ్రేలాడు బాహువులతో, వంగిన పూర్వకాయముతో అభ్యంతరాపవేధము చేసి చక్రమువలె తిరుగునది చక్ర మండలము. (చక్ర మండలము—14) 54

మండల స్థానకమునందు వక్షస్సు నిర్భుగ్నమై, అవహిత్థకహస్తము వక్షస్సునందుండుట నివేశము; ఇది గజవాహనమునందు చేయదగును. 55 (నివేశము—15)

ఉద్వేష్టితక్రియ చేసి చేతులను వెలికిదీసి వ్యావర్తనము చేయునప్పుడే మీది కెగిరి యేకకాలమందే హస్తములను, పాదములను స్వస్తికముగా తీర్పవలెను; అది స్వస్తికము ; ఇది ఇతరులను (?) వెదకునప్పుడు, వేగమునందు, నిషేధించుట యందును ప్రయోగింపదగును. (స్వస్తికము—16) 56, 57

సూచీ పాదము మీదికెత్తి నేలను తాకకుండునట్లు ముందుకు నిలుపవలెను; ఆదిక్కు చేయియే కటకాముఖముగా ఎదమీద నుండదగును ; ఇంకొక చేయి అలపల్లవమై శిరసునందుండును. ఇట్లే ఇంకొక యంగమునందును చేయదగును; అది సూచి. దానికి తాత్కాలికమైన (?) విస్మయము నందుపయోగము. 58 (సూచి—17)

సూచీ పాదోఽన్య పార్ష్ణిస్థః వక్షస్థస్సః కటకాముఖః
పక్షవంచిత కోఽన్యోఽర్ధచంద్రోవా కటి మాశ్రితః
హస్తః స్యాద్యత్ర చింతాదా సూచీవిద్ధం తదిష్యతే. 59
(సూచీవిద్ధమ్—18)

అర్ధాంగేన కృతే సూచిన్యర్ధసూచీ నిగద్యతే. (అర్ధసూచీ—19) 60

చతురశ్రావురః క్షేత్రే భవతో యత్ర రేచితౌ
వ్యావర్త క్రియయా వక్షస్యాభుగ్నౌ స్వస్తికౌ కరౌ. 61

పాదౌచ స్వస్తికౌ జంఘాగుల్ఫస్య వలనాన్మిథః
తద్వక్షః స్వస్తికం ప్రోక్తం లజ్జానుశయగోచరః. 62

ఉత్ప్లుత్య ఘటయేత్ పాణిపాదేన స్వస్తికావితి
ఊచే కీర్తిధరాచార్యః క్వచిల్లక్ష్య నిరీక్షణాత్. 63
(వక్షఃస్వస్తికమ్—20)

ఆవిద్ధమంచితం పాదం కరౌచ క్రమరేచితౌ
యత్రకుర్యాత్ తదున్మత్తం గర్వే సౌభాగ్యజే మతమ్. 64
(ఉన్మత్తమ్—21)

మండలస్థానకే స్థిత్వా వక్షఃస్థం కటకాముఖమ్
సూచ్యాస్య నృత్తహస్తేనాపసృత్యాగచ్ఛతా యుతమ్. 65

పార్శ్వంచ సన్నతం వామం బిభ్రత్ పాదం నికుట్టయేత్
యత్రార్ధరేచితం తత్స్యాత్ అసమంజస చేష్టితే. 66
(అర్ధరేచితమ్—22)

వామపాద కనిష్ఠాయాః క్షేత్రగో దక్షిణః పునః
సార్ధతాలద్వయం ప్రస్తజంఘః పాదః ప్రసారితః. 67

తస్యైవానుగతస్తద్వత్ బాహుస్సన్నలపల్లవః
కరో వామేతరో యత్ర తదర్గల ముదీరితమ్. 68

వేరొకకాలి మడమవద్ద సూచీపాదముండి, కటకాముఖహస్తము వక్షస్సునందు నిలిచి, ఇంకొకచేయి పక్షవంచితముగనో, అర్ధచంద్రముగనో కటినాశ్రయించెనేని అది సూచీవిద్ధము; చింత మున్నగువానియందు దాని వినియోగము. 59

(సూచీవిద్ధము—18)

ఒక యర్ధదేహమునందే చేసిన సూచి అర్ధసూచి. (అర్ధసూచి—19) 60

వక్షః ప్రదేశమున చతురశ్రములుగానున్న హస్తములు రేచితములుగా జేసి, వ్యావర్తనక్రియతో, వంగినయెదమీద స్వస్తికముగా చేయవలెను; అట్లే పాదములను, పిక్కలను, చీలమండలను పరస్పరవలనము చేసి స్వస్తికములుగా తీర్చవలెను; అది వక్షఃస్వస్తికము; లజ్జయందు, పశ్చాత్తాపమందు దాని వినియోగము.

ఒకచో లక్ష్యమును చూచి కీర్తిధరాచార్యుడు, మీదికెగిరి పాణిపాదముల స్వస్తికము చేయవలెనని చెప్పెను. (వక్షఃస్వస్తికము—20) 61, 62, 63

ఆవిద్ధచారిచే పాదమును అంచితము చేసి, హస్తములను క్రమముగా రేచితములుగా చేయుట ఉన్మత్తము. ఇది సౌభాగ్యగర్వమునందు. 64

(ఉన్మత్తము—21)

మండలస్థానకమున నిలిచి, కటకాముఖహస్తము నెదమీద నిలుపుకొని, ఇతర హస్తము సూచీముఖనృత్తహస్తమై వెలికి సాగి, మరలి మీది హస్తమును చేరుకొనగా, పార్శ్వము వంగిన వామపాదమును ఎత్తి మెట్టవలెను; ఇది అర్ధరేచితము; అసమంజస చేష్టయందు చూపదగినది. 65, 66

(అర్ధరేచితము—22)

కుడికాలు ఎడమకాలి చిటికెనవ్రేలికి సరిగా రెండున్నర తాలముల దూరమున జారినజంగతో చాచి, దాని ననుసరించుచునే కుడిభుజమును అలపల్లవహస్తముతో సాగించుట అర్గలమనబడును ; ఇది అంగదుడు మున్నగు వానరుల నడకలో వినియోజ్యము.

ఏతదంగదముఖ్యానాం ప్లవంగానాం పరిక్రమే;
పాదో నూపుర పాదావత్ పృష్ఠతః ప్రసృత_స్తతః. 69

ప్రసార్య పురతః కార్యావుభౌ పాదానుగౌ కరౌ
ఇత్యత్ర కరణే ప్రోక్తం వ్యాఖ్యానే భట్టతండునా. (అర్గలమ్—23) 70

చరణౌ స్వ_స్తికౌ హ_స్తః కరిణోయత్ర దక్షిణః
అపరో వక్షసః స్థానే తదర్ధస్వ_స్తికం విదుః. 71

సవ్యం కీ_ర్తిధరాచార్య భట్టతండు పురోగమాః
కటిహ_స్తం పఠంత్యత్ర వ్యాఖ్యానం తస్య కథ్యతే. 72

అర్ధచంద్రాభిధః కట్యాం పక్షప్రద్యోతకోఽథవా
పక్షవంచిత కోవాపి యథాశోభం విధీయతే. (అర్ధస్వ_స్తికమ్—24) 73

చాషగత్యా (ః ?) ప్రయోగేణ యత్రపాదక్రియా భవేత
దోలాప్రయోగతః కించిత్ కృతోద్వేష్టాపవేష్టనా. 74

కరౌస్యాతాం తదావ_ర్తం, సంత్రాసాదుపసర్పణే;
రేచనం హ_స్తపాదస్య భట్టతండు రిహాబ్రవీత్. 75

కేచిదాహుః స్థితావర్తామలాతామపరే విదుః
బ్రూతే కీ_ర్తిధరాచార్యో భ్రమరీమేవ లక్ష్యవిత్. (ఆవ_ర్తమ్—25) 76

చారీ కుర్వన్నపక్రాంతాం భుజముద్వేష్ట్య విక్షిపేత్
అపవేష్ట్యోత్క్షిపన్నేవ సూచీమేకాంఘ్రిణా భజేత్. 77

తత్రస్త్రికవివ_ర్తేన విదధీత పరాఙ్ముఖః
పృష్ఠే సవ్యస్య పాదస్య వామేన స్వ_స్తికం యదా. 78

పృష్ఠ స్వ_స్తికమాఖ్యాతం, పృష్ఠస్థాన్వేషణే; తదా
అన్యే స్వ_స్తిక మిచ్ఛంతః పృష్ఠతః కరయోరపి. 79

ఈకరణవ్యాఖ్యానమున భట్టతండువు 'పాదము నూపుర పాదచారివలె వెనుకకు సాగించి, తరువాత పాదానుసారులుగా రెండు చేతులు ముందుకు చాచవలెను' అని చెప్పినాడు. (అర్గలము—23) 67, 68, 69, 70

పాదములు స్వస్తికములై యుండి, కుడిహస్తము కరిహస్తముగా నుండి, ఎడమది వక్షస్సుమీద నుండినచో అది అర్ధస్వస్తికమందురు. 71

ఇక్కడ కీర్తిధరాచార్యుడు, భట్టతండువు మున్నగువారు కుడి చేతిని కటిహస్తముగా పఠింతురు; దానిని వివరింతును : 72

కటియందు అర్ధచంద్రమను దానిని గాని, పక్షప్రద్యోతకమునుగాని, పక్షవంచితమునుగాని, అందము మీరక, హస్తము నిల్పవచ్చును. 73
(అర్ధస్వస్తికము—24)

చాషగతిలో పాదములు నడవవలెను; హస్తములు దోలాప్రయోగముచే ఇంచుక ఉద్వేష్టితమును, అపవేష్టితమును చేయుచుండవలెను. అది ఆవర్తము; భయముతో సమీపించుచో దీని వినియోగము. ఇక్కడ హస్తపాదములు రేచనము చేయదగునని భట్టతండువు వచించెను.

కొందరిక్కడ స్థితావర్తచారిని, మరికొందరు అలాతచారిని చెప్పిరి; లక్ష్యవేత్త కీర్తిధరాచార్యుడు భ్రమరినే చెప్పినాడు. (ఆవర్తము—25) 74, 75, 76

అపక్రాంతచారిని చేయుచు, భుజమునుద్వేష్టించి విసరవలయును; అపవేష్టించి పైకెత్తుచునే ఒకకాలితో సూచిని చేయవలయును; ఆపై త్రికమును త్రిప్పి వెనుక మొగమై కుడికాలి మీద ఎడమకాలితో స్వస్తికమును తీర్పవలెను; ఇది పృష్ఠస్వస్తికమనబడును; వీపు ప్రక్కనున్న వానిని వెదకుటయందు దీని వినియోగము; అప్పుడు చేతులుగూడ స్వస్తికపరచవలెనని, యుద్ధమందలి తిరుగాటయందు దీనిని వినియోగింపదగునని ఇతరులన్నారు.

హస్తములు ఆవిద్ధవక్రములుగా పాదములు స్వస్తికముచేసి, ఆమీద అపక్రాంతచారిచేసి, అర్ధసూచీకరణముతో తిరిగి, సభ్యులకు వీపు గానవచ్చునట్లుగా ఎగిరి

వినియోగం వదంత్యస్య సంగ్రామస్య పరిక్రమే
ఆవిద్ధవక్రకౌ హస్తౌ కృత్వాంఘ్రిం స్వస్తికం తతః. 80

అపక్రాంతాం విధాయార్ధసూచినా పరివృత్య చ,
సభ్యాభిముఖ పృష్ఠోఽంఘ్రి స్వస్తికం రచితోత్ప్లుతిః. 81

హృది కుర్యాత్ కరం వామం పతాకం చితకం, పరమ్
పరావృత్తం శిరశ్చేత్థమత్ర కీర్తిధరోఽభ్యధాత్.(పృష్ఠస్వస్తికమ్—26) 82

ఉన్ముఖౌ స్వస్తికాకారౌ అశ్లిష్టౌ మణిబంధతః
వక్షఃక్షేత్రే కరౌ కృత్వా తథైవ యుగపత్ప్లుతః. 83

వ్యావృత్తి పరివృత్తిభ్యాం పతాకౌ యత్ర పాతయేత్
స్వోర్వోరుత్తానితావేవ వర్తితం తత్ ప్రకీర్తితమ్. 84

ఆవిద్ధవర్తనాఘృష్టావధస్తలనిపాతితౌ
పతౌ యదా తదా రోషవాక్యార్థాభినయే మతౌ. 85

శుకతుండాదయోఽప్యత్ర ప్రయోక్తవ్యాః యథోచితమ్,
మునినాప్యత ఏవాత్ర విశేషో న నిరూపితః. 86

తత్రాప్యనంతరోక్తత్వాత్[1] తలపుష్పపుటోదితః[2]
పాదోఽనుమత ఇత్యేకే మునేరాశయవేదినః. 87

కథయామాసురాచార్యాః చరణం తలసంచరమ్,
అపరేతు విదుః పాదం హస్తౌచిత్యానుసారతః. (వర్తితమ్—27) 88

భుజంగత్రాసితాంఘ్రిః స్యాత్ దక్షిణో రేచితః కరః
యత్రవామో లతాసంజ్ఞః తద్భుజంగాంచితం భవేత్. 89

(భుజంగాంచితమ్—28)

---

1 భరతముని పట్టిలో వర్తితము రెండవది.

2, 'పుటాదితః' అను ముద్రితపాఠము అన్వయింపవిది. పీది పాఠము నా వద్ది త్రా. ప్ర. లోనిది

పాదస్వస్తికము తీర్చి, పక్షవంచితముగా ఎడమచేతిని ఎదపై నిలిపి, కుడిచేతిని, తలను వెనుకకు త్రిప్పవలయును; ఇట్లు కీర్తిధరుడు ఈ కరణమునకు లక్షణము చెప్పెను. (పృష్ఠ స్వస్తికము—26) 77, 78, 79, 80, 81, 82

మనికట్టుమీద విడివిడిగా స్వస్తికాకారముగ చేతులు వెలికిలవేసి యెదమీద నిలిపి అక్కడనే ఒకమారుగా వ్యావృత్తి పరివృత్తులతో పతాకలుగా వెలికిలిగానే తమ తమ తొడలపై పడవేయవలెను. అది వర్తితము 83, 84

పై హస్తములను ఆవిద్ధవర్తనచే రాచి, బోరలుగా పడవేసినప్పుడు రోష వాక్యము నర్థము అభినయించుట కుపయోగించును. 85

ఇక్కడ యథోచితముగా శుకతుండాది హస్తములను గూడ ప్రయోగింప దగును. కనుకనే భరతముని యందు ప్రత్యేకముగా హస్తవిశేషమును చెప్పలేదు. మరియు తలపుష్పపుటము తరువాత వెంటనే ఈ కరణమును పేర్కొనుటచే దాని తలసంచరపాదమే దీనికిని అనుమతింపబడినదని ముని యభిప్రాయము నెరిగిన కొందరాచార్యులు చెప్పిరి. మరి కొందరు మాత్రము హస్తములకు తగినట్లు పాదములుండదగునన్నారు. (వర్తితము—27) 86, 87, 88

కుడిపాదమున భుజంగత్రాసితచారి, కుడిచేయి రేచితము, ఎడమది లతా హస్తము — ఇది భుజంగాంచితము. (భుజంగాంచితము—28) 89

[1]సవ్యం సూచీముఖం నృత్తహస్తోపగమ పూర్వకమ్
వామం వక్షః స్థితం దధ్యాత్ తద్దిక్కాంఘ్రిర్నికుట్టితః. 90

ఏవమంగాతరం భూయః సూచీపాదోఽలపల్లవః
నికుట్టితో దక్షిణః స్యాత్ కరో వామో యథా పురా
ఇత్థం ముహుః క్రియాయత్ర తద్విష్కంభం ప్రకీర్తితమ్. 91
(విష్కంభమ్—29)

సవిద్యుద్భ్రాంతయా దండపాదయా చతసృష్వపి
దిక్షు పాదస్య విక్షేపః, కృతోద్వేష్టాపవేష్టయోః. 92

పాదానుకూలయోః పాణ్యోః రేచనాఽంచితయోరపి
క్రియతే యత్ర విక్షిప్తం తదుద్ధతపరిక్రమే. (విక్షిప్తమ్—30) 93

దండపాదాభిధా చారీ దండపక్షౌ కరావపి
యత్ర రేచనసంయుక్తౌ తద్భవేద్దండరేచితః;
నృత్తే ప్రమోదయుక్తేఽస్య ప్రయోగస్తాండవే యథా. 94
(దండరేచితమ్—31)

స్ఖలనాపసృతౌ పాదౌ హంసపక్షౌ ద్రుతభ్రమః
వామః సవ్యోఽర్ధచంద్రస్తు యత్రకట్యాం విధీయతే. 95

అర్ధమత్తల్లి తత్త్వజ్ఞైః జ్ఞేయం తత్తరుణే మదే;
పక్షవంచితకం కట్యామత్ర కీర్తిధరోఽబ్రవీత్,
హస్తం నితంబమత్రైవ పరే ప్రాహుర్మనీషిణః. 96
(అర్ధమత్తల్లి—32)

---

1. ఈ ముద్రిత పాఠము సరిగా తోపదు అభినవభారతి, రత్నాకరముల ప్రకారము, దీని పాఠము 'సవ్యః సూచీముఖో నృత్తహస్తోఽపగమ పూర్వకమ్ – వామం వక్షః స్థితం విధ్యాత్' అని యుండబోలును. ప్రా. ప్ర. లలో C. ప్రతి 'ముఖో' 'విద్యాత్' అని చూపినది గాన ఈ నా సూచన. తెలుగు దాని ననుసరించినది. (చూ. భ. నా. శా. అభినవభారతి. ౪–౧౬౨–౬౩, సం. రత్నా. ౭–౭౩౭, ౩౮)

కుడిచేయి సూచీముఖనృత్తహస్తముతో, అపవిద్ధముగా నడచి, వక్షస్సు మీదనుండు వామహస్తమును తాకవలయును. ఎడమపాదము నికుట్టితము చేయదగును. ఇట్లు ఇంకొక ప్రక్క యంగమునను చేసి మరల సూచీపాదముతో అలపల్లవ హస్తము కుడి ప్రక్క నికుట్టితము చేయనగును. ఎడమ చేయి మునుపటి వలెనే యుండదగును; ఇట్లు పలుమారు చేయుట విష్కంభమనబడును. 90, 91

(విష్కంభము—29)

విద్యుద్భ్రాంత, దండపాదచారులతో నాలుగు దిక్కులందును పాదమును విక్షేపించవలయును; అట్లే చేతులు అంచితములై ఉద్వేష్టితాపవేష్టితములతో పాదము వెంట రేచితములు గావలయును. ఇది విక్షిప్తము; ఉద్ధతముగా తిరుగాడుట యందిది తగినది. (విక్షిప్తము—30) 92, 93

దండపాదచారితో దండపక్షహస్తములు రేచనము చేయుట దండరేచితము; ఇది తాండవమున ప్రయోగించునట్లు, సంతోషమును సూచించునృత్తమునందును ప్రయోజ్యము. (దండరేచితము—31) 94

స్ఖలితకరణమున పాదములు వేరుపడగా, వామహస్తము ద్రుతభ్రమణ గలిగి హంసపక్షమైయుండి, కుడిచేయి అర్ధచంద్రమై, కటియందు నిలువవలెను; ఇది అర్ధమత్తల్లి; దీనిని తరుణమదమున తత్త్వమెరిగినవారు వినియోగింతురు. ఇందు కటిమీది హస్తము పక్షవంచితకమని కీర్తిధరుడు చెప్పెను; ఇతర పండితులు నితంబహస్తమనిరి. (అర్ధమత్తల్లి—32) 95, 96

ఘూర్ణమానస్య పాదస్య యత్ర స్యాదుపసర్పణమ్
గుల్ఫస్వస్తికపర్యంతం తస్యైవానుచరః కరః. 97

ఉద్వేష్టితో నితంబః స్యాదేష పాదోప (దాప ?)[1] సర్పణే
అపవేష్టితమాదధ్యా దేవమంగాంత రేణచ
క్రియైవం బహుళః ప్రోక్తా తన్మత్తల్లి బుధైర్మదే. (మత్తల్లి—33) 98

యత్ర దోలౌ కరౌ స్యాతాం మస్తకం పరివాహితమ్
పర్యాయేణ ముహుః పాదౌ స్వస్తికీ భూయవిచ్యుతౌ. 99

మదస్ఖలితమేవత్ స్యాత్ ప్రయోజ్యం మధ్యమే మదే
అత్ర భ్రమరికావిద్ధే చార్యా కీర్తిధరోఽభ్యధాత్. 100
(మదస్ఖలితమ్—34)

వైష్ణవం స్థానకం హస్తౌ రేచితోఽన్యోఽలపల్లవః
వక్షఃస్థో లోలితం శీర్షం, విశ్రాంతిః పార్శ్వయోః క్రమాత్. 101

యత్రకుర్వీత తత్ తజ్జ్ఞైః లోలితం ప్రతిపాదితమ్;
అత్ర చారీమలాతాఖ్యాం భట్టతండురమన్యత. (లోలితమ్—35) 102

దోలా పాదాంఘ్రిమాదాయ తదన్యోత్ప్లుతిం భజేత్
చారీశ్చ భ్రమరీః[2] యత్ర తత్ ప్రేంఖోలిత మీరితమ్. 103
(ప్రేంఖోలితమ్—36)

వ్యావర్తితం[3] శిరోదేశమానీయాభిముఖాంగులీ
పతాకే పరివర్త్యోర్ధ్వే నిష్క్రామితభుజౌ కరౌ. 104

---

1. 'పాదోప' అను ముద్రితపాఠము సరసముగా తోపదు. కనుక నా సూచన యీ సవరణ.

2. 'చారీంచభ్రమరీం' అను C. ప్రతి పాఠమే యుక్తము. అభినవభారతి, రత్నాకరము ఏకవచనమే చెప్పినవి. (అభి. భా. 4—194; రత్నా. 2-202)

3. వ్యావర్తేన' అను C. ప్రతి పాఠము ఉచితతరము.

పాదము అడ్డాడుచు ఎదుటికాలి గుల్ఫమును స్వస్తికమగునట్లు చేరుచో దాని ననుసరించియే నితంబహస్తము ఉద్వేష్టితముగానుండి, ఆ పాదము వెనుదీయుచో అపవేష్టితముగా నుండవలయును; ఇట్లు ఇతరాంగమునందును; ఈ పని పలుమారు జరుగుట మత్తల్లియని బుధులందురు. ఇది మదమునందు చేయదగును. 97, 98

(మత్తల్లి—33)

దోలా హస్తముఃతో, పరివాహిత శిరస్సుతో దేశియందు పాదములు మారి మారి, స్వస్తికములై, పలుమారు విడిపోవునో అది మదస్ఖలితమగును; ఇది నడిమత్తునందు ప్రయోగింపదగును. కీర్తిధరాచార్యుడు దీనియందు భ్రమరి, ఆవిద్ధము అనుచారులను చేయవలయునని చెప్పినాడు. 99, 100

(మదస్ఖలితము—34)

వైష్ణవము స్థానకము; ఒక చేయి రేచితము, మరొక్కటి అలపల్లవముగా వక్షస్సుననుండును; శిరస్సు లోలితముగా నుండి క్రమముతో ఇరు ప్రక్కలందు విశ్రాంతి దీసుకొనును; ఇట్లు జరిపించుట, లోలితమని విజ్ఞులందురు. ఇందు భట్టతండవు అలాతమనుచారిని ప్రయోగింపదగునన్నాడు. 101, 102

(లోలితము—35)

ఒకటి దోలాపాదము చేసి, మరొక్క దానితో గెంతవలయును; భ్రమరిచారి గావలయును. అది ప్రేంఖోలితము. (ప్రేంఖోలితము—36) 103

పతాకహస్తములను ప్రేళ్ళు ఎదురెదురగునట్లు వ్యావర్త హస్త కరణముతో, శిరః ప్రదేశమునకు తెచ్చి, ఊర్ధ్వముఖముగా పరివర్తము చేసి, భుజములను చాచి,

యథాస్వమం సయోర్న్యస్యేదిత రేతరసమ్ముఖౌ
తతస్తౌ యత్ర కుర్వీత నితంబౌ దేహసమ్ముఖౌ
బద్ధయా సహితం చార్యా నితంబం తన్నిరూపితమ్. 105

(నితంబమ్—37)

ఊర్ధ్వజానుం దధచ్చారీం పతాకం చిత ముస్ముఖమ్
అలపద్మమరాలం వా నిజస్యోపరిజానునః. 106

స్తనక్షేత్రే యథా యస్మిన్ అపరం కటకాముఖమ్
వక్షఃస్థల స్థితం కుర్యాత్ ఊర్ధ్వజాను తదీరితమ్. 107

(ఊర్ధ్వజాను—38)

యత్పార్శ్వ స్వస్తికౌ హస్తౌ పర్యాయేణ నికుట్టితౌ
ఉన్ముఖాధోముఖౌ స్యాతాం తత్పాదశ్చ నికుట్టితమ్ (తః ?). 108

యస్మిన్నంగాంతరేష్వేవం తత్స్యాత్ పార్శ్వనికుట్టితమ్,
ప్రకాశాచరణాఖ్యాన వాక్యార్థాభినయే మతమ్. 109

(పార్శ్వనికుట్టితమ్—39)

యత్రాన్యస్య పురః పార్శ్వక్రాంతయా చరణం క్షిపేత్
హస్తౌ పాదానుగౌ యద్వా ప్రయోజ్యాభినయోచితౌ
పార్శ్వక్రాంతమిదం రౌద్రే భీమాదేః స్యాత్పరిక్రమే. 110

(పార్శ్వక్రాంతమ్—40)

యత్ర చారీమతిక్రాంతాం ప్రయోగానుగతౌ కరౌ
కుర్వీత తదతిక్రాంత ముద్ధతస్య పరిక్రమే;
హస్తౌ గరుడపక్షాఖ్యౌ భట్టతండు రిహాబ్రవీత్. 111

(అతిక్రాంతమ్—41)

యత్ర బద్ధాం విధాయాపక్రాంతాం చారీం సమాచరేత్
ప్రయోగానుగుణౌ హస్తౌ తదపక్రాంత మీరితమ్. 112

(అపక్రాంతమ్—42)

చేతులను తమ తమ మూపులందు ఎదురెదురుగా నిలిపి, తర్వాత ఆహస్తములను శరీరమున కభిముఖముగా, నితంబములుగా, బద్ధచారితో, చేయవలయును. ఇది నితంబము. (నితంబము—37) 104, 105

ఊర్ధ్వజానుచారిని చేసి, తనకెదురు మొగమైన పతాకవంచితహస్తమును అలపద్మముగానో, అరాళముగానో, దాని మోకాలిపై స్తనప్రదేశమునకు సరిగా నిలిపి, ఇంకొక చేతిని కటకాముఖముగా ఎదమీద పెట్టుకొనుట ఊర్ధ్వజానువనబడును. (ఊర్ధ్వజానువు—38) 106, 107

ఏ పార్శ్వమున స్వస్తికహస్తములు నికుట్టితములై పర్యాయముగా, వెలికిలిగా, బోరలుగా, జరుగునో ఆ ప్రక్కపాదమును నికుట్టితము చేయవలయును; ఇట్లు అంగాంతరమందును; అది పార్శ్వనికుట్టితము; ఇది ప్రకాశాచరణమున (?) అభ్యాసమున, వాక్యార్థము నభినయించుటయందు, తగును. 108, 109
(పార్శ్వనికుట్టితము—39)

పార్శ్వక్రాంతచారిచే, ఒక పాదము నింకొకదాని ముందు వేయవలెను. ఆ పాదమునే హస్తము లనుసరించవలెను; లేదా ప్రయోగించు విషయమునకు తగినట్లు హస్తములను మలచవలెను; ఇది పార్శ్వక్రాంతము, భీమసేనుడు మున్నగువారి రౌద్రపు నడకకు ఇది యుక్తము. (పార్శ్వక్రాంతము—40) 110

ప్రయోగము ననుసరించిన హస్తములతో అతిక్రాంతచారిని చేయుట అతిక్రాంతము; ఇది ఉద్ధతుడైనవాని తిరుగాటయందు ప్రయోజ్యము. దీనియందు గరుడపక్షహస్తము లుండదగునని భట్టతండువు వచించెను. 111
(అతిక్రాంతము—41)

బద్ధచారిని చేసి అపక్రాంతచారిని చేయవలెను; హస్తములు ప్రయోగమున కనుగుణముగా సాగవలెను. అది అపక్రాంతము. (అపక్రాంతము—42) 112

వృశ్చికే కరణే యోఽసౌ పాదస్తం విధివద్దధత్
ఏతద్దిక్క్రమరాలంచ శిరసః పార్శ్వతః కరమ్. 113

తథైవాన్యమురః క్షేత్రే నాసికాగ్రానుసారిణమ్
యత్ర కుర్వీత తత్త్వజ్ఞైః నికుంచిత ముదాహృతమ్. 114

నాసికాగ్రే పతాకోఽన్యః ప్రోక్తః సూచీముఖోఽపరః
అత్రాలపల్లవః కీర్తిధరాచార్యేణ కీర్తితః
ఆకాశోత్పతనోత్కంఠా వితర్కాదావిదం మతమ్. 115

(నికుంచితమ్—43)

విద్యుద్భ్రాంతా భవేద్యత్ర చారీ తద్వశగౌ కరౌ
విద్యుద్భ్రాంతం తదాఖ్యాత ముద్ధతస్య పరిక్రమే;
అత్ర పాదక్రియాం కేచిత్ సౌకర్యాత్ పురతోజగుః. 116

(విద్యుద్భ్రాంతమ్—44)

విధాయ దక్షిణం సూచీం తం జవాదపసారితమ్
పాదం పార్శ్వే క్షిపేత్ పృష్ఠపరావృత్తేన కర్మణా. 117

కటిమారేచయేద్యద్వా బాహ్యాతో భ్రమరీం దధత్,
హస్తౌ ప్రయోగతః కుర్యాత్ వ్యావృత్తపరివర్తితౌ. 118

యత్రాంతే చాతురశ్ర్యంచ కటిభ్రాంతం వదంతి తత్;
పరిక్రమే గతీనాం తత్తాలేషు యతి పూరణే. 119

(కటిభ్రాంతమ్—45)

చారీం బద్ధాం విధాయాస్యాం స్వస్తికస్యాపసారణే
స్థితావర్తావదాదధ్యాత్ ఉరోమండలినౌ కరౌ
యత్ర తత్కరణం ప్రోక్త మురోమండల సంజ్ఞకమ్. 120

(ఉరోమండలమ్—46)

హరిణప్లుతయోత్ప్లుత్య పాదయోః స్వస్తికం పురః
యత్ర కుర్వీత హస్తౌతు దోలౌ తత్సన్నతం మతమ్. 121

వృశ్చికకరణమునకు చెప్పిన పాదమును యథావిధిగా నిలిపి, ఆ ప్రక్కచేతిని అరాళముగా శిరస్సు ప్రక్కబెట్టి, ఇంకొక చేతిని అరాళముగానే ముక్కుకొన తాకునట్లు తీర్పవలెను; ఇది నికుంచితమని తత్త్వజ్ఞులందురు; ఇతరులు నాసాగ్రమున పతాకహస్తమును, ఇంకొక హస్తమును సూచీముఖముగాను, చెప్పిరి. కీర్తిధరాచార్యుడు ఇందు అలపల్లవహస్తము పేర్కొనెను. ఆకాశమునకెగురుట, ఉత్కంఠ, వితర్కము మున్నగువానియందు, దీని వినియోగము.

(నికుంచితము—43) 113, 114, 115

విద్యుద్భ్రాంతచారిని చేయుచు దానివెంటనే కరములు నడపుట, విద్యుద్భ్రాంత మనబడును. ఉద్ధతుడైనవాని పరిక్రమమునందు దీని వినియోగము; ఇక్కడ కొందరు సౌకర్యము కొరకు పాదక్రియను మొదట చేయదగు నన్నారు.

(విద్యుద్భ్రాంతము—44) 116

దక్షిణపాదమును సూచిగా చేసి, వేగముగా దానిని ప్రక్కకు త్రోసి మెట్టి, పృష్ఠపరావృత్తిచే కటిని కదలింపవలెను; లేదా బాహ్యభ్రమరి చేయవచ్చును; ప్రయోగము ననుసరించి హస్తములు వ్యావృత్తపరివృత్తములుగా చేయవలెను; కడపట చతురశ్రముగా నిలువవలెను; ఇది కటిభ్రాంతమందురు దీనిని గతుల పరిక్రమమున, తాళములందలి యతిని ముగించుటయందు ప్రయోగింపదగును.

(కటిభ్రాంతము—45) 117, 118, 119

బద్ధచారిచేసి, స్వస్తికమును విడదీయుటయందు స్థితావర్తచారి చేయవలయును; హస్తములు ఉరోమండలములు గాదగును. ఇది ఉరోమండలకరణము. 120

(ఉరోమండలము—46)

హరిణప్లుతచారిచే ఎగిరి ముందర పాదములు స్వస్తికపరచవలెను; దోల హస్తములు; అది సన్నతము. ఇది నీచమైన స్వభావము గలవారు సమీపించుట కుప

ఏతన్నీచ స్వభావానాముపసర్పణ గోచరమ్;
భట్టతండురితి [హ ?] బ్రూతే పాదవత్ స్వస్తికౌ కరౌ;
దేహానత్యా భువం ప్రాప్తౌ [వితి] కీర్తిధరోఽభ్యధాత్. 122
(సన్నతమ్—47)

పార్ష్ణిభాగే యదన్యాంఘ్రేః సూచ్యా స్వస్తికమాచరేత్
వివర్త్య త్రికమేకత్ర ప్రత్యావృత్త్యైవ పార్శ్వతః 123

ఊరోర్వ్యర్వలనమాదధ్యాత్ బద్ధయా రేచితౌ కరౌ
వినివృత్తం తదామ్నాత ముద్ధతస్య పరిక్రమే. 124
(వినివృత్తమ్—48)

పాదమాక్షిప్తయాఽఽక్షిప్య తతో హస్తేన సంయుతమ్,
వ్యావృత్తపరివృత్తేన స్వదేహాదపసారితమ్. 125

ప్రత్యావర్త్య ప్రకుర్వీత భ్రమరీం రేచయ (యన్ ?) కరౌ
యత్రతత్ స్యాన్నివృత్తాఖ్య ముద్ధతస్య పరిక్రమే. 126
(నివృత్తమ్—49)

చతురశ్రతయా స్థిత్వా సవ్యమావర్తితం కరమ్
ఆక్షిప్తయా వినిష్కాస్య శుకతుండకృతం పునః. 127

స్వపార్శ్వేరోః పృష్ఠతోన్యస్యేత్ తతస్తు కటకాముఖమ్
వక్షఃస్థలస్థితం వామం వర్తనా చాతురీవశాత్
కుర్యాద్యత్రాపవిద్ధం తదసూయాయా కోపయోః స్మృతమ్. 128
(అపవిద్ధమ్—50)

వృశ్చికే కరణే హస్తౌ లతాఖ్యౌ రేచితః పరః
వక్షః సముద్ధతం యత్ర తదుక్తం గరుడప్లుతమ్. 129

ఆహురన్వర్థమేవాస్య వినియోగం విపశ్చితః;
పతాకౌ మణిబంధాంతే ముహురంచిత కుంచితౌ
యత్ర లతాన్యానుకూల్యేన కథితౌ భట్టతండునా. 130
(గరుడప్లుతమ్—51)

యోగించును. ఇక్కడ పాదములవలె చేతులును స్వస్తికములుగా నుండదగునని భట్టతండువు చెప్పుచున్నాడు; శరీరమును వంచుటచే చేతులు నేలను తాకవలెనని కీర్తిధరుడు వచించెను. (సన్నతము—47) 121, 122

సూచీ పాదముచే ఇంకొక పాదము మడమవద్ద స్వస్తికముగా తీర్చి, ఒకమారు ప్రక్కకు త్రికము త్రిప్పి మరలించి, బద్ధచారిచే రేచితహస్తములతో ఊరువలనము చేయదగును; ఇది వినివృత్తము. దీనిని ఉద్ధతుల తిరుగులాట కుపయోగింప దగును. (వినివృత్తము—48) 123, 124

ఆక్షిప్తచారిచే పాదమును త్రోసి, ఆపైవ్యావృత్తము, పరివృత్తమునైన హస్తముతోకూర్చి, దేహమునుండి చాచి, మరల ముడిచి, భ్రమరిచేసి, హస్తములను రేచితము చేయవలెను; ఇది నివృత్తము; ఉద్ధతుని పరిక్రమణమందు తగినది. (నివర్తము—49) 125, 126

చతురశ్రముగా నిలిచి, కుడిచేతిని తిరుగవేసి, ఆక్షిప్తచారితో వెలికిదీసి, శుకతుండముగాజేసి, మరలదాని తొడవెనుక పెట్టవలయును: తరువాత కటకాముఖముగా, ఎడమచేతిని వర్తనాచాతుర్యముచే ఎదమీద నిలుపవలయును; ఇది అపవిద్ధము; అసూయాకోపములలో దీని వినియోగము. (అపవిద్ధము—50) 127,128

వృశ్చికకరణమందు ఒకటి లతాహస్తము ఇంకొకటి రేచితము, ఎగదన్నిన వక్షుస్సు — ఇట్లుండుట గరుడప్లుతము; దీనిని సార్థకముగనే — గరుడపక్షి ప్రాకుటయందే — వినియోగింపదగునని పండితులన్నారు

ఇందు లక్ష్యమునకనుకూలముగా, మనికట్టుకొనలో పతాకహస్తములను పలుమారు అంచితముగను, కుంచితముగను చేయదగునని భట్టతండువు వచించినాడు. (గరుడప్లుతము—51) 129, 130

[1]అన్వర్థనామ యత్ప్రష్ఠం వృచ్చికం చరణం యథా
తదంగుష్ఠేన కుర్వీత యత్రభాలే విశేషకమ్
లలాటతిలకం విద్యాత్ విద్యాధరగతావిదమ్. 131
(లలాటతిలకమ్—52)

ఊర్ధ్వజానువిధానేన పాదమాధాయ కుంచితమ్
దోలాపదం భజన్ దోలా ప్రయోగవశగౌకరౌ,
యత్రకుర్వీత తత్ తదేః దోలాపాద ముదీరితమ్. 132
(దోలాపాదమ్—53)

పార్శ్వకర్ణ సమక్షేత్రే భవేత్ పాదస్సముత్థితః
ఊర్ధ్వాంగులితలోఽస్యాగ్రభాక్ పతాకాంచితస్థలే[2]. 133

యంత్రాంగాంతరమప్యేవం తత్స్యాత్ తలవిలాసితమ్
పాదోద్ధారాభిధానేన సూత్రధారాదిగోచరః. 134

భట్టతండుమతేఽత్రాంఘ్రి సంగతౌ యుగపత్కరౌ,
రేచితావస్య పార్శ్వేస్తః కరౌ కైర్తిధరే మతే. 135
(తలవిలాసితమ్—54)

చార్యాఽతిక్రాంతయా దండపాదయాచాం [వాం?] ఘ్రిముద్ధృతమ్
ద్రుతం నిపాతయన్నగ్రే సశబ్దం తాడయేన్మిథః. 136

కరౌయత్రపతాకౌ తత్తలసంస్ఫోటితం మతమ్;
హస్తేన హస్తతాలేఽస్య వినియోగః ప్రకీర్తితః. 137
(తలసంస్ఫోటితమ్—55)

ఊర్ధ్వజాను లతాహస్తౌ జానున్యేకస్తయోర్యది
స్యాదంగాంతరమప్యేవం దండపక్షం సమీరితమ్. 138
(దండపక్షమ్—56)

1. ఈ శ్లోకపాఠము సుగమముకాదు. రత్నాకరసింగభూపాలవ్యాఖ్య ననుసరించి తెలుగున తాత్పర్యమియ్యనైనది. (సం ర. ౭—౬౬౮)

2. పతాకోఽంచితస్థలే అని పాఠము సవరింపదగును. ఉన్నది సుగమముగాదు.

వృశ్చికకరణమందలి పాదము వెనుకమొగమై సాగినపుడు, దాని యంగుష్ఠముతో నుదుట తిలకము రాచుట లలాటతిలకమని సార్థకనామముగల కరణమగును; ఇది విద్యాధరుల గతియందు. (లలాటతిలకము—52) 131

ఊర్ధ్వజానుచారితో కుంచితపాదమునిలిపి, దోలాపాదచారితో హస్తములను ప్రయోగవశముగా దోలములు చేయుట దోలాపాదమగును. 132

(దోలాపాదము—53)

పాదము తనప్రక్కచెవికి సరిగా, వ్రేళ్ళును అరకాలును ఊర్ధ్వముఖములగునట్లు మీదికెత్తియుండగా, దానికెదురుగా అరచేయి వంగిన పతాకహస్తము నిలువవలయును; ఇట్లే మార్చి, ఇంకొకయంగమందును జరుగవలయును; అది తలవిలాసితము; పాదోద్ధారము అను పేర సూత్రధారుడు ముగ్నగువారు దీనినుపయోగింతురు. ఇక్కడ రెండు చేతులును ఒకమారే కాలితోకూర్చి పట్టదగునని భట్టతండుమతము. పార్శ్వరేచితములు గావలెనని కీర్తిధరునిమతము.

(తలవిలాసితము—54) 133, 134, 135

అతిక్రాంతచారితో లేదా దండపాదచారితో ఎత్తినకాలిని వేగముగా ముందు పడవేయుచు, పతాకహస్తములను శబ్దముగునట్లు ఒండొకటితో తట్టవలయును; అది తలసంస్ఫోటితము; దానికి చేతులతో తాళము వేయుటయందు వినియోగము. (తలసంస్ఫోటితము—55) 136, 137

ఊర్ధ్వజానుచారి; లతాహస్తములు; అందులోనొకటి మోకాలిమీద నిలిపినచో దండపక్షమనబడును. (దండపక్షము—56) 138

చతురశ్రాఖ్యయో రేకో వ్యావృత్తకరణాశ్రితః
ఊర్ధ్వే పార్శ్వద్వయే క్షిప్తో హంసపక్షో ద్రుతభ్రమః. 139

అథ స్తలకరో నేయో వక్షోదేశమథాపరః
రేచితో బాహ్యతః క్షేప్యః తద్వశాచ్చరణోఽంచితః. 140

ఏకోఽపరస్తు సూచ్యాఖ్యో యస్మిన్నాక్షిప్తరేచితమ్;
త్యాగోపాదానయోరర్థే తద్ జ్ఞేయం బహుళః కృతే. 141
(ఆక్షిప్తరేచితమ్—42)

జనితాయాః కరోయత్ర లతాఖ్యో దక్షిణో భవేత్
జనితం తత్సమస్తానాం క్రియాణాం జని(న?)కం యతః. 142
(జనితమ్—48)

అంఘ్రిరాక్షిప్తయా యుక్తో వామో యద్యపరం వ్రజేత్
వ్యావృత్తిపరివృత్తిభ్యా మరాలత్వముపాగతః. 143

తథా[ఖై ?] వానుగతో హస్తో దక్షిణం పార్శ్వమానతమ్
తదోపసృతమాఖ్యాతం వినయేనోపసర్పణే. 144

అగ్రతశ్చరణౌ కార్యౌ క్రమాద్దోలౌ కరౌ తతః
ఇత్యంగీకురుతో భట్టతండు కీర్తిధరావిహ. (ఉపసృతమ్-59) 145

అపసార్యాక్షిపేత్పాదం [హస్తం] (పాదౌహస్తౌ?)చోద్వృత్తయాసహ
యస్మిన్నశేషమంగంచ తదుద్వృత్తముదాహృతమ్ ;
భట్టతండు రిహోక్షిప్తాం చారీం పాదక్రియాం జగౌ. 146
(ఉద్వృత్తమ్—60)

కుర్వీత జనితాం చారీం కరావభిముఖాంగుళీ
యత్రాలపల్లవారాలౌ వక్షస్తట లలాటయోః. 147

వ్యావృత్తోద్వేష్టితౌ గ్రాహ్యౌ[?]కరాభ్యాం[?] అవహిత్థకమ్
ఏతద్గోపనవాక్యార్థే విద్వద్భిర్వినియుజ్యతే;
అవహిత్థకరంచాత్ర భట్టతండురవోచత. (అవహిత్థమ్—61) 148

చతురశ్రహస్తములలో ఒకటిని - వ్యావృత్తకరణముతో మీదను, ప్రక్కలందును విసరివైచి హంసపక్షముచేసి, వేగముగా త్రిప్పుచు, బోరగిల్లిన అరచేతితో వక్షోదేశమునకు తార్చవలయును; ఇంకొకహస్తమును రేచితముగా వెలికి వేయవలయును; దానిననుసరించి కాలు అంచితముగా నుండదగును; ఇతరపాదము సూచి; ఇది ఆక్షిప్తరేచితము. దీనిని పలుమారు ఇచ్చి పుచ్చుకొనుటయందు వినియోగింపనగును. (ఆక్షిప్తరేచితము—52) 139, 140, 141

జనితచారియందు కుడిది లతాహస్తముగా నున్నచో జనితకరణము; అన్ని క్రియలకు ఇది ఆరంభమున నుండును గనుక. (జనితము—48) 142

అక్షిప్తచారిని గూడిన యెడమపాదము కుడికాలిని చేరునపుడు, అరాళ హస్తము వ్యావృత్తి పరివృత్తులతో దానివెంట, వంగిన కుడిప్రక్కకు సాగవలెను. అది ఉపసృతము; వినయముతో చేరవచ్చునపుడు దాని వినియోగము. ఇందు పాదక్రియ మొదటను, తరవాత దోలాహస్తములును చేయదగునని భట్టతండువును, కీర్తిధరుడును, అంగీకరించిరి. (ఉపసృతము—59) 143, 145, 145

కాలుచేతులను చాచి వెనుకకు తీసి, ఉద్వృత్తచారితో దేహమునంతటిని త్రిప్పి పెట్టవలయును; అది ఉద్వృత్తము. దీనిలో పాదక్రియ ఆక్షిప్తచారితో చేయదగునని భట్టతండువు వచించెను. (ఉద్వృత్తము—60) 146

జనితచారి చేసి, అందు ఎదురుమొగమైన వ్రేళ్ళుగల అలపల్లవారాళ హస్తములను వ్యావర్తితోద్వేష్టితములు చేసి, వక్షస్సున, లలాటమున చేర్పవలెను. ఇది అవహిత్థము; దీనిని విద్వాంసులు గోపనవాక్యార్థము నభినయించుటకు వినియోగింతురు. ఇక్కడ భట్టతండువు అవహిత్థకరమునుగూడ చెప్పెను. (అవహిత్థము—61)

[1]అంచితం పాదమన్యాంఘ్రేః పార్ష్ణిభాగే వినిక్షిపేత్
వక్షః సమున్నతం బిభ్రత్ కటకాముఖమధ్యమామ్. 149

కుర్యాత్తిలకవత్ ఫాలే యత్రతత్ స్యాన్నికుంభితమ్,
అనేన కరణేన స్యాదభినేయస్త్రిలోచనః. 150

అత్రకీర్తిధరస్త్వాహ సూచీముఖ మధోముఖమ్,
తస్యాభినయనే హస్తో యస్మాదయముదీరితః
ఏతస్మిన్ కరణే పాదం వృశ్చికం కేచిదూచిరే (నికుంభితమ్—62) 151

వ్యావృత్తకరణం యేన కరేణ ప్రవిధీయతే
తేనైవ సహ విక్షిప్తః సఏవ చరణో బహిః. 152

ఆక్షేపే (పో ?) హస్తపాదస్య తస్యైవ పరివర్తనాత్
అన్యాంగేచ భవేదేవం విక్షిప్తాక్షిప్తకాభిధే. 153

ఏతన్నాట్యాంగవిచ్ఛేదే ప్రయోజ్యం సంధిగుప్తయే.
తాలానామనుసంధానే గతీనాం వా పరిక్రమే. 154

చారీణాం వా నియుద్ధాదౌ సంచారేషు యథోచితమ్
కేచిద్గతాగతేత్వస్య వినియోగం ప్రచక్షతే.[2] 155
(విక్షిప్తాక్షిప్తమ్—63)

ఆక్షిప్తాయాం యదా చార్యాం పాదాక్షేపో ద్రుతో భవేత్
తదైవ చతురః పాణి రాక్షేప్యః కటకోఽభవా. 156

యత్ర పార్శ్వం నతం కించిత్ తదాక్షిప్తం ప్రచక్షతే
విహితో వినియోగోఽస్య విదూషకపరిక్రమే. (ఆక్షిప్తమ్—64) 157

---

1 'కుంచితం' అని యుండదగునని అభినవభారతి-రత్నాకరముల ప్రకారము పరిష్కర్త సూచన (Note below and Notes P. 26)

2. ఈ కరణవినియోగము విషయమున అభినవగుప్తుని యభిప్రాయమును జాయన సరిగా గ్రహింపలేదేమో యని పరిష్కర్త సందేహము వివరములకు చూ. పు ౧౨౩, క్రింది సూచిక.

అంచిత [కుంచిత] పాదమును ఇతర పాదము మడమ వద్ద నిలుపవలెను; ఎద యుబ్బెత్తుగా చేసికొని, కటకాముఖహస్తపు నడిమి వ్రేలిని తిలకముగా నొసలిపై పెట్టవలెను; అది నిశుంభిత; దానితో త్రిలోచనుడగు శివు నభినయింప దగును. ఇందు కీర్తిధరుడు మాత్రము అధోముఖమైన సూచీముఖహస్తమును చెప్పెను — శివుని నభినయించుటకాహస్తము చెప్పబడినది గనుక. కొందరు ఈ కరణమున వృశ్చికపాదము చేయదగునని వచించిరి. 149, 150, 151

(నిశుంభితము—62)

ఏ హస్తముచే వ్యావృత్తకరణము చేయింతురో ఆ దానితోడనే, ఆ పాదమునే బయటికి విక్షేపించవలెను; ఆపై అదే హస్తపాదములను పరివర్తనకరణముచే ఆక్షేపించవలయును; ఇతర హస్తపాదములందును ఇట్లే జరుగవలయును; అది విక్షిప్తాక్షిప్తము. దీనిని నాట్యాంగములకు విచ్ఛేదమేర్పడినపుడు, ఆ సంధిని తోపనీయక చేయుటకై ప్రయోగింపదగును; అట్లే భిన్నతాళముల కూర్పునందు, గతుల తిరుగాటలందు, బాహుయుద్ధము మొదలగువానియందు, చారుల సంచారములందుగాని, ఔచిత్యమెరిగి ప్రయోగింపనగును. కొందరు రాకపోకలందు దీని వినియోగము చెప్పుదురు. 152, 153, 154, 155

(విక్షిప్తాక్షిప్తము—63)

ఆక్షిప్తచారియందు పాదము వేగముతో జరిగినపుడే, చతురహస్తము గాని, కటకాముఖహస్తము గాని ఆక్షేపించవలెను; పార్శ్వము ఇంచుక వంగవలెను; దానిని ఆక్షిప్తమందురు: విదూషకుని తిరుగాటయందు దాని వినియోగము.

(ఆక్షిప్తము—64) 156, 157

భుజంగత్రాసితౌ హస్తౌ రేచితౌ వామపార్శ్వగౌ
యత్రకుర్వీత తత్ప్రోక్తం భుజంగత్రస్తరేచితమ్. 158
(భుజంగత్రస్తరేచితమ్—65)

విచ్యవాయాః ప్రయోగేణ సహోద్వేష్టితవర్తితౌ
కృత్వోర్ధ్వమండలౌ కుర్వన్ కుర్వీత స్వస్తికౌ తతః 159

బధ్నీయాన్మండలస్థానం మండలస్వస్తికం భవేత్;
విలాసపరిసంఖ్యానే ప్రత్యక్షేఽర్థే భవేదితమ్. 160
(మండలస్వస్తిమ్—66)

యత్ర నూపురపాదోత్థాం దండపాదాం సమాచరేత్
హస్తం దండవదుత్క్షిప్తమంతర్జంఘం ద్రుతం నయేత్. 161

దండపాదం సమాఖ్యాతం తత్సాటోపపరిక్రమే
అత్రాదౌ జనితా భట్టతండు కీర్తిధరోదితా. 162

ఏకః స్యాదూర్ధ్వతః క్షిప్తః పరో జంఘామగతః
కరోభవేదితి ప్రాహ భట్టతండుః ప్రయోగవిత్. 163
(దండపాదమ్—67)

పరాఙ్ముఖౌ యదా నాభిక్షేత్రే స్తః కటకాముఖౌ
సూచీపాదః వరః పాదో (పరంపాదం ?)[1] విద్ధ్వాప్రకాంతయాన్వితః
భవేదేవం ద్వితీయోఽప్రి యదా పాదాపవిద్ధకః (మ్) 164
(పాదాపవిద్ధకమ్—67)

భుజంగత్రాసితాం కృత్వా వ్యావృత్తపరివృత్తకమ్
ఏకం పాదవశాద్దోల మపరం కటకాముఖమ్,
విదధీత యదాజ్ఞేయం భుజంగత్రాసితం తదా. 165
(భుజంగత్రాసితమ్—69)

---

1. స్పష్టాన్వయమునకై నా యీ సవరణ సూచన.

ఎడమ ప్రక్క భుజంగత్రాసితహస్తములను రేచనము చేయుట భుజంగత్రస్త రేచితమనబడును. (భుజంగత్రస్తరేచితము—65) 158

విచ్యవచారిని చేయుచు, హస్తములను ఉద్వేష్టితక్రియతో ఊర్ధ్వమండలము లుగా సాగించి, ఆపై స్వస్తికపరిచి, మండలస్థానకమును గట్టవలెను. అది మండల స్వస్తికము; ఎదుటనున్న వస్తువును సవిలాసముగా పరికించుటయందు దాని వినియోగము. (మండలస్వస్తికము—66) 159, 160

నూపురపాదచారి నుండి దండపాదచారి చేసి, దండమువలె పైకెత్తినహస్తము త్వరతో జంగలోపలికి చేర్చవలయు; అది దండపాదము; ఆటోపముతో చుట్టుట యందు దీని వినియోగము. ఇక్కడ మొదట జనితచారి చేయదగునని భట్టతండువు, కీర్తిధరుడును చెప్పినారు. ఒకహస్తము మీదికెత్తి, రెండవదానిని పిక్కచెంతకు చేర్చవలెనని ప్రయోగవేత్త భట్టతండువు చెప్పెను. 161, 162, 163
(దండపాదము—67)

నాభివద్ద కటకాముఖహస్తములు సభ్యుల దిక్కుమొగముగానుండగా, ఒక సూచీపాదము ఇంకొక పాదమును తాకి, అపక్రాంతచారి చేయగా, రెండవ పాదముగూడ అట్లుచేయుట పాదాపవిద్ధకమగును. 164
(పాదాపవిద్ధకము—68)

భుజంగత్రాసితచారిచేసి వ్యావృత్తి పరివృత్తులతో ఒకహస్తము కాలిననుసరించి దోలముగా, ఇతరము కటకాముఖముగా, తీర్చుట భుజంగత్రాసితము. 165
(భుజంగత్రాసితము—69)

యత్రాగ్రే కుంచితః పాదః ప్రసృతో గమనోన్ముఖః
రేచితౌ హస్తౌ కరౌ విష్ణుక్రాంతం తద్విక్రమే హరేః. 166
(విష్ణుక్రాంతమ్—20)

ప్రథమం రేచితౌ పశ్చాత్ శీర్షాత్ వ్యావర్తనాదధః
నీతోర్ధ్వం పరివర్తేనావిద్ధవక్రావురస్యథ. 167

స్వస్తికౌ విప్రకీర్ణౌచ పక్షవంచితకౌ తతః
పక్షప్రద్యోతకౌ నృత్తకరకషట్కమితిక్రమాత్. 168

తత్కరానుగతా చారీ స్థానమంతేఽవహిత్థకమ్.
యత్ర తత్కరణం ప్రోక్తంబుధైః స్వస్తికరేచితమ్,
నృత్తత్వాభినయే ముఖ్యే ప్రహర్షాదౌ ప్రయుజ్యతే. 169
(స్వస్తికరేచితమ్—71)

పలకాక్రీడితా పాతే సన్నతం వలితం వపుః
యత్రప్రయోగతో హస్తౌవేలకాక్రీడితాభిధా (ధమ్ ?)
అధమ ప్రకృతీనాం తద్గమనే వినియుజ్యతే. (పలకాక్రీడితమ్—72) 170

సమమావిద్ధయా చార్యా వ్యావర్త్య పరివర్తితమ్
ఊరుపృష్ఠైకరం యత్ర నిదధ్యాదలపల్లవమ్. 171

సంభ్రాంతం కథయంత్యేతత్ ససంభ్రమపరిక్రమే;
పద్మకోశోఽథవాఽత్ర స్యాదితి కీర్తిధరోఽబ్రవీత్. 172
(సంభ్రాతమ్—73)

వృశ్చికం చరణం కృత్వా మణిబంధనికుంచితౌ
స్వస్తికేన సమాయుక్తౌ పద్మకోశాయదాకరౌ. 173

విదధ్యాదూర్ణనాభౌవా వర్తనావశతః పునః
అపసార్య క్రియామేతాం కుర్యాదంగాంతరం తథా 174

సింహాకర్షితమాఖ్యాతం సింహవ్యాఘ్రాదిదర్శనే;
ఆవేష్ట్య స్యందితాం చారీమంచితౌ మకరాకరౌ
అత్రకీర్తిధరో భట్టతండు ర్న్యాపురపాదికామ్. (సింహాకర్షితమ్—74) 175

కుంచితపాదము గమనోన్ముఖముగా ముందుకుసాగి, చేతులు రేచితములై యుండుట విష్ణుక్రాంతము; అది విష్ణుని విక్రమణమున. 166

(విష్ణుక్రాంతము—70)

మొదలు రేచితములైన హస్తములు, పిదప శిరస్సునుండి వ్యావర్తితములై క్రిందికిసాగి, పరివర్తనము గే ఆవిద్ధవక్రములుగా వక్షస్సుచేరి, స్వస్తికములై విడిపోయి, ఆపైపె పక్షవంచితములై, పక్షప్రద్యోతములుగావలయును; ఇట్లు ఆరు నృత్తహస్తములు క్రమగతిచే సాగవలయును; ఆహస్తములననుసరించి చారి నడవదగును; కడపట అవహిత్థస్థానకము గావలయును; దీనిని స్వస్తికరేచనమని బుధులందురు. ముఖ్యముగా నృత్తమును ప్రదర్శించుటయందు, ఎక్కువ సంతోషము మున్నగువానియందును, ఇది ప్రయోగింపబడును. 167, 168, 169

(స్వస్తికరేచితము—71)

ఏలకాక్రీడితచారిచే పడినప్పుడు, దేహమువంగి వలితమైయుండగా, ప్రయోగానుసారము హస్తములు నడచుట ఏలకాక్రీడితమగును; ఇది అధమప్రకృతి గలవారి నడకకు వినియోగింతురు. (ఏలకాక్రీడితము—72) 170

ఆవిద్ధచారితో సమముగా వ్యావర్తనము, పరివర్తనమునుచేసి, అలపల్లవ హస్తమును తొడపై నిలుపవలయును; దీనిని సంభ్రాంతమనియందురు. ఇది సంభ్రమముతోడి తిరుగులాటయందు; ఇక్కడ పద్మకోశహస్తమైనను గానవచ్చునని కీర్తిధరుడు వచించెను. (సంభ్రాంతము—73) 171, 172

వృశ్చికపాదము చేసి, మణిబంధము వద్ద నికుంచితములై స్వస్తికపరిచిన హస్తములను, పద్మకోశములుగా గాని, ఊర్ణనాభములుగా గాని తీర్చి, వర్తనననుసరించి, ఆక్రియను విడిచి ఇంకొకయంగమందును అట్లే చేయవలయును; ఇది సింహాకర్షితమగును; సింహము, పులి మొదలగువానిని చూపుటకిది వినియోగింపదగును ఇక్కడ స్యందితచారిని ఆవేష్టించి, అంచితములైన మకరహస్తములను కీర్తిధరుడును, నూపురపాదచారి ఘట్టకుండువును చెప్పినారు (?).

(సింహాకర్షితము—74) 173, 174, 175

అంచితం పాదమన్యస్య నమీపాదపసర్పణమ్
తద్దిక్కం రేచితం హస్తం శిరశ్చ పరివాహితమ్. 176

కృత్వాయత్ర ప్రకుర్వీత పునరంగాంతరేణచ
సర్పితం తద్భవేత్పాదకృతమత్త్రగతాగతే. (సర్పితమ్—75) 177

రేచితౌచ కరౌయత్ర హంసపక్షౌ ద్రుతభ్రమౌ
చరణౌ స్వస్తికీభూయ విచ్యుతౌ పరివాహితమ్. 178

శిరశ్చేత్తరణే తత్స్యాత్ మదే నాగాపసర్పితమ్;
మత్తల్లియోగతః పాదౌ స్ఖలితావపసర్పితౌ
ఉరరీకురుతో భట్టతండు కీర్తిధరావిహ. (నాగాపసర్పితమ్—76) 179

యస్మిన్ సమస్థితస్యాంఘ్రేరూరుపృష్ఠేవ్యవస్థితః
అన్యోఽంఘ్రిరథ వక్షః స్థో ముష్టిః స్యాదపరః కరః. 180

అర్ధచంద్రః కటీసంస్థః పార్శ్వజాను తదీరితమ్;
బుధైర్యుద్ధే నియుద్ధేచ వినియోగోఽస్య కీర్తితః. 181

ఊరోరభ్యంతరే పార్శ్వే పరపాదాగ్రసంస్థితమ్
భట్టతండు రిహాబ్రూతే పాతాంతరవిలోకనాత్. 182
(పార్శ్వజాను—77)

హంసపక్షౌ ద్రుతభ్రాంత్యా రేచితౌ భవతః కరౌ
స్వస్తికౌ విప్రకీర్ణౌచ యత్రపాదస్తు వృశ్చికః,
వ్యోమయానే ప్రయోక్తవ్యమేతత్ వృశ్చికరేచితమ్. 183
(వృశ్చికరేచితమ్—78)

లతాసంజ్ఞః కరోవామః పాదశ్చయది వృశ్చికః
తల్లతావృశ్చికం ప్రోక్తం పతనే గగనాదధః
[1]వామోలతా ప్రయోగాత్ స్యాత్ దక్షిణోఽత్ర హృదిస్థితః 184
(లతావృశ్చికమ్—79)

---

1. ఇది పరిష్కర్త సవరించిన పాఠము. ప్రా ప్ర 'వామోయదః ప్రయోగః'—స్థితిః

అంచితపాదమును ఇంకొకపాదము నుండి ప్రక్కకు త్రోసి, ఆ దిక్కునందలి హస్తము రేచితము చేసి, శిరస్సును పరివాహితము చేయవలెను; ఇట్లే మరల అంగాంతరమునందును; అది సర్పితము; మత్తెక్కినవారు పాదములను గతాగతముగా చేయుటకిది వినియోగింపనగును. (సర్పితము—75) 176, 177

రేచితములై హంసపక్షహస్తములు ద్రుతముగా తిరుగగా, పాదములు స్వస్తికములై విడివడి, శిరస్సు పరివాహితమై యుండుట, నాగాపసర్పితము; ఇది తరుణమదమందు. దీనియందు భట్టతండువును, కీర్తిధరుడును, మత్తల్లిచారితో పాదములు జారి విడివడుటను అంగీకరించిరి. 178, 179

(నాగాపసర్పితము—76)

సమముగా నిలిచిన ఒకపాదము తొడ వెనుక, ఇంకొకపాదమును బెట్టి, ఒక హస్తమును ముష్టిగా వక్షఃస్థలమందును, ఇంకొకటిని అర్ధచంద్రముగా కటియందును, నిలుపుట పార్శ్వజానువు; యుద్ధము నందును, కుస్తీయందును, దీని వినియోగమని పండితులందురు. ఒకకాలికొనను ఇంకొక కాలితొడ లోప్రక్కలో నిలుపుకొనవలెనని పాఠాంతరము చూచి, భట్టతండువు వచించెను.

(పార్శ్వజానువు—77) 180, 181, 182

హంసపక్షహస్తములు ద్రుతముగా తిరుగుచు రేచితములై, స్వస్తికములై విడివడగా, పాదము వృశ్చికము గావలయును; ఇది వృశ్చిక రేచితము; ఆకాశయానమునందు ప్రయోగింపదగినది. (వృశ్చిక రేచితము—78) 183

ఎడమచేయి లతాహస్తమై, పాదము వృశ్చికముగానుండుట లతావృశ్చికమనబడును; ఇది ఆకాశమునుండి క్రిందికి పడుటయందు వినియోగింపదగినది. దీనిలో ప్రయోగమునుబట్టి, వామహస్తము లతయై యుండగా, కుడిచేయి వక్షస్సునందుండును. (లతావృశ్చికము—79) 184

వైశాఖస్థానకం కుర్వన్ గ్రీవాపాదకటిక్రమాత్ (టీకరాన్ ?)[1]
రేచయేద్యత్ర తద్ధీరైః ప్రోక్తం వైశాఖరేచితమ్
వైష్ణవం స్థానమత్రాదౌ ప్రోక్తం కీర్తిధరాదిభిః. 185
(వైశాఖరేచితమ్—80)

చార్యా తదాఖ్యయా జ్ఞేయం కరణం హారిణప్లుతమ్
కరౌ సామాన్యతః ప్రోక్తౌ వక్షఃపాదానుగావిహ,
చార్యా ఏవ ద్విరావృత్త్యా భట్టుతండురిదం జగౌ. 186
(హారిణప్లుతమ్—81)

కుర్యాదత్రుటితాంగేన దిఙ్ముఖేషు చతుర్ష్వపి
ప్రత్యేకం స్వస్తికం యత్ర తత్ దిక్స్వస్తికముచ్యతే. 187

గీతస్య పరివర్తేషు వినియోగోఽస్య కీర్తితః
స్వస్తికాంతరమప్యేతదుపజీవ్య ప్రవర్తతే. 188
(దిక్స్వస్తికమ్—82)

కర్ణాంతే కరిహస్తస్య త్రిపతాకోయదాంచితః
దోలాపాదాచ చారీ స్యాదేవమంగాంతరే తదా,
గజక్రీడితమాఖ్యాతం గజో యేనాభిధీ[నీ ?][2]యతే. 189
(గజక్రీడితము—83)

అలపద్మః కరో వామో వక్షఃస్థశ్చతురః పరః
భవేదుద్ఘట్టితః పాదో యత్ర తచ్చతురం విదుః,
విదూషకేణ సంసూచ్యో విస్మయాభినయాదికే. (చతురమ్—84) 190

యత్రాక్షిప్తామపక్రాంతాం చారీం కుర్వన్ క్రమాత్తతః
స్వస్తికీభూయ విశ్లిష్టౌ కరౌ నాభికటీచరౌ. 191

1. 'కటికరాన్' అని మూలపాఠము ఉండదగును. ఇందు ఇతర లాక్షణికులు హస్తరేచనమును గూడ చెప్పినారు

2 'అభినీయతే' అని సవరణ పరిష్కర్త సూచించినది. (చూ. క్రింది సూచి).

వైశాఖస్థానమున నిలిచి, మెడను, పాదములను కటిని (కరములను ?) రేచించవలయును. దానిని విద్వాంసులు వైశాఖరేచితమందురు. ఇక్కడ మొదలు స్థానకము వైష్ణవముగా నుండదగునని కీర్తిధరాదులు వచించిరి. 185

(వైశాఖరేచితము—80)

హరిణప్లుతచారితో చేయుకరణము హరిణప్లుతము. సామాన్యముగ దీని హస్తములలో ఒకటి వక్షస్సును, మరొక్కటి పాదమును, అనుసరించియుండును. ఈ చారినే రెండుమార్లు చేయదగునని భట్టతండుమతము. 186

(హరిణప్లుతము—81)

నాల్గు దిక్కులందును ప్రత్యేకముగా, అంగమును విడదీయక, స్వస్తికకరణమును చేసినచో అది దిక్స్వస్తికమనబడును; పాట మార్పులందు దీని వినియోగము. ఇతరకరణములందలి స్వస్తికము గూడ దీనినే యనుసరించును

(దిక్స్వస్తికము—82) 187, 188

కరిహస్తకరణమందలి త్రిపతాకహస్తము అంచితమై చెవివద్దనుంచి, దోలాపాదచారి చేయవలయును ; ఇట్లు రెండవయంగమందును జరిగినచో అది గజక్రీడితము ; దీనితో ఏనుగునభినయింపనగును. (గజక్రీడితము—83) 189

ఎడమచేయి అలపద్మముగా, కుడిచేయి చతురముగా వక్షస్సునందు నిలిపి, పాదము ఉద్ఘట్టితము చేయుట చతురమనబడును ; విదూషకుడు సూచించు విస్మయాభినయము మున్నగుచోట్ల వినియోజ్యము (చతురము—84) 190

ఆక్షిప్తచారి చేసి, అపక్రాంతచారి చేయవలయును ; తరువాత స్వస్తికములై విడివడిన హస్తములలో, ఒకటి కటకాముఖముగా నాభివద్దను, రెండవది అర్ధ

కటకాఖ్యార్ధచంద్రాఖ్యౌ, సమున్నత నతే క్రమాత్
పార్శ్వే వైష్ణవమాదధ్యాత్ స్థానమేవం పునర్విధిః. 192

భవేదంగాంతరేణాపి కీర్తితం తత్కటీసమమ్ ;
సూత్రధారప్రయోక్తవ్యే జర్జరస్యాభిమంత్రణే. 193
(కటీసమమ్—85)

యాత్రాంఘ్రిం వృశ్చికం కృత్వా పతువద్రేచితౌకరౌ
నికుంచ్యాధాము[1]మేవోరుదేశే భ్రమరికాం భజేత్
మయూరలలితం నృత్తే మయూరస్య తదిష్యతే. 194
(మయూరలలితమ్—86)

దక్షిణేనాంఘ్రిణాఽలాతాం కుర్వన్ తేనైవపాణినా
నితంబం చతురశ్రంచ విధాయ క్రమశః కరమ్, 195

వామేన చరణేనోర్ధ్వజానుచారీం ప్రకల్పయేత్
వామాంగేనాపి కుర్వీత భూయోఽలాతాదికం క్రమమ్, 196

యస్మిన్నిదమలాతాఖ్యం లలితే నృత్తఇష్యతే ;
హిత్వానితంబమత్రాహ దోలం కీర్తిధరః కరమ్. 197
(అలాతమ్—87)

అలాతాంఘ్రిం పురః కూర్యాదూర్ణనాభమపిద్రుతమ్
యదాంగాంతరమప్యేవం సింహావిక్రీడితం తదా ; 198

విషయోఽస్య వినిర్దిష్టో రౌద్రప్రాయః పరిక్రమః ;
తుల్యాకాతౌ[తుల్యాకారౌ !][2]కరావత్ర స్యాతాం కైర్తిధరేమతే. 199
(సింహావిక్రీడితమ్—88)

---

1. 'ధాన్యమేవో' అని ముద్రి. 'పాదం తమేవోరుదేశేనికుంచ్య' అను అభినవ భారతి వివరణ ప్రకారము (సం ౧, పు. ౧౨౮) నా యీ సవరణ సూచన.

2. 'తుల్యాకారౌ' అని పరిష్కర్త సూచించిన సవరణ (క్రింది సూ.).

చంద్రముగా కటివద్దను, నిలుపవలయును ; పార్శ్వములలో క్రమముగా ఒకటి సమున్నతము, ఇంకొకటి నతమును గావలయును ; స్థానకము వైష్ణవము ; ఇట్లు మరల ఇంకొకయంగమందును చేయవలయును ; ఇది కటీసమము; సూత్రధారుడు జర్జరమును[1] అభిమంత్రించుచోట దీనివినియోగము. 191, 192, 193

(కటీసమము—85)

ఒకపాదము వృశ్చికముచేసి, హంసపక్షహస్తములను రేచితములుచేసి ఆపాదముసే తొడవద్దికి నికుంచితముచేసి భ్రమరిచేయుట మయూరలలితము. ఇది మయూరనృత్తమునకు తగినది. (మయూరలలితము—86) 194

దక్షిణపాదముతో అలాతచారిచేసి, ఆకుడిచేతనే క్రమముగా నితంబ చతురశ్ర హస్తములుచేసి, వామపాదముచే ఊర్ధ్వజానుచారిని కల్పింపవలెను ; వామాంగమునను మరల అలాతచారి మున్నగు క్రమమును చేయవలెను ; ఇది అలాతకరణము; లలితమగునృత్తమునందిది తగినది. ఇక్కడ కీర్తిధరుడు నితంబ హస్తమునువదలి, దోలహస్తము చెప్పినాడు. 195, 196, 197

(అలాతము—87)

అలాతపాదము, ఊర్ణనాభహస్తమునుచేసి, వేగముతో ముందర మెట్టవలయును ; ఇట్లే అంగాంతరమునుగూడ తీర్చినచో, సింహావిక్రీడితమగును ; రౌద్రము నిండిన తిరుగాటకు దీనిని వినియోగింపదగును ; ఇందు హస్తములు రెండును ఏకకాలమందే చేయదగునని [ఏకాకారముగా నుండదగునని?] కీర్తిధరుని మతము (సింహావిక్రీడితము—88) 198, 199

---

1 విఘ్ననివారణకై నటులు పూజింపవలసిన ఇంద్రధ్వజదండము—వెదురుది - జర్జరము.

తలసంచరభావేన పాదశ్చేత్ దక్షిణోనతః
అలపద్మకతయా సవ్యః కుంచితోవామతః కృతః ,
కుంచితం తత్పరానందనిర్భరా[1]భినయేభవేత్. (కుంచితమ్—89) 200

అతీవ నమితం పృష్ఠం పాదో వృశ్చికపుచ్ఛవత్
క్రమాత్కరికరోయత్ర వృశ్చికం తదుదాహృతమ్ ;
ఇదమింద్రగజేంద్రాది గతాస్యాత్ గగనాంగణే. (వృశ్చికమ్—90) 201

ఆలీఢం స్థానక హస్తౌ స్యాతాం వక్షసి రేచితౌ
సహోద్వేష్టాపవేష్టాభ్యామూర్ధ్వాస్యాధోముఖౌక్రమాత్. 202

విప్రకీర్ణత్వమాపన్నౌ యత్ర తత్ వ్యంసితం మతమ్;
మారుతిప్రముఖ ప్రౌఢప్లవంగమ పరిక్రమే. (వ్యంసితమ్—91) 203

ఊర్ధ్వమండలినౌ సూచి చరణో బద్ధయాంచితః
విచిత్రత్వేన తత్రాన్యపాదే భవతివర్తితః. 204

భ్రమర్యాథ త్రికభ్రాంతిః పరివృత్తం దదీరితమ్ ;
అత్రకీర్తిధరో బాహ్యాభ్రమరీమపి మన్యతే. (పరివృత్తమ్—92) 205

హస్తమాక్షిప్య[2]పాదంచ త్రికం యత్ర వివర్తయేత్
రేచయేదపరం హస్తం కీర్తితం తద్వివర్తితమ్. (వివర్తితమ్—93) 206

రేచితో దక్షిణోహస్తః పాదశ్చోద్ఘట్టితో యది,
వామో దోలాయతే కోలః స్యాద్రేచితనికుట్టితమ్. 207
(రేచితనికుట్టితమ్—94)

---

1. 'నిర్జరాభినయే' అనియుండుబోలును. తక్కిన లాక్షణికులు దేవతలనే పేర్కొన్నారు.

2. 'ఆక్షిప్తపాదం' అను సమస్తపాఠమున హస్తము ఆక్షిప్తము కాకపోవును. అది భరతాదుల మతముగాదు. కనుక నా యీ సవరణ

దక్షిణపాదము తలసంచరమై, నతమైయుండగా, కుడిచేయి అలపద్మముగా, ఎడమప్రక్క కుంచితమైయుండుట, కుంచితము. ఇది పరమానందమనుభవించు దేవతనభినయించుట కుపయోగింపనగును. (కుంచితము—89) 200

వీపునుమిక్కిలివంచి, పాదము వృశ్చికపుచ్ఛమువలె తీర్చి, కరిహస్తమును క్రమముగా ప్రయోగించుట వృశ్చికకరణము; ఇది ఇంద్రుని ఐరావతము మున్నగునవి, ఆకాశమునందు చరించుటకు వినియోజ్యము. 201
(వృశ్చికము—90)

స్థానకము ఆలీఢపు; అందు హస్తములలోనొకటి ఉద్వేష్టితమును, ఊర్ధ్వముఖమునై, రెండవది అపవేష్టితమును, అధోముఖమునై, క్రమముతో వక్షస్సునందు రేచితములై, విప్రకీర్ణములు గావలయును; ఇది వ్యంసితము; ఆంజనేయుడు మున్నగు మహాకపుల తిరుగాటలందు. 202, 203
(వ్యంసితము—91)

హస్తములు ఊర్ధ్వమండలములు; బద్ధచారితో వంకరగానున్న పాదము విచిత్రమండలముతో ఇంకొకపాదమును చేర్చునది; తర్వాత భ్రమరిచే త్రికమును త్రిప్పుట – ఇది పరివృత్తమనబడును; ఇక్కడ కీర్తిధరుడు బాహ్యభ్రమరియు చేయవలెనన్నాడు. (పరివృత్తము—92) 204, 205

ఒక హస్తమును, పాదమును, ఆక్షిప్తములుగాచేసి త్రికమును త్రిప్పవల యును; ఇంకొక హస్తము రేచితము గావలయును. అది వివర్తితము. 206
(వివర్తితము—93)

దక్షిణహస్తము రేచితమై, దక్షిణపాదము ఉద్ఘట్టితము చేయబడవలెను; వామహస్తము దోలమై యూగవలెను; ఇదిరేచితనికుట్టితము. 207
(రేచితనికుట్టితము—94)

ఊరూద్వృత్తాం దధచ్చారీమరాలకటకాముఖౌ
యత్రవ్యావర్తితౌ హస్తౌ నిక్షిపేచ్చోరుపృష్ఠయోః. 208

ఊరూద్వృత్తం భవేత్ప్రేమ కోపేర్ష్యాప్రార్థనాసు తత్ ;
అత్ర హస్తః పతాకః స్యాదితి కైర్తిధరంమతమ్. 209
(ఊరూద్వృత్తమ్—95)

పదా వృశ్చికమాధాయ స్వబాహుశిరసోః కరౌ
నికుట్టితౌ విధీయేతే పర్యాయేణాలపల్లవౌ, 210

యదాతదా సమామ్నాతం బుధైః వృశ్చికకుట్టితమ్,
వాక్యార్థే విస్మయాకాశగమనేచ్ఛాప్రధానకే. 211
(వృశ్చికకుట్టితమ్—96)

దోలాపాదసమౌ హస్తౌ మిథస్సంఘట్టితౌ తలే
తతః స్యాద్వైష్ణవం స్థానం కట్యాంచేద్దక్షిణః కరః. 212

రేచితోఽన్యస్త్రికే పార్శ్వే తలసంఘట్టితం తదా;
అత్ర కీర్తిధరో హస్తమూచే వక్షసి దక్షిణమ్. 213
(తలసంఘట్టితమ్—92)

పాదస్సూచీ కరః క్షేత్రే వక్షసః కటకాముఖమ్(ఖః?)
కపోలాంతే కరోఽన్యః స్యాదలపద్మతలాంచితః, 214

యత్రపార్శ్వం నతం తద్జ్ఞైః గండసూచి తదిష్యతే,
వినియోగోఽస్య మంతవ్యః కర్ణగండస్య[1]మండనే. 215

సూచీపదం పరేప్రాహుః కపోలప్రాంతగామినమ్ ;
నృత్తహస్తోదితం సూచీముఖమన్యే ప్రచక్షతే. 216

తమసంయుతహస్తోక్తమపరే త్వనుమన్వతే;
త్రిపతాకాభిధం హస్తం భట్టతండురభాషత (గండసూచి—93) 217

1. 'గండాస్య' ముద్రి. ఆస్యమును ఇతరులెవరును చెప్పలేదు వ్రా. ప్ర. పాఠమే సరిగా తోచి గ్రహించితిని.

ఊరూద్వృత్తచారి చేయుచు, వ్యావర్తితములైన అరాళ - కటకాముఖ హస్తములలో ఒకటి తొడమీదను, మరొక్కటి పృష్ఠభాగమునందును, నిలుపవల యును ; అది ఊరూద్వృత్తము ; ప్రణయకోపము, ఈర్ష్య, ప్రార్థన - వీని యందిది వినియోగింపదగును. ఇక్కడ పతాకహస్తము చేయదగునని కీర్తిధరుని మతము. (ఊరూద్వృత్తము—95) 208, 209

వృశ్చికపాదముచేసి, అల్లపల్లవహస్తములను తమతమ మూపులందు మార్చి మార్చి, నికుట్టితములుగా చేయవలయును. అది వృశ్చికకుట్టితమని బుధులం దురు ; ఆశ్చర్యము, ఆకాశగమనేచ్ఛ, ప్రధానముగాగల, వాక్యార్థమున దాని వినియోగము. (వృశ్చికకుట్టితము—97) 210, 211

దోలాపాదచారిని చేయుచునే, రెండు హస్తములయరచేతులు పరస్పరము చేర్చి, వైష్ణవస్థానకమున నిలిచి, కుడిచేతిని రేచితముచేసి, కటియందును, ఇంకొకహస్తము దానిప్రక్క త్రికమునందును, నిలుపవలెను; ఇది తలసంఘట్టిత మగును ; ఇక్కడ కీర్తిధరుడు దక్షిణహస్తమును వక్షస్సుమీద నిలుపదగు నన్నాడు. (తలసంఘట్టితము—92) 212, 213

పాదముసూచి ; కటకాముఖమై, హస్తమొకటి వక్షఃప్రదేశమునందు ; ఇంకొకటి అలపద్మమై, అరచేతియందు అంచితమై, కపోలప్రదేశమందు ; పార్శ్వము నతము—ఇట్లుండుట గండసూచియందురు ; చెవులను, చెక్కులను, అలంకరించుపనిలో దీని వినియోగము. 214, 215

ఇక్కడి సూచీపాదము, కపోలప్రాంతముదాక సాగవలెనని ఇతరులు చెప్పు దురు; నృత్తహస్తముగా చెప్పబడిన సూచీముఖమును మరికొందరు చెప్పుదురు. ఇంకను కొందరు అసంయుతహస్తముగా నుండవలెనందురు; భట్టతండువు త్రిపతాకహస్తమును వచించెను. (గండసూచి—98) 216, 217

ఆక్షిప్తాం యత్రకుర్వాణః సమముద్వేష్టయన్ కరౌ
జంఘయోః స్వస్తికం కృత్వా కుర్వీత భ్రమరీంతతః. 218

ఉల్బణౌవా కరావేవం[1]ద్వితీయాంగే పునర్విధిః
భ్రమరం[2] తదుబధైర్జ్ఞేయముద్ధతస్య పరిక్రమే. (భ్రమరమ్–99) 219

నిధాయ భ్రమరీం చారీం కుర్వన్ నూపురపాదికామ్
యేన పాదేన తద్దిక్కం హంసపక్షం ద్రుతభ్రమమ్, 220

హస్తమన్యం లతాసంజ్ఞం యత్ర తన్నూపురం విదుః ;
లతాఖ్యౌరేచితౌచాత్ర స్యాతాం కైర్తిధరేమతే. 221
(నూపురమ్–100)

ఊర్ధ్వాస్యం[3] పార్శ్వతః క్షేత్రే వ్యావర్త్య పరివర్తయన్
అధోముఖం చతుర్దిక్కం భ్రమయన్ దక్షిణం కరమ్, 222

జంఘాస్వస్తికమాదాయ తద్దిక్కం చరణం దధత్
అపక్రాంతాసమాయుక్తం వామందోలాభిధం కరమ్, 223

యత్ర కుర్వీత తద్ధీరైః ఘూర్ణితం పరికీర్తితమ్ ;
ఉత్ప్లుత్య స్వస్తికం కుర్యాదత్ర కైర్తిధరే మతే. 224
(ఘూర్ణితమ్–101)

అలాతాం కుర్వతశ్చారీం కరౌ కుర్వీత రేచితౌ,
వ్యావృత్తకరణేనాథ కుంచితౌ మణిబంధకౌ[4], 225

అలపద్మతలౌ బాహ్వోశ్శిరసో రంచితౌ స్థితౌ
వృషభక్రీడితేఽత్రాహుః పతాకావపరేకరౌ. 226
(వృషభక్రీడితమ్–102)

---

1. 'వేవ'; 2. 'భ్రమర్యాం'–రెండును సంగతి లేని ముద్రితపాఠములు. సవరణ నా సూచన.
3 'ఊర్ధ్వాస్యః' ముద్రి. అనన్వితము. సవరణ నాది.
4. 'మణిబంధగౌ' అను భరతకోశము నందలి పాఠము మేలు

అతిక్షిప్తచారిని చేయున్నప్పుడే, హస్తములను ఉద్వేష్టితములు చేయుచు, జంగలను స్వస్తికపరిచి, అపైని భ్రమరి చేయవలెను, హస్తములు ఉల్బణములుగా నైనను చేయవచ్చును; ఇట్లు రెండవయంగమందును క్రియ సాగవలెను; అది భ్రమరము; ఉద్ధతుని తిరుగులాటయందు చేయదగినది. 218, 219

(భ్రమరము—99)

భ్రమరిచేసి, నూపురపాదచారి చేయుచు, ఆ దిక్కునందలి హస్తమును ద్రుతముగా తిరుగు హంసపక్షముగా చేసి, ఇతరహస్తము లతగాతీర్చుట నూపురకరణ మందురు; ఇక్కడ రెండును లతాహస్తములుగా రేచితములు గావలెనని కీర్తిధరుని మతము. (నూపురము—100) 220, 221

కుడిహస్తమును మీదిమొగముగా చేసి, దాని పార్శ్వభాగమున వ్యావర్తనము చేసి, అపైని క్రిందిమొగముగా పరివర్తించి, నలుదిక్కులను త్రిప్పుచు, ఆదిక్కుపాదమునే జంఘాస్వస్తికముచేసి నిలిపి, ఎడమచేతిని అపక్రాంతచారిచే దోలాహస్తము చేయవలయును;

ఇది ఘూర్ణితమని విజ్ఞులందురు. ఇందు ఎదిరి స్వస్తికము చేయవలెనని కీర్తిధరమతము. (ఘూర్ణితము—101) 222, 223, 224

అలాతచారిని చేయుచు, వ్యావృత్తకరణము చేసి, హస్తములను రేచితములుగా చేయవలెను; అపైని అరచేతులు అలపద్మములుగా, మనికట్టులవద్ద కుంచితములు చేసి, మూపులమీద అంచితములుగా నిలుపవలెను. ఇది వృషభక్రీడితము; కొందరు ఇందు పతాకహస్తములు చెప్పిరి. 225, 226

(వృషభక్రీడితము—102)

వక్షస్థః కటకోవామః కర్ణే సోద్వేష్టనః పరః
త్రిపతాకః కరః పాదస్తద్దిక్కః సమమంచితః
యత్రనిష్క్రామణీయః స్యాత్ కరిహస్తం తదీరితమ్. 227
(కరిహస్తమ్—103)

యత్రవామో లతాసంజ్ఞో రేచితస్త్వపరః కరః
తద్దిక్కోర్ధ్వ(ఘృ?)ష్టభూః పాదః పాదాంతరసమీపతః. 228

మందం మందం త[చ?]రేదేవం భవేదంగాంతరేణ చ
ప్రసర్పితమిదం ప్రాహుః దేవదత్తం [?] నిరూపణే. 229

అత్రపాదద్వయస్యాపి పార్శ్వయోః స్యాత్ ప్రసర్పణమ్
యౌగపద్యాత్ క్రమాచ్చేతి భట్టతండురభాషత ;
సమోత్సారితమత్తల్లీమత్రకీర్తిధరః పునః (ప్రసర్పితమ్—104) 230

ఉరసో యౌగపద్యేన కృత్వా వ్యావర్తితౌ కరౌ
ఆనీయాఽఞ్చిప్తయా సార్ధం తత్రైవ పరివర్తనాత్. 231

స్థాపయిత్వా యదా సమ్యక్ శుకతుండావధస్తతౌ
బద్ధయావా(చా?)[1]వత్ర్యేత వలితోరు తదీరితమ్ ;
అపత్రపితమేతేన ముగ్ధాయాః సంప్రదర్శ్యతే. (వలితోరు—105) 232

అంగుష్ఠేన మహీంచుంబన్ కించిదంచితజానుకః
పృష్ఠతః ప్రసృతః పాదః పార్శ్వగౌచ లతాకరౌ. 233

యత్రగృధ్రావలీనం స్యాత్ పృథుపక్షనిరూపణే
తార్క్ష్యపక్షావిహ ప్రోక్తావుచితౌ భట్టతండునా. 234
(గృధ్రావలీనమ్—106)

స్యాన్నికుట్టకమేవార్ధేనాంగే నార్ధనికుట్టకమ్
అంచితావితి శబ్దేన క్రియావైశిష్ట్య మీరితమ్. 235

---

1. ఇక్కడ బద్ధచారి వైకల్పికము గాదు 'బద్ధయా చ' అను పాఠమే 'భరతకోశము' చూపినది.

ఎడమచేయి కటకాముఖమై యెదమీద నిలువగా, కుడిచేయి త్రిపతాకమై ఉద్వేష్టనక్రియచే చెవిదగ్గరనుండగా, ఆ సమకాలమందే కుడిపాదము అంచితమై వెలికిత్రోయబడుట కరిహస్తము. (కరిహస్తము—103) 227

వామహస్తము లతగావలెను ; దక్షిణహస్తము రేచితము ; దక్షిణపాదము, ఇతరపాదము సమీపమున నేలను రాయుచు మెల్లమెల్లగాచరించవలయును ;

ఇట్లు అంగాంతరమునను చేయవలయును. ఇది ప్రసర్పితమందురు. ఇది దేవదత్త[1]నిరూపణమందుపయుక్తము ఇక్కడ రెండుపాదములుగూడ ఒకమారుగాను, క్రమముగాను, పార్శ్వములందు చరించవలెనని భట్టతండువు వచించెను; మరి కీర్తిధరుడు సమోసారితమత్తల్లి చారి చేయదగునన్నాడు.
(ప్రసర్పితము—104) 228, 229, 230

వక్షస్సునుండి ఒకసారిగానే హస్తములను వ్యావర్తితములుచేసి, ఆక్షిప్త చారిచే వెనుకకుతెచ్చి, యెదమీదనే పరివర్తనముచేసి, శుకతుండములుగా బోరలించి పెట్టి, బద్ధచారిచే నిలువవలయును ; అది వలితోరువు ; దానిని, ముగ్ధ స్త్రీయొక్క లజ్జను చూపుటకు వినియోగింపదగును. 231, 232
(వలితోరువు—105)

ఒక పాదము కొంచెము వంగిన మోకాలితో, నేలను బొటనవ్రేలితో తాకుచు, వెనుకకు సాగియుండగా, పార్శ్వములందు లతాహస్తములు సాగియుండుట గృధ్రావలీనము; పెద్దపక్షులను నిరూపించుటకు తగినది. ఇక్కడ భట్టతండువు గరుడపక్షహస్తములు తగినవనెను. (గృధ్రావలీనము—106) 233, 234

నికుట్టకకరణమునే అర్ధాంగముచే చేయుట అర్ధనికుట్టకము. అలపద్మహస్తమునకు ముందుచెప్పిన లక్షణమును స్మరించుచు, భరతముని, 'అంచితౌ' అని

1. ఈ వినియోగము సుగమముగాదు గనుక 'దేవదూత నిరూపణే' అని యుండదగునేమో ; లేదా, 'దేవమత్త నిరూపణే' అని యుండబోలునని పరిష్కర్త సూచించెను. (చూ. Notes P-29) దేవతల-మత్తుల సంచారము చూపుట యని యర్థము.

మునినై వాలపద్మస్య స్మరతా పూర్వలక్షణమ్;
స్వదేహాభిముఖం పృష్ఠభాగేనాకర్షణం మతమ్. 236

శంకుకప్రముఖైః ప్రోక్తమంచితం తన్నసంగతమ్,
అప్రరూఢ నిజశ్లాఘారూపవాక్యే తదిష్యతే. 237

(అర్ధనికుట్టకమ్—107)

అంచితం పాదమత్యర్థముత్క్షిప్యోర్ధ్వతలం తతః
తస్యోపరి కరౌకార్యౌ త్రిపతాకావధస్తలౌ, 238

శిరశ్చ క్రమశోయత్ర పాదార్ధమవరోపయేత్,
గంగావతరణం విష్ణోః పాదాద్గంగావతారణే. 239

(గంగావతరణమ్—108)

వినియోగో నయేషూక్తః కరణేషు సమాసతః
ఉద్ధతాంగతయా సస్యాత్ తత్రోద్ధత పరిక్రమః. 240

వైశాఖరేచిత వశీకృత నృత్తలీలమ్
సచ్చక్రమండలకరం గరుడప్లుతోత్కమ్
విక్రాంతకుంచితగతం మురవైరిరమ్యమ్
శ్రీజాయనః కరణలక్షమభ్యధత్త. 241

అంగహారాః

నిష్పాద్యాన్ కరణైరేభిరంగహారాన్ ప్రచక్ష్మహే
చతురశ్రేణ తాలేన కేచిత్ త్ర్యశ్రేణ కేచన. 242

ఏతేప్రయోజనీయాః స్యుః, వ్యాకీర్ణామునినోదితాః;
విభజ్య వివిధానేతాన్ సోద్దేశాన్ బ్రూమహే వయమ్. 243

పేర్కొనుటచేత, ఈకరణమునందలి హస్తములు చలనక్రియగలిగినవని సూచించెను. [1]ఇక్కడ అంచిత మనగా, స్వదేహాభిముఖముగా చేతిని వెనుకకీడ్చుకొనుట యని, శంకుకుడు మున్నగువారు నిర్వచించిరి కాని యది సంగతము గాదు. ఇది ప్రౌఢిచాలనివారు ఆత్మశ్లాఘ చేసికొను వాక్యములందు ప్రయోగింపదగినది. (అర్ధనికుట్టకము—107) 235, 236, 237

అంచితపాదమును అరకాలు మీదగునట్లు, పూర్తిగా ఎత్తి, ఆపై అరచేతులు క్రిందగునట్లు త్రిపతాకహస్తములు నిలుపవలెను; శిరస్సును పాదార్ధభాగమును క్రమముగా దించవలెను; ఇది గంగావతరణము; విష్ణుపాదమునుండి గంగను దించుటకిది ప్రయోగింపనగును. (గంగావతరణము—108) 238, 239

ఏయేకరణములకు వినియోగము చెప్పబడలేదో, ఆకరణములన్నిటిని ఉద్ధతములైన యంగములతో, ఉద్ధతుల తిరుగాటలయందు వినియోగింపదగును. 240

కవ్వమునుండి తీసినవెన్నకై నర్తించువాడు, చక్రముధరించినవాడు, గరుడునిపై స్వారిచేయు వేడుకగలవాడు, విక్రమించిన గుజ్జునడకగలవాడునగు కృష్ణునివలె వైశాఖరేచితము, చక్రమండలము, గరుడప్లుతము, విక్రాంతము, కుంచితము అనువానిని లోగొన్న కరణలక్షణమును శ్రీజాయన ఇట్లుచెప్పెను. 241

### అంగహారములు

ఈ కరణములచే ఏర్పరుపదగిన అంగహారములను వివరింతుము: అవికొన్ని చతురశ్రతాళముతో, కొన్ని త్ర్యశ్రతాళముతో ప్రయోగింపదగినవి. భరతముని వానిని కలిపిచెప్పెను; వానిని వేరుపరిచి, ఉద్దేశములతోగూడ మేము తెలియబరుతుము. 242, 243

---

1 'అంచితా బాహుశిరసి హస్తస్త్వభిముఖాంగులిః' భ నా. శా లక్షణము అ ४, శ్లో 70). ఈ శ్లోకపాఠము సరియైనదిగా తోపదు

వ్యాపారైస్సహజైః క్వాపి స్యాదేవం [కం] కరణంసకృత్;
నృత్యతీతి పరిజ్ఞానం తద్ద్వయేన యతో భవేత్,
కరణద్వయసంయోగః తతః స్యాన్నృత్తమాతృకా. 244

తద్ (తే?) ద్వే త్రిస్సశ్చతస్రో వేత్యంగహారః ప్రకీర్తితః;
ఇదం ప్రాయికమాఖ్యాతం కుత్రచిద్ వ్యభిచారతః
[1]వాశబ్దేనోక్తవానత్ర న్యూనతాధికతే మునిః. 245

కేచిత్ ద్విత్రి చతుః పంచకరణైః సంచయాన్ విదుః
క్రమాత్ మాతృ కలాపాఖ్య ఖండ సంఘాతకాభిధాన్. 246

కరణానాం యథాకామం షట్కం సప్తక మష్టకమ్
నవకం యావదేతేషా మంగహారో మతస్తదా. 247

కరణానాం వినిష్పన్నం [ష్పత్తా ?] ప్రయోజ్యానాం నలక్ష్యతే
యథాసంధిస్తథా హస్తపాదాద్యంగైః క్రియాక్రమః
వర్తనాది బుధైర్నృత్త మంగవిద్భిర్విధీయతామ్. 248

అంగానాం యోగ్యదేశేషు హరణేన నిరుచ్యతే
అంగహారోఽథవా హారః ప్రయోగో హారయోగతః
అంగనిర్వర్తనీయత్వాత్ అంగహారః ప్రకీర్తితః. 249

తథాచ మునయే శంభోరాదేశాత్ తండురబ్రవీత్
దృష్టాదృష్టఫలోపేతాన్ పూర్వరంగాంజనాయతాన్. 250

పార్శ్వచ్ఛేద పరావృత్త గతిమండలసంకులమ్
కుర్యోర్మేఢ్రాంగహారాణామిదం కులమివద్విషామ్ 251

**షోడశచతురశ్రాంగహారాః**

స్థిరహస్తః పరిచ్ఛిన్నః పార్శ్వచ్ఛేదోఽపరాజితః
పర్యస్త భ్రమరాలీఢ మత్తాక్రీడాపసర్పితాః, 252

---

1. 'ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిర్వాప్యంగహారస్తు మాతృభిః' (భ.నా శా అ. ౪, శ్లో. ౩౧)

సహజమైన నడవడులచే ఒకకరణము ఒకమూరు ఎప్పుడైనను కలుగవచ్చును. రెండుకరణములు చేరినప్పుడు 'నర్తించుచున్నాడు' అనునిశ్చయము గలుగును. కనుక రెండుకరణములకూడిక నృత్తమాతృకయగును. 244

అవి రెండు, మూడు, నాల్గుగాని కలియుట అంగహారమనబడును. ఇది ప్రాయికమైనది; ఈనియమము కొన్నియెడల తప్పుటగలదు గనుక భరతముని 'వా' అని చెప్పి ఇందు ఎక్కువతక్కువలు గావచ్చునని సూచించెను. 245

కొందరు రెండుకరణముల కూడికకు మాతృకయని, మూడిటికి కలాపమని, నాలుగింటికి ఖండమని, ఐదింటికి సంఘాతకమని, పేరుపెట్టిరి. 246

కనుక ఈకరణములను ఇష్టమువచ్చినట్లు ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిదిదాక అంగహారములలో గుంపుగూర్పవచ్చును. 247

అంగహారముల నిష్పత్తికి ప్రయోగింపదగిన కరణము లొండొంటి నడుమ సందుకానరానట్లు, హస్తపాదాద్యంగముల క్రియసు—వర్తన మొదలగు వానిని, అంగము లెరిగిన బుధులు నిర్వహింపదగును.[1] 248

అంగములను తగినచోట్లకు తీసికొనిపోవుట కావున అంగహారమని దాని నిర్వచనము; లేదా, హరునికి సంబంధించినది హారము; ప్రయోగము; అది అంగములచేత నెరవేర్పబడునది గనుక అంగహారమనబడును. 249

ఎట్లనగా : తండువు శివునియాజ్ఞచే భరతమునికి, పూర్వరంగమున ప్రయోగించినచో దృష్టఫలమును అదృష్టఫలమును ఇచ్చునవియని, ఈ యంగహారములను ఉపదేశించెను. 250

ప్రక్కపోటు, వెనుదిరిగిపోవుట, వ్యూహము,— గల్గి సంకులయుద్ధముచేయు శత్రుకులమువలె, పార్శ్వచ్ఛేదము, పరావృత్తము, గతిమండలము అనుభేదములుగల అంగహారముల లక్షణమును చెప్పుదుము. 251

**చతురశ్రాంగహారములు పదునారు**

స్థిరహస్తము, పరిచ్ఛిన్నము, పార్శ్వచ్ఛేదము, అపరాజితము, పర్యస్తము, భ్రమరము. ఆలీఢము, మత్తాక్రీడము, అపసర్పితము, మదవిలసితము, విమ్యా

1. ఇక్కడ వ్రా. ప్ర. లో పాఠము చాల కలుషితముగా నున్నది.

మదాద్విలసితో విద్యుద్భ్రాంత వైశాఖరేచితౌ
సూచీవిద్ధాక్షిప్త పార్శ్వస్వస్తికాచ్ఛురితా ఇతి
చతురశ్రస్య మానేన షోడశామీ ప్రకీర్తితాః. 253

**షోడశ త్ర్యశ్రాంగహారా**

గతిమండల విష్కంభౌ పరావృత్తాపవిద్ధకౌ
మత్తస్ఖలిత సంభ్రాంతా క్షిప్తరేచిత రేచితాః 254

విష్కంభాపసృతోఽలాతోర్ధ్వవృత్తావర్ధనికుట్టకమ్(కః?)
ఉద్ఘట్టితో వృశ్చికాపసృత స్వస్తిక రేచితే
రేచితః పరివృత్త్యాదిః త్ర్యశ్రమానేనషోడశ. 255

లక్షణేష్వంగహారాణాం భరతేన సమాసతః
ఏకదేశగ్రహేణోక్తం సమగ్రం కరణం క్వచిత్ ;
ఆలోచ్యతానహం వ్యక్తం కథయామ్యనుపూర్వశః. 256

క్రమాల్లీనం సమనఖం తతోవ్యంసితమాచరేత్
అత్రత్వపసృతావూర్ధ్వం స్థానప్రాప్తౌ కరావుభౌ, 257

ఆలీఢవ్యత్యయేనాస్య ప్రత్యాలీఢం సమాశ్రయేత్
ఊరూద్వృత్తం తతః కుర్యాన్నికుట్టకపురస్సరమ్. 258

స్వస్తికాక్షిప్తకే పశ్చాత్ నితంబకటిహస్తకమ్
కటిచ్ఛిన్నంచ యత్రైష స్థిరహస్తో హరప్రియః, 259

ఆదౌ సర్వాంగహారాణాం కైశ్చిత్ కరణసంచయః
స్థిరహస్తోక్తలీనాది ప్రత్యాలీఢాంత ఇష్యతే. 260

కరణాన్యంగహారేషు ప్రత్యేకం చతస్రుష్వపి
దిక్షు కుర్యాత్ పరావృత్త్యా భ్రమణం (రం ?) కరణం భజన్.
అంత్యంతు కరణాన్వంద్వం సభామభిముఖస్సకృత్ ; 261

భ్రాంతము, వైశాఖరేచితము, సూచీవిద్ధము, ఆక్షిప్తము, పార్శ్వస్వస్తికము, ఆచ్ఛురితము, - ఇవి చతురశ్రమానముతోడి పదునారు అంగహారములు. 252, 253

### త్ర్యశ్రాంగహారములు పదునారు

గతిమండలము, విష్కంభము, పరావృత్తము, అపవిద్ధము, మత్తస్ఖలితము, సంభ్రాంతము, ఆక్షిప్తరేచితము, రేచితము, విష్కంభాపసృతము, అలాతము, ఉద్వృత్తము, అర్ధనికుట్టకము, ఉద్ఘట్టితము, వృశ్చికాపసృతము, స్వస్తికరేచితము, పరివృత్తిరేచితము, — ఈపదునారును త్రశ్యమానముగలవి. 254, 255

భరతముని అంగహారముల లక్షణములను సంగ్రహముగా చెప్పునప్పుడు, కొన్నిచోట్ల ఏకదేశముగాను, కొన్నిచోట్ల సమగ్రముగాను కరణములను పేర్కొనెను. నేను వానిని స్పష్టముగా ఆలోచించి, మొదటినుండి తెల్పుచున్నాను. 256

క్రమముగా లీనము, సమనఖము, వ్యంసితమును చేయవలయును. అందు విడివడినచేతులు తమస్థానమందు ఆలీఢమునుమార్చి మీదికెత్తబడియుండవలెను. ప్రత్యాలీఢస్థానము నాశ్రయింపదగును ; తరువాత నికుట్టకముచేసి, ఊరూద్వృత్తము చేయవలెను ; ఆపై స్వస్తికము, ఆక్షిప్తకము, నితంబము, కటిహస్తము, కటిచ్ఛిన్నము - ఇవి క్రమముగా చేయవలెను. ఇది స్థిరహస్తము. శివునికి ప్రియమైనది. 257, 258, 259

కొందఱు, అన్ని యంగహారములకును మొట్టమొదలు ఈస్థిరహస్తమునకు విధించిన కరణములగుంపు — లీనము మొదలు ప్రత్యాలీఢమువరకు — చేయదగునని యిచ్ఛింతురు. 260

అంగహారములందలి కరణములొక్కొక్కటియు రెండుమారులు భ్రమరకరణమునాశ్రయించి, నాలుగుదిక్కులందును చేయవలయును ; కడపటి రెండు కరణములు మాత్రము సభకభిముఖముగా ఒక్కమారే చేయవలయును. 261

[1]రేచితం పరివృత్తాద్యమంగహారం వదన్మునిః
'పరాఙ్ముఖ విధిర్భ్రాంతః ఏవమేవభవేదిహ'
ఇత్యత్ర త్యేహ శబ్దేనాముమర్థం పర్యభాషత. (స్థిరహస్తః—1) 262

క్రమాత్ సమనఖచ్ఛిన్నసంభ్రాంతాని విధాయ చేత్
వామేనాంగేన కుర్వీత భ్రమరాఖ్యార్ధసూచినీ. 263

అతిక్రాంతాభిధం పశ్చాత్ భుజంగత్రాసితం తతః
కరిహస్తంకటిచ్ఛిన్నం పరిచ్ఛిన స్తదా భవేత్ (పరిచ్ఛిన్నః—2) 264

కరణం యత్రకుర్వీతపూర్వం వృశ్చికకుట్టితమ్
ఊర్ధ్వజానుకమాక్షిప్తం స్వస్తికం భ్రమణంత్రికే, 265

ఉరోమండలకాభిఖ్యం నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నం తమిచ్ఛంతి పార్శ్వచ్ఛేదం విపశ్చితః. 266
(పార్శ్వచ్ఛేదః—3)

దండపాదం యదాకుర్యాత్ వ్యంసితాఖ్యం ప్రసర్పితమ్
నికుట్టార నికుట్టాఖ్యాక్షిప్తోరోమండలాన్యథ
కరిహస్త కటిచ్ఛిన్నే తదాస్యాదపరాజితః. (అపరాజితః—4) 267

తలపుష్పపుటాత్ పశ్చాదపవిద్ధాఖ్యవర్తితే
నికుట్టకం భవేదూరూద్వృత్తమాక్షిప్తకాభిధమ్, 268

ఉరోమండలనామాథ నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నం చ యత్రస్యాత్ పర్యస్తోఽయంభవ ప్రియః 269
(పర్యస్తః—5)

1. 'రేచితే పరివృత్తాదావంగహారేఽవదన్ మునిః' అని ముద్రి. అన్వయక్లేశము గలది నావద్ది వ్రా. ప్ర.ని బట్టి - 'రేచితం పరివృత్తాద్యరంగహార' - పై విధముగా పాఠమూహింప వీలున్నది. అన్వయము సుగ్రహము.

పరివృత్త రేచితమను అంగహారమునుగూర్చి చెప్పుచు భరతముని 'ఇక్కడ పరాఙ్ముఖముగా మరల ఈక్రియ జరుగవలయును' అని 'ఇక్కడ' అనుమాటచే పై విషయమును పరిభాషించెను. (స్థిరహస్తము—1) 262

సమనఖము, ఛిన్నము, సంభ్రాంతము, క్రమముగాచేసి, వామాంగమున భ్రమరము, అర్ధసూచి, అతిక్రాంతముచేసి, ఆపై భుజంగత్రాసితము, కరిహస్తము, కటిచ్ఛిన్నము చేయునది పరిచ్ఛిన్నమగును. (పరిచ్ఛిన్నము—2) 263, 264

మొదలు వృశ్చికకుట్టితకరణము, ఆపైని ఊర్ధ్వజానుకము, ఆక్షిప్తము, స్వస్తికము, త్రికభ్రమణము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము — ఇట్లుచేయుట పార్శ్వచ్ఛేదమని పండితులందురు. 265, 266

(పార్శ్వచ్ఛేదము—3)

దండపాదము, వ్యంసితము, ప్రసర్పితము, నికుట్టకము, అర్ధనికుట్టము, ఆక్షిప్తము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నము, ఇట్లు క్రమముగా చేయుట అపరాజితమగును. (అపరాజితము—4) 267

తలపుష్పపుటముతర్వాత అపవిద్ధము, వర్తితము, నికుట్టకము, ఊరూద్వృత్తము, ఆక్షిప్తకము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము- ఇట్లుచేయుట పర్యస్తము ; ఇది శివునికిప్రియము. 268, 269

(పర్యస్తము—5)

[1][కృత్వానూపురపాదంతు తథాఽఽక్షిప్తకమేవచ
కటిచ్ఛిన్నంచ కర్తవ్యం సూచీవిద్ధం నితంబకమ్.] 270

కరిహస్తాభిధం తస్మాదురోమండల సంజ్ఞకమ్
కటిచ్ఛిన్నం[2]........................... (భ్రమరః—6) 271

విధాయ వ్యంసితం యత్ర ప్రకుర్వీత నికుట్టకమ్
నూపురం వామతోఽలాతాక్షిప్తకే తు తతోఽన్యతః, 272

ఉరోమండలకాభిఖ్యం కరిహస్తసమాహ్వాయమ్
కటిచ్ఛిన్నంచ యత్రాఽఽయమాలీఢః పరికీర్తితః. (ఆలీఢః—2) 273

భ్రమరాన్నూపురం తస్మాత్ భుజంగత్రాసితాభిధమ్
అంగేన దక్షిణేనైవతతోవైశాఖరేచితమ్ 274

ఆక్షిప్తకమథాచ్ఛిన్నం వామేన భ్రమరాభిధమ్
యత్రోరోమండలంకుర్యాన్నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నంచ సంప్రోక్తో మత్తాక్రీడో హరప్రియః (మత్తాక్రీడః—8) 275

క్రమాత్‌కుర్యాదపక్రాంతం వ్యంసితేన కరక్రియామ్
కేవలం కరిహస్తార్ధసూచి విక్షిప్తకాన్యథ. 276

కటిచ్ఛిన్నాభిధానోరూద్వృత్తమాక్షిప్తనామకమ్
కరిహస్తం కటిచ్ఛిన్నమపసర్పితనామకే.[3] (అపసర్పితః—9) 277

మదస్ఖలిత మత్తల్లి తలసంస్ఫోటితాని చేత్
గుంఫేన త్రిచతుఃకృత్వః[4] పంచకృత్వోఽథవా పునః, 278

విదధీత నికుట్టోరూద్వృత్తాఖ్యే కరిహస్తకమ్
కటిచ్ఛిన్నం సమాఖ్యాతో మదాద్విలసితస్తదా. (మదవిలసితః—10) 279

---

1. గ్రంథలోపము. భరతలక్షణము ననుసరించి పరిష్కర్త పూరించిన దీ శ్లోకము.
2. వ్రా.ప్ర.లో ఈ భాగము చాల కలుషితము 'చతుర్థావ సూక్ష్మాఖ్యా హారతి తతః', "చ యత్రస్యాఽయం భ్రసురనామకః" అని తేప వేయవచ్చును
3. 'నామకః'. 4. కృత్వా — రెండును వ్రాత పొరబాట్లు.

నూపురపాదముచేసి, ఆక్షిప్తము, కటిచ్ఛిన్నము చేయవలెను. ఆపై సూచీ విద్ధము, నితంబము, కరిహస్తము, ఉరోమండలము, కటిచ్ఛిన్నము. (ఇది భ్రమరమనబడును.) (భ్రమరము—6) 270, 271

వ్యంసితముచేసి తరువాత నికుట్టకము, ఆపై ఎడమప్రక్క నూపురము, కుడి ప్రక్క అలాతము, ఆక్షిప్తమునుచేసి, మరి ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నములు చేయుట ఆలీఢమనబడినది. (ఆలీఢము—7) 272, 273

భ్రమరముచేసి ఆమీద కుడిప్రక్కనే నూపురమును, భుజంగత్రాసితమును, ఎడమప్రక్క వైశాఖరేచితమును, ఆక్షిప్తమును, ఆచ్ఛిన్నమును దీర్చి, మరల భ్రమరము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము — వీనినిచేసి, కటిచ్ఛిన్నముచేయుట మత్తాక్రీడనమనబడును. శివునికిది ప్రియమైనది. 274, 275
(మత్తాక్రీడము—8)

క్రమముగా అపక్రాంతముచేసి, వ్యంసితకరణమందలి హస్తక్రియను మాత్రము చేసి, తరువాత కరిహస్తము, అర్ధసూచి, విక్షిప్తకము, కటిచ్ఛిన్నము, ఊరూద్వృత్తము, ఆక్షిప్తము, కరిహస్తము, కటిచ్ఛిన్నము-వీనిని తీర్చుట అపసర్పితమగును. (అపసర్పితము—9) 276, 277

మదస్ఖలితము, మత్తల్లి, తలసంస్ఫోటితము, ఈమూడుకరణములును గుంపుగూర్చి మూడుమార్లు, నాలుగుమార్లుగాని, ఐదుమార్లైనను చేసి, తరువాత నికుట్టము, ఊరూద్వృత్తము, కరిహస్తము, కటిచ్ఛిన్నము — వీనిని చేయుట మదవిలసితము. (మదవిలసితము—10) 278, 279

అర్ధసూచి భవేద్వామే విద్యుద్భ్రాంతంతు దక్షిణే
వ్యత్యాసేన పునర్ద్వంద్వమేతత్ ఛిన్నమతఃపరమ్; 280

వామేఽతిక్రాంతమాదధ్యాత్ లతావృశ్చికసంజ్ఞకమ్
కటిచ్ఛిన్నం చయత్రాయం విద్యుద్భ్రాంతః ప్రకీర్తితః. 281
(విద్యుద్భ్రాంతః—11)

అంగద్వయేన వైశాఖరేచితం యత్రనూపురమ్
భుజంగత్రాసితోన్మత్తే మండలస్వస్తికాభిధమ్, 282

నికుట్టకం తతః కుర్యాత్ ఊరూద్వృత్తమతఃపరమ్
ఆక్షిప్తకాహ్వయం పశ్చాదురోమండలసంజ్ఞకమ్,
కరిహస్తకటిచ్ఛిన్నేసోఽయం వైశాఖరేచితః. 283
(వైశాఖరేచితః—12)

కృత్వార్ధసూచి విక్షిప్తమావర్తంచ తతఃపరమ్
కుర్యాత్ నితంబవర్జ్యాని పర్యాస్తోక్తాని షట్క్రమాత్
నికుట్టాదీని యత్రాయం సూచివిద్ధః ప్రకీర్తితః. (సూచివిద్ధః—13) 284

నూపురం యత్రవిక్షిప్తమలాతాక్షిప్తకే భవేత్
ఉరోమండలకాభిఖ్యం నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నంచ కుర్వీత సోయమాక్షిప్తకో మతః. 285

యత్రయత్రపునశ్శబ్దః కరణేఽత్రాభ్యధాన్మునిః
[1]ద్విఃప్రయోజ్యం జగుస్తత్తస్యాభిప్రాయవేదినః. 286

ఇతి న్యాయేన విక్షిప్తాలాతకాక్షిప్తకాభిధమ్
కరణత్రయమత్రాపి ద్విఃప్రయోజ్యత్వమర్హతి. (ఆక్షిప్తకః—14) 287

దిక్స్వస్తికాఖ్యమేకేన పార్శ్వేనార్ధనికుట్టకమ్
అన్యేనైతత్ ద్వయం భూయో విదధ్యాదపవిద్ధకమ్, 288

---

1 'ప్రయోజ్యత్వం జగుస్తత్ర' ముద్రి, సంగతి చాలని పాఠము. నావద్ది వ్రా. ప్ర. పాఠము ఈ నా సవరణకు మూలము.

ఎడమప్రక్క అర్ధసూచి, కుడిప్రక్క విద్యుద్భ్రాంతము, మరల ఈ రెంటిని ప్రక్కలు మార్చిచేయవలయును; ఆపై ఎడమప్రక్క ఛిన్నమును, అతిక్రాంతమునుచేసి, లతావృశ్చికమును, కటిచ్ఛిన్నమును చేయదగును. ఇది విద్యుద్భ్రాంతము. (విద్యుద్భ్రాంతము—11) 280, 281

వైశాఖరేచితమును రెండుప్రక్కలను క్రమముగాచేసి, ఆపై నూపురము, భుజంగత్రాసితము, ఉన్మత్తము, ఆక్షిప్తము, మండలస్వస్తికము, నికుట్టకము, ఊరూద్వృత్తము, ఆక్షిప్తకము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నమును చేయుట వైశాఖరేచితము. (వైశాఖరేచితము—12) 282, 283

అర్ధసూచి, విక్షిప్తము, ఆవర్తముచేసి, తరువాత పర్యస్తాంగహారమునకు చెప్పిన ఆరుకరణములు నికుట్టము మొదలుగా — నితంబమొకటివదలి—చేయునది సూచివిద్ధము. (సూచివిద్ధము—13) 284

నూపురము, విక్షిప్తము, అలాతము, ఆక్షిప్తకము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము — ఇట్లుచేయుట ఆక్షిప్తకము. 285

భరతముని యేయేకరణమును చెప్పుచోట 'పునః' అనుపదమును చేర్చెనో[1] ఆయాకరణమును రెండుమారులు ప్రయోగింపవలెనని ఆయనయభిప్రాయమెరిగిన వారందురు. 286

దానినిబట్టి ఇక్కడ విక్షిప్తము, అలాతము, ఆక్షిప్తకము, అనుమూడు కరణములను రెండురెండుసారులు ప్రయోగింపదగును. (ఆక్షిప్తకము—14) 287

దిక్స్వస్తికము చేసి, తరువాత ఒకప్రక్క అర్ధనికుట్టకమును, మరల దిక్స్వస్తికమును చేసి, ఇంకొకప్రక్క అర్ధనికుట్టకమును చేయదగును; ఆపై

1. "విక్షిప్తాలాతకే పునః పునరాక్షిప్తకం కుర్యాత్" (భ.నా.శా. ౪-౧౭౩, ౧౭౪)

ఊరూద్వృత్తాఖ్యమాక్షిప్తం నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నంచ యత్రైష పార్శ్వస్వస్తికఇష్యతే. 289
(పార్శ్వస్వస్తికః—15)

నూపుర భ్రమరాభిఖ్యే వ్యంసితాహ్వామలాతకమ్
నితంబమథ సూచ్యాస్యం కరిహస్తాహ్వాయం తతః
కటిచ్ఛిన్నంచ యత్రస్యాదయమాచ్ఛురితః స్మృతః. 290
(ఆచ్ఛురితః—16)
(ఇతి షోడశచతురశ్రాంగహారాః)

మండలస్వస్తికం పూర్వం నివేశోన్మత్తకే తతః
ఉద్ఘట్టితక మత్తల్యాక్షిప్తోరో మండలాన్యథ
కటిచ్ఛిన్నంచ కుర్వీత యత్రాయం గతిమండలః. 291
(గతిమండలః—17)

కృత్వానికుట్టితం యత్ర నికుంచితమథాంచితమ్
ద్వయమంగద్వయేనైవ కృత్వోరూద్వృత్తమాచరేత్, 292

పశ్చాదర్ధనికుట్టాఖ్యం భుజంగత్రాసితం తతః ;
కించాత్రకరణే హస్తాచతుర్భిః కరణైర్యుతౌ, 293

తదైవ భ్రమణేచాథచ్ఛిన్నాముభయతః కటిమ్
కరిహస్తం కటిచ్ఛిన్నం సవిష్కంభః ప్రకీర్తితః. (విష్కంభః—18) 294

జనితం సవ్యతః కుర్యాత్ శకటాస్యమలాతకమ్
భ్రమరం కరిహస్తంతు గండే కరనికుట్టితమ్
కటిచ్ఛిన్నే(న్నం ?)చ యత్రాయం పరావృత్తః ప్రకీర్తితః. 295
(పరావృత్తః—19)

అపవిద్ధము, ఊరూద్వృత్తము, ఆక్షిప్తము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము, — ఇట్లు తీర్చునది పార్శ్వస్వస్తికము. 288, 289

(పార్శ్వస్వస్తికము—15)

నూపురము, భ్రమరము, వ్యంసితము, అలాతము, నితంబము, సూచ్యాస్యము, కరిహస్తము, కటిచ్ఛిన్నము, — ఇట్లు తీర్చుట ఆచ్ఛురితము. 290

(ఆచ్ఛురితము—16)

(ఇవి పదునారు చతురశ్రాంగహారములు)

మొదలు మండలస్వస్తికము; ఆమీద నివేశము, ఉన్మత్తము, ఉద్ఘట్టితము, మత్తల్లి, ఆక్షిప్తము, ఉరోమండలము, కటిచ్ఛిన్నము — ఇట్లు జరుపుట గతిమండలము. (గతిమండలము—17) 291

నికుట్టితముచేసి, కుంచితమును, అంచితమును రెంటిని రెండుప్రక్కలనుచేసి, ఊరూద్వృత్తము చేయవలయును; ఆపైని, అర్ధనికుట్టము, భుజంగత్రాసితము; ఈకరణమున హస్తకరణములు నాలుగుగావలయును (అనగా ఉద్వేష్టితము చేయదగును)[1]. అప్పుడే భ్రమణముచే రెండుప్రక్కలను కటిచ్ఛిన్నము; ఆపై కరిహస్తము, కటిచ్ఛిన్నము ; ఇది విష్కంభము. 292, 293, 294

(విష్కంభము—18)

కుడిప్రక్కజనితము, శకటాస్యము, అలాతకమును చేయవలెను ; తరువాత భ్రమరి ; ఆపై ఎడమప్రక్క కరిహస్తముతో గండప్రదేశమున నికుట్టితము, కటిచ్ఛిన్నము — ఇట్లు చేయువది పరావృత్తము. (పరావృత్తము—19) 295

---

1. ఇది పరిష్కర్త వివరణము (క్రింది సూచిక).

అపవిద్ధాభిధాత్ సూచీవిద్ధం కృత్వాతతః కరమ్
ఉద్వేష్ట్య బద్ధయా చార్యా త్రికభ్రమణమాచరేత్, 296

ఊరూద్వృత్తమనేనైవ కృత్వోరోమండలం తతః
కటిచ్ఛిన్నంచ కుర్వీత యత్రాయమపవిద్ధకః. (అపవిద్ధకః—20) 297

కృత్వా మత్తల్లి, కుర్వీత గండసూచ్యథలీనకమ్
అపవిద్ధం ద్రుతం, పశ్చాత్ తలసంస్ఫోటితం తతః
కరిహస్తం కటిచ్ఛిన్నం మత్తస్ఖలితసంజ్ఞకే. (మత్తస్ఖలితః—21) 298

విక్షిప్తమంచితం గండసూచి గంగావతారణమ్
క్రమాత్కృత్వాఽర్ధసూచ్యాఖ్యం దండపాదంచవామతః, 299

చతురభ్రమరాభిఖ్యే నూపురాక్షిప్తనామనీ
అర్ధస్వస్తికనామూధ నితంబం కరిహస్తమ్, 300

ఉరోమండలకం యత్ర కటిచ్ఛిన్నం సమాచరేత్
సంభ్రాంతం కథయంత్యేతమంగహారం విచక్షణాః. (సంభ్రాంతః—22) 301

వైచిత్ర్యేణ ప్రకుర్వీత యత్రస్వస్తికరేచితమ్
ఉరోమండలకం పార్శ్వనికుట్టిత కటీసమే, 302

ఘూర్ణితం భ్రమరం సింహాకర్షం వృశ్చికరేచితమ్
సన్నతం పృష్ఠదిగ్వక్షఃపూర్వకం స్వస్తికంత్రిధా, 303

నాగాపసర్పితంచేతి కరణాభ్యాంఘ్రిహస్తయోః
రేచితస్వస్తికావాభ్యా(?)మంచితానిత్రయోదశ, 304

ఉత్క్షేపయంత్య (యన్న?) ధాక్షిప్తమూరూద్వృత్తాద్వినాకృతమ్
లలాటతిలకం దండపక్షం తలవిలాసితమ్, 305

విద్యుద్భ్రాంతం గజక్రీడం నికుంభిత నితంబకే
విష్ణుక్రాంతాభిధానోరోమంటలాఖ్యే నితంబకమ్, 306

కరిహస్తం కటిచ్ఛిన్నం యథాశోభం యథారుచి
విదధీత యథాప్రజ్ఞం సోఽయమాక్షిప్తరేచితః. 307

అపవిద్ధము తర్వాత సూచీవిద్ధముచేసి, కరమును ఉద్వేష్టించి, బద్ధచారితో త్రికభ్రమణము చేయవలయును; దానిచేతనే ఊరూద్వృత్తమునుచేసి, ఆమీద ఉరోమండలమును కటిచ్ఛిన్నమును గూర్పవలయును. ఇది అపవిద్ధకము.
(అపవిద్ధకము—20) 296, 297

మత్తల్లి చేసినపిదప, గండసూచిని, లీనకమును, అపవిద్ధమును, మూటిని ద్రుతముగాచేసి, తలసంస్ఫోటితము, కరిహస్తము, కటిచ్ఛినమును చేయుట మత్తస్ఖలితమనబడును. (మత్తస్ఖలితము—21) 298

విక్షిప్తము, అంచితము, గండసూచి, గంగావతారణము — వీనిని క్రమముగా చేసి, ఎడమప్రక్క అర్ధసూచిని దండపాదమును ప్రదర్శించి, చతురము, భ్రమరము, నూపురము, ఆక్షిప్తము, అర్ధస్వస్తికము, నితంబము, కరిహస్తము, ఉరోమండలము, కటిచ్ఛిన్నము — ఇవి చేయవలెను. ఈ యంగహారమును పండితులు సంభ్రాంతమందురు. (సంభ్రాంతము—22) 299, 300, 301

స్వస్తికరేచితము, ఉరోమండలము, పార్శ్వనికుట్టితము, కటీసమము, ఘూర్ణితము, భ్రమరము, సింహాకర్షము, వృశ్చికరేచితము, సన్నతము, పృష్ఠస్వస్తికము దిక్స్వస్తికము, వక్షఃస్వస్తికము, నాగాపసర్పితము, — ఇట్లు హస్తపాదముల రేచకస్వస్తికములతోగూడిన (?) పదుమూడు కరణములను చేసి, హస్తపాదములను ఉత్క్షేపించి ఆపైని ఆక్షిప్తము, — ఊరూద్వృత్తమును వదలి — లలాటతిలకము, దండపక్షము, తలవిలాసితము, విద్యుద్భ్రాంతము, గజక్రీడము, నిశుంభితము, నితంబకము, విష్ణుక్రాంతము, ఉరోమండలము, నితంబకము, కరిహస్తము, కటిచ్ఛిన్నము, — ఈ కరణములను అందము చెడనట్లు, రుచికి తగినట్లు, బుద్ధికిఅందినట్లు, చేయవలెను; ఇది ఆక్షిప్తరేచితము.
302, 303, 304, 305, 306, 307

[1]'రేచితా స్వస్తికాపాదా' విత్యత్ర వదతోమునేః
[2]తదిష్టం కరణం యద్యద్రేచితం స్వస్తికాంచితమ్. 308

[3]'పునరుత్క్షేపణం' చేతి వదతోఽస్య మతానితు,
కరణాని సముత్క్షేప సమాయుక్తాని కాన్యపి. (ఆక్షిప్తరేచితః—23) 309

దండవృశ్చిక వైశాఖాక్షిప్తార్ధ స్వస్తికాదికమ్
షడ్విధం రేచితం వక్షఃస్వస్తికం గరుడప్లుతమ్ 310

సర్పితం స్ఖలితోన్మత్తే ప్రసర్పిత వివర్తితే
వినివృత్త వివృత్తార్ధమత్తల్లి వ్యంసితాన్యథ, 311

లోలితం వృషక్రీడం భుజంగాంచితనూపురే;
తలసంఘట్టితాభిఖ్యం మయూరలలితాభిధమ్, 312

రేచితాది నికుట్టాఖ్యం భుజంగత్రస్తరేచితమ్
ఇత్యేతాని సకృత్కృత్వా కరణాని చతుర్ష్వపి. 313

దిఙ్ముఖేషు యథాశోభం యథాబుద్ధి యథారుచి,
మధ్యేమధ్యేప్రయుంజానః శోభార్థం చక్రమండలమ్, 314

ఉరోమండలకం కుర్యాత్ యత్రప్రథమ దిఙ్ముఖే
కటిచ్ఛిన్నాభిధానే(నం?)చ సోఽయంరేచిత ఉచ్యతే. 315

కుతోఽయం మునినానుక్త ప్రపంచ ఇతిచేత్ఛృణు ;
[4]'రేచితం కరణం కుర్యాత్' ఇతియన్మునిరబ్రవీత్, 316

క్వచిద్రేచితసంజ్ఞం తత్కరణం నహిదృశ్యతే;
అత స్తత్కరణం వాచ్యంయద్యత్ రేచితవాస్తవత్. 317

---

1. మరియు కె. భ. నా. శా. ౪—౨౩౭, ౨౩౮.

2. ఇది నావద్ది వ్రా. ప్ర. పా, 'ఉద్దిష్టం' ముద్రి.

4. భ. నా. శా. ౪—౨౩౪.

'రేచితములు స్వస్తికములునైన పాదములు' అని చెప్పిన భరతముని యభిప్రాయమేమనగా, ఏయేకరణమున రేచితమును, స్వస్తికమును గలదో అవియన్నియు చేయనగునని. 308

'మరల ఉత్‌క్షేపణము' అన్న ఆయన మాటకు ఉత్‌క్షేపముతోగూడిన కరణములేవైనను కొన్ని చేయనగునని భావము. (ఆక్షిప్తరేచితము—23)[1] 309

దండరేచితము, వృశ్చికరేచితము, వైశాఖరేచితము, ఆక్షిప్తరేచితము, అర్ధరేచితము, స్వస్తికరేచితము, — ఈ ఆరింటినిచేసి, వక్షఃస్వస్తికము, గరుడప్లుతము, సర్పితము, స్ఖలితము, ఉన్మత్తము, ప్రసర్పితము, వివర్తితము, వినివృత్తము, వివృత్తము, అర్ధమత్తల్లి, వ్యంసితము, లోలితము, వృషభక్రీడము, భుజంగాంచితము, నూపురము, తలసంఘట్టితము, మయూరలలితము, రేచితనికుట్టము, భుజంగత్రస్తరేచితము, — ఈకరణములను నాల్గుదిక్కులందును దిక్కుకొక్కటిగా, అందమునకు బుద్ధికి, రుచికి తగినట్లు, నడుమనడుమ అందమునకై చక్రమండలమును ప్రయోగించుచు చేసి, ప్రారంభించిన దిక్కునందు ఉరోమండలకమును, కటిచ్ఛిన్నమును చేయవలెను; ఇది రేచితము.
310, 311, 312. 313, 314, 315

''భరతముని చెప్పని యీవివరణము నీవెట్లు చెప్పెదవు?'' అని యడిగినచో, వినుము: 'రేచితకరణమును చేయవలెను' అని కదా భరతముని చెప్పినది? రేచితము అను పేరుగల కరణమెక్కడను కానరాదుగదా; కనుక ఏయేకరణమునందు రేచితహస్తము గలదో అవన్నియు దానికర్థముగా చెప్పదగును.
316, 317

---

1. దీర్ఘమైన, చిక్కైన యీ కరణలక్షణమున అభినవగుప్తుని ననుసరించినను శార్ఙ్గదేవుడుగాని, జాయనగాని, నికరముగా ఆ పని చేయలేదని పరిష్కర్త యభిప్రాయము (క్రింది సూచి). నా తెలిగింపుగూడ సందిగ్ధముగానే యున్నది.

[1]'రేచితౌ స్వస్తికాపాదా' విత్యత్ర వదతో మునేః
[2]తదిష్టం కరణం యద్యద్రేచితం స్వస్తికాంచితమ్. 308

[3]'పునరుత్ క్షేపణం' చేతి వదతోఽస్య మతానితు,
కరణాని సముత్ క్షేప సమాయుక్తాని కాన్యపి. (ఆక్షిప్తరేచితః—23) 309

దండవృశ్చిక వైశాఖాక్షిప్తార్ధ స్వస్తికాదికమ్
షడ్విధం రేచితం వక్షఃస్వస్తికం గరుడప్లుతమ్ 310

సర్పితం స్ఖలితోన్మత్తే ప్రసర్పిత వివర్తితే
వినివృత్త వివృత్తార్ధమత్తల్లి వ్యంసితాన్యథ, 311

లోలితం వృషక్రీడం భుజంగాంచితనూపురే;
తలసంఘట్టితాభిఖ్యం మయూరలలితాభిధమ్, 312

రేచితాది నికుట్టాఖ్యం భుజంగత్రస్తరేచితమ్
ఇత్యేతాని సకృత్కృత్వా కరణాని చతుర్ష్వపి. 313

దిఙ్ముఖేషు యథాశోభం యథాబుద్ధి యథారుచి,
మధ్యేమధ్యేప్రయుంజానః శోభార్థం చక్రమండలమ్, 314

ఉరోమండలకం కుర్యాత్ యత్రప్రథమ దిఙ్ముఖే
కటిచ్ఛిన్నాభిధానే(నం?)చ సోఽయం రేచిత ఉచ్యతే. 315

కుతోఽయం మునినానుక్త ప్రపంచ ఇతిచేత్ శ్రుణు ;
[4]'రేచితం కరణం కుర్యాత్' ఇతియన్మునిరబ్రవీత్, 316

క్వచిద్రేచితసంజ్ఞం తత్కరణం నహిదృశ్యతే;
అతస్తత్కరణం వాచ్యంయద్యత్ రేచితమాస్తవత్. 317

---

1. మరియు కె. భ. నా. శా. ౪—౨౩౨, ౨౩౮.

2. ఇది నావద్ది వ్రా. ప్ర. పా, 'ఉద్దిష్టం' ముద్రి.

4. భ. నా. శా. ౪—౨౩౪.

ఇక్కడ కీర్తిధరాచార్యుడు ఆక్షిప్తరేచితము, వైశాఖరేచితము రెండే గ్రహింపవలెనన్నాడు. కాని అదేమంతయుక్తముగాదు. 318

ఎట్లనగా రేచితమను అంగహారము ఇరువదియైదు కరణములచే ఏర్పరుపబడి, విచిత్రములగు భేదములు గలదియని వేరొక్కచో వివరింపబడినది.[1] 319

(రేచితము—24)

నికుట్టము, అర్ధనికుట్టమును చేసి, తర్వాత ఒకయంగముచే భుజంగత్రాసితమును, మరియొకదానిచే భుజంగత్రస్తరేచితమును రచించి, ఆపై ఆక్షిప్తమును, ఉరోమండలమును, కటిచ్ఛిన్నమును చేయదగును; కటిచ్ఛిన్నము చేయునపుడు, పర్యాయముగా లతాహస్తములు గూర్పవలెను. ఇది విష్కంభాపసృతమనబడును. (విష్కంభాపసృతము—25) 320, 321

స్వస్తికముచేసి, వ్యంసితము రెండుసార్లు చేయవలెను ; ఆపై అలాతము, ఊర్ధ్వజానువు, నికుంచితము, అర్ధసూచి, విక్షిప్తము, ఉద్వృత్తము, ఆక్షిప్తకము, కరిహస్తము, కటిచ్ఛిన్నము — ఇట్లుచేయునది అలాతము.

(అలాతము—26) 322, 323

మొదలు నూపురముచేసి, పిదప రెండుఅంగములందును భుజంగత్రాసితము చేయవలయును ; ఆపై విక్షిప్తము, ఉద్వృత్తము రెండును ఒకప్రక్కచేసి, మరల రెండవప్రక్కను అట్లే చేయవలయును ; మరి సూచి, నితంబము, లతావృశ్చికము, కటిచ్ఛిన్నము ; ఇది ఉద్వృత్తము. 324, 325

(ఉద్వృత్తము—27)

---

1 అభినవగుప్తుని వ్యాఖ్యలో, 'తథాచాన్యత్ర శ్రూయతే'; 'పంచవింశతి విచిత్ర (మాతృకా) ప్రక్రమేణ వివిధంవ్యరీ రచత్ రేచితాంగహారణం మహేశ్వరో గేయమార్గమివసప్తభిః స్వరైః' (అభి. భా ౩—౨౩౪) ఇది యెక్కడిదో అతడు చెప్పలేదు

నూపురాఖ్య వివృత్తాఖ్యే నికుట్టార్ధనికుట్టకే
రేచకాది నికుట్టాఖ్యం పార్శ్వపూర్వనికుట్టకమ్, 326

అర్ధరేచితకాభిఖ్యం పశ్చాద్ వృశ్చికకుట్టితమ్
అతఃపరమురః పూర్వం మండలం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నంచ యత్రస్యాదయమర్ధనికుట్టకః. (అర్ధనికుట్టకః—28) 327

కృత్వా నికుట్టకం యస్మిన్ ఉరోమండలమాచరేత్
నితంబకరిహస్తాఖ్య కటిచ్ఛిన్నాని చ క్రమాత్
తముద్ఘట్టితనామానమంగహారం ప్రచక్షతే. (ఉద్ఘట్టితః—29) 328

లతావృశ్చికమాధాయ విదధీత నికుంచితమ్
మత్తల్యథ నితంబాఖ్యం కరిహస్తమతఃపరమ్, 329

కటిచ్ఛిన్నంచ యత్రాయం వృశ్చికాపసృతః స్మృతః ;
నితంబమపహాయాత్ర వదంతి భ్రమరం పరే. (వృశ్చికాపసృతః—30) 330

యత్రకుర్వీత వైశాఖరేచితాభిఖ్య వృశ్చికే
[1]పాదర్ష[దూర్ధ్వ?] (ద్విస్తదూర్ధ్వం?) నికుట్టాఖ్య
కర్మపర్యాయశఃస్మృతమ్
కటిచ్ఛిన్నం లతాహస్తయుతం స్వస్తికరేచితే. 331
(స్వస్తికరేచితః—31)

కృత్వాయత్ర నితంబాఖ్యం తతః స్వస్తికరేచితమ్
విక్షిప్తాక్షిప్తకాభిఖ్యం లతావృశ్చిక సంజ్ఞకమ్, 332

ఉన్మత్తకరిహస్తాఖ్యే భుజంగత్రాసితాభిధమ్
ఆక్షిప్తకం నితంబంచేత్యేతాని పరివృత్త్యాచ. 333

భ్రమరేణచ కుర్వీత పరాఙ్ముఖతయా స్థితః
తథా పార్శ్వముఖః కుర్యాత్ పార్శ్వాంతరముఖస్తథా, 334

1. వ్రా. ప్ర. పాఠము కలుషితము. రెండవ సవరణ నా సూచన. ఐనను తాత్పర్యము సందిగ్ధమే.

నూపురము, వివృత్తము, నికుట్టము, అర్ధనికుట్టము, రేచకనికుట్టము, పార్శ్వనికుట్టకము, అర్ధరేచితకము, వృశ్చికకుట్టితము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నము, — ఇవి చేయునది అర్ధనికుట్టకము. 326, 327
(అర్ధనికుట్టకము—28)

నికుట్టకము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము—ఇవి క్రమముగాచేయుట ఉద్ఘట్టితమందురు. (ఉద్ఘట్టితము—29) 328

లతావృశ్చికము, నికుంచితము, మత్తల్లి, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము — ఇట్లుచేయుట వృశ్చికాపసృతమగును. ఇందు నితంబమును విడిచి, భ్రమరమును ఇతరులు చెప్పుదురు. (వృశ్చికాపసృతము—30) 329, 330

వైశాఖరేచితమును, వృశ్చికమును రెండుసార్లుచేసి, ఆపై పర్యాయముగా(?) నికుట్టకరణముచేసి, లతాహస్తముతో కటిచ్ఛిన్నము చేయుట స్వస్తికరేచితము. (స్వస్తికరేచితము—31) 331

నితంబము, స్వస్తికరేచితము, విక్షిప్తము, ఆక్షిప్తకము, లతావృశ్చికము, ఉన్మత్తము, కరిహస్తము, భుజంగత్రాసితము, ఆక్షిప్తకము, నితంబము — ఈ కరణములుచేసి, భ్రమరముతో వెనుకకు తిరిగి అవే చేయవలయును. అట్లే పార్శ్వమునకు, ఇంకొకపార్శ్వమునకును మొగమై చేసి, మరల మొదటిదిక్కున

కరిహ_స్త కటిచ్ఛిన్నే తతః ప్రథమదిఙ్ముఖః
[1]అంగహారోఽయమాఖ్యాతః పరివృ_త్తకరేచితః. 335
(పరివృ_త్తకరేచితః-32)

(ఇతి షోడశ త్ర్యశ్రాంగహారాః)

క్రమ వ్యుత్క్రమతో యోగాత్ కరణై రితరేతరమ్
ఏతేషా మంగహారాణామస్తు నూనమనంతతా. 336

తథాపి జనితానేతాన్ కరణై ర్మిశ్రసంధిభిః
పశ్యన్ దృష్టఫలాధిక్యమూచే పరిమితాన్మునిః. 337

విష్కంభాపసృతోన్మ_త్తస్ఖలితాహ్వా[2]పసర్పితాః
మదాద్విలసితాహ్వాశ్చ స_ప్తభిః కరణై ర్మతాః. 338

సూచీవిద్ధాఖ్య విష్కంభ పరిచ్ఛిన్నాపరాజితాః
ఉద్వృ_త్త సహితాశ్చైతే నవభిః పరికీ_ర్తితాః. 339

కరణై_స్తు చతుస్సంఖ్యైః భవేత్ స్వ_స్తికరేచితః
విద్యుద్భ్రాంత పరావృ_త్త వృశ్చికాపసృతాభిధా
షట్సంఖ్యైః పంచవింశత్యా భవేదాక్షి_ప్తరేచితః. 340

వైశాఖరేచితాలాత పరివృ_త్తకరేచితాః
అర్ధపూర్వనికుట్టశ్చ స్యురేకాదశభిః పునః. 341

ఉద్ఘట్టితాపవిద్ధాఖ్యౌ పంచభిః పరికీ_ర్తితౌ
స్థిరహస్తాఖ్య పర్య_స్తమత్తాక్రీడాభిధాస్త్రయః. 342

భవంతి దశభి_స్త్వష్టావింశత్యారేచితః స్మృతః,
సంభ్రాంతః పంచదశభిః శేషా_స్త్వష్టాభిరీరితాః. 343

---

1 'అంగహారా మయాఖ్యాతాః' ముద్రి అన్వయశుద్ధి లేనిది. నావద్ద వ్రా. ప్ర.ని అనుసరించి నా యీ సవరణ

2. 'స్ఖలితాహ్వోఽపసర్పితః' ముద్రి. అపపాఠము

కరిహస్తమును, కటిచ్ఛిన్నమును చేయవలెను; ఇది పరివృత్తకరేచితమను అంగహారము. (పరివృత్తకరేచితము—30) 332, 333, 334, 335

(ఇవి పదునారు త్ర్యశ్రాంగహారములు)

ఈ అంగహారములందు కరణములను పరస్పరముగా క్రమము తప్పించి చేర్చినచో, అవి నిజముగా అనంతసంఖ్యగలవి కావచ్చును; కాని చేరికయందలి మైత్రిని చూచి, దృష్ట(ష్టి) ఫలమెక్కువయనుట గమనించి, భరతముని మీది కొన్నిటినే చెప్పెను. 336, 337

విష్కంభాపసృతము, ఉన్మత్తము, స్ఖలితము, అపసర్పితము, మదవిలసితము— ఈ యంగహారములు ఏడుకరణములు గలవి. 338

సూచీవిద్ధము విష్కంభము, పరిచ్ఛిన్నము, అపరాజితము, ఉద్వృత్తము — ఇవి తొమ్మిది కరణములు గలవి. 339

స్వస్తికరేచితము నాలుగుకరణములు గలది; విద్యుద్భ్రాంతము, పరావృత్తము, వృశ్చికాపసృతము, — ఈ మూటికిని ఆరుకరణములు; ఆక్షిప్తరేచితమునకు ఇరువదియైదు కరణములు 340

వైశాఖరేచితము, అలాతము, పరివృత్తరేచితము, అర్ధనికుట్టకము — ఇవి పదునొకండుకరణములు గలవి. 341

ఉద్ఘట్టితము, అపవిద్ధము, — ఈ రెంటికిని ఐదుకరణములు; స్థిరహస్తము, పర్యస్తము, మత్తాక్రీడము— ఈ మూడును పది కరణములు గలవి; రేచితమునకు ఇరువదియెనిమిది కరణములు; సంభ్రాంతమునకు పదునైదుకరణములు; తక్కిన అంగహారములకు ఎనిమిది కరణములు. 342, 343

కరణద్వితయావృత్త్యా షడ్భిః స్వస్తికరేచితః
ద్వయోరావృత్తితః సప్తవింశత్యాఽష్టరేచితః. 344

మత్తాక్రీడేఽధికం చైకం భ్రమరాభ్యాసతో మతమ్,
వ్యంసితార్ధద్వయాభ్యాసాత్ నవభిశ్చాపసర్పితః. 345

ద్వయోరభ్యాసతః పార్శ్వస్వస్తికో దశభిః స్మృతః,
త్రయోదశభిరుద్వృత్తే ద్వయావృత్త్యాఽధికం ద్వయమ్. 346

ద్వితీయాభ్యాసతోఽష్టాభిః విద్యుద్భ్రాంతాభిధో భవేత్;
వ్యంసితావృత్తకం త్వేకమధికం స్యాదలాతకే. 347

ద్విగుణైర్ద్విగుణైః తదఙ్గైరారభ్య కరణాష్టకాత్
చతురశ్రప్రమాణాః స్యురంగహారాః ప్రకీర్తితాః
షట్కాదారభ్య కథితాః త్ర్యశ్రమానాస్తథావి(బు?)ధైః 348

న్యూనత్వం దృశ్యతే యత్ర ప్రోక్తసంఖ్యాసు కుత్రచిత్
కుర్వీత పూరణం స్యా[తస్య]క్రియాభ్యాసేన కుత్రచిత్. 349

ఆధిక్యం దృశ్యతే యత్ర ప్రోక్తసంఖ్యాతిలంఘనాత్
తత్ర తాలకలాయత్యా సంధానాత్ సమతాం నయేత్. 350

అనంతతాఽంగహారాణాం కరణానాం వికల్పనాత్,
కథం ద్వాత్రింశదుద్దిష్టా ఇతి చేత్ శృణు కథ్యతే. 351

అంగాని పూర్వరంగస్య ద్విధా భిన్నాని షోడశ,
తేషు ప్రత్యేకమేకస్య ప్రయోగాత్ కేచిదూచిరే. 352

అన్యే చతసృణాం తత్ర నర్తకీనాం ప్రవేశతః
పిండీరేచకసంభూతం(త?)న్యాసాపన్యాసకైః సహ
ప్రతిప్రయోగమష్టస్యురితి ద్వాత్రింశకం(తం?)జగుః. 353

రెండుకరణములు త్రిప్పిచేయుటచే, స్వస్తికరేచితమునకు కరణములు ఆరు; రెండుకరణముల ఆవృత్తిచేయుటచే, ఆక్షిప్తరేచితమునకు ఇరువదియేడు. 344

భ్రమరము మరలచేయుటవలన మత్తాక్రీడమందు ఒకకరణమెక్కువ; వ్యంసితము సగమై, రెండుకరణములు త్రిప్పిచేయుటమూలమున, అపసర్పితము తొమ్మిదికరణములు గలది. 345

రెండుకరణముల పునఃప్రయోగముచే పార్శ్వస్వస్తికమునకు పది; రెండు కరణముల యావృత్తిచే రెండెక్కువై (?)పదుమూడు కరణములు ఉద్వృత్తము నకు గలుగును. 346

రెండుకరణముల యావృత్తిచే విద్యుద్భ్రాంతమున ఎనిమిదికరణములగును. వ్యంసితము ఆవృత్తమై అలాతమున ఒకకరణము ఎక్కువగును. 347

ఎనిమిదికరణములు మొదలుకొని రెండురెండింతలుగానున్న అంగహారములు, చతురశ్రప్రమాణములని విజ్ఞులు చెప్పుదురు; అట్లే ఆరుకరణములు రెండింతలై నవి, త్ర్యశ్రమానము గలవన్నారు. 348

ఈ చెప్పిన సంఖ్యలలో ఏయంగహారమందైనను తక్కువగానున్నచోట, క్రియను రెండుమారులుచేసి, దానిని పూరింపవలెను; చెప్పిన సంఖ్యకంటె ఎక్కువయున్నచో, తాళకళల పొడుగును తగ్గించి సరిపుచ్చవలెను. 350

కరణముల మార్పుతో అంగహారములు అనంతములగును; కావున ముప్పది రెండని యెట్లునిర్దేశించుట? — అనియడిగిన చెప్పెదను విను. 351

పూర్వంగమునకు అంగములు పదునారు; అవి ఒక్కొక్కటియు రెండు రెండువిధములు; వానిలో ఒక్కొక్కటికొక్కొక్క అంగహారముగా ప్రయో గించుటవలన ముప్పదిరెండగును — అని కొందరు చెప్పిరి. 352

ఇతరులు కొందరు—ఆ పూర్వరంగమున నలుగురు నట్టువకత్తెలు ప్రవేశింతురు వారి పిండీరేచకమున కలుగు న్యాసాపన్యాసములతో ప్రతిప్రయోగమునందును ఎనిమిది అంగహారములగును గనుక ముప్పదిరెండు, అన్నారు. 353

వింశతిర్గీతకాంగాని చతుర్భిరధికాని చ
ఆసారితాని చత్వారి వర్ధమానకహేతవః[?]. 354

వస్తుత్రివిధమేకైవ పాణికేతి పరేవిదుః
బ్రహ్మణో గీతివైచిత్ర్యాత్ ద్వాత్రింశచ్చేతి కేచిన. 355

వయంతు శివయోరిష్టాః దృష్టాదృష్టఫలప్రదాః
మహేశ్వరేణ గదితాఇయంతఇతి చక్ష్మహే. 356

మత్తస్ఖలిత సంభ్రాంత భ్రమరాళీఢశోభితమ్
వ్యధాత్ (ధాం?) లక్ష్మాంగహారణామిదముద్యానసన్నిభమ్. 357

## రేచకలక్షణాని

పాదహస్తకటీగ్రీవా రేచకాంశ్చతురో బ్రువే ;
ఉభయోరథవైకస్య పాదస్య ధరణీతలే. 358

అశ్రాంతం గమనం పార్ష్ణేరంగుష్ఠాగ్రస్యచాన్వితమ్
నమనోన్నమనై రంతర్బహిశ్చరణరేచకః. (పాదరేచకః-1) 359

త్వరితం హంసపక్షస్య భ్రమణం హస్తరేచకః,
హస్తస్య కేచిత్ భావంతే విరలప్రసృతాంగులేః. (హస్తరేచకః-2) 360

కట్యాః సమంతతో భ్రాంతిః కథ్యతే కటిరేచకః (కటిరేచకః-3)
శిరోవినమనాత్ భ్రాంతిర్గ్రీవాయాః కంఠరేచకః (కంఠరేచకః-4)
పాఠాంతర విధేస్త్వేనం (విధౌత్వేవం) లక్షణం పఠ్యతే; యథా; 361

[1]"రేచితాఖ్యః పృథగ్భావే వలనేచాభిధీయతే;
ఉద్వాహనాత్ పృథగ్భావాత్ చలనాచ్చాపిరేచకః. 362

1. ఇది మొదలు ఐదు శ్లోకములు భ. నా. శా పాఠాంతరము దీనికి అభినవగుప్త పాదాచార్యుని వ్యాఖ్యయులేదు. రత్నాకరముగూడ దీనిని దడవలేదు.

గీతకమునకు అంగములు ఇరువదినాల్గు; ఆసారితములు నాలుగు ; ఇవి వర్ధమానకమునకు సాధనములు; వస్తువు మూడు విధములు; పాణిక ఒకటే; ఇట్లు బ్రహ్మ పాడిన పాటలోని విచిత్రతవలన అంగహారములు ముప్పదిరెండని మరి కొందరు వచింతురు.[1] 354, 355

కాని, పార్వతీపరమేశ్వరులకిష్టమైనవి, దృష్టాదృష్టఫలములనిచ్చునవి, మహేశ్వరుడు నిర్దేశించినవి, ఇన్నేయని మాయభిప్రాయము. 356

మత్తుతో తొట్రుపడుచు, తిరుగు తుమ్మెదలు తేనెల గ్రోలుచుండుటచే, అందమైన పూదోటవలె, మత్తస్ఖలితము, సంభ్రాంతము, భ్రమరము, ఆలీఢము అను భేదములతో శోభిల్లు, అంగహారముల లక్షణమిట్లు చెప్పితిని. 357

**రేచకముల లక్షణములు**

పాదములు, హస్తములు, కటి, మెడ — వీని రేచకములను నాల్గింటిని తెల్పుదును. రెండుకాళ్ళవిగాని, ఒకకాలివిగాని, నేలమీది మడమ — బొటన వ్రేలికొన — ఈ రెంటి యెత్తుదింపులతో ఎడతెగక లోపలికి, వెలుపలికి నడచుట పాదరేచకము. (పాదరేచకము—1) 358, 359

హంసపక్షహస్తమును వేగముగా త్రిప్పుట హస్తరేచకము ; కొందరు ఈ హస్తమున వ్రేళ్ళువిడివిడిగా చాపబడియుండవలెనందురు. 360

(హస్తకరేచకము—2)

కటిని అన్నిప్రక్కలను త్రిప్పుట కటిరేచకమనబడును. (కటిరేచకము—3)

తల వంచి మెడ త్రిప్పుట కంఠరేచకము. (కంఠరేచకము—4)

భరతనాట్యశాస్త్ర పాఠాంతరమున పై రేచకముల లక్షణమిట్లు చెప్పబడియున్నది; ఎట్లనగా. 361

'రేచితమనగా వేరుపడుట, కదలుటయు అర్థమగును; పైకెత్తి వేరుపరుచుటచే, కదలించుటచేతను రేచకమనబడును. 362

---

1. ఇందలి వర్ధమానకము, ఆసారితము, వస్తువు, పాణిక — వీని లక్షణములకు మానవల్లి రామకృష్ణకవిగారి 'భరతకోశము'న కొంత తెలివిడిగలదు ; కాని అస్పష్టము.

"పార్శ్వాత్ పార్శ్వానుగమనం స్థలితైః స్థ(చ?)లితైఃగతైః[1]
వివిధైశ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే. 363

"త్రికస్యోద్వర్తనంచైవ కటీచలనమేవచ
దథాఽపసర్పణంచైవ కటీరేచక ఉచ్యతే. 364

"ఉద్వర్తనం పరిక్షేపో విక్షేపః పరివర్తనమ్
విసర్పణంచ హస్తస్య హస్తరేచక ఉచ్యతే. 365

"ఉద్వాహనం సన్నమనం పార్శ్వాత్ పార్శ్వంచ సంగతిః (నతిః?)[2]
భ్రమణంచేతి విజ్ఞేయో గ్రీవాయారేచకో బుధైః". 366

"[3]తతోయే తండునాప్రోక్తాస్త్వంగహారాః మహాత్మనా
తాన్వః కరణసంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్". 367

ఇతి వ్యాహారతో నూనమేవ(వం?)మన్యే మునేర్మతమ్ [తాః]
కరణై రంగహారైశ్చ సహితాఏవరేచకాః. 368

పుత్రేణ చ మునేరేతత్ప్రోక్తం తుంబురుణా యథా,
"అంగహారాదిమధ్యాంతకరణైః రేచకాన్విదుః". 369

"[4]పాదరేచక ఏకఃస్యాత్" ఇత్యాదౌ సంఖ్యయోక్తయా
అపికేవలవైశాఖప్రభృతిస్థానకస్థితైః, 370

ప్రయుక్తాః పుణ్యసంపత్తిహేతవో రేచకా ఇమే
నియమేన భవంతీతి నూనం మునిరసూచయత్. 371

---

1, 2. 'చలితైః పదైః'-'సంనతి' అని భ. నా. శా. ముద్రి. పాఠములు (చూ. బరో. ముద్ర ౧ సం. పు. ౧౬౩, ౧౬౪). అదే సంగతము.

3. భ. నా. శా. ౪-౧౮, ౧౯ - బరో. ముద్ర.

4. భ. నా, శా ౪-౨౪౯ - బరో. ముద్ర.

పట్టులేక పలువిధములుగా కదలుచున్న అడుగులు ఒకప్రక్కనుండి వేరొక ప్రక్కకు సాగివచ్చుట పాదరేచకమనబడును. 363

త్రికము మీదికెత్తిరాచుట, కటిచలించుట, ప్రక్కకొదుగుట, — ఇది కటీరేచకము. 364

హస్తము మీదికిరాచుట, చుట్టునువీచుట, విసరివేయుట, లోపలికి మలచుట, ప్రాకుట — ఇది హస్తరేచకమనదగును. 365

మీదికెత్తుట, వంచుట, ప్రక్కనుండి యింకొకప్రక్కకు వంచుట, త్రిప్పుట — ఇది గ్రీవారేచకమందురు. 366

"తరువాత మహాత్ముడు తండువు చెప్పినవి, కరణములతో రేచకములతో గూడినవియునైన అంగహారములు వివరింతును,"

అని శిష్యులతో భరతముని వచించుటకు, రేచకములు, కరణములతోను, అంగహారములతోను, కూడియేయుండును అని భావము. 367, 368

భరతమునిపుత్రుడైన తుంబురుడును ఇట్లే చెప్పెను; "రేచకములను, అంగహారముల ఆదిమధ్యాంతములందు చేయదగునందురు" అని. 369

'పాదరేచకము ఒకటి' మొదలగు వాక్యములలో, ఏకవచనము చెప్పుటచే, వట్టివైశాఖాదిస్థానకములందుండి ప్రయోగించినను, ఈ రేచకములు తప్పక పుణ్యసంపదను గలిగించును అనునభిప్రాయము భరతముని సూచించెను. 370, 371

"[1]రేచకై రంగహారైశ్చ నృత్యంతం వీక్ష్య శంకరమ్"
ఇత్యపి బ్రువతా స్పష్టం తదేవమునినా కృతమ్. 372

ఇతి

శ్రీ రాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక జాయసేనాపతి
విరచితాయాం నృత్తరత్నావల్యాం కరణాంగహార వివేచనం నామ
చతుర్థోఽధ్యాయః

---

1 భ. నా. శా. ౫-౨౪౯ - బరో. ముద్ర

"రేచకములతోను, అంగహారములతోను నర్తించు శంకరునిజూచి" అనియు చెప్పి, భరతముని ఆ విషయమునే స్పష్టపరిచెను. 372

ఇది

శ్రీ రాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుఁడగు

జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు

కరణాంగహార వివేచనము

నాలవయధ్యాయము

# అథ పంచమోఽధ్యాయః

వందే శ్రీకంఠమందారం యత్ర గౌరీస్తనోద్గమః
ధత్తే విశ్వఫలవ్యక్త్యై ప్రథమస్తబకశ్రియమ్. 1

భాషావేషభూషణై రనుగుణైః తైస్తైర్మనోహారిభిః
నానాదేశరుచీన్ విదగ్ధపురుషానావర్జయంతీగుణైః
భూపాలై రుపలాలితా బహుకలైః ప్రౌఢేవ వారాంగనా
దేశీసంప్రతి దంతిసైన్యపతినా సాంద్రాదరం వర్ణ్యతే. 2

భవంతి ధరణీపాలాః ప్రాయేణాభినయ[వ?]ప్రియాః
అతస్తత్ప్రీతయేఽద్యాపి యద్యదుత్పాద్యతే నవమ్
నృత్తం తతః స్మృతం దేశీ తత్తద్దేశానుసారతః. 3

భూతం శాస్త్రముఖాద్జ్ఞేయం భవిష్యన్నావగద్య(మ్య)తే
భవన్నిరూపణీయం స్యాత్ నృత్తం దేశీతి సంజ్ఞితమ్. 4

ఇదానీం భారతేవర్షేకాలే వైవస్వతాంతరే
కలౌ యాతేషు వర్షేషు భూతబాణాగ్నిసాగరైః. 5

మితేష్వానందసంజ్ఞేఽబ్దే జగదానందదాయిని
శశ్వత్ కువలయోల్లాసియశః ప్రాలేయరోచిషి, 6

ప్రతాపతపనప్రౌఢితాపితారాతిమానసే,
శత్రుప్రాణానిలాహారతీక్ష్ణకౌక్షేయకోరగే, 7

విశ్రాణన పయఃపూర విధూతకలికల్మషే
త్యాగధిక్కృత రాధేయ కామధేను సురద్రుమే, 8

రూపలావణ్యసౌభాగ్య సవ్రీడమకరధ్వజే
తౌర్యత్రితయ విజ్ఞాన రహస్తత్త్వవిశారదే, 9

# ఇక ఐదవ యధ్యాయము

శ్రీకంఠుడు కల్పవృక్షమువంటివాడు, గౌరీస్తనము అందు ప్రపంచమను పండునుగలిగించు పూలగుత్తివంటిది — ఆతనికి నమస్కరింతును. 1

తగిన భాష, వేషము, అలంకారమును గలిగి, మనస్సును హరించు ఆయా గుణములచేత, నానాదేశముల రుచులెరిగిన విదగ్ధులగు పురుషులను ఆకర్షించుచు, అనేకకళలెరిగిన రాజులచే లాలింపబడుచు, ప్రౌఢయగు వారకాంతను బోలిన దేశి ఇప్పుడు గజసేనాపతిచే, అత్యాదరముచే వర్ణింపబడుచున్నది. 2

రాజులకు ప్రాయికముగా క్రొత్తక్రొత్తవిషయములందు ప్రీతియుండును; కనుక వారిప్రీతికై, క్రొత్తక్రొత్తగా ఏనృత్తము కల్పింపబడునో, అది ఆయా దేశములననుసరించునది గనుక 'దేశి' యనబడును. 3

దేశినృత్తము, వెనుక ఏర్పడినది శాస్త్రముఖమున తెలియదగును; ముందు రాబోవునది తెలియుట సాధ్యముగాదు; కనుక ఇప్పుడు నడుచుదానిని నిరూపింపవలసియున్నది. 4

ఇప్పుడు భారతవర్షమున, వైవస్వతమన్వంతరకాలమున, కలియుగమున, 4355 సంవత్సరములు గడచియుండగా, జగదానందకరమగు ఆనందనామ సంవత్సరమున,

కీర్తిచంద్రునిచే భూమండలమునకు — కలువలకు — స్థిరముగా వికాసము గల్గించువాడు, ప్రతాపమను సూర్యప్రభచే శత్రువుల మానసములనుడికించువాడు, శత్రువుల ప్రాణవాయువులు క్రోలి మత్తెక్కిన కత్తియను సర్పముగలవాడు, దానధారలచే కలికాలపు మైలనంతయు కడిగినవాడు, త్యాగమున కర్ణుని, కామధేనువును, కల్పవృక్షమును తిరస్కరించినవాడు, రూపమున, లావణ్యమున సౌభాగ్యమున, మన్మథుని సిగ్గుపరిచినవాడు, నృత్తగీతవాద్యమున విజ్ఞానమందలి రహస్యతత్త్వములను చక్కగా నెరిగినవాడు, మార్గ-దేశి భేదములనేర్పరచుటలో నేర్పరియైనవాడును, అయిన గణపతిభూపాలుడు మహారాజులకధిరాజుగా

మార్గదేశీవిభాగస్య వివేచన విచక్షణే
మహారాజాధిరాజేఽస్మిన్ గణపత్యవనీశ్వరే, 10

యా దేశీ వర్తతే లోకే సాఽస్మాభిః కథ్యతే స్ఫుటమ్
నిరూప్యతేఽధునా దేశ్యాం స్థానకాని యథాక్రమమ్ 11

త్రయోవింశతి దేశీస్థానకాని

సమపాదం పరావృత్తం స్వస్తికం వృషభాసనమ్
బ్రాహ్మ వైష్ణవ శైవాని గారుడం సంహతాభిధమ్. 12

పృష్ఠోత్తానతలం వర్ధమానం కూర్మాసనాహ్వయమ్
ఏకపార్శ్వగతం నంద్యావర్తాహ్వ చతురశ్రకే. 13

పాణిపార్శ్వగతాభిఖ్యమేకజానుగ(న?)తాహ్వయమ్
పార్శ్వ(పార్ష్ణి?)విద్ధైక పాదాఖ్యే నాగబంధాభిధం తతః 14

సమేన విషమేనాథ ఖండేనోపపదేన చ
యుక్తం సూచిత్రయేణేతి వింశతిస్త్రిభిరుత్తరా. 15

స్వభావస్థితో దేహో వితస్తిమితమంతరమ్
అంఘ్ర్యోః సరలయోర్యత్ర సమపాదం తదుచ్యతే. (సమపాదమ్—1) 16

బాహ్యాభ్యంతర పార్శ్వాభ్యాం యుక్తయోస్తిర్యగ[స్తయోః?]
పాదయోర్యత్ర పార్ష్ణిభ్యాం కనిష్ఠాంగుష్ఠకౌ యుతౌ
గజసాధనికేనైతత్ పరావృత్తం ప్రకీర్తితమ్. (పరావృత్తమ్–2) 17

పాదౌ పాదాంగదస్థానే స్వస్తికా జాతుకుంచితా
మిథః కనిష్ఠయోః శ్లిష్టౌ యత్రతత్ స్వస్తికం భవేత్. 18
(స్వస్తికమ్—3)

జానునీ యది సంశ్లిష్ట (ష్టే?) విశ్లిష్టేతా[స్తౌ](వా?)మహీతలే
విశ్లిష్టౌ [సుశ్లిష్ట?) సౌష్టవం...స్యాద్ వృషభాసనమ్. 19
(వృషభాసనమ్—4)

నుండగా, లోకమున ప్రచారమందున్న దేశిని మేము స్ఫుటముగా తెల్పుదుము. ప్రకృతము దేశిస్థానకములు క్రమముగా వివరింతుము.
5, 6, 7, 8, 9, 10, 11

### ఇరువదిమూడు దేశిస్థానకములు

సమపాదము, పరావృత్తము, స్వస్తికము, వృషభాసనము, బ్రాహ్మము, వైష్ణవము, శైవము, గారుడము, సంహతము, పృష్ఠోత్తానతలము, వర్ధమానము, కూర్మాసనము, ఏకపార్శ్వగతము, నంద్యావర్తము, చతురశ్రము, పాణిపార్శ్వగతము, ఏకజానుగ(న?)తము, పార్శ్వ(పార్ష్ణి?)విద్ధము, ఏకపాదము, నాగబంధము, సమసూచి, విషమసూచి, ఖండసూచి, — ఇవి యిరువదిమూడు దేశిస్థానకములు. 12, 13, 14, 15

దేహము స్వాభావికముగా నిలబడియుండి, అడుగులు రెండును జేనెడు అంతరముతో సరళముగా నుండునది సమపాదము. (సమపాదము—1) 16

ఒకపాదముయొక్క వెలిప్రక్కతో రెండవదానిలో ప్రక్క చేరునట్లు, అడుగులు అడ్డముగా చాచినప్పుడు ఒకదాని చిటికెనవ్రేలు, మరొకదాని బొటనవ్రేలును, మడమలతో కలియుట, పరావృత్తమని గజసాధనికుడు (జాయన) చెప్పెను. (పరావృత్తము—2) 17

అందెలు ధరించుచోట్ల, స్వస్తికముగా కొంచెము ముడిచిన పాదములేర్పడి, పరస్పరము చిటికెనవ్రేళ్ళు కలిసియుండుట స్వస్తికము. (స్వస్తికము—3) 18

మోకాళ్ళు రెండును కలిసికాని, విడివడికాని నేలమీద సౌష్ఠవముతోనుండునది వృషభాసనము. (వృషభాసనము—4) 19

స్థితస్త్వేకస్య పాదస్య సమ...జానుకోఽపరః
పృష్ఠతః కుంచితోత్క్షిప్తోయత్ర తద్బ్రాహ్మముచ్యతే. 20
(బ్రాహ్మమ్—5)

సమస్థితస్య పాదస్య పురతః కుంచితోమనాక్
తిర్యక్ ప్రసారితోఽన్యశ్చేద్ బుధాస్తద్వైష్ణవం విదుః. 21
(వైష్ణవమ్—6)

సమస్థితస్య పాదస్య జానూత్సంగసమోఽపరః
కుంచితో గమనే తిష్ఠేత్ యత్ర తచ్ఛైవముచ్యతే. (శైవమ్—7) 22

తలేనావస్థితో భూమౌ కుంచితశ్చరణః పురః
జానునా పృష్ఠతోఽన్యస్తుయత్ర తద్గారుడంవిదుః. (గారుడమ్—8) 23

సమపాదే యదాత్వంఘ్ర్యోః గుల్ఫాంగుష్ఠౌ మిథోన్వితౌ
సంహతాఖ్యం తదాప్రోక్తం పుష్పాంజలి విమోచనే. 24
(సంహతమ్—9)

సమః స్యాదగ్రతః పాదోయదాఽన్యః పృష్ఠతఃక్షితౌ
స్పృష్టశ్చేదంగులీపృష్ఠః పృష్ఠోత్తానతలంతదా. 25
((పృష్ఠోత్తానతలమ్—10)

పార్ష్ణినా సంగతః పార్ష్ణిః పాదౌ తిర్యఙ్ముఖౌ యదా
విధీయ(యం?)తే తదా వర్ధమానాఖ్యం పరికీర్తితమ్. 26
(వర్ధమానమ్—11)

జాన్వభ్యంతర గుల్ఫాభ్యాం పృష్ఠతోఽంఘ్రిః స్పృశేన్మహీమ్
అన్యః కుంచితజానుశ్చేత్ పురః కూర్మాసనం తదా. 27
(కూర్మాసనమ్—12)

అథ్వర్ణే సమపాదస్య పురః [పరః] తిర్యఙ్మనాక్ పునః [పురః]
స(స్వ?)పార్శ్వాభిముఖశ్చ స్యాదేకపార్శ్వగతం తదా. 28
(ఏకపార్శ్వగతమ్—13)

నిలబడిన యొకకాలి మోకాలికి సరిగా రెండవకాలి మోకాలుండునట్లు ముడిచి వెనుక కెత్తుట బ్రాహ్మము. (బ్రాహ్మము—5) 20

ఒకపాదము సమస్థితిలోనుండగా, రెండవది కొంచెముగాముడిచి, అడ్డముగా ముందుసాగుట వైష్ణవమని బుధులందురు. (వైష్ణవము—6) 21

సమస్థితియందున్న యొకపాదము మోకాలివద్దికి, ముడిచిన యింకొక పాదము సాగించి, నడచుట శైవము. (శైవము—7) 22

ఒకపాదమును ముడిచి ముందర అరకాలిపై నేలమీద మోపవలెను ; ఇంకొక పాదము వెనుక, మోకాలిని మోపనగును ; ఇది గారుడము. 23

(గారుడము—8)

సమపాదస్థానకమున పాదముల చీలమండలును, బొటనవ్రేళ్ళును ఒండొంటితో కలిసియుండుట, సంహతము ; ఇది పుష్పాంజలి యిచ్చుటకు. 24

(సంహతము—9)

ముందర ఒకపాదము సమస్థితమైయుండగా, రెండవది వెనుక వ్రేళ్ళమీద నిలుచుట పృష్ఠోత్తానతలమగును. (పృష్ఠోత్తానతలము—10) 25

అడుగులు అడ్డముగా మడమతో మడమ చేరునట్లు చేసినచో అది వర్ధమాన మనబడును. (వర్ధమానము—11) 26

ఒకకాలి మోకాలిక్రిందిభాగము, చీలమండతో వెనుకప్రక్క నేలను తాకు చుండగా ఇంకొకటి ముడిగిన మోకాలితో ముందుప్రక్కనుండుట కూర్మాసనము.

(కూర్మాసనము—12) 27

ఒకసమపాదమునకు సమీపమున ఇంకొకయడుగు ఇంచుకయడ్డముగా తన ప్రక్కకు తిరిగియుండినచో, అది ఏకపార్శ్వగతము. 28

(ఏకపార్శ్వగతము—13)

వర్ధమానస్య చరణౌ విశ్లిష్టౌ షడ్భిరంగులైః
వితస్త్యా వా సమాఖ్యాతం నంద్యావర్తాభిధం తదా. 29
(నంద్యావర్తమ్—14)

అస్యైవ యది పార్ష్ణీ(ర్ ష్ణ్యోః?)స్యాదష్టాదశభిరంగులైః
అంతరాల (లం?) మితం తద్జ్ఞైః చతురశ్రం తదాస్మృతమ్. 30
(చతురశ్రమ్—15)

అంతః పార్శ్వం సమస్యాంఘ్రేః మధ్యేఽన్యః పార్ష్ణినా స్పృశేత్
స్వపార్శ్వాభిముఖ స్తిష్ఠేత్ పార్ష్ణిపార్శ్వగతాభిధమ్. 31
(పార్ష్ణిపార్శ్వగతమ్—16)

యత్ర పార్శ్వముఖస్యై (ఖేనై ?) వ పార్ష్ణినాంఘ్రిర్వియోజితః
చతురంగుల మానేన కించిత్ కుంచితజానుకః
ఏకజానునతం తత్స్యాదితి దేశివిదోవిదుః. (ఏకజానునతమ్—17) 32

కించిత్ పార్శ్వముఖస్యాంఘ్రేః పార్ష్ణిమన్యస్య యోజయేత్
అంగుష్ఠేన యదాప్రోక్తం పార్ష్ణివిద్ధాభిధమ్ తదా. 33
(పార్ష్ణివిద్ధమ్—18)

సమస్థితస్య పాదస్య జానునో బాహ్యపార్శ్వతః
అన్యస్తు బాహ్యపార్శ్వేన సంలగ్నో జానుకుంచితః
స్థానకం యత్రతత్ తద్జ్ఞైరేకపాదముదీరితమ్. (ఏకపాదమ్—19) 34

అసితే ద్విగుణస్యాంఘ్రేః వామస్యోరోర్నివేశయేత్
పృష్ఠే పరస్యచేత్ జంఘాం నాగబంధః స్మృతస్తదా. 35
(నాగబంధః—20)

పార్ష్ణిజంఘోరుభిః పాదౌ నీరంధ్రశ్లిష్టకుట్టిమౌ
తిర్యక్ ప్రసారితౌ యత్ర సమసూచి తదుచ్యతే. (సమసూచి—21) 36

వర్ధమానస్థానకమున అడుగులు, ఆరుగాని, పండ్రెండుగాని, అంగుళముల యంతరము గలిగి విడివడియున్నచో నందావర్తమగును. 29
(నంద్యావర్తమ్—14)

నంద్యావర్తస్థానమందే మడమల నడిమియంతరము పదునెనిమిదియంగుళము లుండినచో, అది చతురశ్రమని బుధులందురు. (చతురశ్రము—15) 30

ఒక సమపాదము లోపలిప్రక్క నడిమిభాగమును, ఇంకొకకాలు మడమతో తాకి, తనప్రక్కమొగముగానుండుట, పార్ష్ణిపార్శ్వగతము. 31
(పార్ష్ణిపార్శ్వగతము—16)

ఒకకాలి మడమ ఇంకొకకాలి ప్రక్కమొగమై, నాలుగంగుళముల యెడముతో విడివడి, ఇంచుక ముడిచిన మోకాలితో నిలిచినప్పుడు, అది ఏకజానునతమగునని దేశిపండితులందురు. (ఏకజానునతము—17) 32

కొంచెముగా ప్రక్కమొగమైన యొకకాలి మడమతో, ఇంకొకకాలియంగుష్ఠమును కూర్చుట పార్ష్ణివిద్ధము. (పార్ష్ణివిద్ధము—18) 33

సమస్థితియందున్న ఒకకాలి మోకాలి వెలిప్రక్క, రెండవకాలు ముడిచిన మోకాలివెలిప్రక్కతో చేరుట యేకపాదమందురు. (ఏకపాదము—19) 34

కూర్చున్నపుడు ముడుచుకొన్న యెడమకాలి తొడమీద, రెండవకాలి పిక్కను పెట్టునది నాగబంధమగును. (నాగబంధము—20) 35

**మడమలు, జంఘలు, తొడలును, సందులేక, నేలను కరచునట్లు అడ్డముగా కాళ్ళు చాచుట సమసూచియనబడును.** (సమసూచి—21) 36

సమసూచివదేకాంఘ్రిరగ్రగతః స్యాత్ ప్రసారితః
అపరః పృష్ఠతో జానుగుల్ఫాభ్యాం స్పృష్టకుట్టిమః
స్వేనాభ్యంతరపార్శ్వేన యస్మిన్ విషమసూచి తత్. 37
(విషమసూచి—22)

సమసూచిని చేదేకః చరణో ద్విగుణీకృతః
ఉన్ముఖీభూతజానుః స్యాత్ ఖండసూచి స్మృతం తదా. 38
(ఖండసూచి—23)

ఉ త్ప్లు తి క ర ణా ని

సంప్రత్యుత్ప్లుతిపూర్వాణి కరణాని ప్రచక్ష్మహే
అంచితం కర్తరీపూర్వమంచితం భైరవాంచితమ్. 39

ఏకపాదాంచితం క్షేత్రాంచితం స్కంధాంతపూర్వకమ్
అంచితం లోహడీపూర్వ మంచితం దండపూర్వకమ్. 40

ప్రణామాంచితకం లంకాదాహాంచితసమాహ్వయమ్
భ్రాంతపాదాంచితాంగుష్ఠబంధపూర్వాంచితాభిధే. 41

బలిబంధాంచితాభిఖ్య మలగాంచితపూర్వకమ్
సమకర్తరిపూర్వం చాంచితమేవంచా చతుర్దశ. 42

అలగః స్యాత్ తతః కూర్మాలగమూర్ధ్వాలగాభిధమ్
అంతరాలగమిత్యేతత్ చతుర్థా పరికీర్తితమ్. 43

లోహడీ ప్రథమా తస్యాః కర్తరీ సమకర్తరీ
బాహుబంధా విచిత్రాస్యాదేకపాదా చతుర్ముఖీ
లోహడ్యః షడ్వినిష్క్రాంతాః మిలితాస్సప్తకీర్తితాః. 44

స్యాద్దర్పసరణం తస్మాదుత్పన్నం జలపూర్వకమ్
శయనం నాగబంధంచ త్రీణి ప్రోక్తాని పండితైః 45

ఒకపాదము సమసూచివలె ముందుకు చాచవలయును ; రెండవది తనలోపలి ప్రక్క మోకాలు-మడమలు నేల తాకునట్లు వెనుకకు తార్చవలయును ; ఇది విషమసూచి. (విషమసూచి—22) 37

సమసూచిస్థానమందు ఒకకాలు పూర్తిగాముడిచి, మోకాలు మీది మొగ మగునట్లు నిలిపినచో అది ఖండసూచి. (ఖండసూచి—23) 38

**ఉత్ప్లుతి కరణములు**

ఇక ఉత్ప్లుతికరణములను వివరింతుము : అంచితము — కర్తర్యంచితము, భైరవాంచితము, ఏకపాదాంచితము, క్షేత్రాంచితము, స్కంధాంతాంచితము, లోహడ్యంచితము, దండాంచితము, ప్రణామాంచితము, లంకాదాహాంచితము, భ్రాంతపాదాంచితము, అంగుష్ఠబంధాంచితము, బలిబంధాంచితము, అలగాంచితము, సమకర్తర్యంచితము - ఇట్లు పదునాలుగు తెరగులు. 39, 40, 41, 42

అలగము — దానినుండి కూర్మాలగము, ఊర్ధ్వాలగము, అంతరాలగము, ఇవి జనించును ; ఇట్లు ఇది నాల్గువిధములు. 43

లోహడి — మొదటిది ; దానినుండి వెలువడినవి — కర్తరీలోహడి, సమకర్తరీ లోహడి, బాహుబంధ లోహడి, విచిత్రలోహడి, ఏకపాదలోహడి, చతుర్ముఖ లోహడి—ఇట్లు ఆరు లోహడులు మొత్తము ఏడు. 44

దర్పసరణము — దానినుండి పుట్టినవి జలశయనము, నాగబంధము, ఇట్లివి మూడని పండితులు చెప్పినారు. 45

కపాలస్పర్శనం తస్మాత్ జాతం వ్యంకోలసంజ్ఞకమ్
సూచ్యంతం మత్స్యకరణమాహు రేతచ్చతుష్టయమ్ ;
క్రమాల్లక్షణమేతేషాం సువ్యక్తమభిధీయతే. 46

**ఉత్ప్లుతికరణ లక్షణాని**

సమపాదస్థితో యత్ర కృతోత్తానోత్ప్లుతిర్దివి
వివృతః పూర్వవత్తిష్ఠేత్ తదంచితముదీరితమ్. (అంచితమ్—1) 47

కర్తర్యంచితముక్తం తత్ యత్పాదః స్వస్తికాభిధః. 48
(కర్తర్యంచితమ్—2)

పాద[దం]భూమిస్థితస్యాంఘ్రేః ఊరుపృష్ఠేద్వితీయకమ్
నివేశ్యాంచితమాదధ్యాత్యత్ర తద్భైరవాంచితమ్. 49
(భైరవాంచితమ్—3)

ఏకపాదాంచితం కుర్యాదేకపాదాంచితం తథా 50
(ఏకపాదాంచితమ్—4)

అంచితాద్యంతయోర్యత్ర భజేదుత్కటికాసనమ్
రంగక్షేత్రే యతః ప్రోక్తమేతత్ క్షేత్రాంచితంబుధైః. 51
(క్షేత్రాంచితమ్—5)

పూర్వం కృత్వాంచితం యస్మిన్నేకాంసాలింగితం క్షితిః
పాదోల్లాసనయా తిర్యగుత్తిష్ఠేత్ త్వరితంపునః
స్కంధాంతాంచితముద్దిష్టమిదం నృత్తవిశారదైః. 52
(స్కంధాంతాంచితమ్—6)

విధాయలోహడీం యస్మిన్నంచితం రచయేద్ధ్రితమ్
లోహడ్యంచిత సంజ్ఞం తత్ నర్తకైః పరికీర్తితమ్. 53
(లోహడ్యంచితమ్—7)

కపాలస్పర్శనము — దానినుండి జనించినవి — వ్యంకోలము, సూచ్యంతము, మత్స్యకరణము ; ఇట్టివి నాలుగందురు.

వీనికి లక్షణములు క్రమముగా, స్పష్టముగా వివరింపబడును. 46

**ఉత్ప్లుతి కరణముల లక్షణములు**

సమపాదమందు నిలిచి మీదికి, చక్కగా ఎగిరి, మొదటివలె అంగములను సవరించుకొని నిలుచుట అంచితమనబడును. (అంచితము—1) 47

అంచితమందలి పాదము స్వస్తికముగా నుండినచో అది కర్తర్యంచితమనబడును. (కర్తర్యంచితము—2) 48

నేలమీదనుండు ఒకకాలితొడమీద రెండవకాలిని మోపి, అంచితము చేయుట భైరవాంచితము. (భైరవాంచితము—3) 49

ఒకకాలితో అంచితము చేయుట, యేకపాదాంచితము. 50
(ఏకపాదాంచితము—4)

అంచితకరణమునకు మొదటను, కడపటను, ఉత్కటికాసనమును గ్రహించినచో అది, రంగక్షేత్రమందు చేయబడునది గనుక, క్షేత్రాంచితమని బుధులందురు. (క్షేత్రాంచితము—5) 51

మొదలు అంచితము చేసి, ఒకమూపును నేలపై మోపి, పాదములను అడ్డముగా ఆడించి, తటాలున లేచునది స్కంధాంతాంచితమని నృత్తవిశారదులందురు. (స్కంధాంతాంచితము—6) 52

లోహడి చేసిన తర్వాత, ద్రుతముగా అంచితముచేయుట, లోహడ్యంచితమని నర్తకులు చెప్పుదురు. (లోహడ్యంచితము—7) 53

సమపాదాంచితస్యాంతే దండవత్ ప్రణతిర్భువి
క్రియతే యత్ర తద్దండప్రణామాంచితముచ్యతే. 54
(దండప్రణామాంచితమ్—8)

అంచితం రచయన్నంగం ప్రత్యావృత్య (వర్త్య ?) పరాఙ్ముఖః
యత్రాసీత మహీపృష్ఠే భజన్నుత్కటికాసనమ్,
లంకాదాహాంచితం తత్స్యాదస్త్యైరుక్త మురోఽంచితమ్. 55
(లంకాదాహాంచితమ్—9)

పాదమేకం పరిభ్రామ్య, తత్పృష్ఠేన సమాశ్రితః
జంఘామధ్యం ద్వితీయస్య, రచయిత్వాంచితం, మహీమ్ 56

ఆలింగ్య స్కంధయుగ్మేన తతః కృతవివర్తనః
పదోల్లాలనయా తిష్ఠేత్ (తత్స్యాత్ ?) భ్రాంతపదాంచితమ్. 57
(భ్రాంతపదాంచితమ్—10)

అంగుల్యంగుష్ఠమధ్యాభ్యాం సంయుక్తా [?] పాదయోర్మిథః
కృత్వాంచితం విధీయేతాంగుష్ఠబంధాంచితాభిధమ్ (?). 58
(అంగుష్ఠబంధాంచితమ్—11)

అంజలిం పృష్ఠతో బధ్వా మధ్యవంశే యదోన్ముఖమ్
అంచితంరే (ర ?) చయేత్ ప్రోక్తం బలిబంధాంచితం తదా ;
గజదంతేన పురతః కృతమేతత్ పరే జగుః. (బలిబంధాంచితమ్—12) 59

అలగాంతే కృతం వేగాదంచితంచాలగాంచితమ్. 60
(అలగాంచితమ్—13)

ఆదావంఘ్రీ సమాబద్ధ్వా స్వస్తికాపంచితం యదా
సంపద్యతే తదా ప్రోక్తం సమకర్తరికాంచితమ్. 61
(సమకర్తర్యంచితమ్—18)

సమపాదమున అంచితముచేసిన మీద, దండమువలె ప్రణామము చేయుట దండప్రణామాంచితమనబడును. (దండప్రణామాంచితము—8) 54

అంచితము చేయుచు, అంగమును త్రిప్పి వెనుక మొగమై, ఉత్కటికాసనమున నేలపై కూర్చుండవలెను ; ఇది లంకాదాహాంచితమగును ; దీనిని ఉరోంచితమని యితరులు పేర్కొనిరి. (లంకాదాహాంచితమ్—9) 55

ఒకకాలిని చుట్టును త్రిప్పి, దానియరకాలిని ఇంకొకకాలిపిక్కనడిమికి చేర్చి, అంచితముచేసి, రెండు మూపురములతో నేలను కౌగిలించి, పాదములను విడదీసి, మీద ఆడించుచుండుట భ్రాంతపదాంచితము. (భ్రాంతపదాంచితము—10) 56,57

(పాఠము కశ్మలము. తాత్పర్యమును స్ఫురింపలేదు. నాట్యశాస్త్ర — రత్నాకర — భరతకోశములలో ఈ కరణము పరిగ్రహింపబడలేదు.) 58

(అంగుష్ఠబంధాంచితము—11)

అంజలిని వెనుక వెన్నెముక నడిమికి పట్టి, మొగమెత్తి, అంచితము చేయునది, బలిబంధాంచితమందురు ; గజదంతహస్తమును ముందుగడ పట్టి, దీనిని చేయవలెనని ఇతరులన్నారు. (బలిబంధాంచితము—12) 59

అలగము చేసి వెంటనే అంచితము చేయునది అలగాంచితము. 60

(అలగాంచితము—13)

సమముగానున్న పాదములు మొదలు స్వస్తికపరిచి అంచితము చేయుట సమకర్తర్యంచితము. (సమకర్తర్యంచితము—14) 61

**అలగ లక్షణమ్**

ఉత్ప్లుత్యావాఙ్ముఖో వ్యోమ్ని పివృత్యాగ్రేపతన్భువి
ఉత్కటాసనమాదధ్యాత్ యత్రేదమలగం మతమ్. (అలగమ్—15) 62

కూర్మాలగం తదేవ స్యాదంతే కూర్మాసనం యది. 63
(కూర్మాలగమ్—16)

యద్యంతేఽ సోర్ధ్వపాదాభ్యాం స్థితిరూర్ధ్వాలగం భవేత్. 64
(ఊర్ధ్వాలగమ్—17)

ఉద్వాహితమురో బాఢం జంఘోపాంతేచ మస్తకమ్
కుర్యాచ్చేదలగస్యాంతే తదా స్యాదంతరాలగమ్. 65
(అంతరాలగమ్—18)

**లోహడీలక్షణమ్**

ఉత్ప్లుత్య సమపాదస్థః తిర్యగావర్తితత్రికః
పరాఙ్ముఖః పతేద్యత్ర లోహడీ సాప్రకీర్తితా. (లోహడీ—19) 66

సైవస్యాత్ స్వస్తికాంఘ్రిభ్యాం కృతా కర్తరిలోహడీ. 67
(కర్తరిలోహడీ—20)

లోహడ్యాద్యంతయోః పాదౌ సమౌ స్వస్తికతాం గతౌ
క్రమాచ్చేత్ నర్తకైః ప్రోక్తా సమకర్తరిలోహడీ. 68
(సమకర్తరిలోహడీ—21)

శుద్ధా యా లోహడీ సైవ గజదంతేన సంయుతా
యది ప్రకీర్తితా బాహుబంధాద్యాల్లోహడీ తదా. 69
(బాహుబధంలోహడీ—22)

కాయస్య చక్రవద్భ్రాంత్యా తిర్యక్చేత్ (?) పార్శ్వతః కృతా
లోహడీయది సాప్రోక్తా నర్తకైశ్చిత్రలోహడీ. 70
(చిత్రలోహడీ—23)

### అలగ లక్షణము

క్రిందిమొగమై మీదికెగిరి, విడివడిన యంగములతో ముందుప్రక్క నేలపై పడుచు, ఉత్కటాసనము చేయుట, అలగము. (అలగము—15) 62

అదే కూర్మాసనముతో ముగించుట కూర్మాలగమగును. 63
(కూర్మాలగము—16)

అదే తుదలో మీదికెత్తి నిలిచినచో ఊర్ధ్వాలగము. 64
(ఊర్ధ్వాలగము—17)

అలగము తుదలో ఎదను దృఢముగా మీదికెత్తి, శిరస్సును పిక్కలచెంత నిలుపుట, అంతరాలగము. (అంతరాలగము—18) 65

### లోహడిలక్షణము

సమపాదమందు నిలిచి, మీదికెగసి, త్రికమును అడ్డముగా త్రిప్పి, వెనుక మొగమై పడుట లోహడి యనబడును. (లోహడి-19) 66

అదే స్వస్తికపాదములతో చేయుట కర్తరిలోహడి. (కర్తరిలోహడి—20) 67

లోహడికి మొదటను కడపటను, సమపాదములు క్రమముగా స్వస్తికపరుచుట, సమకర్తరిలోహడియని నర్తకులందురు. (సమకర్తరిలోహడి-21) 68

శుద్ధమైన లోహడిని గజదంతహస్తములతో చేయుట, బాహుబంధలోహడి యగును. (బాహుబంధలోహడి—22) 69

దేహమును చక్రమువలెత్రిప్పి, అడ్డముగా ప్రక్కలోచేయు లోహడి, చిత్రలోహడియని నర్తకులు చెప్పుదురు. (చిత్రలోహడి—23) 70

ఏకాంఘ్రిస్థానకే కాయః స్యాచ్చేదేకాంఘ్రిలోహడీ. 71
(ఏకపాదలోహడీ—24)

లోహడీ చేచ్చతుర్దిక్కం స్యాత్ చతుర్ముఖలోహడీ. 72
(చతుర్ముఖలోహడీ—25)

దర్పసరణ లక్షణమ్

వైష్ణవస్థానకే పాదః త్ర్యశ్రశ్యాః పార్శ్వముఖశ్చయః
తత్పార్శ్వదిశి కాయస్య తిర్యక్ స్యాచ్చక్రవద్భ్రమః. 73

యస్మిన్నంతే పరః పాదః త్ర్యశ్రః స్వస్థానమాచరేత్
తద్దర్పసరణం నామ నృత్తజ్ఞైః పరికీర్తితమ్. (దర్పసరణమ్—26) 74

తస్యాంతే జలశాయీవ శయానః స్యాన్మహీతలే
యదాతదా సమాఖ్యాతం శయనం జలపూర్వకమ్. 75
(జలశయనమ్—27)

విధాయ కరణం దర్పసరణం నాగబంధవత్
యత్రాసీత తదాప్రోక్తం నాగబంధాభిధం బుధైః. (నాగబంధః—28) 76

కపాల స్పర్శమాహుస్తత్ కురుతే యత్రనర్తకః
లోహడీమలగం బద్ధ్వా స్వశేనూర్ధ్నా మహీం మనాక్
కపాలచూర్ణమిత్యుక్తం యదన్యైస్తన్న శోభనమ్. 77
(కపాలస్పర్శనమ్—29)

కపాలస్పర్శనం యత్ర కుర్వన్నలగసంభవమ్
అంతరాలగవాన్ తిష్ఠేత్ వ్యంకోలం తదుదీరితమ్.
నతపృష్ఠాభిధానం తు కేచిదేతత్ ప్రచక్షతే. (వ్యంకోలమ్—30) 78

ఆనుపూర్విమమ ఖండాఖ్యసూచినీచాత్ర కేచన;
యస్యయస్య విరామేతు సూచీష్యేత...కించన
తత్తత్ సూచ్యంతమిత్యుక్తం కరణం నృత్తకోవిదైః. 79
(సూచ్యంతమ్—31)

దేహము ఏకపాదస్థానముననుండినచో, ఏకపాదలోహడి యగును. 71
(ఏకపాదలోహడి—24)

నాల్గుదిక్కులను లోహడిచేయుట, చతుర్ముఖలోహడి. 72
(చతుర్ముఖలోహడి- 25)

**దర్పసరణలక్షణము**

వైష్ణవస్థానమందుండి, ఒకపాదము త్ర్యశ్రముగా, ప్రక్కమొగముచేసి, ఆప్రక్కనే అడ్డముగా చక్రమువలె దేహము తిరుగజేసి, ముగింపున ఇంకొక పాదము త్ర్యశ్రముగా, స్వస్థానము చేరునట్లు తీర్చుట, దర్పసరణమని నృత్తజ్ఞు లందురు (దర్పసరణము—26) 73, 74

దర్పసరణము తుదిలో, నీటిమీద పరున్నట్లు నేలమీద పరుండుట, జలశయన మనబడును. (జలశయనము—27) 75

దర్పసరణముచేసి, నాగబంధముతో కూర్చుండుట, నాగబంధమని బుధులు చెప్పుదురు. (నాగబంధము—28) 76

లోహడినిచేసి అలగమును బంధించి, తలతో నేలను నర్తకుడు తాకినచో, అది కపాలస్పర్శమందురు ; కొందరు దీనిని కపాలచూర్ణమని పేర్కొనిరి; అది బాగు గాదు. (కపాలస్పర్శము—29) 77

అలగమునుండి పుట్టిన కపాలస్పర్శమును చేయుచు, అంతరాలగముతో నుండుట, వ్యంకోలము; కొందరు దీనిని నతపృష్ఠమని పేర్కొనిరి. 78
(వ్యంకోలము—30)

ఇక్కడ కొందరు విషమసూచి, ఖండసూచి యను రెంటిని చెప్పుదురు. ఏయే కరణము ముగించునప్పుడు, సూచిని చేర్తురో, ఆయా కరణములన్నియు సూచ్యంతములేయని నృత్తకోవిదులందురు. (సూచ్యంతము—31) 79

కస్యాపి కరణస్యాంతే ఉత్తానః శయితః క్షితౌ
నితంబోన్నమనాన్మధ్యం యస్మిన్నావర్త్యవామతః. 80

1.................................
[తన్మత్స్యకరణం ప్రోక్తం] మత్స్యవత్ పరివర్తనాత్. 81

(మత్స్యకరణమ్—32)

భ్రమరీలక్షణమ్

పదైరంతర్బహిశ్ఛత్ర తిరిపౌతాలగోచితైః
విద్యుచ్చక్ర శిరోహస్తకుంచితాంగైః విశేషితాః
త్రయోదశ భ్రమర్యః స్యుః తాసాం లక్షణముచ్యతే. 82

సముత్క్షిప్తేన పాదేన భుజంగత్రాసితాంఘ్రివత్
వామేన దక్షిణావర్త వామావర్త పరేణచ. 83

శరీరం భ్రామ్యతే వేగాత్ త్రయభ్రాంత్యా పరస్యయత్[?]
అంతర్భ్రమరికాఖ్యేయం ; అస్యాపవ విపర్యయాత్. 84

బాహ్యాభ్రమరికాప్రోక్తా ; విశేషః కింత్వయం పునః,
స్ఫిజాంద్రుతపార్ష్ణ్యయం[?][2]ద్విగుణేనాంఘ్రిణాభ్రమః. 85

యాప్రదక్షిణతో భ్రాంతిరప్రదక్షిణతశ్చయా
తామంతర్భ్రమరీం బాహ్యాభ్రమరీంచపరేవిదుః. 86

(అంతర్భ్రమరీ, బాహ్యాభ్రమరీచ—1, 2)

---

1. ఒకటిన్నర శ్లోకము లుప్తము వేమభూపాలుని సంగీతచూడామణి లక్షణమునందలి యీ క్రింది వాక్యముచే ఈ క్రియ పూర్తి చేయవచ్చును—
"అంతే సముత్ప్లుతిం కృత్వా పాదోల్లాలనయాక్షణాదు త్తిష్ఠేత్"
(చూ. మా. రా. కృ కవిగారి భరతకోశమున 'మత్స్యకరణము'.)

2. 'స్థిచోరుద్ధృత పార్ష్ణ్యయం' అని పాఠముండునా ? ఈ భ్రమరికి ఇంత వివరణము ఇతరులు చేయలేదు. ఇక్కడ పాఠము అస్పష్టము

పద్దైనను కరణముచేసి, తుదలో వెల్లికిలిగా నేలపై పరుండి, నితంబమును పైకెత్తి, నడుము ఎడమప్రక్కకు వాల్చి, చేపవలె పరివర్తించి, కడపట మీదికెగసి, పాదములనాడించి, వెంటనే లేచి నిలుచుట, మత్స్యాకరణము.

(మత్స్యాకరణము—32) 80, 81

## భ్రమరీలక్షణము

అంతర్భ్రమరి, బహిర్భ్రమరి, ఛత్రభ్రమరి, తిరిపభ్రమరి, ఓతాభ్రమరి, అలగభ్రమరి, ఉచితభ్రమరి, విద్యుద్భ్రమరి, చక్రభ్రమరి, శిరోభ్రమరి, హస్త భ్రమరి, కుంచితభ్రమరి, అంగభ్రమరి, - ఇట్లు భ్రమరులు పదుమూడు; వాని లక్షణమును చెప్పుదుము. 82

ఎడమకాలిని భుజంగత్రాసితచారియందువలె తీర్చి, మీదికెత్తి, కుడినుండి యెడమకు వేగముగా దేహమును త్రిప్పుట, అంతర్భ్రమరి యనబడును; దీనినే మార్చిచేయుట బాహ్యభ్రమరి యనబడును; కాని కొంత విశేషము గలదు; బాహ్యభ్రమరియందు మడమతో పిరుదులు తాకునట్లు కాలు మడిచి, తిరుగ వలయును. (?) 83, 84, 85

ప్రదక్షిణముగా తిరిగిన, అంతర్భ్రమరియని, అప్రదక్షిణముగా తిరిగిన, బాహ్యభ్రమరియని ఇతరులన్నారు. (అంతర్భ్రమరి, బాహ్యభ్రమరి—1, 2) 86

[1]విష్ణుక్రాంతవదుత్‌క్షిప్య వామాంఘ్రిః కుంచితః పునః
పతనోత్ప్లుతనైరన్యైః పాదస్య భ్రమణం జవాత్
యత్రాప్రదక్షిణం కుర్యాత్ సా చక్రభ్రమరీ మతా. (చక్రభ్రమరీ—3) 87

కుంచితం పాదముత్క్షిప్య పార్శ్వేనాక్షిప్య పృష్ఠతః
అన్యాంఘ్రౌ స్వస్తికం కృత్వా శరీరం భ్రామయేద్యదా, 88

తిర్యక్ చేత్ దండపక్షాభ్యాం యథాస్యాత్ స్వస్తికచ్యుతిః
తిరిపభ్రమరీత్యేషా తదా తద్‌జ్ఞైర్నిగద్యతే. 89

ఉత్ప్లుత్య ఘటయిత్వాపి జానునోః స్వస్తికంభ్రమేత్
పూర్వవద్యత్ర సాప్రోక్తా (ప్యుక్తా?) తిరిపభ్రమరీ పునః. 90
(తిరిపభ్రమరీ—4)

[[2]కృతోత్ప్లుతిర్వామపాదతలేన తు ముహుర్ముహుః
తాడయన్ దక్షిణస్యోరుం యత్ర భ్రామ్యేత్ ప్రదక్షిణమ్,
ఓతాభ్రమరికా సేయం నృత్తవిద్భిరుదాహృతా. (ఓతాభ్రమరీ—5) 91]

నమనోన్నమనైః పూర్వకాయస్య క్షితిమస్పృశన్
దక్షిణం ప్రసృతం పాదం ముహుః కుర్వన్ ద్రుతం భ్రమన్
తిరశ్చీనా(నో) భవేద్యత్ర సాఽలగభ్రమరీ మతా. (అలగభ్రమరీ—6) 92

విశాఖస్థానకే తిష్ఠన్ తిర్యక్ సోల్లాలనైః స(క్ర?)మైః
యుగపద్దండపక్షాభ్యాం వామహస్తేన కుం లిఖన్. 93

ముహుః ప్రదక్షిణం కుర్వన్ చురితం త్వరితం యదా
మండలేన పరిభ్రామ్యేదుచితభ్రమరీ తదా. (ఉచితభ్రమరీ—7) 94

---

1. ఈ శ్లోకపాఠము కలుషితము.

2. ఓతాభ్రమరి లక్షణము మూలగ్రంథమున లోపించినది అదిలేనిచో పండ్రెండే భ్రమరీభేదములగును ; మొదలు నిర్దేశించినట్లు పదమూడు కావు కనుక ఈ లక్షణశ్లోకము వేమభూపతి "సంగీత చింతామణి" నుండి పరిష్కర్త యెత్తిచూపినది.

విష్ణుక్రాంతమునందువలె ఎడమకాలు కుంచితమై యుండగా, ఇంకొకపాదము పతనోత్పతనములతో వేగముగా, అప్రదక్షిణముగా, తిరుగుట (?) ఛత్రభ్రమరి యగును. (ఛత్రభ్రమరి—3) 87

కుంచితమైన పాదమునెత్తి, ప్రక్కనుండి వెనుకకు వీచి, యింకొకపాదము మీద స్వస్తికపరిచి, అడ్డముగా దండపక్షహస్తములలో స్వస్తికము విడిపోవునట్లు శరీరమును త్రిప్పవలయును. అది తిరిపభ్రమరి యందురు. 88, 89

మరియు, మీదికెగసి మోకాళ్ళను స్వస్తికముగాచేసి, పూర్వమువలెనే తిరుగ వలెను. అదియు తిరిపభ్రమరి యనబడును. (తిరిపభ్రమరి—4) 90

[ఉత్ప్లుతిచేసి, యెడమయరకాలిచే కుడికాలితొడను మాటిమాటికి తట్టుచు, ప్రదక్షిణముగా తిరుగవలయును. దానిని నృత్తజ్ఞులు ఓతభ్రమరి యందురు.] 91
[ఓతభ్రమరి—5]

శరీరము పూర్వభాగమును, నేలను తాకకుండ వంచుచు ఎత్తుచు, కుడికాలు పలుమారు చాచుచు, ద్రుతముగా తిరుగుచు, ప్రక్కకు నిలువవలెను; ఇది అలగభ్రమరి. (అలగభ్రమరి—6) 92

వైశాఖస్థానకమున నిలిచి, అడుగులు చక్కగా మీదికెత్తి, అడ్డముగా నాడించుచు, దండపక్షహస్తములతో, ఏకకాలమందు ఎడమచేతితో నేలను తాకుచు, మాటిమాటికి ప్రదక్షిణముగా ఘరితము (?) చేయుచు, వేగముగా, మండలాకారముగా చుట్టవలయును. ఇది ఉచితభ్రమరి. 93, 94
(ఉచితభ్రమరి—7)

విద్యుద్భ్రాంతాం ముహుః కుర్వన్ దక్షిణేనాంఘ్రిణా యదా
ప్రదక్షిణం పరిభ్రామ్యేత్ (స్యాద్విద్యుద్భ్రమరీ తదా?). 95
(విద్యుద్భ్రమరీ—8)

[1](స్థానకే ఖండసూచ్యాఖ్యే వామస్యాగ్రతలేన తు
మహీతలమవష్టభ్య దక్షిణం చరణంపునః
చక్రవద్ భ్రమయేద్యత్ర సా చక్రభ్రమరీ భవేత్.) (చక్రభ్రమరీ—9) 96

(మస్తకేన మహీభాగే స్థిత్వాథ చరణద్వయమ్
ఊర్ధ్వీకృత్య యదా తిర్యక్ పరిభ్రమణమాచరేత్. 97

తదా శిరోభ్రమరికా కథితా నృత్తకోవిదైః ;
అథవా నిశ్చలం తిష్ఠన్ భ్రమయేత్ కేవలంశిరః. 98

త్వరితం పాణియుగలం భ్రమితోత్ఫుల్లపద్మవత్
ఏషాపి కథితా తద్జ్ఞైః శిరోభ్రమరికేతిచ). (శిరోభ్రమరీ—10) 99

వామహస్తతలేనోర్వ్యాం తిష్ఠన్ వ్యోమ ముఖక్రమః
అపసవ్యం భ్రమేద్యత్ర సా హస్తభ్రమరీ భవేత్. 100
(హస్తభ్రమరీ—11)

చిత్ర (ఛత్ర?) భ్రమరికాం కుర్యాద్ భుజంగత్రాసితాంఘ్రిణా
యదావిద్భిః సమాఖ్యాతా కుంచితభ్రమరీ తదా. 101
(కుంచితభ్రమరీ—12)

సమపాదే స్థితఃస్థానే మధ్యస్య వలనాద్ భృశమ్
పరితోభ్రామయేత్తూర్ణం పూర్వకాయం కరౌదధత్. 102

---

1. వ్రాతప్రతిలో చక్రభ్రమరి — శిరోభ్రమరుల లక్షణము లుప్తము. అందుకై సంగీత రత్నాకరమందలి శ్లోకములను పరిష్కర్త సూచించిరి. వేమభూపాలుని సంగీతచింతామణిలోని పై శ్లోకములు, వివరములెక్కువగలవి కనుక, ఇందుద్ధరింపబడినవి. వేమభూపతి జాయసేనానిని ప్రాయికముగ అనుసరించువాడుగూడ. వీనిని భరతకోశమునుండి గ్రహించితిని.

కుడికాలిచే పలుమారు విద్యుద్భ్రాంతచారి చేయుచు ప్రదక్షిణముగా తిరుగుట విద్యుద్భ్రమరి యగును. (విద్యుద్భ్రమరి–8) 95

(ఖండసూచి స్థానకమందుండి యెడమ యరకాలి తుదతో నేలను పట్టుకొని, కుడికాలిని చక్రమువలె త్రిప్పుట, చక్రభ్రమరియగును. (చక్రభ్రమరి–9) 96

(నేలమీద తలమోపి నిలిచి, ఆపై కాళ్ళు రెండును మీదికెత్తి, అడ్డముగా త్రిప్పుట శిరోభ్రమరియని నృత్తకోవిదులందురు.

లేదా, కదలకుండ నిలిచి, శిరస్సు మాత్రము, నిండుగా వికసించిన తామర పూలవలె, తిరుగుచున్న చేతులతో వేగముగాత్రిప్పుటగూడ శిరోభ్రమరియని యెరిగినవారందురు.) (శిరోభ్రమరి–10) 97, 98, 99

ఎడమ యరచేతిని నేలమీదమోపి, కాళ్ళు మీదికి చాచి, అప్రదక్షిణముగా భ్రమించుట హస్తభ్రమరియగును. (హస్తభ్రమరి–11) 100

భుజంగత్రాసితపాదముతో చిత్ర (ఛత్ర) భ్రమరి చేయునది, కుంచిత భ్రమరియని పండితులందురు. (కుంచితభ్రమరి–12) 101

సమపాదస్థానమందుండి, నడుము నెక్కువగా ప్రక్కకుత్రిప్పి, దండపక్ష హస్తములను ప్రయోగానుసారముగా వ్యవస్థలేక పట్టుచు, దేహముమీదిభాగమును

ప్రయోగవశగౌదండపక్షాఖ్యావవ్యవస్థితౌ
యస్యామభిహితా తద్జ్ఞైరంగభ్రమరికేతిసా. (అంగభ్రమరీ–13) 103

చక్రాంగౌతా శిరోహస్త తిరిపచ్ఛ్రత్రకుంచితైః
భవంత్యుపపదైః సప్త(ష్ట)భ్రమర్యః కేవలా ఇమే (మాః?). 104

అంతర్బాహ్యాలగ్నైః విద్యుదుచితాభ్యాంతు సంయుతాః
కేవలా గనికాశ్చ[?][1]స్యురన్యాసాం సంకరాన్మిథః. 105

పంచానాం వా చతసృణాం మిశ్రాణాము(శ్రణాదు?)భయోరపి
భ్రమర్యః సంభ్రమం (భవం?) త్యన్యాఃక్రమ వ్యుత్క్రమ భేదతః
శతాని సప్తషష్టిశ్చ విచిత్రం చతుర్భైఃకృతాః. 106

అంతర్బాహ్యాలగ్నైర్వ్యక్తాః తద్వత్ బాహ్యాంతరాలగాః
తథాఽంతరాలగా బాహ్య అలగాంతర్బహిర్గతాః. 107

బాహ్యాంతరాలగాశ్చైవమలగా బాహ్యాకాంతరాః
క్రమ వ్యుత్క్రమతశ్చైవ తిస్రః త్వన్[షన్?]నవతేః పరాః
భ్రమర్యస్తద్వదన్యాశ్చ కల్పనీయా(ః?)పథామునా. 108

ఏతాసామపి విజ్ఞేయః ప్రస్తారః కూటతానవత్
సచాస్మాభిః స్ఫుటం గీతరత్నావల్యాం ప్రపంచితః. 109

ఇతి

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవగజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
దేశీస్థానక కరణభ్రమరీలక్షణం నామ పంచమోఽధ్యాయః

1 'గుణితాః' అని సందిగ్ధముగా పరిష్కర్త సూచించిన సవరణ.

వేగముగా చుట్టూర త్రిప్పుట అంగభ్రమరి. (అంగభ్రమరి—13) 102, 103

చక్రభ్రమరి, అంగభ్రమరి, ఓతాభ్రమరి, శిరోభ్రమరి, హస్తభ్రమరి, తిరిప భ్రమరి, ఛత్రభ్రమరి. కుంచితభ్రమరి-ఈ యెనిమిదిమాత్రము శుద్ధమైనవి. 104

అంతర్భ్రమరి, బాహ్యభ్రమరి, అలగభ్రమరి, విద్యుద్భ్రమరి ఉచితభ్రమరి—ఈ యైదు ఇతరభ్రమరుల అన్యోన్యసంకరముచే ఏర్పడినవంతే. 105

పై రెండుతెగల భ్రమరులు ఐదో, నాలుగో కలిపి, వరుసగాను. వరుస తప్పించియు, విచిత్రముగా చతురులైనవారు చేయునవి, యేడునూర్లయరువది భేదములగును.[1] 106

(107, 108, శ్లోకములందలి అలగప్రస్తారపద్ధతి నాకు స్ఫుటముకాదు. మూలపాఠముగూడ సరిగానున్నట్లు తోపదు). 107, 108

ఈ భ్రమరుల ప్రస్తారము, కూటతానముల ప్రస్తారమువలెనే గ్రహింపదగినది; దానిని మేము 'గీతరత్నావళి'యందు వివరించితిమి. 109

ఇది

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుడగు
జాయసేనాని రచించిన నృత్తరత్నావళియందు
దేశిస్థానక కరణ భ్రమరీలక్షణమను
ఐదవయధ్యాయము

1. 'శతాని సప్తషష్టిశ్చ' అనుమాటకు నూటయరువదియేడు(167) అని వరిష్కర్త భావించినయర్థము, (పీఠిక. పు. 123)

# అ థ ష ష్ఠో ఽ ధ్యా యః

మతంగేనోదితాన్ దేశీనృత్తశోభావిధాయినః
పాదాన్ షోడశసంఖ్యాకాన్ కథయామోఽధునా వయమ్. 1

సరికః (కా ?), స్వస్తికోల్లాలా స్ఫురికాఽర్ధపురా తథా
పురాటీ వేష్టనోద్వేష్టౌ ఖుత్తాఽర్ధఖలితాభిధా, 2

ప్రావృతః పృష్ఠతః క్షేపో లతా క్షేపో నికుట్టకః
సమస్ఖలితకో (ఉ ?) త్క్షేప ఇత్యేషాం లక్ష్మకథ్యతే. 3

**షోడశ దేశీపాదాః**

పురస్సరో ద్వయో రేకః పాదశ్చేత్ సరికా స్మృతా. (సరికా—1)
స్వస్తికః స్వస్తికాకారధారిణోః పాదయోర్మతః. (స్వస్తికః—2) 4

ఉల్లాసనం క్రమేణాంఘ్ర్యో యత్రోల్లాలః స కథ్యతే. (ఉల్లాలః—3)

పద్భ్యామంగులి పృష్ఠేన పార్శ్వయోః పృష్ఠతోఽగ్రతః
గతిర్యత్ర స్థితిర్వాస్యాత్ తాం విదుః స్ఫురికాం బుధాః. (స్ఫురికా-4) 5

యత్రోద్వృత్తేన పాదేన నికుట్టేన నికుట్యతే
ఉద్వృత్తశ్చరితో [శ్చరణో]ఽన్యోఽర్ధపురాటీ సాభిధీయతే. 6
(అర్ధపురాటీ—5)

నికుట్టనం మిథః పద్భ్యాముద్వృత్తాభ్యాం పురాటికా. (పురాటీ—6)
వేష్టనం తద్వదన్యస్య పదేనైకేన వేష్టనాత్. (వేష్టనమ్—7) 7

# ఇక ఆరవ యధ్యాయము

దేశినృత్తమునకు శోభగలిగించు పదునారు పాదములను మతంగుడు చెప్పెను. వానినిప్పుడు వివరింతుము. 1

సరిక, స్వస్తికము, ఉల్లాలము, స్ఫురిక, అర్ధపురాటి, పురాటి, వేష్టనము, ఉద్వేష్టము, ఖుత్త, అర్ధస్ఖలితము, ప్రావృతము, పృష్ఠోత్క్షేపము, లతాక్షేపము, నికుట్టకము, సమస్ఖలితము, ఉత్క్షేపము - అను నీపదునారింటికిని లక్షణము చెప్పబడును. 2, 3

## పదునారుదేశిపాదములు

కాళ్ళు రెంటిలో ఒకటి ముందుగానుండినచో సరిక. (సరిక—1)
పాదములు స్వస్తికముగా నుండుట స్వస్తికము. (స్వస్తికము—2) 4

క్రమముతో అడుగులు మీదికెత్తి మెల్లగా నాడించుట ఉల్లాలము. (ఉల్లాలము—3)
కాళ్ళకొనవ్రేళ్ళమీద, ప్రక్కలందు, వెనుక, ముందు, నడుచుట లేక నిలుచుట స్ఫురికయందురు. (స్ఫురిక—4) 5

మీదికెత్తిన అడుగును వంచి, ఇంకొక యడుగునెత్తి దానిపై క్రిందు మీదులుగా ఆడించుట అర్ధపురాటి యనబడును. (అర్ధపురాటి—5) 6

ఉద్వృత్తములైన పాదములు రెంటను పరస్పరము పై జెప్పినట్లు నికుట్టనము చేయుట పురాటి. (పురాటి—6)
అట్లే ఒకపాదముచే, ఇంకొకటిని చుట్టుట వేష్టనము. (వేష్టనము—7) 7

పశ్చాద్గతేన తేనైవ పాదేనోద్వేష్టనం పునః. (ఉద్వేష్టనమ్—8)
తాడనం చరణాగ్రేణ భువః ఖుత్తాఽభిధీయతే (ఖుత్తా-9) 8

అర్ధస్ఖలితికా తిర్యగేకాంఘ్రేః స్ఖలనం స్మృతా. (అర్ధస్ఖలితికా—10)
లీలయాంగలతా యత్రవలితా చరణం భవేత్
ఉద్వృత్తం ప్రావృతం తత్స్యాత్ పుష్పేషోః కేలికాననమ్. 9
(ప్రావృతమ్—11)

పృష్ఠతశ్చరణోత్క్షేపం పృష్ఠోత్క్షేపం ప్రచక్షతే. (పృష్ఠోత్క్షేపః—12)
పశ్చాన్నిక్షిప్య యత్రాంఘ్రిం లీలయాగ్రే ప్రసార్యచ
మహీ నికుట్యతే తేన లతాక్షేపస్స ఇష్యతే. (లతాక్షేపః—13) 10

అగ్రేణ కుంచితస్యాంఘ్రేః అగ్రేస్థానం నికుట్టకః. (నికుట్టకః—14)
అగ్రతః పృష్ఠతః పాదౌ భవేతాం పార్శ్వతోఽథవా
యుగపత్ స్ఖలితౌ యత్ర సా సమస్ఖలితా మతా. (సమస్ఖలితా—15) 11

ఆజానునః స్థితస్యాంఘ్రేః కుంచితస్య పరస్యచేత్
ఉత్క్షేపః స్యాత్ పురః పశ్చాద్యత్రోత్క్షేపః స ఉచ్యతే. 12
(ఉత్క్షేపః—16)

**అష్టావింశతిపాటాః**

[1]దేశీనృత్తపయోరాశేః ప్రేక్షకాణాం మనోహరాః
విచిత్రాః కతిచిత్ పాటమణయోఽస్మాభిరుద్ధృతాః
యౌగికైర్నామభిస్సర్వే విజ్ఞేయాస్తే మనీషిభిః. 13

1. శార్దూల కోహలసంవాదరూపమగు 'సంగీతమేరుః' అనుగ్రంథమున, నారద రచితమైన 'దేశీనృత్తసముద్రము' అనుగ్రంథము పేర్కొనబడినది సంగీతరత్నాకరవ్యాఖ్యాత, కల్లినాథుడుదాహరించినాడు (చూ అడయారుము. అధ్యా-౭ పు. ౧౧౨) పరిష్కర్త పీఠిక పు. ౮౦.

ఆ చుట్టిన పాదమునే మరల వెనుకకుదెచ్చి చాచుట ఉద్వేష్టనము.
(ఉద్వేష్టనము—8)

కాలికొనచే నేలను తట్టుట ఖుత్తయనబడును. (ఖుత్త—9) 8

ఒకపాదమును అడ్డముగా జార్చుట అర్ధస్ఖలితము. (అర్ధస్ఖలితము—10)

లీలతో అంగలతను త్రిప్పి, పాదమును ఉద్వృత్తము చేసినది ప్రావృతము; ఇది మన్మథుని ఆటపూదోట వంటిది. (ప్రావృతము—11) 9

వెనుకకు అడుగునుఎత్తిచాచుటపృష్ఠోత్క్షేపమందురు.(పృష్ఠోత్క్షేపము—12)

అడుగును వెనుకపెట్టి, లీలతో ముందరికి చాచి, నేలను తట్టుట, లతాక్షేపమనదగును. (లతాక్షేపము—13) 10

కుంచితమైన కాలికొనతో ముందునిలుచుట నికుట్టకము. (నికుట్టకము—14)

పాదములు రెండును ఒకచేసారి ముందుకుగాని, వెనుకకుగాని, ప్రక్కకుగాని, జారుట సమస్ఖలితము. (సమస్ఖలితము—15) 11

కొంచెముగా ముడిగి నిలిచిన కాలిమోకాలివరకును, ఇంకొకకాలు ముందును, వెనుకను ఎత్తివేయుట ఉత్క్షేపమనబడును. (ఉత్క్షేపము—19) 12

**ఇరువదియెనిమిదిపాటములు**

'దేశీనృత్తసముద్రము' నుండి చూచువారి మనసులను హరించు విచిత్రములైన మణులవంటి పాటములు[1] కొన్ని యిచట మేమెత్తి చూపుదుము. వాని పేర్లన్నియు యౌగికములు (సార్థకములు) గా బుధులు గమనింపదగును. 13

1. పాదమణి – పాటమణి – పాదపాటము – అనియు ఇవి పేర్కొనబడినట్లున్నది. పాదపాటమునకు లక్షణము వేమభూపతి సంగీతచింతామణిలో నిట్లున్నది:

"పాటాక్షరాణి వాద్యానాం పాదపాతై(తై?)ర్నిరంతరైః స్ఫుటముచ్చారయం తీవ పూర్వకాయమచంచలమ్, రేఖాసౌష్ఠవ సంపన్నం దధానా యత్రనర్తకీ, నర్తనంకురుతే సోఽయం పాదపాటః ప్రకీర్తితః" (చూ. భరతకోశము. పు. ౩౬౫)

(ఎడతెగని కాలితట్టులచే వాద్యముల పాటాక్షరములను – తరికిట మొదలగు వానిని – స్పష్టముగనుచ్చరించుచునదానివలె, రేఖాసౌష్ఠవములుగల పూర్వాంగమును కదలింపక, నట్టువకత్తె నర్తించుట పాదపాటమనబడును.)

ఊరుద్వితయ పార్శ్వోరు వ్యత్యాస స్వస్తికత్రిభిః[1]
తలపార్శ్వక్రమైశ్చస్యాత్ పూర్వైర్వస్తాడితమష్టధా. 14

సమ స్వస్తిక పర్యాయ పృష్ఠ విచ్యుత పార్శ్వతః
పరం షడ్విధముద్వృత్తం తతః స్వస్తికవిచ్యుతమ్, 15

స్యాత్ తలోద్ఘట్టితం పాదతలోద్ఘట్టిత సంజ్ఞకమ్
కలనూపురకం చిత్రలుఠితే కుడుపాలగే, 16

చతుష్కోణం త్రికోణాఖ్యమథ మంజీరశింజితమ్
కుచుంబినీ షడశ్రంచ లంఘితప్రతిలంఘితమ్
ఇత్యష్టావింశతిః ప్రోక్తాః పాటాః పాటవిచక్షణైః. 17

తలాభ్యాం తాడయేదూరూ సముత్ప్లుత్య పరస్పరమ్
జవేనక్రమశోయత్ర తదూరుద్వయతాడితమ్ 18

(ఊరుద్వయతాడితమ్—1)

పాదమభ్యంతరావృత్త్యా స్వపార్శ్వ గమితం తతః
తిష్ఠంతమంగులీ పృష్ఠే తలేనోరు (రుం ?) యదాపరః
తాడయేత్ కథితం తజ్జ్ఞైః తదా పార్శ్వోరుతాడితమ్. 19

(పార్శ్వోరుతాడితమ్—2)

ఏకస్యాంగులిపృష్ఠేన ద్వితీయస్య తలేన చ
యత్రపాదస్య పర్యాయాదసకృత్ తాడయేన్మహీమ్
తిష్ఠన్వా దిశుగచ్ఛన్వా తత్ స్యాత్ వ్యత్యాసతాడితమ్. 20

(వ్యత్యాసతాడితమ్—3)

---

1, 'స్వస్తికాత్స్త్రిభిః' అను ముద్రితపాఠమసంగతము. పరిష్కర్త (Notes P. 32) సూచించిన అన్వయమును సరిగాతోపదు. ఐదవ 'తాడితము', 'త్రితాడితము' గాని 'వితాడితము' గాదు. భరతకోశమునందలి 'త్రితాడితము'నకు వేమభూపతి సం. చిం. లక్షణము చూచునది. అట్టిప్రకారముగా పైసవరణ సూచించితిని.

ఊరుద్వయతాడితము, పార్శ్వోరుతాడితము, వ్యత్యాసతాడితము, స్వస్తిక తాడితము, త్రితాడితము, తలతాడితము, పార్శ్వతాడితము, క్రమతాడితము - ఇట్లు తాడితపాటము ఎనిమిది విధములు. 14

సమోద్వృత్తము, స్వస్తికోద్వృత్తము, పర్యాయోద్వృత్తము, పృష్ఠోద్వృత్తము, విచ్యుతోద్వృత్తము, పార్శ్వోద్వృత్తము, - ఇట్లు ఉద్వృత్తము ఆరు విధములు. 15

ఆపై స్వస్తికవిచ్యుతము, పాదతలోద్ఘట్టితము, కలనూపురము, చిత్రము, లుఠితము, కుడుపము, అలగము, చతుష్కోణము, త్రికోణము, మంజీరశింజితము, కుచుంబిని, షడశ్రము, లంఘిత ప్రతిలంఘితము, - ఇట్లు పాటములు, ఇరువది యెనిమిది, పాటవిచక్షణులు చెప్పినారు. 15, 16, 17

మీదికెగసి, అరకాళ్ళచే, వేగముగా, ఒకదాని తర్వాత మరొక్కటిగా, అన్యోన్యముగా, తొడలను తట్టుట, ఊరుద్వయతాడితము. 18

(ఊరుద్వయతాడితము—1)

ఒకపాదమును లోమొగముగాచుట్టి, దానిప్రక్కయందే వ్రేలికొనపై నిలిపి, మరొక్కకాలి యరకాలిచే దానితొడను తట్టుట, పార్శ్వోరుతాడితమని తెలిసిన వారందురు. (పార్శ్వోరుతాడితము—2)

ఒకకాలివ్రేలివీపుమీద, ఇంకొకదాని యరకాలిపై, నిలిచికాని, దిక్కులు తిరుగుచుగాని, మార్చి మార్చి పలుమారు నేలతట్టుట, వ్యత్యాసతాడితమగును. (వ్యత్యాసతాడితము-3) 20

సమస్థితస్య పాదస్య పృష్ఠే స్వస్తికమాచరన్
ఏకాంఘ్రిరంగులీపృష్ఠైః తిష్ఠేదన్యస్య పార్శ్వగః, 21

తద్వత్ స్యాద్యత్ర పూర్వస్తు తలేనావనితాడనమ్,
విదధీత సమాఖ్యాతమేతత్ స్వస్తికతాడితమ్. (స్వస్తికతాడితమ్-4) 22

అంగులీపృష్ఠ పార్ష్ణిభ్యాం తలేనాపి మహీతలమ్
నిహత్య విరతే పాదే పార్శ్వమన్యోవ్రజేన్నిజమ్,
నిఘ్నన్నుర్వీం ముహుర్యత్ర తద్వి (త్రి ?) తాడితముచ్యతే. 23
(వి (త్రి ?) తాడితమ్—5)

అంగులీపృష్ఠభాగేన పురః పూర్వముఖాంఘ్రిణా
స్థిత్వా, పరేణ తత్పార్ష్ణిభాగే తిర్యఙ్ముఖేన చ, 24

తలాభ్యాం క్రమశోఽయత్ర సశబ్దం తాడనం భువః
పర్యాయేణ విధీయేత తదుక్తం తలతాడితమ్. (తలతాడితమ్—6) 25

ఉత్ప్లుత్య పార్శ్వయోరంఘ్ర్యోః పర్యాయేణద్రుతం మహీమ్
తాడయేత్తలపృష్ఠాభ్యాం యత్రతత్ పార్శ్వతాడితమ్. 26
(పార్శ్వతాడితమ్-7)

పాదయోరంగులీ పృష్ఠభాగైస్తిష్ఠన్ ముహుః క్రమాత్
తలాభ్యాం తత్రక్రమేణైవ సశబ్దం తాడనం భువః,
యత్రకుర్వీత తత్తద్జ్ఞైః కీర్తితం క్రమతాడితమ్. 27
(క్రమతాడితమ్—8)

ఉత్ప్లుత్య యుగపత్ పాదౌ తిష్ఠతోంగులిపృష్ఠతః
అన్యోన్యసంముఖీభూతతలౌ యత్రముహుర్ముహుః, 28

తాడయంతౌ ధరాపృష్ఠం తలాభ్యామంతరాంతరా
సమోద్వృత్తమిదం ప్రోక్తందేశీనృత్తవిశారదైః. 29
(సమోద్వృత్తమ్—9)

సమస్థితియందున్న ఒకపాదమువీపుపై, ఇంకొకపాదము స్వస్తికము చేయుచు, ఆప్రక్కయందే, వ్రేళ్ళవీపులపై నిలువవలెను ; మొదటిపాదము అరకాలితో నేలను తట్టవలయును ; అది స్వస్తికతాడితమనబడును. (?) 21, 22
(స్వస్తికతాడితము—4)

వ్రేళ్ళమీదిభాగముచే, మడమచే, అరకాలిచే, నేలను తట్టి, ఒకకాలు విరమించిన పిదప, ఇంకొకకాలు నేలను తట్టుచు, తనప్రక్కసాగుట వి (త్రి ?) తాడితమనబడును. (వి (త్రి ?) తాడితము—5) 23

మొదలు పూర్వముఖముగానున్న యొకపాదము వ్రేళ్ళమీద నిలిచి, దాని మడమవద్ద అడ్డమొగముగా ఇంకొకపాదమును నిలిపి, అరకాళ్ళచే మార్చి మార్చి చప్పుడగునట్లు నేలను తట్టుట, తలతాడితమగును. (తలతాడితము—6) 24, 25

ఎగసి నిలిచి, కాళ్ళతల-పృష్ఠములతో పర్యాయమున, వేగముగా ప్రక్కలందలి నేలను తట్టుట, పార్శ్వతాడితము. (పార్శ్వతాడితము-7) 26

క్రమముగా పాదముల మునివ్రేళ్ళమీద నిలిచి, అరకాళ్ళచే క్రమముగానే శబ్దమగునట్లు పలుమారు నేలను తట్టునది, క్రమతాడితమందురు. 27
(క్రమతాడితము—8)

పాదములు రెండును ఒకమారే యెగసిపడి, అంగుళిపృష్ఠములమీద నెలకొని, ఒకదానికొకటి యెదురుమొగముగానుండి, నడుమ నడుమ పలుమారు నేలను అరకాళ్ళచే తట్టుచుండునేని, అది సమోద్వృత్తమని దేశినృత్తవిశారదులందురు. (సమోద్వృత్తము—9) 28, 29

ఉత్ప్లుత్య స్వస్తికాకారౌ పరాఙ్ముఖతలౌ మిథః
పాదావంగులిపృష్ఠేన తిష్ఠతః పృథివీం ముహుః
తలాభ్యాం తాడయే [తాంచ] స్వస్తికోద్వృత్తనామని. 30
(స్వస్తికోద్వృత్తమ్-10)

స్థితయోరంగులీ పృష్ఠైరంఘ్ర్యోరేకః పురోవ్రజేత్
అపరః పృష్ఠతశ్చైవ పర్యాయేణముహుః క్రియామ్
ఉత్ప్లుత్యోత్ప్లుత్య కుర్వీత పర్యాయోద్వృత్త సంజ్ఞకమ్. 31
(పర్యాయోద్వృత్తమ్–11)

కృత్వార [ముహుః ?] సమోద్వృత్తౌ తలేనాస్పృష్టభూతలౌ
[1]కరౌ సమాశ్రితౌ (?) పృష్ఠపార్శ్వాభిముఖపార్శ్వ (శ్లి ?) కౌ
తిష్ఠతో యత్రచరణౌ పృష్ఠోద్వృత్తం తదిష్యతే. 32
(పృష్ఠోద్వృత్తమ్–12)

పృష్ఠస్వస్తిక విశ్లేషాదేతదేవ కృతం యది
దేశీనృత్తరహస్యజ్ఞైః విచ్యుతోద్వృత్తముచ్యతే. 33
(విచ్యుతోద్వృత్తమ్-13)

సమావుత్ప్లుత్య చరణావేకపార్శ్వతలౌ ముహుః
తిష్ఠతోఽంగులి పృష్ఠేన పర్యాయాత్ పార్శ్వయోర్ద్వయోః, 34
మధ్యే మధ్యే మహీపృష్ఠం తాడయంతౌ తలేనయ (చే ?) త్
పార్శ్వోద్వృత్తం తదాప్రాహుః పదపాటవిచక్షణాః 35
(పార్శ్వోద్వృత్తమ్-14)

తిష్ఠంతావంగులీపృష్ఠైః తథైవ రచితోత్ప్లుతీ
స్వస్తికేన చ్యుతిం పాదౌ యుగపత్కురుతో ముహుః
యత్ర తద్ జ్ఞైస్తదాఖ్యాతం నామ్నాస్వస్తికవిచ్యుతమ్. 36
(స్వస్తికవిచ్యుతమ్-15)

1. పాఠము సరిగాతోపదు. కరములకీపాటములలో సంబంధము కానరాదు. తాత్పర్యము స్థూలముగా చేసినది

పాదములు రెండును గెంతివచ్చి, స్వస్తికాకారముతో, పరస్పరము పెడ మొగముగా అంగుళి పృష్ఠమున నిలిచి, అరకాళ్ళతో భూమిని తట్టుట, స్వస్తి కోద్వృత్తము. (స్వస్తికోద్వృత్తము-10) 30

అంగుళిపృష్ఠములపై నిలిచిన రెండు పాదములలో ఒకటి ముందుకును, ఇంకొకటి వెనుకకును, మార్పులతో సాగవలయును ; ఈక్రియను పలుమారు చేయదగును ; ఇది పర్యాయోద్వృత్తము. (పర్యాయోద్వృత్తము-11) 31

సమోద్వృత్తములుగా పాదములను పలుమారు చేసి, అరకాలు నేలను తాకకుండునట్లు, ఒక మడమ వెనుకకును, ఇంకొక్కటి ప్రక్కకును సాగునట్లు నిలుచుట, పృష్ఠోద్వృత్తమగును. (పృష్ఠోద్వృత్తము-12) 32

ఈ పృష్ఠోద్వృత్తమునే పృష్ఠస్వస్తికమునుచేసి విడదీయుచు నడపినచో, అది విచ్యుతోద్వృత్తమని దేశినృత్తరహస్యమెరిగిన వారందురు. 33
(విచ్యుతోద్వృత్తము-13)

సమములైన పాదములు ఎగసిపడి, అంగుళిపృష్ఠము మీద ఒక పార్శ్వమునందే అరకాళ్లు మొగమగునట్లు నిలిచి, నడుమనడుమ పలుమారు అరకాలితో నేలను తట్టుచు, ఇట్లు పర్యాయముతో, ఇరుప్రక్కలను చేయుట, పార్శ్వోద్వృత్తమని పాదపాటవిచక్షణులు పేర్కొందురు. (పార్శ్వోద్వృత్తము-14) 34, 35

అంగుళిపృష్ఠములందు నిలిచి, అట్లే యెగసిపడి పాదములు, స్వస్తికమును, దానివిడుపును, జతగా పలుమారుచేయుట స్వస్తికవిచ్యుతమనబడును. 36
(స్వస్తికవిచ్యుతము-15)

తిష్ఠతో గచ్ఛతోవాం(ఘ్రేః పార్శ్వమన్యః స్వపార్శ్వగః
సశబ్దమంగులీ పృష్ఠతలాభ్యాం లుఠనం(దుతమ్.
యత్రకుర్వీత తత్ప్రోక్తం బుధైర్లుఠితసంజ్ఞయా. (లుఠితమ్-20) 42

పార్శ్వయోరున్ముఖం పార్ష్ణిం వామదక్షిణయోర్దధత్
చరణాంగులి పృష్ఠేన హన్యాద్భూమిం క్రమాత్ పునః
అన్యః సమస్థితో యత్రకులు(డు?) పం తదుదీరితమ్. 43
(కులు (డు?) పమ్-21)

జానుక్షేత్రే స్థితస్యాంఘ్రేః చతుష్కోణం యదాచరేత్
అన్యః ఖే కుంచితోత్క్షిప్తః స్వజానువలనాద్యదా
బుధైరలగమిత్యేష తదా పాటః ప్రకీర్తితః. (అలగమ్-22) 44

సమస్థితస్య పాదస్య పృష్ఠతః పురః క్రమాత్
స్వస్తికం తచ్చ్యుతిం కుర్వన్నుర్వీం హన్యాద్విదిక్షుచేత్
అన్యోఽంఘ్రిరంగులీపృష్ఠైః చతుష్కోణం మతం తదా. 45
(చతుష్కోణమ్-23)

ఏతదేవ త్రికోణం స్యాదగ్రేచేత్ సకృదాహతిః (త్రికోణమ్-24) 46

[1]ఘాతా యత్రాంగులీపృష్ఠైః తాలపాతపురస్సరమ్
పార్ష్ణినాపి తథాకుర్యాదేకాంఘ్రిరపరః పునః. 47

ద్విద్విఘాతాంతరాలే చేత్ తలేనాహతిమాచరన్
నిజపార్శ్వ వ్రజేన్మంజు తదా మంజీరశింజితమ్ ;
త్రి (త్రిః) తాడితద్వితీయాంఘ్రిర్యద్వామంజీరశింజితే. 48
(మంజీరశింజితమ్-25)

1. ఈ శ్లోకార్ధపాఠము సంగతి చాలనిది. అర్థము మసకగానున్నది

నిలిచియున్న, లేక పోవుచున్న పాదముయొక్క పార్శ్వమును, ఇంకొక పాదము తన పార్శ్వమునందేయుండి, అంగుళిపృష్ఠములతో, అరకాలితో, వేగముగా శబ్దము కలుగునట్లు తట్టుట లురితమని బుధులందురు 42

(లురితము—20)

ఒకపాదము సమస్థితిలోనుండగా, ఇంకొకటి తనమడమను కుడియెడమ పార్శ్వములకు సాగించుచు, క్రమముగా అంగుళిపృష్ఠముతో నేలమీద తట్టుట, కులు (డు?) ప మనబడును. (కులు (డు?) పము-21) 43

నిలిచిన పాదముయొక్క మోకాలియొద్ద, ఇంకొకకాలిని ముడిచి, మీదకెత్తి, దానిమోకాలిని త్రిప్పుచు, చతుష్కోణము చేసినచో, అది అలగపాటమని బుధులందురు. (అలగము—22) 44

సమస్థితమైన ఒకపాదమునకు ముందును వెనుకకును, ఇంకొకకాలు క్రమముగా స్వస్తికమును దాని విడుపును, చేసి నాలుగు విదిక్కులందును నేలను అరవ్రేళ్ళతో తట్టుట, చతుష్కోణమనబడును. (చతుష్కోణము-23) 45

ముందరిప్రదేశమున ఒకతూరినేలను తట్టినచో, ఇదే త్రికోణమగును. 46

(త్రికోణము—24)

తాళపుదెబ్బకు సరిగా (?) అరవ్రేళ్ళతోను, మడమతోను, ఒకకాలు నేలను మెట్టవలయును; ఇంకొకపాదము రెండు రెండు తట్టులనడుమ అరకాలితో తట్టుచు, తనప్రక్కకు అందముగా జరుగవలయును; అది మంజీరశింజితము; దీని యందు రెండవపాదము త్రితాడితమైననుగావచ్చును. 47, 48

(మంజీరశింజితము-25)

తలాభ్యామస్పృశన్ భూమిం పార్శ్వేద్వృత్తంద్రుతం యదా
విధీయేత (దధీత ?) తదా తద్జ్ఞైః సమాఖ్యాతా కుచుంబినీ. 49
(కుంచుబినీ—26)

సమోద్వృత్తం విధాయాంఘ్రిం (ఘ్రీ ?) పురతస్తిష్ఠతస్సమౌ
అంగులీపృష్ఠభాగేన పృష్ఠోన్ముఖతలౌ, పునః 50

మధ్యేకృత్వా సమోద్వృత్తం పృష్ఠేపి పురతోఽయదా (ధా ?)
ముహురేవం క్రియా యత్ర షడశ్రంత దుదాహృతమ్. 51
(షడశ్రమ్—27)

అగ్రతోఽంగులి పృష్ఠేన [త్ర్య] శ్రీభూయ భువిస్థితమ్
చరణం చరణోఽన్యశ్చేత్ లంఘయేత్ ప్రతిలంఘయేత్,
పర్యాయేణ తదామ్నాతం లంఘితప్రతిలంఘితమ్. 52
(లంఘితప్రతిలంఘితమ్-28)

అన్యేచ సంకరాచ్చైవం మిథస్సౌందర్యకారిణః
పాటా విచిత్రాః కల్పా [కల్ప్యాః] -న [?] చ్ఛకైః ప్రౌఢబుద్ధితః. 53

**దేశీచార్యః**

దేశీనృత్తస్య సంక్షేపం బృహద్దేశ్యాం నిరూపయన్
మతంగోఽకథయత్ పాటలక్షణావసితౌయథా. 54

"స్వబుద్ధ్యా కల్పయిత్వైవమన్యానపి సమాచరేత్"
తతశ్చిరంతనాచార్యాః పాదా [టా?] నుత్పాద్య తాన్ పునః. 55

దేశీచార్య ఇతి ప్రాహుస్తేషాం చరణధర్మతః
శౌమ్యో నాథస్య ఇత్యేతాః కథ్యంతే ద్వివిధాః పునః, 56

అరకాళ్ళ నేలను తాకకుండునట్లు, ద్రుతముగా, పార్శ్వోద్వృత్తము నాచరించుట, కుచుంబిని యనబడును. (కుచుంబిని—26) 49

సమోద్వృత్తము చేసినతర్వాత, అడుగులు సమముగా వెనుకమొగమైన యరకాళ్ళతో, అరవ్రేళ్ళమీద ముందుగడ నిలువవలయును; ఆపై మరల సమోద్వృత్తము నడుమను, వెనుకను, ముందటివలె చేసి, నిలబడవలయును; ఇట్లు పలుమారుచేయుట, షడశ్రమందురు. (షడశ్రము—27) 50, 51

ఒకపాదము అరవ్రేళ్ళమీద త్ర్యశ్రముగా నిలిచియుండగా, ఇంకొకపాదము దానిని పర్యాయముగా దాటి, మరలి వచ్చినచో అది లంఘితప్రతిలంఘితము. (లంఘితప్రతిలంఘితము—28) 52

ఇట్లు మరికొన్నియు, పరస్పర మిశ్రణము చేసియు, అందము కలిగించు పాటములు, విచిత్రములైనవి, ప్రౌఢబుద్ధులు కల్పింపవచ్చును. (?) 53

### దేశిచారులు

మతంగుడు 'బృహద్దేశి' యందు, దేశినృత్తమును సంక్షేపముగా నిరూపించుచు, పాటముల లక్షణము కడపట "ఇట్లే స్వబుద్ధితో మరికొన్నిటిని గూడ కల్పించి చేయదగును" అని చెప్పెను. కనుక, ప్రాచీనులైన యాచార్యులు కొన్ని పాద(ట)ములను కల్పించి, వానిని దేశిచారులనిరి; వాని సంచార ధర్మమును బట్టి, భౌమములని, ఆకాశికములని అవి రెండు తెగలు. వానిని వివరింతుము. 54, 55, 56

దేశీభౌమచారః షడ్వింశతిః

ఆదౌ సమనఖా పార్ష్ణిరేచితా తలదర్శినీ
అర్ధమండలికా తిర్యక్కుంచితాఖ్యాపకుంచితాః, 57

కాతరోత్కుంచితా తిర్యఙ్ముఖా నూపురవిద్ధికా
మదాలసా పరావృత్తా తథా (త్తతలా ?) లంఘితజంఘికా, 58

మరాలా స్ఫురికా చోరువేణీ సంఘట్టితాభిధా
హరిణత్రాసితాభిఖ్యా కరిహస్తా కులీరికా, 59

స్తంభక్రీడనికా నామ్నా రథచక్రోరుతాడితా
సంచారితాఽథ విశ్లిష్టా తలోద్వృత్తాభిధేత్యమూః
భూచార్యోఽపి నిరూప్యంతే వింశతిః షడ్భిరుత్తరాః. 60

ఆకాశికదేశీచార్యః షోడశ

విద్యుద్భ్రాంతా పురఃక్షేపే అవక్షేపాంఘ్రితాడితే
డమరీ భ్రమరీ దండపాదా విద్ధోర్ధ్వజానుకా 61

అలాతాందోలితా సూచీ విక్షేపా హరిణప్లుతా
జంఘాలంఘనికా జంఘావర్తా చేతి ప్రచక్ష్మహే,
ఏతాః షోడశ సంఖ్యాతాశ్చారీరాకాశికాః [శగాః] క్రమాత్. 62

దేశీభౌమచారీణాం లక్షణాని

సమపాదే స్థితౌ స్థానే తిరశ్చ్యైతౌ ప్రసర్పతః
యదాపాదౌ సమాఖ్యాతాతదా సమనఖాభిధా. (సమనఖా—1) 63

స్థానకే యత్ర పార్ష్ణీస్తః పార్ష్ణిపార్శ్వగతాభిధే
రేచితా సా పరిజ్ఞేయా నర్తకైః పార్ష్ణిరేచితా. (పార్ష్ణిరేచితా-2) 64

## దేశిభౌమచారులు ఇరువదియారు

సమనఖము, పార్ష్ణి రేచితము, తలదర్శిని, అర్ధమండలి, తిర్యక్కుంచితము, అపకుంచితము, కాతరము, ఉత్కుంచితము, తిర్యఙ్ముఖము, నూపురవిద్ధము, మదాలసము, పరావృత్త (తల) ము, లంఘితజంఘము,

మరాళము, స్ఫురిక, ఊరువేణి, సంఘట్టితము, హరిణత్రాసితము, కరిహస్తము, కుళీరకము, స్తంభక్రీడనకము, రథచక్రము, ఊరుతాడితము, సంచారితము, విశ్లిష్టము, తలోద్వృత్తము, ఈ యిరువదియారు భూమిచారులు. 57, 58, 59, 60

## ఆకాశికదేశిచారులు పదునారు

విద్యుద్భ్రాంతము, పురఃక్షేపము, అవక్షేపము, అంఘ్రితాడితము, డమరి, భ్రమరి, దండపాదము, విద్ధము, ఊర్ధ్వజానుకము, అలాతము, ఆందోళితము, సూచి, విక్షేపము, హరిణప్లుతము, జంఘాలంఘనకము, జంఘావర్తము, – ఇట్లు ఆకాశికచారులు పదునారు. వీనిని క్రమముగా వివరింతుము. 61, 62

## దేశిభౌమచారుల లక్షణములు

సమపాదస్థానమందు నిలిచిన పాదములు అడ్డముగా జరిగినప్పుడు, అది సమనఖచారియనబడును. (సమనఖము—1) 63

పార్ష్ణిపార్శ్వగతమనబడు స్థానకమునందలి పాదములు రెండును క్రిందుమీదుగా కదలుచుండునది, పార్ష్ణి రేచితమని నర్తకులు తెలియదగును. 64

(పార్ష్ణి రేచితము—2)

సంహతస్థానమాస్థాయ తిర్యంచౌ పృథగాయతౌ
చతురశ్రౌ బాహ్యాపార్శ్వాభ్యాం స్వపా [భ్యాంపా] దౌ తిష్ఠతోయది
యదాతదా సమాఖ్యాతం (తా?) నర్తకైః తలదర్శినీ. 65
(తలదర్శినీ–3)

భూమి పృ [ఘృ] ష్టతలౌ మందం బాహ్యతో భ్రామ్యతః
క్రమాత్
యత్రాంఘ్రీ గచ్ఛతః పశ్చాత్ సాఽర్ధమండలికా మతా. 66
(అర్ధమండలికా–4)

కుంచితం చరణం యస్యాం తిరశ్చీతత్ ముహుః క్రమాత్
స్వపార్శ్వే నిక్షిపేత్ తిర్యక్కుంచితా సా విధీయతే. 67
(తిర్యక్కుంచితా–5)

చరణౌ కుంచితౌ కించిత్ పృష్ఠతో గచ్ఛతః క్రమాత్
యస్యామేషా సమాఖ్యాతా నృత్తజ్ఞైరపకుంచితా. 68
(అపకుంచితా–6)

నంద్యావర్తస్థితౌ యత్ర చరణావపసర్పతః
పశ్చాద్దేశే సమాఖ్యాతా నర్తకైః సకటీతి సా.[1] 69
(సకటీ (కాతరా) -7)

ఉత్క్షిప్యకురు [కుంచి?] తౌ యత్ర చరణౌ పురతః క్రమాత్
విక్షిప్యేతే పురః ప్రోక్తా సేయ ముత్కుంచితాభిధా. 70
(ఉత్కుంచితా–8)

స్థానకే వర్ధమానేతు పాదౌ సవ్యాపసవ్యతః
సరతస్త్వరితౌ యత్రసేయం తిర్యఙ్ముఖా స్మృతా. (తిర్యఙ్ముఖా–9) 71

---

1. మొదటి పరిగణనమున 'కాతరా' అని కలదు. శార్ఙ్గదేవుడును, సోమేశ్వరుడును దీనికి ఆపేరే గ్రహించిరి. వేమభూపతి 'సకటీ' అనుపేరే గ్రహించినాడు (పరి.) జాయన రెంటినిగూడ గ్రహించినట్లైనది

సంహతస్థానమునందుండి, పాదములు చతురశ్రములుగా, అడ్డముగా, ఎడముగా, నిడుపుగా, తమవెలిపార్శ్వములందు సాగుట తలదర్శినియని నర్తకు లందురు. (తలదర్శిని—3) 65

అరకాలితో మెల్లగా నేలను రాచుచు, వెలికి తిరిగి, పాదములు క్రమముగా వెనుకకు పోవుట అర్ధమండలియగును. (అర్ధమండలి—4) 66

కుంచితపాదమును పలుమారు అడ్డముగా నాడించి, దాని పార్శ్వమునందే పెట్టుట తిర్యక్కుంచితము. (తిర్యక్కుంచితము—5) 67

కొంచెముగా ముడిచిన పాదములు క్రమముగా వెనుకకు సాగుట, అపకుంచిత మని నృత్తవేత్తలందురు. (అపకుంచితము—6) 68

నంద్యావర్తస్థానమందు పాదములు వెనుకకు జరుగుట, సకటి (కాతర) యని నర్తకులు చెప్పుదురు. (సకటి (కాతరము) —7) 69

కుంచితములైన పాదములను మీదికెత్తి, వరుసగా ముందరికి విసరివేయునది ఉత్కుంచితమనబడును. (ఉత్కుంచితము—8) 70

వర్ధమానస్థానకమునందు పాదములు కుడియెడమలకు వేగముగా జరిగినచో, అది తిర్యఙ్ముఖమనబడును. (తిర్యఙ్ముఖము—9) 71

స్వస్తికే స్థానకే పాదౌ పార్ష్ణినాఽగ్రతలేన చ
రేచితౌ భవతో యత్రసా స్యాన్నూపురవిద్ధికా. (నూపురవిద్ధా—10) 72

మధ్యమత్తాలసేత్యే (సస్యే ?) వగతిః స్యాదవ్యవస్థితా
యస్యాం చరణయోః సేయం యథార్థాఖ్యా మదాలసా 73
(మదాలసా-11)

పృష్ఠోత్తానతలం పాదో బాహ్యతశ్చేత్ ప్రసారితః
తదా దేశీరహస్యజ్ఞైః పరావృత్తతలా[1] స్మృతా (పరావృత్తతలా-12) 74

ఖండసూచిని చేత్పాదం [తతమాకృష్య] వేగతః
తజ్జంఘా లంఘ్యతేఽన్యేన తదా లంఘితజంఘికా. 75
(లంఘితజంఘికా-13)

నంద్యావర్తే స్థితౌ యుగ్మపార్శ్వౌ పాదాగ్రయోరపి
రేచితౌ చరణౌ యత్ర సర్వతస్సా మరాలికా. (మరాలికా-14) 76

భూపృష్ఠ (స్పృష్ట ?) బాహ్యపార్శ్వాభ్యాం పార్శ్వయోః
సరణం ద్రుతమ్
పురతో [యస్త్వసౌ] (యత్రసా ?) తద్జ్ఞైః స్ఫురితా[2]పరికీర్తితా. 77
(స్ఫురితా-15)

కృతోర్ధ్వైచ్చైః స్వస్తికం పాదం (కృతోర్ధ్వోర్ధ్వః స్వస్తికంపాద-?)[3]
పార్శ్వాభ్యాం పురతో యదా
చరణౌ ఘర్షతో భూమిమూరువేణీ భవేత్తదా. (ఊరువేణీ-19) 78

---

1. 'పరిగణనమున "పరావృత్తా".

2. పరిగణనమున 'స్ఫురికా'.

3. శార్ఙ్గదేవ — వేమభూపాల లక్షణములననుసరించి అన్వయసంగతికొరకు ఈసవరణ సూచించితిని. (సం రత్నా. ౭-౯౮౩ : భరతకో. 'ఊరువేణీ')

స్వస్తికస్థానకమునందు పాదములు మడమలను, అగ్రతలములును. ఇటునటు గదలించుట నూపురవిద్ధమగును. (నూపురవిద్ధము–10) 72

మద్యపానముచే మత్తుగొని మందగించిన వాని నడకవలె, పాదముల నడక అవ్యవస్థితముగా నున్నచో, ఆచారికి మదాలసమని యథార్థమైన పేరు. 73
(మదాలసము–11)

అరకాలిని వెనుకదిక్కుగా మీదికెత్తి, పాదమును బయటికి చాచినచో, అది పరావృత్తతలమని దేశీరహస్యవిదులందురు. (పరావృత్తతలము_12) 74

ఖండసూచి స్థానకమున చాచినపాదమును వేగముగా వెనుకకీడ్చి, దాని చిరుదొడను ఇంకొకపాదముచే దాటించుట, లంఘితజంఘము. 75
(లంఘితజంఘము_13)

నంద్యావర్తమునందు పాదములప్రక్కలు రెండును చేరికయగునట్లుండి, తుది కాళ్ళను అన్నిదిక్కులవాడించుట మరాళిక. (మరాళిక_14) 76

నేలనంటుకొన్న పాదముల వెలిప్రక్కలు, ద్రుతముగా ముందరి పార్శ్వములకు జరుగుట, స్ఫురితమని ప్రాజ్ఞులందురు. (స్ఫురితము_స్ఫురిక-15) 77

తొడలమీద స్వస్తికము చేసి, అడుగుల పార్శ్వములతో ముందరి నేలను రాచుట ఊరువేణి యగును. (ఊరువేణి-16) 78

ముహుర్విషమ సూచిస్థో పాదావుత్ప్లుత్య భూతలే
పతన్ సంఘట్టయేద్యత్రసేయం సంఘట్టితామతా. 79

(సంఘట్టితా—17)

కుంచితే చలితే పాదతలే స్వస్తికతాం గతే
ఉత్ప్లుత్య సంహతేయత్ర పాతితే తామిమాంజగుః
హరిణత్రాసితాభిఖ్యాం చారీం చారీ విచక్షణాః. 80

(హరిణత్రాసితా—18)

సంగ(హ?)త స్థానమాస్థాయ పార్శ్వాభ్యామవనీతలమ్
ఘృష్యతే యత్రపాదేన కరిహస్తేతి తాం విదుః. (కరిహస్తా—19) 81

నంద్యావర్తాభిధం స్థానమాశ్రితా చరణౌయదా
తిరశ్చీనం ప్రసర్ప్యేతే తదాప్రోక్తా కులీరికా. (కులీరికా—20) 82

పార్శ్వే ప్రసారితస్యాంఘ్రేః తలేన స్యాన్ముహుర్యదా
స్థితాంఘ్రి పార్శ్వసంశ్లేషః స్తంభక్రీడనికా తదా. 83

(స్తంభక్రీడనికా—21)

చతురశ్రస్థితౌ పాదౌ పరి(పురః?)[1]శ్లిష్టౌ ప్రసర్పతః
పృష్ఠతోవా యదా ప్రోక్తా రథచక్రా తదా బుధైః. 84

(రథచక్రా—22)

ఏకపార్శ్వస్థ ఉత్ప్లుత్య హన్యాదన్యోరు మంఘ్రిణా
భూస్థితేన సశబ్దంతత్(?)తదాస్యా దూరుతాడితా. 85

(ఊరుతాడితా—23)

ముహురాకుంచితం పాదముత్క్షిప్యాన్యేనయోజయన్[యేత్?]
తలేన చరణా తిర్యగ్యదా సంచారితా తదా. (సంచారితా—24) 86

1. వేమభూప – శార్ఙ్గదేవుల లక్షణమునమసరించి యీ సవరణ సూచించితిని. తేకున్న లక్షణమందలి 'వా' అనుపదమును అసంగతమగును. (చూ. భరతకో. 'రథచక్రా', సం. రత్నా. ౭-౯౭౧)

విషమసూచి స్థానమందలి పాదములతో, పలుమారు ఎగసిపడుచు, నేలను ఘట్టనచేయునది సంఘట్టితము. (సంఘట్టితము—17) 79

కుంచితములై కదలుచున్న అరకాళ్ళను స్వస్తికపరచి, యెగసి ఒండొంటితో చేర్చి, నేలపై పడజేయుట, హరిణత్రాసితయని చారీకోవిదులందురు. 80
(హరిణత్రాసిత—18)

సంహతస్థానకముననుండి కాలియంచులచే నేలను రాచుట, కరిహస్తమన బడును. (కరిహస్తము—19) 81

నంద్యావర్తస్థానమునాశ్రయించిన పాదములు, అడ్డముగా జరుగుట, కుళీరిక యనబడును. (కుళీరిక—20) 82

ప్రక్కకుసాగిన యొకపాదమును, నిలబడిన మరియొక పాదముయొక్క అంచుతో పలుమారు చేర్చుట, స్తంభక్రీడనకము. (స్తంభక్రీడనకము—21) 83

చతురశ్రమునందున్న పాదములు చేరికగానుండి, ముందుకుగాని, వెనుకకు గాని, జరుగుట రథచక్రమని బుధులందురు. (రథచక్రము—22) 84

ఏకపార్శ్వగతస్థానమందుండి యెగసి, నేలమీది పాదముచే ఇంకొకకాలి తొడను శబ్దమగునట్లు తట్టుట, ఊరుతాడితము. (ఊరుతాడితము—23) 85

ఆకుంచితమైన పాదమును, మాటిమాటికిని ఎత్తి, తలసంచరముగానున్న యింకొకపాదముతో అడ్డముగా కూర్చవలెను ; అది సంచారితము. 86
(సంచారితము—24)

స్థానకే పార్ష్ణి విద్ధేఽంఘ్రీ విశ్లిష్టావుపసర్పతః
ఉతాపసర్పతో యత్ర విశ్లిష్టా సా నిగద్యతే. (విశ్లిష్టా—25) 87

పాదయోరంగులీ పృష్ఠభాగేన గమనం పురః
క్రియతే త్వరితం యత్ర తలోద్వృత్త మిదం విదుః. 88
(తలోద్వృత్తమ్—26)

**దేశ్యాకాశికచార్యః షోడశః**

ఘాలస్యోపరి వైక్షిప్రం పాదముత్క్షిప్యకుంచితమ్
స్వపార్శ్వభ్రామితం న్యస్యేత్ విద్యుద్భ్రాంతాభవేత్తదా. 89
(విద్యుద్భ్రాంతా—1)

పాదం కుంచితముత్క్షిప్య ప్రసార్యపురతోఽద్రు(ద్రు?)తమ్
స్వస్థానే నిక్షిపేద్యత్ర పురఃక్షేపేతి తాం విదుః. (పురఃక్షేపా—2) 90

బాహ్యాపార్శ్వేన సంశ్లిష్య పృష్ఠమూరోః పరస్యచేత్
పాదోఽ[న్యః]స్వనితంబస్య సమీపంగచ్ఛతి ద్రుతమ్
అవక్షేపా తదా లక్ష్యవేదిభిః పరికీర్తితా. (అవక్షేపా-3) 91

వైశాఖస్థానకే క్షిప్రముత్ప్లుత్య దివి పాదయోః
తలాభ్యాం తాలికాం దద్యాద్యత్రోక్తా సాంఘ్రితాడితా. 92
(అంఘ్రితాడితా-4)

జానుదఘ్నం సముత్క్షిప్య కుంచితం చరణం ద్రుతమ్
యదాంతర్బహిరావృత్త్యా భ్రామయేత్ డమరీ తదా. (డమరీ-5) 93

ప్రసార్య పురతః పాదం శరీరం భ్రామయేద్బహిః
ద్రుతమన్యతలభ్రాంత్యా యత్రసా భ్రమరీమతా. (భ్రమరీ-6) 94

విశ్లేష్య స్వస్తికం తిర్యగూర్ధ్వమంఘ్రేః ప్రసారణమ్
యత్రసా దండపాదేతి దేశీవిద్భిరుదాహృతా. 95

పార్ష్ణి విద్ధస్థానకమందు విడివడిన యడుగులు ఒండొంటిని చేరుకొనుట, లేదా తొలగుట, చేయునది విశ్లిష్టము. (విశ్లిష్టము—25) 87

రెండుపాదముల అరవ్రేళ్ళమీద వేగముగా ముందరికి నడచుట, తలోద్వృత్త మందురు. (తలోద్వృత్తము_26) 88

### దేశి-ఆకాశికచారులు పదునారు

నుదుటికి మీదుగా వేగముతో కుంచితపాదమునెత్తి, దానిప్రక్కనుండి త్రిప్పి, నేలమీదపెట్టుట విద్యుద్భ్రాంతమగును. (విద్యుద్భ్రాంతము_1) 89

కుంచితపాదమెత్తి, ద్రుతముగా ముందుకుచాచి, దానిచోట దానిని నిలుపుట, పురఃక్షేపమనబడును. (పురఃక్షేపము_2) 90

ఒకకాలి తొడమీదికి వెలిప్రక్కనుండి యింకొకపాదము చేరి, తన పిరుదు దగ్గరకు ద్రుతముగా పోయినచో, అది అవక్షేపమని లక్ష్యవేత్తలు కీర్తింతురు. (అవక్షేపము-3) 91

వైశాఖస్థానకమందు, వేగముతోపైకెగసి అరకాళ్ళతో తాళము వేయుట, అంఘ్రితాడిత మనబడును. (అంఘ్రితాడితము-4) 92

ముడిచిన చరణమును మోకాలిదాక ఎత్తి, లోపలను, వెలుపలను, త్రిప్పుట డమరి. (డమరి-5) 93

ఒకపాదము ముందుకుచాచి, ఇంకొకదాని యరకాలితోగూడ వెలుపలి శరీరమును త్రిప్పుట, భ్రమరియనబడును. (భ్రమరి_6) 94

స్వస్తికమును విడదీసి, పాదమును అడ్డముగా మీదికి చాచుట, దండపాదమని దేశీవిదులు చెప్పినారు. 95

పార్శ్వప్రసారితస్యోరుం స్థితః పాదః కృతాప్లుతిః
తలేన తాడయేత్ సోఽపి స్థితమేనం యది స్పృశేత్
ఊరుపృష్ఠే స్వపార్శ్వేన దండపాదేతి మన్మతమ్. (దండపాదా-7) 96

యత్రోపరితలః పాదః స్వస్తికస్యాగ్రతో భవేత్
ఈషదాందోలితః సేయం విద్ధేతి[1] పరికీర్తితా. (విద్ధా-8) 97

ఊర్ధ్వజానుం వినిష్పాద్య యస్యాం పాదం స(ప్ర?)కంపయేత్
ఊర్ధ్వజానురియం దేశ్యాం చారీ ప్రోక్తా మనీషిభిః. (ఊర్ధ్వజానుః-9) 98

కించిత్ ప్రసారితం పృష్ఠే పాదమన్యేన లంఘయేత్
త్వరితం యత్రసా తద్జ్ఞైః అలాతేతి ప్రకీర్తితా. (అలాతా—10) 99

యస్యామాందోలితః పాదః పృష్ఠతః కుంచితోముహుః
భవేదాందోలితే త్యేషా చతురైః పరికీర్తితా. (ఆందోలితా—11) 100

ఊరుపృష్ఠం ద్వితీయస్య ముహుః పార్శ్వేన సంస్పృశన్
కుంచితః ప్రశ్రితోఽగ్రాంఘ్రిః (సృతాగ్రోఽఘ్రిః)[2] యత్ర సూచీతి
సా స్మృతా. (సూచీ—12) 101

ప్రసార్య పురతోయస్యాం చరణం గగనాంగణే
ముహురాకుంచయేదేతాం (దేషా ?) విక్షేపేతి ప్రవక్ష్యతే. 102
(విక్షేపా—13)

భూయోఽభూయస్సముత్ప్లుత్య ప్రసార్యచరణౌ పతేత్
భూతలే యత్రసా తద్జ్ఞైః వ్యాహృతా హరిణప్లుతా. 103
(హరిణప్లుతా—14)

---

1. 'బద్ధేతి' అని ముద్రి, వ్రాతపొరబాటు గావచ్చును

2 శార్ఙ్గదేవ, వేమభూపతుల, లక్షణమునను సరించి ఈ మార్పు సూచించితిని. 'ప్రశ్రిత' అనుట పాదమునకన్వయించుట సాధ్యముగాదు. (సం. రత్నా. ౭-౧౦౧౪; భరతకో. 'సూచీ)

ప్రక్కకు చాచిన యొకకాలితొడను, నిలిచిన ఇంకొకపాదము అరకాలితో తట్టవలెను; నిలిచిన కాలిని, మొదటికాలు తనప్రక్కనుండి తొడపై తాకవలెను. ఇది దండపాదమని నామతము. (దండపాదము-7) 96

స్వస్తికపరిచిన పాదము, అరకాలు మీది మొగముగా ముందర నిలిచి, యించుక తూగాడుచుండినచో, అది విద్ధమనబడును. (విద్ధము-8) 97

ఊర్ధ్వజానుచారి చేసి, దానియందు పాదమునల్లాడించుట, ఊర్ధ్వజానువను దేశిచారియని పండితులన్నారు. (ఊర్ధ్వజానువు-9) 98

వెనుకకు కొంచెముగా చాచినపాదమును, ఇంకొకపాదముతో వేగముగా దాటుట, అలాతమని తెలిసినవారందురు. (అలాతము—10) 99

పాదమును కుంచించి, వెనుకదిక్కున పలుమారు తూగాడించుట, ఆందోళిత మని చతురులందురు. (ఆందోళితము—11) 100

ఒకపాదమును ముడిగి, చాచినవ్రేళ్ళతో తనయంచుతో రెండవపాదము తొడమీద పలుమారు తాకుట, సూచి యగును. (సూచి—12) 101

పాదమును ముందుకు చాచి, పలుమారు దానిని బయట కొంచెముగా ముడుచుచుండుట, విక్షేపమనబడును. (విక్షేపము—13) 102

పలుమారు గట్టిగా మీదికెగసి, కాళ్ళుచాచి, నేలపై దూకుట, హరిణప్లుత మని విజ్ఞులందురు. (హరిణప్లుతము—14) 103

తిర్యగాకుంచితస్యాంఘ్రే రుద్వృత్త స్యోత్ప్లుతౌ యదా
అన్యేన లంఘయేజ్జంఘాం జంఘాలంఘనికా తదా. 104
(జంఘాలంఘనికా-15)

అంతరభ్రమణస్యాంఘ్రేః తలం పృష్ఠేన జానునా (నః ?)
బాహ్యతో భ్రమతస్తస్య జానుపార్శ్వే వినిక్షిపేత్
అసకృద్యత్ర సాజ్ఞేయా జంఘావర్తాభిధా బుధైః. 105
(జంఘావర్తా-16)

[1]సంకీర్ణచార్యః చతస్రః

పర్యాయేణాగ్ర పాశ్చాత్త్యభాగాభ్యాం తలయోర్ధ్రుతమ్
ప్రసర్పతాం చతుర్దిక్కం చరణౌ యత్రసా బుధైః,
తలసర్పణికాప్రోక్తా పరైః సైవ కులీరికా. (తలసర్పణికా-1) 106

ఆజంఘామధ్యముత్క్షిప్య స్థితస్యాంఘ్రేః పురోయదా
ఊర్ధ్వాధః ప్రేరణైః ద్వితైః గానపాటానుసారిభిః, 107

నూపురం ముఖరీకుర్యాత్ పర్యాయేణ విహాయసి,
తదా హంసరుతం బ్రూతే పాదం జాయచమూపతిః. 108
(హంసరుతమ్-2)

ఆలంబ్యాలంబ్య భూభాగమంగుల్యగ్రైః ప్రసర్పతః
ఆకర్షతా (ంతౌ ?) తలే యత్ర పురతః పృష్ఠతస్తథా
ప్రేరయంతౌ చ చరణౌ సా తిత్తిరిగతి ర్మతా. (తిత్తిరిగతిః-3) 109

ఉత్ప్లుత్య గగనే పద్భ్యాం బద్ధ్వా పద్మాసనం పునః
విశ్లేష్య త్వరితం తిష్ఠేత్ బుధః పద్మాసనాంతరే. 110

---

1. 'ఈ పైని నాలుగు దేశీచారులు, ఈ గ్రంథమునతప్ప ఎక్కడను చెప్పబడలేదు: వీనిని సంకీర్ణాచారు లనవచ్చున'ని పరిష్కర్త సూచన (చూ. అధస్సూచిక)



దక్షిణ
భ్రమణ నర్తనము

ఎగిరిమూకుటయందు, ఇంచుకముడిచి, అడ్డముగా మీదికెత్తిన యొకకాలి జంగను, మరొక్కకాలిచే దాటుట, జంఘాలంఘనకము. 104

(జంఘాలంఘనకము—15)

లోపల తిరిగిన కాలియరకాలు, ఇంకొకకాలి మోకాలిమీద పెట్టవలయును; రెండవకాలు వెలుపల తిరిగి, తనయరకాలిని మొదటికాలి ప్రక్కన పెట్టవలెను. ఇట్లు పలుమారు జేయుట, జంఘావర్తము. (జంఘావర్తము—16) 105

సంకీర్ణచారులు నాలుగు

అరకాళ్ళ ముందటి, వెనుకటి భాగములతో మార్చిమార్చి, నాలుగుదిక్కులను పాదములు జరుగుట తలసర్పణికయని బుధులందురు; దీనినే ఇతరులు కుళీరికయని పేర్కొనిరి. (తలసర్పణిక—1) 106

జంగనడిమిదాక ఎత్తి నిలిపిన పాదము, ముందరిభాగమున, రెండుమూడు మార్లు క్రిందు మీదులుగా కదలుచు, గానపాటములననుసరించి, పర్యాయముగా నూపురమును బయట పలికింపవలెను. ఇది హంసరుతమని జాయసేనాపతి చెప్పును. (హంసరుతము—2) 107, 108

కొనవ్రేళ్ళతో తమ భూభాగమును ఊదియూది, అరకాళ్ళను ఈడ్చుకొనుచు, వెనుకకు ముందుకు త్రోయుచు, పాదములు జరుగుచో అది తిత్తిరిగతి యనబడును. (తిత్తిరిగతి—3) 109

మీదికెగసి, అక్కడనే కాళ్ళతో పద్మాసనమునమర్చి, త్వరతో విడదీసి, నేల మీధ నిలుచుట అంతరపద్మాసనము. 110

వ్యోమ్ని పద్మాసనం బద్ధ్వా కృత్వా తస్య [చ ?] విచ్యుతిమ్
తథై వోపవిశత్యూర్ధ్వాం యత్ర సమ్యక్ సుశిక్షితః. 111
(అంతరపద్మాసనమ్—4)

చారీణాం వ్యోమ భూస్థానాం పాటానామిహ సంకరాత్
హస్తాద్యంగవిశేషాచ్చ భవేదేషామనంతతా
హస్తాద్యంగక్రియాచాత్ర స్యాత్ ప్రయోగానుసారిణీ. 112

**అథదేశీలాస్యాంగాని షట్చత్వారింశత్**

దేశీలాస్యస్య (స్యాంగ ?) భేదానాం ప్రసిద్ధానాం సమాసతః
ప్రవ్యక్తాని విధాస్యామో లక్షణాన్యధునా వయమ్, 113

సౌష్ఠవం స్థాపనా రేఖా డాలిశ్చాలిశ్చలావలిః
లలిస్త్రిక నిరుల్లాసః సుకలాసమురోంఽగణమ్, 114

భావః థరహారం కిత్తుః దేశీకారం నిజాపణమ్
డిల్లాయీ లవణిః గీతవాది (ద్య ?) తాభినయాహ్వయాః, 115

లయః కోమలికాయారః తతోఽనీకీతి సంజ్ఞితః
అంగహారమనోధర్మావంగానంగం (గే ?) వివర్తనమ్, 116

రింఖా ముఖరసః శేవా విహాసీ థసకస్తలమ్
వితలం రసవృత్తిశ్చ తతోమస్రృణతాభిధమ్, 117

[అనుమానం ప్రమాణాఖ్యం] లంఘితాంశగతీ తథా
సుసంధిః పాదపాటాఖ్యం గతిష్ఠం చండనాభిధమ్,
షట్చత్వారింశదిత్యేషా మథలక్షణముచ్యతే. 118

యదుక్తం సౌష్ఠవం స్థానం తదేవాత్రావగమ్యతే
కింతు తస్యావగంతవ్యా ఖర్వతా త్రివిధా నిజైః, 119

చతుర్భిరథవాష్టాభిరథ ద్వాదశభిర్మతా
అంగులైరిహ నర్తక్యాజానువంక్షణనామనాత్, 120

ఇందు మంచిశిక్షగలవాడు పద్మాసనమునాకాశమున కట్టి, విడిచి నేలపై అట్లే కూర్చుండ గలుగును. (అంతరపద్మాసనము—4) 111

ఆకాశచారుల, భూచారుల, పాటముల - కలయిక చేతను, హస్తాదులగు అంగముల భేదముచేతను, ఇవి లెక్కలేనన్నియగును ; వీనియందు హస్తాద్యంగ క్రియలు ప్రయోగముననుసరించి నడపదగును. 112

ఇక దేశీలాస్యాంగములు నలువదియారు

ఇప్పుడు ప్రసిద్ధములైన దేశీలాస్యాంగముల భేదములకు మొత్తముగా లక్షణములను విధించుచున్నాము. 113

సౌష్ఠవము, స్థాపన, రేఖ, డాలము, చాలి, చలావళి, లలి, తృకని, ఉల్లాసము, సుకలాసము, ఊరోంగణము, ఛావము, ధరహారము, కిత్తు, దేశీకారము, నిజాపణము, డిల్లాయి, లవణి, గీతవాద్యత, అభినయము, లయము, కోమలిక, ఓయారము, అనీకి, అంగహారము, మనోధర్మము, అంగము, అనంగము, వివర్తనము, రింఖ, ముఖరసము, రేవ, విహసి, ధసకము, తలము, వితలము, రసవృత్తి, మసృణత, అనుమానము, ప్రమాణము, లంఘితము, అంశగతి, సుసంధి, పాదపాటము, గతిష్ఠము, చండనము - ఇట్లవి నలువదియారు. ఇక వీని లక్షణములను చెప్పుదుము. 114, 115, 116, 117, 118

సౌష్ఠవమను స్థానకము వెనుక చెప్పబడినది. అదే యిందును గమనింపదగినది. విశేషమేమనగా: ఇక్కడ నర్తకి, మోకాళ్ళను, గజ్జను నాలుగో యెనిమిదో పండ్రెండో తన అంగుళాలంత క్రుంగజేసి పొట్టితనము చూపదగును; అది రాజుల యిచ్ఛను, ఆయాదేశముల పద్ధతిని, అనుసరించియుండును ; అంతకుమించి దేహ

ఇచ్ఛయా భూమిపాలానాం తత్తద్దేశానుసారతః
అతః పరంతు ఖర్వత్వం పరం నృత్యేనశోభతే. (సౌష్ఠవమ్—1) 121

రేఖయాలంకృతా రమ్యా స్థితిర్మ్ముఖరసేనచ
నృత్యస్యాభినయానాం యదంతే సా స్థాపనా తదా. 122
(స్థాపనా—2)

అంగానాం యత్రసర్వేషాం మిథశ్శోభా విధాయినామ్
సౌష్ఠవే [సం] నివిష్టానాం స్వతేత్రేషు యదా [?] (త్రసుహితా?) స్థితిః
హారేదఖిలచిత్తాని సా రేఖేత్యభిధీయతే. (రేఖా—3) 123

మందానిల చలత్పద్మదలాంతజ (ర్జ ?) లబిందువత్
నిభృతోఽంగస్య సంచారో నృత్యేఽసౌ డాల ఉచ్యతే. (డాలః—4) 124

మృదుమధ్యలయం తాలసామ్యరమ్యం (మ్య ?) సమాగమమ్ [?]
త్ర్యశ్రత్వబహులం పాదకరకట్యూరుచాలనమ్
సమమేవ భవేద్యత్ర సాచాలిరభిధీయతే. (చాలిః—5) 125

సైవ సాముమ్ఖ్యభూయిష్ఠా సౌష్ఠవం నవిముంచతి
యదాద్రుతలయోపేతా తదాప్రోక్తా చలావలిః. (చలావలిః—6) 126

సంగీతప్రాప్తి సంభూతః తత్సౌందర్యనిరంతరః
ఆనందాతిశయః కోఽపి లలిరిత్యభిధీయతే. 127

తాలచ్ఛందానుగం తిర్యగుపాంగాదివిచాలనమ్
సుకుమారం విలాసాఢ్యం లలి రిత్యూచిరేఽపరే. (లలిః—7) 128

ప్రకారైః శిరసస్తాల లయచ్ఛందానుసారిభిః
గతా యద్వత్ స్థితా తద్వత్ తత్తద్భావ మనోహరైః
రసిక ప్రేక్షకానందదాయినీ తృకని ర్భవేత్. (తృకనిః—8) 129

తాలాత్ ద్విత్రిగుణైః కైర్ఘ్యాత్ భావాభివ్యంజకైర్యదా
శ్లథసంధిభిరంగస్య సూక్ష్మైరుల్లసనం ముహుః. (ఉల్లాసః—9) 130

మును పొట్టిగాచేయుట నృత్యమునందు అందగింపదు. 119, 120, 121
(సౌష్ఠవము—1)

నృత్యముయొక్క యభినయముల తుదలో, రేఖతోను, ముఖరసముతోను అందముగా నిలుచుట స్థాపన. (స్థాపన—2) 122

ఒకటికొకటి అందము కలిగించుచు, అంగములన్నియు సౌష్ఠవమునందు నెల కొని, తమ తమ క్షేత్రములందు తృప్తితోనుండి, అందరి మనస్సులను హరించు రీతి, రేఖ యనబడును. (రేఖ—3) 123

చిరుగాలిచే కదలు తామరాకులోని నీటిబొట్టువలె, నిబ్బరముతో అంగము చరించుట డాలమనబడును. (డాలము—4) 124

పాదములు, హస్తములు, కటి, తొడలును మృదుమధ్యలయకలిగి, తాళము తోడి సామ్యముచే రమ్యముగా చేరుచు, త్ర్యశ్రమే యెక్కువగా, సమము గానే కదలుట చాళియనబడును. (చాళి—5) 125

చాళియే, ఎక్కువగా సంముఖమున, సౌష్ఠవము చెడనీక, ద్రుతలయముతో గూడియున్నచో చలావళియనబడును. (చలావళి—6) 126

గీత నృత్త వాద్యములు నింపుగా లభించుటచే కలిగి, వాని యందముచే ఎడతెగని, అపూర్వమైనయానందము లలి ; తాళగతిననుసరించి ఉపాంగములు మొదలగువానిని సుకుమారముగా నిండువిలాసముతో అల్లాడించుట, లలియని యితరులన్నారు. (లలి—7) 127, 128

ఆడునప్పుడును, నిలిచినప్పుడును, తాళలయముల గతిననుసరించి, ఆయా భావములచే మనోహరములగు శిరోభేదములతో చూచురసికులకానందము నిచ్చు రీతి; తృకనియనబడును. (తృకని—8) 129

తాళమునకంటె రెండుమూడింతలు వేగముతో, భావములను వ్యంజింప జేయుచు, అంగములు, సంధుల బిగువు సడలించి, సూక్ష్మముగా పలుమారు మీదికి కదలుట, ఉల్లాసమగును. (ఉల్లాసము-9) 130

[1]నర్తకీ హారణం [?] గీతవాద్యానాం మధ్యే మధ్యే విధీయతే
శోభనం ప్రౌఢనర్తక్యా సుకలాసం తదాభవేత్. 131

[విధాయ చారీ (రీం ?) లాస్యాంగ పాదాదీనాంతు చాలనమ్
మేలనం గీతవాద్యాభ్యాం విదధాత్యంతరాంతరా
ప్రగల్భా నర్తకీయత్ర సుకలాసం తదుచ్యతే.] (సుకలాసమ్—10) 132

ఊర్ధ్వాధః పురతః పశ్చాత్ స్కంధయోః స్తనయోరపి
ద్రుతం విలంబితం యద్వాలలితం తాలమానతః
పర్యాయాత్ చాలనం యత్ర స్యాదుక్తం తదురోఽంగణమ్. 132
(ఉరోఽంగణమ్—11)

స్యాన్నృత్తసహితం గీతం వాద్యంచ లయసమ్మితమ్
నర్తక్యాః ప్రాప్య హృష్యంత్యాః పుష్యంత్యాః పులకాంకురాన్
నృత్తస్య విరతిః క్షిప్రం భావ ఇత్యభిధీయతే. (భావః—12) 133

భుజావధి యదా శీఘ్రం కంపనం కుచకుంభయోః
సముల్లసతి నర్తక్యాః తదా థరహారం మతమ్. (థరహారమ్—13) 134

స్తనయోః భుజయోః కటోర్యోః స్పందనం తాలసమ్మితమ్
సలీలం నర్తకీ కుర్యాద్యత్ర తత్ కిత్తు కీర్తితమ్. (కిత్తు—14) 135

నానాదేశోద్భవం నృత్యం తత్తద్రీతి మనోహరమ్
అగ్రామ్యం దృశ్యతే యత్ర దేశీకారం తదుచ్యతే. (దేశీకారమ్—15) 136

సౌష్ఠవం రేఖయా యుక్తం ప్రేతుకేచ్ఛాప్రమాణవత్
హస్తానుగత భావార్ద్రదృష్టిభిః సుమనోహరమ్
అప్రయత్నకృతం నృత్యే నిజాపణ ముదీరితమ్. (నిజాపణమ్—16) 137

---

1. పాఠము కలుషము; అస్పష్టము మొదటి శ్లోకార్ధమున, రెండర్ధముల భాగములు కలిసియుండునని పరిష్కర్త చక్కని యూహ. తరువాతి లక్షణశ్లోకము వేమభూపతి సం. చింతా నుండి యుద్ధరించినది. దానికే తెనిగింపు.

చారిని చేసి, లాస్యాంగములు, పాదపాటములు మున్నగువానిని అల్లాడిం
చుచు, నడుమనడుమ గీతవాద్యముల మేళగింపును ప్రౌఢయగు నర్తకిచేయుట,
సుకలాసమనబడును. (సుకలాసము—10) 131

తాళము కొలతననుసరించి ద్రుతముగానో, విలంబితముగానో, లలితముగా
మార్చి మార్చి, మూపులను, స్తనములను క్రిందికి మీదికి, ముందువెనుకలకు
కదలించుట, ఉరోఙ్గణమందురు. (ఉరోఙ్గణము—11) 132

నృత్తము, గీతము, వాద్యము - ఈమూటిని, లయసమ్మితముగా సాధించి,
సంతోషించి, పులకలు నించుకొన్న నర్తకి, వేగముగా నృత్తమును ముగించుట,
భావమనదగును. (భావము—12) 133

చనుగడవలను భుజములవరకును శీఘ్రముగా ముందుకు కదలించుట, థరహార
మగును. (థరహారము—13) 134

స్తనములను, భుజములను, కటిభాగములను, తాళమునకు సరిగా లీలతో
నర్తకి కదలించుట, కిత్తు అందురు. (కిత్తు—14) 135

నానాదేశములందు పుట్టిన, అగ్రామ్యమైన నృత్యము, ఆయారీతులచే
అందముగా చూపుట, దేశీకారమనబడును. (దేశీకారము—15) 136

రేఖతోగూడి, చూచువారి యిష్టమునకు తగిన కొలత గలిగి, భావార్ద్రము
లైన చూపులు హస్తముల వెంటసాగుచు, మనోహరమైయుండగా, ప్రయత్నము
లేక చేయు సౌష్ఠవము, నిజాపణమందురు. (నిజాపణము—16) 137

భావార్ద్రిహృదయం పేలాపుంథరామంద సౌష్ఠవమ్
శ్లథం మధురమంగం చేత్ డిల్లాయాకథితా తదా. (డిల్లాయీ—17) 138

యత్రాంగానాం ప్రయోగేషు నమనం దుష్కరేష్వపి
అక్రమేణ భవేత్ సేయం లవణిః ప్రణిగద్యతే. (లవణిః—18) 139

సుగీతవర్ణకాకుభ్యాం సదృశస్య లయేన చ
వాద్యస్యానుగుణం నృత్యేత్ యత్రసా గీతవాద్యతా.[1] 140
(గీతవాద్యతా—19)

[2]గీతవాద్యేఽనుకరణాన్యంగ హారాంశ్చ......
............... యథావద్విదధీతచేత్ 141

అంగై శ్చేతోహరై ర్భావగర్భై రభినయ స్తదా ;
గీతార్థాభినయో [ఽన్యైస్తుగణ్యతేఽ] భినయః పునః. 142
(అభినయః—20)

ప్రవర్తమానే ఏకస్మిన్నవా యత్రపరాలయా
యోజయంత్యా యథాయోగ్యం నర్తక్యాపి ప్రగల్భయా
నృత్యేతే (నర్త్యతే ?) చక్రవచ్చారు నృత్యేఽసౌ లయ ఉచ్యతే. 143
(లయః—21)

లయక్రీడాభిరంగానాం వ రసాం ఏలనాదిభిః
సజ్యతే సుకుమారాభిరార్ద్రితా మనసో భృశమ్,
తన్వంగ్యా సహజా నృత్యే సేయం కోమలికా మతా. 144
(కోమలికా—22)

1. ఇందు రెండు లాస్యాంగము లున్నవని పరిష్కర్త సూచన. (క్రిందిసూచిక చూ.) ఇది ఒకటిగా భావించి రాబోవు 'అంగమనంగం' అనునది రెండుగా భావింప వచ్చును.

2. ఇందు గ్రంథలోపము. ఉన్నది కలుషితము. ఈ లాస్యాంగలక్షణము ఇతరత్ర కానరాదు. పరిష్కర్త సూచన ననుసరించి స్థూలదృష్టితో తాత్పర్యము వ్రాయ బడినది.

భావార్ద్రమైన హృదయము గలిగి, హేల (శృంగారప్రౌఢిమ) చే మందమై, సౌష్ఠవమునిండి, అంగము సడలి, మధురముగా నుండుట డిల్లాయి. 138
(డిల్లాయి—17)

దుష్కరములైన ప్రయోగములందును శ్రమలేక, అవయవములు వంగగల్గుట లవణియందురు. (లవణి—18) 139

చక్కగా పాడబడిన వర్ణము (పాట) తో, కాకువు (భావము వెలువరుచు ధ్వని మార్పు) తో, లయతో, సమముగా సాగిన వాద్యమునకనుగుణముగా, నృత్యము చేయుట, గీతవాద్యతయగును. (గీతవాద్యత—19) 140

గీతవాద్యమందుఅనుసరించి, కరణములను, అంగహారములను, భావగర్భములై మనోహరములైన యంగములతో, యధావిధిగా చేయుట, అభినయమగును; గీతముయొక్క అర్థము నభినయించుట, యభినయమని ఇతరులు గణింతురు.
(అభినయము—20) 141, 142

ద్రుతమధ్యవిళంబితములలో, ఏదోయొక లయ నడచుచుండగా, ప్రౌఢురాలైన నర్తకి, క్రొత్తగా తక్కిన రెండు లయలును తగినట్లు చేర్చి, చక్రమువలె తిరుగుచు, అందముగా నాడుట, నృత్యమున, లయయందురు. (లయ—21) 143

సుకుమారముగా అంగములను జరుపుట, త్రిప్పుట, మున్నగు లయక్రీడలచే, నర్తకియగు సుందరి మిక్కిలి హృదయమునకు సహజమైన తంపును, నృత్యమున గలిగించుట, కోమలికయనబడును. (కోమలిక—22) 144

నృత్యస్యావయవాః పూర్వప్రక్రాంతాస్తాలయుక్తిభిః
గత్యా సర్వాంగశోభిన్యా వర్ధేరన్నుత్తరోత్తరమ్
నర్తక్యాశ్చతురాయాశ్చేత్ ఓయారః కీర్తితస్తదా. (ఓయారః—23) 145

గీతావాద్యే యదా తాలలయేచ స్ఖలనం వినా
నర్తకీ తనుతే నృత్తం తదాఽనికీతి కీర్తితా. (అనికీ—24) 146

స్మరచాపలతేవాంగయష్టిః పార్శ్వద్వయేన చేత్
సవిలాసాకుంచితా తాలలయా వినమతిక్రమాత్
హారణాదంతరంగాణా మంగహార స్తదామతః. (అంగహారః—25) 147

ఉపదిష్టాత్ పృథగ్దృష్ట్యా మనోవృత్త్యానుకూలయా
హస్తాద్యంగక్రియాయోగం ప్రాప్తయావ్యంజితోగుణః
కోఽప్యపూర్వో మనోహారీ మనోధర్మోని గద్యతే.
(మనోధర్మః—26) 148

నృత్తే యల్లాస్యముద్దిష్టం నిజై రంగై స్తదాన్వితమ్
అంగమిత్యుచ్యతేఽనంగం తాండవాంగతరంగితమ్.
(అంగం, అనంగంచ—27, 28) 149

కరణ భ్రమరీ పాదచారీ హస్తైర్యథోచితమ్
వాద్యాక్షరసమం నృత్యేద్యత్ర తత్ స్యాద్వివర్తనమ్.
(వివర్తనమ్—29) 150

ఉద్ధృత్య చాలయిత్వాంగం ఆహరంతీ సవిభ్రమమ్
జనం వంచయమానేవ పార్శ్వతః పురతోఽథవా
నర్తకీ తనుతే నృత్తం యదా ఝుంకా తదామతా. (ఝుంకా—30) 151

తత్తన్నృత్తోచితాభీష్ట నేపథ్యరచనాభువః
ప్రసన్నముఖరాగస్య కాంతిర్ముఖరసః స్మృతః. (ముఖరసః—31) 152

ఉత్తరంగౌ యదాఽపాంగౌ స్వభావాద్భావగర్భితౌ
నర్తనే వామనేత్రాయాః స్యాతాం శేవా తదామతా. (శేవా—32) 153

మొదలుపక్రమించిన నృత్యావయవములు తాళముతోగూడి, ఉత్తరోత్తర ముగా సర్వాంగసుందరమైన నడకతో, చతురురాలగు నర్తకి యాటలో, పెరుగు చుండుట ఓయారమని చెప్పబడును. (ఓయారము—23) 145

గీతవాద్యములందు, తాళలయములందు, ఎక్కడగాని తప్పులేక, నర్తకి నృత్తము చేయుట అనీకి యనదగును (అనీకి—24) 146

తీగవంటిదేహము, మన్మథుని ధనుర్లతవలె, విలాసము గలిగి, తాళలయము లతో మేళగించుచు, క్రమముగా ఇరుప్రక్కలందును వంగుట, చూచువారియంత రంగములను హరించునదిగావున, అంగహారమనబడును. (అంగహారము—25) 147

చెప్పిపెట్టిన దానికంటె వేరుగా, మనోవృత్తికి తగిన చూపుతో, హస్తములు మొదలైన యంగముల క్రియలు చేర్చి, నర్తించినప్పుడు, అపూర్వముగా, మనో హరముగా, వ్యంజితమైన ఒకానొక గుణము మనోధర్మము. 148
(మనోధర్మము—26)

నృత్తమున తనయంగములతో గూడిన లాస్యము అంగము; తాండవాంగ ములు గలిగినది అనంగము. (అంగము, అనంగము—27, 28) 149

కరణము, భ్రమరి, పాదము, చారి, హస్తము — వీనితో వాద్యాక్షరములకు సరిగా నర్తించుట వివర్తనమగును. (వివర్తనము—29) 150

అంగమును మీదికెత్తి, చలింపజేసి, విభ్రమముతో ఆహరించుచు (వెనుక కొదిగించుచు) జనులను వంచించుదానివలె, ప్రక్కలలోగాని, ముందుగడలోగాని, నర్తకి యాడుట, ఝుంక యనదగును. (ఝుంక—30) 151

ఆయానృత్తములకుచితమైన, తనకు రుచించిన, నేపథ్యమును చేసికొనుటచే గలిగిన, ప్రసన్నమైన, ముఖరాగపుకాంతి, ముఖరసమందురు. 152
(ముఖరసము—31)

స్వభావముగనే, నిలకడలేనివగు వామనేత్రి కనుగొనలు, నర్తనమున భావ గర్భితములగుట లేవయనబడును. (లేవ—32) 153

స్మితం వక్త్రస్య విహాసీ పద్మస్యేవ మనోహరమ్. (విహాసీ—33) 154

చంచరీక సమద్గుచ్ఛ వల్లీ లీలానుకారిణీ
స్తనాధోదేశనమనాత్ యదా త్ర స్తేవ నర్తకీ, 155

వాద్యానుగం విలాసాఢ్యం స్తనాధోనయనం సకృత్
మధ్యే మధ్యే ప్రకుర్వీత నృత్తస్య ధసక స్తదా.[1] (ధసకః—34) 156

పాటాద్యాః ప్రతిభాసంతే దుష్కరాః సుకరా ఇవ
క్రమాద్యం (దం ?) గ సమాయుక్తాయత్ర తత్తలముచ్యతే. 157
(తలమ్—35)

చారీపాటాదికం యత్ర సుకుమారం నిసర్గతః
కృతం బలేన కఠినమేత ద్వితల మీరితమ్. (వితలమ్—36) 158

సంభోగో విప్రలంభోవా గీతస్యార్థోఽభినీయతే
అంగైర్యథోచితైః నృత్తైః తద్భావాకృష్టచిత్తయా,
నర్తక్యా యత్రభావజ్ఞాః రసవృత్తి మిమాంవిదుః. (రసవృత్తిః—37) 159

అభివ్యంజిత శృంగారా స్నిగ్ధా దృష్టిర్విరాజతే
నృత్తహస్త సఖీయ స్యామియం మసృణతా మతా. 160
(మసృణతా—38)

నృత్తప్రస్తుతయోర్గీతవాద్యయోః సదృశం దృఢమ్
కృతై కభ్రూలతాక్షేపా వితర్కయతి నర్తకీ
డోలాయితమనా యస్మి న్ననుమాన మిదం మతమ్. 161
(అనుమానమ్—39)

ప్రమాణం గీతవాద్యాభ్యాం నృత్తస్య సమతాభవేత్. 162
(ప్రమాణమ్—40)

---

1 ఈ లక్షణ శ్లోకముల పాఠము సరిగానున్నట్లుతోచదు

తామరవలె అందమైన, మోమునవ్వు విహసియనబడును. (విహసి—33) 154

తుమ్మెదలు వాలుటచే వంగిన పూగుత్తులుగల తీగయందముననుకరించుచు, నర్తకి, వెరచినదానివలె, స్తనముల క్రిందివరకును ఒకమారు వంగి, వాద్యముల ననుసరించి సవిలాసముగా, అప్పుడప్పుడు నర్తించుట ధసకమనదగును.
(ధసకము—34) 155, 156

దుష్కరములైన పాటములు మొదలైనవి, క్రమముగా అంగములతో చక్కగా కలిసి, సుకరములవలె తోచుట, తలమనబడును. (తలము—35) 157

స్వాభావికముగా సుకుమారములైన చారులు, పాటములు, మున్నగువానిని బలముచే కఠినపరుచుట, వితలమని చెప్పబడినది. (వితలము—36) 158

గీతార్థము, సంభోగముగాని, విప్రలంభముగాని, దానిభావములచే ఆకర్షింపబడిన మనస్సుగల నర్తకి, ఔచిత్యము మీరని యంగములతో అభినయించుట, రసవృత్తియని భావజ్ఞులు చెప్పుదురు. (రసవృత్తి—37) 159

శృంగారమును తోపజేయుచు, నిద్ధమైన చూపు నృత్త హస్తముల తోడు పాటుతో శోభిల్లుట, మస్రృణత యనబడును. (మస్రృణత—38) 160

నృత్తమున మొదలుపెట్టిన గీతవాద్యములకు సరిగా, దృఢముగా, ఒక్క కనుబొమను పైనికెత్తి, నర్తకి డోలాయితమనస్సుతో, ఆలోచించుట, అనుమానమని చెప్పబడును. (అనుమానము—39) 161

నృత్తము గీతవాద్యములతో సమానముగా నుండుట, ప్రమాణము. 162
(ప్రమాణము—40)

యదా విశ్రమ్య విశ్రమ్య లంఘయంతీ ముహుర్ముహుః
లాస్యస్యావయవాన్ నృత్యేత్ నర్తకీ లంఘితం తదా. 163
(లంఘితమ్—41)

శస్త్రవ్యాయామభేదేషు నర్తనేష్వితరేష్వపి
రమ్యానంశాన్ క్షణం నృత్తే నర్తకీ దర్శయేద్యదా
ఉచితావసరే కాంశ్చిత్ తదాఽంశగతి రుచ్యతే. (అంశగతిః—24) 164

ఖాండవాద్యాత్ పృథగ్ఖాండవాద్యప్రాప్తౌ విచక్షణా
తాలాత్తాలాంతర ప్రాప్తౌ యథా సంధిర్నలక్ష్యతే,
తథాచేన్నర్తకీ నృత్యేత్ సుసంధిః సోఽభిధీయతే (సుసంధిః—43) 165

స్ఫుటముచ్చారయంతీవ వాద్యపాటాక్షరాణిచేత్
పాదపాతైర్విచిత్రైః పూర్వకాయరేఖామముంచతీ
నర్తకీ లలితం నృత్యేత్ పాదపాటస్తదామతః. (పాదపాటః—44) 166

[1]మార్గ (ర్గం ?) దేశీగతం యద్వా సమగ్రం లక్షణాంచితమ్
వాద్యతాలయుతం నృత్తం గతిస్థం ప్రణిగద్యతే. (గతిస్థమ్—45) 167

గీతానుగస్య వాద్యస్య గీతేన రహితస్య చ
ఉచితం నర్తనం కృత్వా తదంతే ప్రౌఢనర్తకీ, 168

నృత్యస్య త్యాగమాధత్తే సౌష్ఠవేనయుతాఽథవా
క్షణం నిష్పందితైరంగైః తిష్ఠేత్ చిత్రార్పితా యథా
యత్ర చండన మిత్యేతన్నర్తకైః ప్రకీర్తితమ్. (చండనమ్—46) 169

**అథ గతిలక్షణమ్**

నర్తనే గతయస్త్రిస్రో ద్రుత మధ్య విలంబితాః
దీర్ఘాల్పతాలకాలేషు సంభవంత్యఖిలేష్వపి. 170

ఏతాశ్శుద్ధాః పునస్తాసాం సంకీర్ణాః సంకరాన్మిథః,
ఆదిమధ్యావసానేషు రాజంతి స్వయమేవయే
తాః శుద్ధాః స్యుః, ద్వయోర్యోగాత్ సంకీర్ణాస్తిసృణామపి. 171

1. 'మార్గదేశీ' అను ముద్రితపాఠము అన్వయశుద్ధి చాలనిది.

ఆగి యాగి, మాటిమాటికి దాటుచు, నర్తకి లాస్యముయొక్క యంగములను నర్తించుట, లంఘితము. (లంఘితము—41) 163

వేరువేరు శస్త్ర వ్యాయామములందు, ఇతరనర్తనములందును, రమ్యములైన యంశములను కొన్నింటిని, ఉచితసమయములందు నర్తకి క్షణకాలము చూపుట, అంశగతియందురు. (అంశగతి—42) 164

ఒక ఖాండవాద్యమునుండి యింకొక ఖాండవాద్యమునకు, ఒకతాళమునుండి యింకొకతాళమునకు, మార్చునప్పుడు సందుకానరానీక, నేర్పరియైన నర్తకి ఆడుట, సుసంధియందురు. (సుసంధి—43) 165

పూర్వకాయమందలి రేఖను పోనియ్యకుండ, నర్తకి, తన పాదపాటములచే వాద్యపాటాక్షరములను స్పష్టముగా ఉచ్చరించుదానివలె, లలితముగా నర్తించుట, పాదపాటమగును. (పాదపాటము—44) 166

మార్గనృత్తమునుగాని, దేశినృత్తమునుగాని, సమగ్రమైన లక్షణముతో, వాద్యతాళయుతముగా చేయుట, గతిస్థమని చెప్పుదురు. (గతిస్థము—45) 167

గీతమునుసరించు వాద్యమునకు, గీతములేని వాద్యమునకును, తగిన నర్తనము చేసి, దాని తుదలో ప్రౌఢురాలైన నర్తకి, సౌష్ఠవముతో గూడి నృత్యమును వదలవలయును; లేదా క్షణకాలము చిత్రమందలి బొమ్మవలె, నిశ్చలములైన యవయవములతో నిలువవలెను; ఇట్లు చేయుట చండనమని నర్తకులందురు. (చండనము—46) 168, 169

ఇక గతిలక్షణము

నర్తనమున గతి-నడక-ద్రుతము, మధ్యము, విళంబితము, అని మూడు తెగలు; తాళముల దీర్ఘాల్పకాలములన్నిటియందును పైమూడువిధములునుఉండగలవు. 170

ఇవి శుద్ధగతులు ; ఒండొంటితో కలిసినప్పుడు సంకీర్ణగతులగును. ఆదియందు, మధ్యమున, తుదలో, ఏ యొక్కటి మాత్రమో వెలయునవి శుద్ధములు ; రెండుగాని, మూడునుగాని మిశ్రమగునవి సంకీర్ణములు. 171

ద్వివార చరణన్యాసం తాలస్యైకస్య మానతః
కుర్వతీ నర్తకీ గచ్ఛేద్యస్యాం సాకథితా ద్రుతా. 172

ఏకవారంతు మధ్యాస్యాత్, తాలమానంతు తత్పునః
[1]ఏకవారమియన్ (రం ద్వయే ?) ధీరైర్వినిర్దిష్టా విలంబితా. 173

విలంబితద్రుతా మధ్యవిలంబా ద్రుతమధ్యమా
తిస్రః స్యుర్వృత్తయస్తాసామితి షట్ సంకరాత్ద్వయోః. 174

తయోరేవతు కస్యాశ్చిదావృత్త్యా సంభవంతి షట్
మధ్యాద్యంతే ద్రుతాద్యంతే విలంబాద్యంతిమే ఇతి. 175

ద్రుతమధ్య విలంబాఽథ మధ్యద్రుత విలంబితా
విలంబద్రుత మధ్యాచ మధ్యలంబిత త [స ?] (తక ?) ద్రుతా, 176

లంబమధ్యద్రుతా తద్వత్ ద్రుతలంబితమధ్యమా
భవంతి(ఏవం త్రి?)సంకరాత్ షట్స్యుః మతా (సంహతా?) ఏకవింశతిః. 177

[2]పరివర్తసమానా (నాం ?) యే తాలానాం నియతా లయాః
మానసామ్యయుజో (జాం ?) యేచ తైరేవ ప్రౌఢయా గతా
నర్తనీయం విపర్యాసాదప్యకోర్ధ్వాంగరేఖయా. 178

ఆదితాలైకతాలాఖ్యమంఠికాప్రముఖా ఇమే
పరివర్తసమాః జ్ఞేయాస్తాలాః తాలవిచక్షణైః. 179

ప్రతితాల ద్వితీయసూఖ్యా నిస్సారుక తృతీయకా
ఏవమాద్యా మిథోజ్ఞేయా తద్జ్ఞైర్మానసమావితి. 180

---

1. పాఠము చెడినది. సవరణ నా సూచన.

2. ముద్రితపాఠమున అన్వయము సుగ్రహముగాదు. నావద్ది వ్రాతప్రతి మీద సూచించిన సవరణలకు సహాయపడినది. కాని యీ 3 శ్లోకముల తాత్పర్యము నాకు స్పష్టపడలేదు.

ఒకతాళపుకొలతకు రెండుమారులు అడుగులు వేయుచు, నర్తకి నడచుట ద్రుతగతి యనబడును. 172

ఒకమారు అడుగువేయుట, మధ్యగతి యగును ; ఇదే తాళపుకొలత. రెండు తాళమానములకొకసారి అడుగువేయుట, విళంబితగతియని పండితులందురు. 173

విళంబితద్రుతము, మధ్యవిళంబము, ద్రుతమధ్యము, - ఇట్లు ఆ గతుల వృత్తులు మూడగును. ఇట్లు రెండుగతులు గలిసి ఆరగును. 174

ఆ రెండు గతులలోనే ఒకదానిని ఆవృత్తిచేసినచో ఆరువిధములగును: మధ్యాది-మధ్యాంతములు, ద్రుతాది-ద్రుతాంతములు, విళంబాది—విళంబాంతములు - ఇట్లు. 175

ద్రుతమధ్యవిలంబితము, మధ్యద్రుతవిలంబితము, విలంబితద్రుతమధ్యము, మధ్యవిలంబితద్రుతము, విలంబమధ్యద్రుతము, ద్రుతవిలంబితమధ్యము, ఇట్లు మూడుగతుల మిశ్రణముచే ఆరుతెగలు; అన్నియుగలిసి యిరువదియొక్క తెగలగును. 176, 177

[1]పరివర్తసమములైన తాళములకును, మానసామ్యముగల తాళములకును, ఏయే లయములు నియమితములైయున్నవో, ఆయాలయములతోనే గతిప్రౌఢిమగల నర్తకి నర్తింపవలయును ; మీదచెప్పిన ఊర్ధ్వాంగరేఖ చెడకుండ వ్యత్యాసము చేసికూడ ఆడవచ్చును. (?) 178

ఆదితాళము, ఏకతాళము, మఠిక మున్నగు తాళములు, పరివర్తసమములని తాళజ్ఞులెరుగదగును. 179

ప్రతితాళ - ద్వితీయములు, నిస్సారుక - తృతీయములు - ఇత్యాదులగు జంటలు మానసమములని తెలియదగును. (?) 180

---

1. "పరివర్తాః గానక్రియాఖ్యావృత్తయః" (అభినవభారతి. సం. ౧; పు. ౨౨౭) గాన క్రియను మరిమరి త్రిప్పిచేయుట పరివర్తము.

గతిరేకసరాఽన్యాతు ద్విసరా త్రిసరా తతః
తిస్రస్తు గతయో దిక్షు సంభవంత్యఖిలాస్వపి. 181

సతాలా సహజా పాదస్మృతిరేకసరామతా
సకృదాద్యం వినిక్షిప్య నిక్షిపేత్ చరణం పరమ్. 182

ఘూఘృష్టనికషే తస్య న్యస్యన్నాద్యం పురస్సరమ్
యస్యాం పర్యాయశోధీరైః ద్విసరేయముదీరితా. 183

అస్యామేవ యదాపూర్వః త్రివారం చరణస్సరేత్
ద్వివారం పూర్వవచ్చాన్యః త్రిసరేతి తదామతా. 184

అగ్రతః పృష్ఠతోఽవర్జ్యం[1] దిక్షు షట్స్వపరాస్వపి
స్వస్తికం ఘటయేత్ పూర్వః పరోవిశ్లేషయన్ సరేత్
ఏతాస్వేవ యదా తాః స్యుః తదా స్వస్తికపూర్వకాః. 185

అనంతాః స్యురిమాశ్చారి పాటలాస్యాంగ సంగతాః. 186

సలీలాః సౌష్ఠవోపేతాః సోల్లాసాః సాక్షివిభ్రమాః
సహస్తకరణాః కస్యగతయో న మనోహరాః. 187

ఇతి

శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవగజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
దేశీపాట-చారీ-లాస్యాంగ-గతిలక్షణం నామ షష్ఠోఽధ్యాయః

1. 'వర్జ్యం' అనుటకు ప్రతి 'వాజ' అను సవరణ పరిష్కర్త సూచన. వాజ — అనగా ప్రక్క. వివరములకు (చూ. Notes P. 35).

ఏకసర, ద్విసర, త్రిసర - ఇట్లు మూడువిధములైన గతులు అన్నిదిక్కు లందును సంభవించును. 181

తాళముతో సరిగా, సహజముగా, అడుగు సాగుట యేకసరయగును. ఒక పాదమునొకసారిపెట్టి, దాని సమీపమున నేలను రాచుచు (?), ఇంకొక పాద మును పెట్టవలెను. మొదటిది ముందుకు సాగవలెను ; ఇట్లు క్రమముగా మార్చి చేయుట ద్విసరగతి యనబడును. 182, 183

దీనియందే మొదటియడుగు మూడుసారులు, రెండవది రెండుసారులును, మొదటివలె నడుచుట త్రిసరయగును. 184

ఈగతులందే ముందు, వెనుక, ఆరుదిక్కులందు, దేనిని వదలక, మొదటి పాదము స్వస్తికమును గూర్చవలయును ; రెండవది దానిని విడిపించుకొనుచు సాగవలెను ; అప్పుడాగతులు స్వస్తికపూర్వకములగును. 185

చారులు, పాటములు, లాస్యాంగములును గలిసినచో ఇవి యనంతము లగును. 186

లీలగలవి, సౌష్ఠవముతో గూడినవి, ఉల్లాసముగలవి, చూపుల విభ్రమము గలవి, హస్తములు, కరణములును గలిసినవి - అగుగతులు ఎవనికి మనోహర ములు గావు ? 187

ఇది

శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవుని గజసాధనికుడగు
జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు
దేశిపాట_చారీ_లాస్యాంగ_గతులలక్షణమను
ఆరవయధ్యాయము

# అథ సప్తమోఽధ్యాయః

**శిక్షాపద్ధతిః**

తిథిస్సర్వా వినా రిక్తాం త్రయోవారాః బుధాదిమాః
హస్తః శతభిషక్పుష్యా వనూరాధో త్తరాత్రయమ్
ధనిష్ఠా రేవతీ జ్యేష్ఠా నృత్యారంభే ప్రశస్యతే. 1

సౌధే కేలివనే రమ్యే శాద్వలేఽన్యత్ర వా శుభే
స్థానే యోగ్యా విధాతవ్యా ; వితానాది విచిత్రితా
స్థిరా శ్లక్ష్ణా సమా గౌరీ కృష్ణావా రంగభూర్మతా. 2

హేమంతే శిశిరే చోష్ణా వసంతగ్రీష్మయోర్హిమా
ఘనాగమాపగమయోః సాధారణగుణా తథా. 3

విఘ్నేశ్వరం సురజ్యేష్ఠం వైకుంఠప్రముఖాన్ సురాన్
భారతీం చండికాం మాతృసమాజం కులదేవతామ్, 4

ఆతోద్యమఖిలం తాలం దండికాం స్థూణయోర్ద్వయమ్
రంగభూమిముపాధ్యాయం కన్యకాంచ యథావిధి, 5

విప్రేణాభ్యర్చయేత్ శుభ్రైః గంధపుష్పాక్షతాంబరైః
ధూపైరారాత్రికైర్దీపైః నైవేద్యైః వివిధైరపి. 6

షట్సప్తవర్ష దేశీయాం గౌరీం యద్వాతు రోహిణీమ్
కన్యాం చార్ధోరుకం గాఢం వసానాం శిక్షయేత్ క్రమమ్,
తతః స్తనోద్గమే జాతే దధానామపి కంచుకమ్. 7

వైణవీం దండికాం శ్లక్ష్ణాం దోషహీనాం సుఖగ్రహామ్
సప్తభిః పర్వభిర్యుక్తాం మూలతో గాత్రవర్తనైః; 8

# ఇక ఏడవ యధ్యాయము

**శిక్షాపద్ధతి**

రిక్తతిథివదలి తక్కినయన్ని తిథులును, బుధ గురు శుక్రవారములు, హస్త, శతభిషము, పుష్యము, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ధనిష్ఠ, రేవతి, జ్యేష్ఠ, అను నక్షత్రములును, నృత్యమునారంభించుటకు ప్రశస్తములు. 1

మేడయందు, కేళీవనమున, రమ్యమైన పచ్చికబయట, శుభమైన యింకొకచోటగాని అభ్యాసము చేయవలయును; రంగభూమి, మేల్కట్టు మున్నగువానిచే అలంకృతమై, గట్టిదై, నున్ననై, సమమై, తెలుపు నలుపులలో ఏదేని యొకవన్నెగలిగి, హేమంత-శిశిరకాలములో వెచ్చదనము గలుగునదియు, వసంత-గ్రీష్మములలో చలువగలదియు, వర్షా-శరత్తులందు సామాన్యగుణము గలదియునై యుండదగును. 2, 3

గణపతిని, చతుర్ముఖబ్రహ్మను, విష్ణువు మున్నగు దేవతలను, సరస్వతిని, చండికను, సప్తమాతృకలను, ఇలువేల్పును, అన్నివాద్యములను, తాళమును, దండికను, రెండుకంబములను, రంగభూమిని, ఉపాధ్యాయుని, కన్యకను, యథావిధిగా తెల్లని గంధపుష్పాక్షత వస్త్రములతో, ధూపములతో ఆరతి దీపములతో, పలువిధముల నైవేద్యములతో, బ్రాహ్మణునిచే పూజచేయింపవలయును. 4, 5, 6

ఆరేడేండ్లప్రాయముగలది, రజోదర్శనములేని గౌరి, లేదా రజోదర్శన ముపక్రమించిన రోహిణి-అగు కన్యకకు, దిట్టముగా అర్ధోరుకమును-చల్లడమును-తొడిగించి సాధన నేర్పవలయును. చనులు మొలచియున్నదానికిని, రవిక తొడిగించి నేర్పనగును. 7

దండిక (చిన్నకర్ర) వెదురిది, నున్ననై, దోషములులేనిది, సుఖముగా పట్టుకొనదగినదియుగా నుండదగును; దానికి బుడమునుండి యేడు కనుపులుండ

గాత్రసౌష్ఠవ సిద్ధ్యర్థం కన్యానాం ప్తనసమ్మితామ్
ప్రాగగ్ర ముదగగ్రం వా స్థూణయోర్వినివేశయేత్. 9

హస్తాభ్యాం దండికాం ధృత్వా నర్తకీ స్థైర్యసిద్ధయే
ఆచార్యస్యోపదేశేన మార్గదేశీ విభాగతః; 10

స్థానాదీన్ సుకరానాదౌ ప్రయోగాన్ దుష్కరాన్ తతః
అభ్యస్యేత్ శనకై ర్నిత్యం యథా శ్రాంతిర్న జాయతే. 11

బుద్ధ్వా సిద్ధాన్ ప్రయోగాంస్తాన్ తాలైః సంయోజయేత్ పునః
అథైతాన్ వక్త్ర వాద్యేన[1] గీతేనాపి క్రమాత్తతః. 12

గురుం సంతోష్య బృందేన సహస్వర్ణాంబరాదిభిః
శుభేహ్ని (ఽహ్ని ?) పూర్వవత్పూజాం విధాయాతోద్యవాదకైః
సార్ధం సర్వేణ బృందేన శ్రమం కుర్వీత నర్తకీ. 13

ప్రౌఢాయామథ నర్తక్యాం గీతే వాద్యేఽథ నర్తనే
పారంపర్యాత్ సమాయాతమభ్యాసస్యాప్యగోచరమ్; 14

శ్లోకానాం పంచకేనాత్ర సార్ధేన ప్రకటీకృతమ్
రహస్యముపదేష్టవ్య మాచార్యేణేద మాదరాత్. 15

గీతస్యావయవానంగైః భావాన్ దృష్టివిచేష్టితైః
హస్తైరర్థం లయం పదాభ్యాం వర్ణాన్ పాఠైః ప్రదర్శయేత్. 16

గీతాక్షరసమం వాద్యమవాద్యం గీతమేవవా
లాస్యాంగైః పాదహస్తాద్యైః తన్మిత్రైః [శ్రైః?] నృత్తమాన
యేత్. [?] 17

1. వక్త్రవాద్యమనగా నోటితో 'తధిగిణ' మొదలగు వాద్యములు జతులను పలుకుట (చూ. 'ముఖవాద్యేషుకోవిదః' అను చో సంగీత రత్నాకర కల్లినాథ వ్యాఖ్య సం. ౪ శ్లో. ౧ ౨౪౯)

వలెను ; దేహమును మలచుటచే అంగసౌష్ఠవము సంపాదించుకొరకు అది కన్యకల స్తనములయెత్తు గలిగినదిగాను ; కోనతూర్పునగాని, ఉత్తరమునగాని యుండు నట్లును కంబములు రెంటికిని గట్టవలయును. 8, 9

నర్తకి, స్థైర్యము సిద్ధించుకొరకు, ఆదండికను రెండు చేతులతో పట్టుకొని, ఆచార్యుడుపదేశము చేసినట్లు, మార్గ-దేశి విభాగముననుసరించి, మొదలు సుకరములైన స్థానకములు మొదలగు ప్రయోగములను, తరువాత కష్టములైన వానిని, నెమ్మదిగా, అలపుగలుగనట్లు, దినమును అభ్యసింపవలెను. 10, 11

పై ప్రయోగములు సిద్ధములైనవని తెలిసికొన్నతర్వాత, వానిని తాళముతో, ఆపై వక్త్రివాద్యముతో, మరి పాటతో, క్రమముగా కలుపవలయును. 12

ఆపై ఒక శుభదినమున తనజట్టుతోగూడి గురువును స్వర్ణవస్త్రములు మున్నగు వానిచే సంతోషపరిచి, మొదటివలె పూజనడపి, వాద్యములు వాయించు వారితోడి నిండుజట్టుతో నర్తకి సాధన చేయవలెను. 13

నర్తకి పాటయందు, వాద్యమునందు, నర్తనమందును నేర్పరియైన తర్వాత, ఆచార్యుడు ఆదరపూర్వకముగా ఈక్రింది యైదున్నరశ్లోకములలో ప్రకటించిన రహస్యము నామెకుపదేశింపదగును ; ఇది పరంపరగా వచ్చినది ; అభ్యాసము చేతను నేర్వరానిది. 14, 15

గీతముయొక్క భాగములను అంగములతో, భావములను దృష్టి చేష్టలతో, అర్థమును హస్తములతో, లయను అడుగులతో, వర్ణములను పాటములతోను చూపవలయును. 16

గీతాక్షరములకు సరియైన వాద్యమును, వాద్యములేని గీతమునైనను, లాస్యాంగములైన పాదములు, హస్తములు మున్నగువాని మిశ్రణముచే నృత్తమున తీర్పవలయును. (?) 17

ప్రాణేశం భావయంతీ స్వం మానసేన సభాపతిమ్
గీతార్థాపతితాన్ భావాన్ వ్యంజయంత్యనురంజయేత్. 18

యేషుయేషు ప్రయోగేషు ప్రేక్షకాణాం రుచిర్భవేత్
సమ్యక్ జ్ఞాతేంగితా కామం భంగ్యాతాంస్తాన్ ప్రదర్శయేత్. 19

రసానాం వినియోగేషు యతో హేతోః కరోభవేత్
దృష్టిర్మనశ్చ భావశ్చ తతఏవ భవేత్క్రమాత్.
రసానాం పునరుత్పత్తిర్భావైర్భవతి భావితైః. 20

**అథ వాద్యపద్ధతిః**

అథ పాత్రస్య నృత్తార్థం కథ్యతే వాద్యపద్ధతిః
మతంగస్య మతే ప్రోక్తా బృహద్దేశీవిధానతః
నృత్తప్రకరణే; శుద్ధా విచిత్రాచేతి సా ద్విధా. 21

**శుద్ధ పద్ధతిః**

సమహస్తో భవేత్తత్ర ప్రాక్ సర్వాతోద్యసంభవః
ప్రావృడారంభ సంరంభ గంభీరాంభోధరధ్వనిః,
రంగప్రత్యూహ శాంత్యర్థం నాయకస్యాపి వృద్ధయే. 22

వాదనాత్ సమహస్తాద్యైః పాత్రైరన్వర్థ సంజ్ఞకః
భృశం సమప్రహారాభ్యాం హస్తాభ్యామపి వాదనాత్. 23

తదను ప్రవిశేద్రంగే సమపాదేన నర్తకీ
కృత సందంశికా కుర్యాత్ వామపాదం నికుట్టితమ్. 24

తన ప్రాణనాథుని మనస్సున భావనచేయుచు, గీతార్థముచే గలుగుభావము లను వెలువరుచుచు, సభాపతిని రంజింపనగును. 18

ఏయే ప్రయోగములందు చూచువారికి రుచి పుట్టునో, చక్కగా ఇంగిత మెరిగి, ఆయా ప్రయోగములను ఇచ్చవచ్చిన రీతిచే చూపదగును. 19

రసముల వినియోగములందు, ఏకారణమువలన హస్తము రూపుగొనునో, అద్దానివలననే దృష్టి, మనస్సు, భావమును క్రమముగా ప్రసరించవలయును; రసములు, భావించిన భావములచే పుట్టును. 20

### ఇక వాద్యపద్ధతి

ఇక పాత్ర నర్తించుటకుపయోగించు వాద్యపద్ధతిని, మతంగుడు 'బృహద్దేశి' యందు, నృత్తప్రకరణమున చెప్పిన మతము ప్రకారము, చెప్పుదును; అది శుద్ధము, విచిత్రము అని రెండు విధములు. 21

### శుద్ధ పద్ధతి

మొదలు అన్నివాద్యములనుండియు సమహస్తము వాయింపు, వర్షాకాలము మొదట సంరంభించు మేఘముల గంభీరమైనయురుమువంటి ధ్వనికలిగి, నడువవలెను; అది రంగస్థలమందు విఘ్నములు శాంతించుటకై, సభానాయకుని యభ్యుదయముకొరకును. 22

సమహస్తము మొదలగు పాటములతో వాయించుటచేత, రెండుహస్తములును సమానముగా గట్టిదెబ్బలు వేయుటచేతను దానిపేరు సార్థకమైనది. 23

ఆపైనర్తకి, సమపాదముతో రంగమందు ప్రవేశింపవలయును. సందంశహస్తమును చేసి, యెడమపాదము నికుట్టితము చేయవలయును. 24

ముఖత్రయేణ కుర్వీత సాంగేన పుటిలం[1] తతః
తత్ర ప్రవర్తయేద్గీతమద్ధై తద్వినివర్తయేత్. 25

కుర్యాన్ముఖత్రయేణాథ పద్దై రంగైః ప్రవేశకమ్,
విదధీత కియత్కాలం గతిం మండికయా తతః. 26

క్రమాత్తదనుయోజేన[2] ఖండయత్యాపదేనచ
మలపేన తథాంగేన ప్రాశైశ్చ సుమనోహరైః. 27

శుష్కవాద్యం ప్రయుంజీత ప్రవేశపదయోః పునః
శంఖకాంస్యాది సంభూతాః మృదంగకరటోద్భవాః[3]
పాటాః విచిత్రతా హేతోర్వాద్యాః శ్రోత్రసుఖావహాః. 28

నిర్దిష్టోఽయం విధిర్నిత్యం భావితాలచతుష్టయే
గీతం మట్టేన తత్రాదౌ కించిత్కాలం ప్రవర్తయేత్ ; 29

తతః పూర్వోక్తమేవాత్ర శుష్కవాద్యం తతః పరమ్
అవచ్ఛేదం తతః కుర్యురవధానపరాయణాః ; 30

స్యాత్ ద్వితీయ తృతీయాభ్యాం చతుర్థేనాప్యయం విధిః
తాలేనేతి మతంగేన నిర్దిష్టా శుద్ధపద్ధతిః. 31

---

1. తులజేంద్రుని సంగీతసారామృతమందు ( PP. XLII, XLIII ) ఈ భాగ ముదాహరింపబడినది అందలి పాఠము 'కుటిలం' (పరిష్కర్త); వివిధ వాద్యముల గాయకులజట్టు నిండియుండుట కుటిలమని సం. రత్నా. (౭-౧౨౩౭), వర్ణాలంకార మను స్వరగానపద్ధతి యని భరతకోశము. 'పుటిన' మనియు ఒక వ్రా. ప్ర.

2. ఢెంకితాళమునకు మారుపేరు యోజన. ఈ 'యోజ' అదే కాబోలును (పరి.) (చూ. క్రింది సూచిక)

3. కరట - ఇరుప్రక్కల కోడుపుతో వాయించు, అడ్డపొడుపైన చర్మవాద్యము. ఝర్ఝమనియు దీనిపేరు. 'కరడె' కన్నడము (కిట్టెల్ నిఘంటు).

సాంగమగు ముఖత్రయముతో, పుటిలము చేయవలెను. దానియందు పాట నడపదగును. ఆపై దానిని నిఱుపుదల చేయవలయును 25

తరువాత ముఖత్రయముతో, పదములచే, అంగములచే, ప్రవేశకము చేయ నగును ; ఆపై మంరికతో కొంతకాలము గతి జరుపవలయును. 26

తరువాత క్రమముగా యోజ, ఖండయతి, పదము, మలపము, అంగము - మనోహరములైన పాటములు - మరల ప్రవేశమందు, పదమందును, శుష్క వాద్యమును ప్రయోగింపవలెను ; శంఖము, కంచుతాళము, మున్నగువానిలో పుట్టునవియు, మృదంగము, కరట - వీనియందు గలుగునవియు, అగుపాటము లను, వినుటకింపైనవానిని, వైచిత్రికొరకు వాయింపదగును. 27, 28

రాబోవు నాలుగుతాళములందును, ఇదే నియమము తప్పగూడదు. మొదలు మట్టతాళమున కొంతప్రొద్దు పాట నడపవలెను ; ఆమీద పైని చెప్పిన శుష్క వాద్యమే జరిపి, అవధానము గలిగి అవచ్ఛేదము చేయనగును. ఇదే యేర్పాటు రెండవ, మూడవ, నాల్గవ, తాళములందును సాగవలయునని, మతంగుడు నిర్దే శించిన శుద్ధపద్ధతి యిది. 29, 30, 31

విచిత్ర పద్ధతిః

స్వరైః బద్ధేన పాటైశ్చ క్రమేణ కరణత్రయమ్
గేయం వర్ణస్వరోపేతం గాయనైరథ వాదకైః, 32

వాద్యం యథాక్షరం యత్రసా చిత్రాపద్ధతిః స్మృతా
నర్తకీ నర్తనం కుర్యాత్ తత్ర వాద్యాక్షరైస్సమమ్. 33

ప్రేరణి లక్షణమ్

రంజకో రూపసంపన్నః ప్రఖ్యాతః ఖ్యాతవంశజః
భావుకో రసికస్తాలవేదీ గమకకోవిదః, 34

ధ్వనిశారీరసంపన్నో రాగాంగాదివిచక్షణః
పంచాంగకుశలోఽవ్యంగః సర్వభాషావిశారదః, 35

సురేఖో వాద్యవిత్ ప్రౌఢః ప్రస్తావోచితభాషణః,
గాతా గీతప్రబంధానాం లాస్యతాండవపద్ధతేః, 36

విద్వానుత్ప్లుతిపూర్వేషు కరణేషు సలాఘవః
భ్రమరీ పాదవిత్ నానాలస్తిజ్ఞః ప్రేరణీమతః. 37

ప్రేరణి నైపథ్యమ్

వరాటకమయైర్జాతరూపరత్నమయైరపి
భూషణైర్భూషితో భాస్వద్ భస్మోద్ధూళితవిగ్రహః, 38

శిఖావాన్ ముండితశిరాః దధత్ పుస్తఫణాధరమ్
ఏకేన రంగయష్టింవా కరేణాన్యేన చామరమ్, 39

బిభ్రత్ ఘర్ఘరికాజాలే జంఘయోర్దృఢసంయుతే
ఏకశోద్వంద్వశోవాపి క్రమాత్ పూర్వప్రవేశితైః, 40

చతుర్భిరథవా షడ్భిః అష్టాభిర్వా సహాయకైః
అభితస్సహితః స్వస్యదధానైస్తుల్యవేషతామ్. 41

సమపాదేన వా తిష్ఠన్ భుజంగత్రాసితేన వా
కృతే యవనికాక్షేపే సతి రంగభువం విశేత్. 42

### విచిత్ర పద్ధతి

స్వరములతో బద్ధ (తాళ ?) ముతో, పాటములతో, క్రమముగా గాయకులు వర్ణ స్వరసహితముగా పాడవలయును ; వాద్యములవారు అక్షరముల ప్రకారము, ఆపై వాయింపదగును ; ఇది చిత్రపద్ధతి , అందు, నర్తకి వాద్యాక్షరములకు సమముగా నర్తింపవలయును. 32, 33

### పేరణి లక్షణము

రక్తికలిగింపగలవాడు, రూపసంపన్నుడు, ప్రసిద్ధిగలవాడు, ప్రఖ్యాతమైన వంశమున జనించినవాడు, అందమును భావింపగలవాడు, రసానుభవము గలవాడు, తాళజ్ఞుడు, గమకములందు నేర్పరి, ధ్వనిగలశారీరము గలవాడు, రాగాంగాది భేదములందు పండితుడు, పంచాంగములందు కుశలతగలవాడు, అంగవికారము లేనివాడు, అన్నిభాషలందును నేర్పుగలవాడు, మంచిరేఖగలవాడు, వాద్యము లెరిగినవాడు, ప్రౌఢ, ప్రస్తావమునకు తగినట్లు మాటలాడగలవాడు, గీతప్రబంధ ములు పాడగలవాడు, లాస్యతాండవపద్ధతి తెలిసినవాడు, ఉత్ప్లుతికరణములు లాఘవముతో చేయగలవాడు, భ్రమరులు, పాదములును తెలినవాడు, నానా విధములైన ఆలప్తులు నేర్చినవాడు - ఇట్టివాడు పేరణియగును.

34, 35, 36, 37

### పేరణి వేషము

పేరణి, గవ్వలతోగాని, బంగారు-రత్నములతోగాని చేసిన సొమ్ములు ధరింప దగును ; తెల్లని విభూతి దేహమున పూసికొనవలయును ; జుట్టునిలుపుకొని, తల నిండుగా క్షౌరము చేసికొని, ఒకచేత కృత్రిమమైన నాగుబామునుగాని, రంగ యష్టినిగాని, ధరించి, మరొక్క హస్తమున చామరమును పట్టుకొని, జంగలందు బిగువుగా గజ్జెలగుంపులు గట్టుకొనియుండనగును ; తనవలె వేషముధరించిన సహా యకులు నలుగురుగాని, ఆరుగురుగాని, యెనమండుగురుగాని, ఒక్కరొక్కరు గానో, జంటలుగానో, క్రమముగా మొదలు ప్రవేశించియుండగా, వారినడుమ, సమపాదముతో నిలుచుకొనికాని, భుజంగత్రాసితపాదముతోగాని, రంగభూమిలో తెరయెత్తిన తరువాత, అతడు ప్రవేశింపవలయును. 38, 39, 40, 41, 42

పంచప్రేరణాంగాని

ప్రేరణాంగాని పంచస్యుః నృత్తకైవార[1] ఘర్ఘరాః
వికటం గీతమిత్యేషాం క్రమాల్లక్ష్మప్రచక్ష్మహే. 43

తన్నృత్తం యత్ ద్విధాచోక్తం లాస్యతాండవభేదతః 44
(నృత్తమ్—1)

ఇతివృత్త ప్రవిఖ్యాత చక్రవర్తి ధరాధిపాన్
గుణైః శౌర్యాదిభిః స్తుత్వాత్తైస్తైరేవ సభాపతేః
స్తుతిర్వితన్యతే యస్మిన్ కైవారోఽత్ర స కీర్తితః. (కైవారః-2) 45

అతాలం తాలయుక్తంచ ఘర్ఘరీవాదనం క్రమాత్
అత్రోక్తో ఘర్ఘరస్తస్య ప్రకారాః సప్తకీర్తితాః. 46

చావడః పడివాడాఖ్యో రుంధః సిరిభిరాభిదః
తతః ఖలుహులాలగ్నపాటౌ సిరిపిటీ తతః
క్రమాల్లక్షణమేతేషాం కథయామోఽధునా వయమ్. 47

సశబ్దం చావడః పాదతలాభ్యాం తాడనం భువః. (చావడః-1) 48

పాదాగ్రశ్లిష్టభూర్యాభ్యామిం పార్ష్ణిభ్యాం పార్ష్ణినాఽథవా
పర్యాయాత్ కుట్టయేద్యస్మిన్ పడివాడః స కీర్తితః. (పడివాడః-2) 49

రుంధః స్యాత్ యుగపత్ సృత్వా (త్యా?) పురః పాదతాలగ్రయోః
దుష్కరోయః (యం?) ప్రయోగః స్యాత్ విరలో హాస్యసాధకః. 50
(రుంధః—3)

స్వభావాత్ భూస్థయోరంఘ్ర్యోః జంఘాభ్యాం కంపనం ముహుః
ప్రసృత స్యాంబరే దిక్షు యద్వా సిరిభిరోమతః. (సిరిభిరః—4) 51

---

1 దీనినే 'కవిచారకః' అని సం రత్నా. (౭—౧౩౦౩) కైవారము దాని ప్రాకృత భవము. సాంకేతికపదముగనుక 'కైవార' పదమును సంస్కృతముగనే ప్రాచీనులు గ్రహించిరి.

ఐదు పేరణమునకంగములు

పేరణమునకు అంగములైదు : నృత్తము, కైవారము, ఘర్ఘరము, వికటము, గీతము - అని వాని లక్షణము క్రమముగా వచింతుము. 43

లాస్యము, తాండవము అన్న రెండు భేదములు గలదిగా చెప్పబడినదే నృత్తము. (నృత్తము-1) 44

చరిత్రములందు ప్రసిద్ధులైన చక్రవర్తులగు రాజులను, శౌర్యము మున్నగు గుణములచే పొగడి, వానిచేతనే సభాపతిని స్తుతిచేయుట కైవారమనబడును. (కైవారము—2) 45

తాళములేక, తాళముగలిగి, క్రమముగా ఘర్ఘరిని వాయించుట, ఇక్కడ ఘర్ఘరమనబడినది. దానిరీతులు ఏడు గలవు : 46

చావడ, పడివాడము, రుంధము, సిరిభిరము, ఖలుహులము, అలగ్నపాటము, సిరిపిటి, - ఇవి యా యేడు రీతులు ; వీనిలక్షణమిప్పుడు క్రమముగా చెప్పుదుము. 47

అరకాళ్ళతో సద్దుగలుగునట్లు నేలను తట్టుట చావడ. (చావడ—1) 48

కాళ్ళకొనలతో నేలను మెట్టుకొని, మడమలు రెంటితోగాని, ఒకటితోగాని, మార్చి మార్చి భూమిని తట్టుట పడివాడమనబడును. (పడివాడము—2) 49

కొనగాళ్ళు రెంటితోను ఒకమారే జారుట, రుంధము. ఇది కష్టమైన ప్రయోగము ; అప్పుడప్పుడు విరళముగా చేసినచో హాస్యమును సాధించును. (రుంధము—3) 50

స్వాభావికముగా పాదములను నేలపై నిలిపి, జంగలను పలుమారు కదలించుట, లేదా, ఒకపాదమును మీదికి చాచి, దిక్కులందు వడకించుట, సిరిభిరము. 51
(సిరిభిరము—4)

భూశ్లిష్టాగ్రతలస్యాంఘ్రేః పార్ష్ణ్యా (ర్ష్ణిః ?) ఘట్టయతి క్షితిమ్
ఏకస్య తాదృశస్యైవ పార్ష్ణినాఽన్యస్య రేచనమ్
బాహ్యాభ్యంతరతః స్యాచ్చేత్ తదా ఖలుహులో మతః. 52
(ఖలుహులః—5)

ఊర్ధ్వాధః క్షేపకంపాభ్యాం వ్యోమ్ని ఘర్ఘరవాదనమ్
క్రమాచ్చరణయోర్యత్ర స మతోఽలగ్నపాటకః. 53
(అలగ్నపాటకః—6)

పురతః పృష్ఠతః పార్శ్వద్వయేచ సరణం యదా
భూమిలగ్నతలస్యాంఘ్రేః భవేత్ సిరిపిటీ తదా. (సిరిపిటీ—7) 54

పార్శ్వగం ఘట్టితం సూచీం అంగులీపృష్ఠగం వినా
షడన్యే పాదభేదాః స్యురత్ర ఘర్ఘరవాదనే. (ఘర్ఘరః—3) 55

పిశాచ వానరాదీనాం వేషచేష్టానుకారతః
వికృతైరాననోష్ఠాక్షి కుక్షిదోశ్చరణాదిభిః; 56

వితాలం వికృతం నృత్తం హాస్యకృద్ వికటం విదుః
కైశ్చిత్ వాగడమిత్యుక్తం భాండికానాం ప్రసిద్ధితః. (వికటమ్—4) 57

శుద్ధైః ఛాయాలగైర్యద్వా రాగైరాలప్తి సంయుతాః
ప్రబంధా యత్రగాయంతే గీతం తదభిధీయతే. (గీతమ్—5) 58

**అథః ప్రేరణీపద్ధతిః**

సమహస్తాభిధే వాద్యే వాదితే సమనంతరమ్
శుష్కవాద్యం భవేద్యత్యా, రిగవణ్యా, పదేనచ. 59

పైసారాపరనామ్న్యాఽథ యతోపశమనాఖ్యయా
ప్రవిశ్య ప్రేరణీ నృత్యేత్ తతః కైవారమాలపేత్. 60

ఐదు పేరణమునకంగములు

పేరణమునకు అంగములైదు : నృత్తము, కైవారము, ఘర్ఘరము, వికటము, గీతము - అని వాని లక్షణము క్రమముగా వచింతుము. 43

లాస్యము, తాండవము అన్న రెండు భేదములు గలదిగా చెప్పబడినదే నృత్తము. (నృత్తము-1) 44

చరిత్రములందు ప్రసిద్ధులైన చక్రవర్తులగు రాజులను, శౌర్యము మున్నగు గుణములచే పొగడి, వానిచేతనే సభాపతిని స్తుతిచేయుట కైవారమనబడును. (కైవారము—2) 45

తాళములేక, తాళముగలిగి, క్రమముగా ఘర్ఘరిని వాయించుట, ఇక్కడ ఘర్ఘరమనబడినది. దానిరీతులు ఏడు గలవు : 46

చావడ, పడివాడము, రుంధము, సిరిభిరము, ఖలుహులము, అలగ్నపాటము, సిరిపిటి, - ఇవి యారేడు రీతులు ; వీనిలక్షణమిప్పుడు క్రమముగా చెప్పుదుము. 47

అరకాళ్ళతో సద్దుగలుగునట్లు నేలను తట్టుట చావడ. (చావడ—1) 48

కాళ్ళకొనలతో నేలను మెట్టుకొని, మడమలు రెంటితోగాని, ఒకటితోగాని, మార్చి మార్చి భూమిని తట్టుట పడివాడమనబడును. (పడివాడము—2) 49

కొనగాళ్ళు రెంటితోను ఒకమారే జారుట, రుంధము. ఇది కష్టమైన ప్రయోగము ; అప్పుడప్పుడు విరళముగా చేసినచో హాస్యమును సాధించును. (రుంధము—3) 50

స్వాభావికముగా పాదములను నేలపై నిలిపి, జంగలను పలుమారు కదలించుట, లేదా, ఒకపాదమును మీదికి చాచి, దిక్కులందు వడకించుట, సిరిభిరము. 51 (సిరిభిరము—4)

చాలయేత్ చరణం తాలరహితం ఘర్ఘరైస్తతః
ద్వితీయం తాలమారభ్య మార్గదేశిగతైరథ. 61

కృత్వాంతే వాదనం తాలైరేకయాంతరయాపి చ[1]
యోజయేత్సకలాతోద్యనాదైః ప్రహరణైస్సహ. 62

లగ్నప్రహరణే పాటం భ్రమరీకరణాన్వితమ్ ;
విషమం తాండవం నృత్యేత్ వికటాంగ మతఃపరమ్. 63

సరాగమాలపేత్ యేన జనస్సర్వోఽనురజ్యతే ;
సూడస్యాద్యమథో గాయేత్ ప్రబంధం వాదయేచ్చ తమ్. 64

ముహుర్ధ్రువపదే గీతే తత్తుల్యాం వాదయేద్యతిమ్
విధాయ ప్రేరణీ తాయాన్ సమాన్ ద్విత్రిగుణానపి. 65

యత్యంతే యోజయేత్ తద్వత్ ఘర్ఘరీవాదనాన్యపి ;
ఆభోగం గాపయిత్వాంతే యత్యా ప్రహరణేనవా. 66

గజరే వాద్యమానే తైః నృత్యేద్వికటముచ్చకైః
తకారేణ సమం కుర్యాత్ ఛండనం ప్రేరణీపునః. 67

సూడస్థిత ద్వితీయాది ప్రబంధానేవమేవ చేత్
ప్రయుంజీత తదా ప్రోక్తా బుధైః ప్రేరణి పద్ధతిః. 68

**దేశీపద్ధతిః**

ఆతోద్యమేలనం పూర్వం సమహస్తమతఃపరమ్
యతిప్రహరణే శూన్యే పుష్పాంజలి రతఃపరమ్. 69

ఝుంకారో రిగవణాఖ్యా తతః స్యాత్తుండుకాభిధమ్
చమత్కారోఽథగీతాంగవాద్యముచ్చలితాయతిః
తద్వత్ ప్రహరణం చైతత్ దేశీపద్ధతిరుచ్యతే. 70

1. ఈ పాదము, తరువాతి శ్లోకమును, కృప్తికరముగా సవరింప వీలుకాలేదు; ఇతర లాక్షణికుల సహాయమును లభింపలేదు. [పరి ] (క్రిందిసూచి).

గజ్జెలతోడి పాదమును, మొదలు తాళము లేక చలింపజేయవలయును; తరువాత రెండవతాళము నారంభించి, మార్గ - దేశిగతులతో వాయించి, కడపటపక, అంతర అను క్రియలతో ప్రహారణములు గూర్చి, లగ్నప్రహారణమందు, భ్రమరీకరణముతోడి పాటమును, అన్నివాద్యముల నాదములతోను గూర్పవలయును; తరువాత వికటాంగమైన విషమతాండవము చేయవలెను. 61, 62, 63

తరువాత అతడు జనులందరికిని రక్తిగలుగునట్లు, రాగమునాలాపింపవలెను. ఆపై, సూడయొక్క మొదటి ప్రబంధమును పాడవలెను; దానినే వాయింపవలయును; ధ్రువపదమును పలుమారు పాడుచున్నపుడు, దానికి సరియగు యతిని వాయింపదగును; పేరణి, తాయములు, సమముగాను, రెండు మూడింతలుగాను చేసి, యతి ముగింపుతో గజ్జెల వాయింపులను గూడ కూర్పవలెను; ఆభోగమును పాడించి, ముగింపులో యతితోగాని, ప్రహారణముతోడగాని, గజరము వాయింపబడుచుండగా, వికటముగా, మరల ఉద్ధతముగా, వారితో [సహనాయకులతో ?] నర్తింపవలెను. మరల పేరణి, తకారముతో సరిగా (?) ఛండనము చేయవలయును. 64, 65, 66, 67

సూడయందలి రెండవది, మొదలగు ప్రబంధములను ఇట్లే ప్రయోగించుట పేరణిపద్ధతియని బుధులందురు. 68

## దేశి పద్ధతి

మొదలు సమహస్తముతో వాద్యముల మేళగింపు; తర్వాత యతి ప్రహారణమును, ఆపై శూన్యమందు [వాద్యము, పాట, లేక ?] పుష్పాంజలి; ఆమీది ఝుంకారము, రిగవణి, మరి తుండుకము, చమత్కారము, ఆతారువాత గీతాంగ వాద్యము, ఉచ్చలితమైన యతి, అట్లే ప్రహారణము; ఇది దేశపద్ధతి. 69, 70

కవితోట్టవణీ ఖండయత్యవచ్ఛేదకాదయః
వికల్పేన భవేద్యత్ర రిఘోణ్యా సమనంతరమ్. 71

పైసారా పరనామ్నా సా నర్తకీ రంగమండపమ్
సముదాయప్రబంధేన ప్రవిశేదపరేణవా. 72

కేనచిచ్చిత్రవాద్యేన ముఖవాద్యం మతం తదా ;
పుటిలం త్వేతదేవోక్తం దేశీవిద్యావిశారదైః. 73

పుష్పాంజలిరనేనైవ క్షేప్య ఇత్యుపచారతః
ఏతదేవమతం లోకే పుష్పాంజలిరితి స్ఫుటమ్. 74

హుడుక్కా, కరటా, దేశీపటహోద్యంతరా భవేత్
శబ్దే శ్రావ్యత్వహేతుత్వాత్ కాంస్యతాలం నివారయేత్. 75

రిఘోణ్యామేకతాలాడ్డతాల నిస్సారుకాస్త్రయః
తాలాః స్యుః ప్రాయశో నేతురిచ్ఛయాన్యేఽపి కేచన. 76

అథ ప్రేక్షణ పద్ధతిః

అతాలాలాప సంయుక్తో రేఖంకారః ప్రథమస్తతః
పదరూపకయోర్మధ్యే స్యాదోతానియతాస్పదా. 77

అనంతరంతు కవితా తతోఽవచ్ఛేదసంజ్ఞకః
మలపోఽథ ప్రహారణం ప్రబంధాః ప్రేక్షణేమతాః. 78

ఏషాం పాటాక్షరైస్తుల్యముత్ప్లుతైః కరణైః కృతమ్
భ్రమరీభిస్తథా చారీమండలైరుద్ధతైరపి
నర్తనం ప్రేక్షణం ప్రోక్తం చమత్కారైకకారణమ్. 79

కవితము, ఉట్టవణి, ఖండయతి, అవచ్ఛేదకము, మొదలగునవి, రిఘోణితో వికల్పముగా రావచ్చును ; తరువాత నర్తకి, పైసారమను నామాంతరముగల సముదాయప్రబంధముతో, వేరొక్క చిత్రవాద్యముతోనైనను, రంగమండపమును ప్రవేశింపవలయును ; అనంతరము, ముఖవాద్యము నడువవలెను ; దీనినే దేశీవిద్యావిశారదులు పుటిలమని పేర్కొన్నారు. 71, 72, 73

దీనితోనే పుష్పాంజలి వేయవలయును గనుగ, దీనికే లోకవ్యవహారమున పుష్పాంజలి అనుపేరు, ఔపచారికముగా వచ్చినది. 74

అంతరమున హుడుక్క, కరట, దేశీపటహము, మున్నగు వాద్యములుండ దగును; శబ్దము శ్రావ్యముగానుండుటకై కంచుతాళములను వదలవలయును. 75

రిఘోణియందు ఏకతాళము, అడ్డతాళము, నిస్సారుకము, అను మూడు తాళములు ప్రాయికముగానుండును ; నాయకుని యిష్టప్రకారము మరికొన్ని తాళములును గావచ్చును. 67

ఇక ప్రేక్షణ పద్ధతి

మొదలు తాళము లేని యాలాపముతో గూడిన ఝేంకారము ; దానిపై పదము రూపకము ; ఈ రెంటి నడుమ, ఓతము తప్పక యుండదగును ; అనంతరము, కవితము, అవచ్ఛేదము, మలపము, ప్రహారణమును; ఇవి ప్రేక్షణమందలి ప్రబంధములు. 77, 78

వీని పాటాక్షరములతో సమముగా, ఉత్ప్లుతకరణములతో, భ్రమరులతో, ఉద్ధతమైన చారీమండలములతో, నర్తించుట, ప్రేక్షణము ; ఇది, ముఖ్యముగా చమత్కారము గలిగించును. 79

ద్వివిధః సూడః

శుద్ధశ్చ సాలగశ్చేతి సూడః స్యాన్నర్తనే ద్విధా ;
ప్రాగేలా కరణం వర్ణసరః కైవార ఝోంబడౌ. 80

త్రిభంగిర్వర్తనీ ప్రాంతే [?] రాసకోఽథైకతాలికా
ఇత్యేతే శుద్ధసూడేఽస్మిన్ ప్రబంధాః కీర్తితాః నవ. 81

ఏషాం స్వరాక్షరైస్తుల్యం సదృశం ధాతుకాకుభిః
వినిర్మితస్య వాద్యస్య సమానం నృత్తమాచరేత్. 82

సంగీతస్య యదా పాత్రం తదా సంగీతముచ్యతే[1]
ధ్రువో మట్టః ప్రతిమట్టో నిస్సారుః సాటతాలకః
రాసకశ్చైకతాలీచ సూడే స్యుః సప్తసాలగే. 83

అథ రాసకమ్

బంధం పిండ్యాదిమాశ్రిత్య యస్మిన్ షోడశనాయికాః
నృత్యంతి ద్వాదశాష్టౌవా రాసకం తత్ప్రకీర్తితమ్. 84

పిండీ శృంఖలికా భేద్యలతా భేదాత్ చతుర్విధః
ఆఖ్యధాయి బుధైర్బంధః ; తత్ర పిండీతు పిండనాత్ ; 85

గుంఫనాత్ శృంఖలా ; భేద్యో భేదనాత్ ; జాలవత్ లతా
ప్రత్యేకం బహుభేదాః స్యుః ప్రోక్తైస్తే నర్తకైః కృతాః.
షోడశైవ పరం తత్ర యత్రాభిర్బంధపూర్ణతా. 86

చేలమర్ధోరుకం యద్వా కా (కూ?) ర్పాసం కంచుకం తథా
ధమ్మిల్లం వేణికాం వాపి తత్తద్దేశానుసారతః, 87

దధానాః సుభగం వేషం క్వణన్మంజీరకంకణమ్
యౌవనంచ మనోహారి పీవరోరుకటిస్తనమ్. 88

1. ఈ వాక్యమునకు అన్వయముగాని, అర్థముగాని స్పష్టపడలేదు [పరి.].
'తదసంగీత ముచ్యతే' అని నావద్ది వ్రా. ప్ర; అప్పటికిని అంతే.

### రెండు తెగల సూడ

న_ర్తనమున సూడ శుద్ధమని సాళగమని రెండువిధములు: మొదలు, ఏల, కరణము, వర్ణసరము, కై_వారము, ఝూంబడము, త్రిభంగి, వ_ర్తని; కడపట (?) రాసకము, ఏకతాళి — ఇవి తొమ్మిది శుద్ధసూడమందలి ప్రబంధములు. 80, 81

వీని స్వరాక్షరములతో సమముగా, ధాతు - కాకువులకు తగినట్లు, నిర్మించిన (?) వాద్యమునకు సరిగా నృ_త్తము చేయవలెను. 82

ధ్రువము, మట్ఠము, ప్రతిమట్ఠము, నిస్సారువు, అటతాళము, రాసకము, ఏకతాళి, — ఈ యేడును సాళగసూడయందుండును. 83

### ఇక రాసకము

పిండి మొదలగు బంధములను - కట్టుబాట్లను - ఆశ్రయించి, నాయికలు పదునారుగురుగాని, పంద్రెండుగురుగాని, యెనమండుగురుగాని, చేయునృ_త్తము, రాసకమనబడును 84

పిండి, శృంఖలిక, భేద్యము, లత - ఇట్లు బంధము నాలుగు తెగలని బుధులు చెప్పుదురు; అందు పిడుచవలె గుంపుగాగూడుట పిండి; సరమువలె కూర్చుట శృంఖల; వేరుగా విడివడియుండుట భేద్యము; వలవలె ఏర్పడుట లత; ప్రౌఢులై_న న_ర్తకులు, పై_వానిలో నొక్కొక్కటినిగూడ, అనేక విధములుగా కల్పింపగలరు. నట్టువక_త్తెలు పదునారుగురే యుండదగును, ఎందుకనగా అసంఖ్యతో బంధము పూర్ణమగును గనుక. 85, 86

నట్టువక_త్తియలు చీరనుగాని, చల్లడమునుగాని, కుబుసముగాని, రవికగాని, కొప్పునుగాని, జడనుగాని, ఆయాదేశపద్ధతిననుసరించి తాల్పవచ్చును; వారి వేషము సొబగుగానుండవలయును; చేతికడియములును, కాలందియలును గలగల సద్దుచేయగలవి గావలయును; ఊరు - కటి - స్తనములు, లావుగాగల మనోహరమైన ప్రాయముననుండువారు గావలెను; ఇట్టివారు క్రమముగా, జంటలు జంట

వాద్యేన ద్వంద్వశస్తుల్యచారీ ప్రభృతయః క్రమాత్
రంగం యవనికా గర్భాత్ విశేయుః పార్శ్వయోరిమాః. 89

ఆదిరాజశ్రియః[1] ప్రేక్ష్య స్వానురూపం చిరాద్వరమ్
స్వయం వరీతుం మహోత్కంఠ్యాత్ ప్రాప్తాఇవ సభాపతిమ్ ; 90

గోపికానాం సహస్రేభ్యో మానితాః ముఖ్యనాయికాః
ఆగతా ఇవ భూపేన క్రీడితుం రాసకోత్సవే ; 91

యాతాయాతక్ర (క్ల ?) మశ్లిష్టాః స్త్రీరూపాః శశినః కలాః
అస్తదోషోదయా? (యం ?)[2] ప్రాప్తాః రాజానమివ సేవితుమ్. 92

ధ్రువా ఇవ తటిల్లేఖాః, చలత్కల్పలతా ఇవ
కామినీ వేషధారిణ్యః సాక్షాన్నృత్తకలా ఇవ, 93

శిక్షితా ఇవ పార్వత్యా ప్రతిచ్ఛాయా ఇవశ్రియః
ఋతుప్రయోజ్య రాగేణ గీయమానేషు గాయనైః, 94

చర్చర్యాది ప్రబంధేషు దేశీసూడస్థితేషుచ
వాద్యేషుచ ప్రయుక్తేషు సదృశేషు విచక్షణైః, 95

ఖండ మండల చారీభిః లాస్యాంగ ప్రముఖైరపి
కుర్వత్యః ప్రస్తుతై రంగగైః గీతార్థాభినయం సమమ్. 99

ప్రవేశైర్నిర్గమైః సంధిహీనైరప్యపసారకైః
ఛోటికాభిర్మిథో హస్తతాలికాభిః లయానుగమ్,
బంధురైర్వివిధైర్బంధైః నృత్యేయురిహ నాయికాః. 97

---

1. 'క్రియం' ముద్రి. సభాపతికి విశేషణముగా పరిష్కర్త దీనిని గ్రహించి, సవరించిరి. 'శ్రియః' అనియే వ్రా. ప్రతులన్నిటను అదే యుచితతరమని గ్రహించితిని.

2. 'దోషోదయం' అను వ్రా. ప్ర. పాఠము రాజుకు విశేషణముగా సుగ్రహము.

లుగా, వాద్యముతో సరిగా, సాగునట్టి చారి మొదలగువానితో, తెరలోనుండి, రంగస్థలమునకు ఇరుప్రక్కలనుండియు రావలెను. 87, 88, 89

చాలకాలమునకు తమకు తగిన మాహాత్మ్యముగల వరుడు మరల దొరకినాడని, సభాపతిని తామేవరించుటకు వచ్చినట్టి, ప్రాచీన షోడశమహారాజుల లక్ష్ములో యనునట్లు, 90

పదారువేల గోపికలలో, మన్ననగలిగిన ముఖ్యనాయికలు పదారుగురు, రాస కోత్సవమందు ప్రభువుతో క్రీడింపవచ్చినారోయనునట్లు, 91

దోషముల పుట్టుక (రాత్రులం దుదయము) లేని రాజును (చంద్రుని) సేవించు టకై, రాకపోకలుచేసి, అలసి, కూడబడిన, చంద్రకళలు పదునారును, స్త్రీరూప ములు ధరించి వచ్చినవో యన నట్లు, 92

నిలిచిన మెరుగుదీగలవలె, కదలునట్టి కల్పలతలవలె, నృత్తకళలు స్త్రీరూప ములతో ప్రత్యక్షమైనవోయనురీతి, పార్వతీదేవి శిష్యురాండ్రోయనుపగిది, లక్ష్మీ దేవి ప్రతిబింబములో యనదగియుండునాయికలు,

ఆయాఋతువులందు ప్రయోగింపదగిన రాగములతో, గాయకులు చర్చరి మున్నగు ప్రబంధములను, దేశిసూడయందున్నవానిని, పాడుచుండగా, నేర్ప రులు తగిన వాద్యములను వాయింపగా, 93, 94, 95

ఖండములతో, మండలములతో, చారులతో, ప్రస్తావమునందలి యంగములచే, పాట యర్థమును సమముగా అభినయించుచు, ప్రవేశించుచు, వెడలిపోవుచు, సందులేకుండ తొలగుచు, లయకు సరిగా చిటికెలు వేయుచు, ఒకరొకరిచేతులపై తాళము తట్టుచు, పలువిధములైన నిండుబంధములతో, నర్తింపవలయును. 96, 97

అథ చర్చరీ

చర్చరీ మేతదేవాహుః వర్ణతాలాంచితేనచేత్
వాద్యేన ప్రవిశేయుస్తాః గాయంత్యశ్చర్చరీం కలమ్, 98

ద్విపదీం వాథ శృంగార వీరాభ్యామృతువర్ణనైః
నాయకస్య గుణఖ్యాతి ప్రఖ్యాపన పదోత్తరైః
మండలేన ప్రనృత్యంతి కాంతా వాసంతికోత్సవే. 99

అథ నాట్యరాసకమ్

చరితం భూపతేర్యత్ర పదార్థైరభినీయతే
నాయికాభిర్వసంతర్తౌ దేశీ హిందోలగీతిభిః
యౌవనాసవమత్తాభిః తదుక్తం నాట్యరాసకమ్. 100

అథ దండరాసకమ్

పాత్రాణ్యష్టౌ సమారభ్య వర్ధంతే దండరాసకే
క్రమాత్ చత్వారి చత్వారి నాయకేచ్ఛానుసారతః. 101

చతుష్షష్టిర్భవేద్యావత్ యావత్సా ద్విగుణా పరైః;
అరత్ని సమ్మితౌ దైర్ఘ్యాత్ అంగుష్ఠపరిణాహినౌ, 102

దండౌ కనకబద్ధాంతౌ మదనాది ద్రుమోద్భవౌ
సువృత్తౌ మసృణౌ నానావర్ణకైశ్చారు చిత్రితౌ, 103

దధీరన్ పాణిపద్మాభ్యాం అథవా దండచామరే
ఛురికా దండకౌ యద్వా తత్తద్దేశీయభంగిభిః. 104

ఉక్తేషు వాద్యమానేషు చిత్రబంధేషు వాదకైః
లాస్యాంగ భ్రమరీ పాద చారీభిశ్చారుచంక్రమమ్, 105

సవ్యాపసవ్యతశ్చక్రభ్రాంత్యా ఖండప్రయోగకైః
సశబ్దం పంచభిర్ఘాతైః కుర్వీరన్ దండమేళనమ్. 106

ఇక చర్చరి

రాసకమందే, నాయికలు వర్ణతాళములతో గూడిన వాద్యముతో, మధురముగా చర్చరినిగాని, ద్విపదినిగాని, పాడుచు ప్రవేశించి, శృంగార వీరములలో, నాయకుని గుణములను, కీర్తిని, వెలువరుచు పదములు నిండిన ఋతువర్ణనలతో, మండలముగా వసంతోత్సవమునందు నర్తించుట చర్చరియనబడును. 98, 99

ఇక నాట్యరాసకము

నాయికలు యానవాసవమత్తలై, వసంతఋతువున, దేశియుయ్యాలపాటలు పాడుచు, రాజుగారి చరిత్రమును, పదార్థాభినయముతో చూపుట, నాట్యరాసకమనబడును. 100

ఇక దండరాసకము

దండరాసకమున, ఎనమండుగురు మొదలు, నాయకుని యిష్టముననుసరించి, క్రమముగా నలుగురు నలుగురుగా, పాత్రముల - ఆడునట్టివారి - సంఖ్య పెరుగ వచ్చును; అట్లు అరువదినలుగురవరకును ఎక్కించ వచ్చును; వారు రెండురెండు సరిజట్లుగా ఏర్పడవలెను. (?)

రెండు చేతులందును రెండుకోలలు ధరింపవలయును; అవి ఒక్కొక్కటి చిటికెనవ్రేలు చాచిన మూరపొడవును, బొటనవ్రేలి లావునుగలిగి, గుండ్రముగా నుండదగును; పొగడ మున్నగు మ్రానితో చేయబడినవియు, పలువన్నెల చిత్రపు పనులు గలవియుగావలెను; లేదా, ఆయాదేశరీతులననుసరించి ఒకచేతకోల, ఇంకొకచేత చామరమునుగాని, అట్లే కోలను, చురకత్తినిగాని ధరింపవచ్చును. 101, 102, 103, 104

మీదచెప్పిన చిత్రబంధములను వాదకులు వాయించుచుండగా, లాస్యాంగములయిన భ్రమరులు, పాదములు, చారులు _ వీనితో, అందమగు దాట్లతో ఎడమ, కుడి ప్రక్కలందును, చక్రమువంటి తిరుగుడులతోను, ఖండప్రయోగముచే గలిగి, సశబ్దములగు ఐదుఘాతములతో, పరస్పరము కోలలను కలుపవలెను. 105, 106

నర్తకీ నర్తనే ప్రోక్తాః ప్రబంధాస్సకలా అపి
కౌతుకాద్యూభిపాలానాం వాద్యతేఽత్రయథాక్రమమ్.
నర్తనంచ తథా కుర్యాత్ ప్రౌఢనర్తకశిక్షితమ్. 107

అథశివప్రియమ్

మృదంగ కరటా కాంస్యతాల కాహలవాదకైః
వాద్యమానేషు వాద్యేషు యతిప్రహరణాదిషు, 108

కాంస్యేన ఘటితాన్ యద్వాలోహేన ఘణిన‹ కరైః
వామైః వామేతరైః కోణాన్ బిభ్రాణాః తన్మయానపి, 109

స్ఫురత్కిరికిటీకారం వాదయంతో లయానుగమ్
రుద్రాక్షాభరణాః శ్లక్ష్ణాః (క్ష్ణ ?) క్లప్తభూతి త్రిపుండ్రకాః, 110

శివైకతత్పరాభక్తాః నరాః నారీజనోఽథవా
శ్రేణీభూతాః ప్రమోదేన గాయంతశ్చంద్రశేఖరమ్, 111

అంగైర్యథోచితైః పాదైర్లాస్యాంగైర్గతి సంయుతైః
అన్యోన్యాభిముఖీ భూతాః ద్విధాభూతాః కదాచన, 112

కదాచిన్మండలీభూతాః నృత్యేయుర్బహుభంగిభిః
శివోత్సవేషు కర్తవ్యం నృత్తమేతత్ శివప్రియమ్. 113

అథ చింతు నృత్తమ్

తాలచ్ఛందానుగైః పాదైర్యతి ప్రహరణాదిభిః
కరతాలలయోపేతైః వాద్యవక్త్రభవైస్సహ, 114

పాదైర్లలిత సాలాభ్యాంగైః చారీభిర్గతిభిస్తథా
శైవ్యైః ద్రవిడదేశీయైః క్లప్తైస్తత్కాకురీతిభిః, 115

గీతార్థాభినయోపేతైః ద్విపదైః చింతుసంజ్ఞకైః
ప్రయోగైశ్చాపి తైః కిత్తుప్రచురైః సులయైర్మ్మహుః, 116

నట్టువకత్తెల నర్తనమందు చెప్పబడిన అన్ని ప్రబంధములును దీనియందు, దొరల కుతూహలము ననుసరించి, క్రమముగా, వాయింపనగును ; అట్లే ప్రౌఢు లగు నర్తకులు నేర్పిన నర్తనముగూడ, చేయదగును. 107

### ఇక శివప్రియము

మృదంగము, కరట, కంచుతాళము, కాహళమును వాయించువారు తమ తమ వాద్యములలో యతి, ప్రహారణము మున్నగు వాద్యప్రబంధములను వాయించుచుండగా, పురుషులుగాని, స్త్రీలుగాని, కంచుతోగాని తామ్రముతో గాని చేసిన పాములను ఎడమచేతులందును, అట్టికొండుపులను కుడిచేతులందును ధరించి, లయానుసారముగ 'కిరికిటి' యను శబ్దము స్ఫురించునట్లు వాయించుచు, రుద్రాక్షసొమ్ములుదాల్చి, విభూతిపుండ్రములు మూడు పలుచనగా ధరించి, శివునినే ధ్యానించుచు, బంతులుదీరి శివునిపాటలు పాడుచు, యథోచితములైన అంగములతో, పాటలతో, గతితోగూడిన లాస్యాంగములతో, ఒకప్పుడు ఒకరి కొకరు ఎదురుమొగముగా రెండుగా ఏర్పడుచు, మరొకప్పుడు మండలముగా తిరుచు, పలుభంగులుగా నర్తింపవలయును ; శివునికి ప్రియమైన యీ నృత్తము శివోత్సవములందు చేయదగినది. 108, 109, 110, 111, 112, 113

### ఇక చింతునృత్తము

చక్కని వేషముగల తెల్గాయపు ప్రమదలు, యతి, ప్రహారణము, మొదలగు పాటములను తాళచ్ఛందముననుసరించి, వాద్యములందును, నోటను, కరతాళ లయముతో గూడ పలికించుచు, లలితములైన లాస్యాంగములతో, పాదములతో, చారులతో, గతులతో, ద్రవిడదేశమున పుట్టినవియు, ఆ కాకురీతులతో నేర్పరుప బడినవియు, 'చింతు' అను పేరుకలవియునగు ద్విపదలు పాడుచు, ఆ పాటల యర్థము నభినయించుచు, అందమైన లయముగల కిత్తు అను లాస్యాంగము ప్రచు రముగానుండునట్టి, అయాప్రయోగములతో నడుమ ప్రభువు మనస్సు హరించు

నృత్యేయుః ప్రమదా యత్ర సువేషాః నవయౌవనాః
సుకలాసం వితన్వంత్యః పత్యుర్మధ్యే మనోహరమ్,
చింతున్నృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడవల్లభమ్. 117

**అథ కందుక నృత్తమ్**

పద్మగోమూత్రికా నాగ చక్ర ప్రభృతిషు స్ఫుటమ్
వాద్యమానేషు బంధేషు నానాపాఠేషు వాదకైః, 118

దేశీయ నర్తన ప్రోక్త ప్రబంధేష్వథవా క్రమాత్
నర్తకీ వేషధారిణ్యః సుమధ్యాః దీర్ఘలోచనాః, 119

పీవరోరు కటీభారాః పీనోన్నత పయోధరాః
స్పర్ధమానాః మిథః కాంతిరూపయౌవనవిభ్రమైః. 120

హేమ్నారూప్యేణ కాంస్యేన రచితాన్ దారుణాఽథవా
అంతశ్చల దయోగోల నిక్వాణ ముఖరీకృతాన్, 121

దత్వాఽన్యాసాం నిజాన్ [తద్వత్] గృహ్ణంత్యః పరతః పరాన్
మిథో వినిమయైస్తైస్తాన్ స్వీకుర్వంత్యః కదాచన, 122

కుచవక్త్ర కృతాసక్తాన్ శకుంతానివ కందుకాన్
కరైరుడ్డాపయంత్యస్తాన్ కౌతుకోత్కూలకూజితాః, 123

ఉల్లలత్కందుక ప్రాప్తి ధావల్లోలాక్షిలీలయా
రచయంత్య ఇవాకాశం సరోమీనాబ్జసంకులమ్. 124

చారీభిర్గతిభిః పాదైర్లాస్యాంగైరపి కోమలైః
నృత్యంతి వనితా యత్ర తత్ స్యాత్ కందుకనర్తనమ్. 125

**అథ ఖాండిక నృత్తమ్**

వక్త్రోద్భవేషు వాద్యేషు వాద్యానుకరణేషుచ
వర్తమానేషు తాళేన హస్తతాలయుతేనచ, 126

నట్లు, సుకలాసము చేయుచు, అడుట చింతునృత్తమనబడును ; ఇది తమిళులకు చాల ప్రియమైనది. 114, 115, 116, 117

### ఇక కందుకనృత్తము (చెండాట)

ఇందు పద్మము, గోమూత్రిక, నాగము, చక్రము, మున్నగు బంధములను, లేదా దేశినృత్తమునకు చెప్పిన ప్రబంధములను, నానాపాటములతో క్రమముగా వాద్యాల వారు వాయించుచుండవలయును.

నట్టువ కత్తియల వేషముధరించి, చక్కని నడుములు, నిండైన కన్నులుగలిగి, బలిసినతొడల, పిరుదుల బరువుగలిగి, నిక్కిన గబ్బిగుబ్బలు గలిగి, అందమున, ప్రాయమున, విభ్రమమున, ఒకరితోనొకరు పోటాపోటి చేయువనితలు, 118, 119, 120

బంగారు - వెండి - కంచులతో చేసినవి, త్రమానితో చేసినవి యైనను, లోన కదలునట్టి యినుపగుండ్ల గలగలధ్వని గలవియునగు బంతులు గ్రహించి, తమ వానిని ఎదుటివారికిచ్చుచు, వారిబంతులను తాముపట్టుకొనుచు, అప్పుడప్పుడు మరల చెండ్లను మార్చుకొనుచు కుచములవద్దికి, మొగములవద్దికి అవివచ్చినపుడు పక్షులనువలె ఎగురగొట్టుచు, వేడుకతో గట్టిగా కూతలువేయుచు, 121, 122, 123

ఎగురుచున్న చెండ్లను పట్టుకొనుటకై పరువెత్తు చంచలనేత్రములలీలచే, ఆకాశమును చేపలు, తామరపూవులు నిండిన యొక కొలనివలె తీర్చుచు, కోమల ములగు చారులు - గతులు - పాదములు - లాస్యాంగములు- వీనితో నర్తించునది కందుకనృత్తమగును. 124, 125

### ఇక ఖాండికనృత్తము

ఇది ఖండులు - హాస్యగాండ్రు - చేయునది ; వారు నర్తించునపుడు వాద్య గాండ్రు నోటివాద్యములును, వాద్యములను వాయించునట్లు అభినయములును,

ఖంజ వామన పోగండ వానరాద్యనుకారిణః
శిఖి సారస హంసాఢ్య [?] శుకాది రుతకారిణః, 127

ఖరోష్ట్రి సారమేయాది వాశితానువిధాయినః
తైస్తైర్వచోభిరశ్లీలైః చేష్టితైశ్చ తథావిధైః, 128

ఉత్సారణాయ జాడ్యస్య హాసయంతో నిరంతరమ్
అత్యంతం వామనీభూతాః పాత్రైరత్యంతదుష్కరైః
యత్ర నృత్యంతి ఖంజాస్తత్ ఖాండికం నర్తనం మతమ్. 129

[1]అథ ఘటిసణీ నృత్తమ్

హుడుక్కాంస్కంధసంసక్తాం వాదయంతీ సఖీమివ
గాయనైర్గాయనీభిశ్చ వాంశికైశ్చ సమన్వితా, 130

చండాలీ నర్తకీవేషా (ష ?) ధ్వనిశారీరపేశలా
చర్యాప్రభృతిభిర్గీతైః దేశీయూడస్థితైరపి, 131

గాయంతీ ధన్వినం క్రీడాకిరాతం పార్వతీపతిమ్
కాహలైర్మర్దలైః, కాంస్యతాలైః కరటయాంచితైః, 132

వాద్యేషు వాద్యమానేషు యతిప్రహారణాదిషు
గతిభిస్సుకుమారాభిః తాలచ్ఛందమనోహరమ్, 133

యత్ర నృత్యేదిదం ఖ్యాతం నృత్తం ఘటిసణీ విధిః [?]
ఏవంవిధగుణే నైతత్ ప్రయోజ్యం పురుషేణవా. 134

1. 'ఘటిసిశ్రీ', 'ఘటిసణి', 'ఘటివిశ్రీ', 'ఘటీవిశ్రీ'- అను రూపములు వ్రా. ప్ర. లలో నున్నవి. హుడుక్కజాలి వాద్యము, 'ఘటసా' అనునది గలదు గనుక, దానిని ధరించిన స్త్రీ 'ఘటసిస్త్రీ' కాగా, అదే వ్రాతలో 'ఘటిసశ్రీ' అయి యుండునని, ఈ నృత్త మింకే గ్రంథమునందును కానరాలేదు గనుక, దీని సరియైనపేరు సందిగ్ధమని పరిష్కర్త సూచించినారు. (క్రింది సూచిక)

తాళానుసారముగా చేతులు తట్టుచు సాగింపవలెను, నర్తకులు గూనివారిని, పొట్టివారిని, అంగహీనులను,[1] కోతులను, అనుకరించుచు, నెమలి, బెగ్గురు, పైడికంటి, చిలుక మున్నగు వారివలె కూయుచు, గాడిద, ఒంటె, కుక్క మొదలగు జంతువుల కూతలననుసరించుచు, ఆయా బూతుమాటలతో, చేష్టలతో, చూచువారి విసుగును పోగొట్టుటకై నిరంతరముగా నవ్వించుచు, చాల పొట్టిగానిలిచి, అతిదుష్కరములైన పాటములతో, ఆడవలయును, ఇది ఖాండిక నృత్తమగును. 126, 127, 128, 129

ఇక ఘటిసణీ నృత్తము

మృదువైన వేషము, స్ఫుటమైన నాదముగల శారీరమును, గలిగిన మాలజాతి నర్తకి, మూపుమీద చెలికత్తెవలె హుడుక్కా వాద్యమును బెట్టుకొని వాయించుచు, పాటపాడునట్టి పురుషులతో, స్త్రీలతోగూడి, చర్యాప్రబంధము[2] మొదలగు రచనలును, దేశిసూడయందలి పాటలును, క్రీడాకిరాతరూపుడగు ధనుర్ధారిని పార్వతీపతిని గూర్చి పాడుచు, కాహళములు, మద్దెలలు, కంచుతాళములు - వీనితో కరటావాద్యమునుచేర్చి వాదకులు యతి, ప్రహరణము మున్నగు తాళప్రబంధములను వాయించుచుండగా, సుకుమారములగు గతులతో, మనోహరముగా తాళచ్ఛందముననుసరించి నర్తించుట ఘటిసణీ నృత్తమగును, ఇట్టి గుణములుగల మగవాడైనను ఈ నృత్తము చేయవచ్చును. 130, 131, 132, 133, 134

---

1. 'పోగండ' అనగా చిన్న బిడ్డలనియు చెప్పవచ్చును

2 అంత్యప్రాసలు గలిగి, అధ్యాత్మవిషయము గలిగి, యోగులు పాడునట్టి రచన చర్యాప్రబంధము (చూ భరతకోశము)

అథ చారణ నృత్తమ్

నానానుప్రాసమధురాన్ దోహకాన్ రసనిర్భరాన్
రసోచితేన రాగేణ గాయంతోదేశకాకుభిః, 135

వాద్యానుకరణైః వక్త్రభవైః (భీఘా)[1]కృతోత్తరైః
ఉద్ధతైః పాదవిన్యాసైః భ్రమరైరపి ఘూర్ణితైః, 136

హస్తాభ్యాం బహుభంగీభిస్తాళైః ఛందమనోహరైః
యత్రభి సౌరాష్ట్రదేశీయాః చారణాః లలితోద్ధతమ్, 137

స్త్రియశ్చేదుంతరీయాణాం పల్లవైరవగుంఠితాః
నృత్యంతి మండలావృత్త్యా తత్స్యాత్ చారణనర్తనమ్. 138

అథ బహురూప నృత్తమ్

బహురూపస్య లోకస్య తత్తద్రూప ప్రదర్శనాత్
వేషచేష్టితభాషాభిః బహురూపం నిరూప్యతే. 139

సర్వ (చీవ-ఓది? - రవా చేదిం...నావగమ్, ప్రకల్పకః) ?[2]
రంజకో మంజువాగ్వాగ్మికల్యః కైవారకోవిదః, 140

సురేఖో రసికో రూపభాజనం భావకోయుహా
[3](వాయవేనాపితంవో) నాత్యుచ్చో నాతివామనః, 141

సంస్కృతాదిషు భాషాసు నానాదేశోద్భవాసుచ
దక్షః సదస్యతాభిజ్ఞః బలవాన్ విజితశ్రమః, 142

ఆశువేషాంతరగ్రాహీ ప్రస్తావోచితపారకః
స్వతుల్యానుచరైర్యుక్తో ముండితశ్మశ్రుమూర్ధజః, 143

---

1 కుండలించినది అస్పష్టమని పరిష్కర్త వ్రాలిన పాఠము ఇది నావద్ది వ్రా ప్ర. లోనిది అర్థము నా యూహా

2, 3 సవరణ సాధ్యముగాని వ్రాత.

### ఇక చారణ నృత్తము

సౌరాష్ట్రదేశము వారైన చారణులు - ఊరూరు తిరుగుచు, గేయములు పాడు వృత్తిగలవారు —, పలు తెరగుల యనుప్రాసములు గల్గి, మధురములైన రసమునిండిన దోహకములను[1] రసములకు తగిన రాగములతో దేశకాకువులతో పాడుచు, ఖీ-ఖూ అను శబ్దములు నిండిన వాద్యధ్వనులను నోటితో పలుకుచు, అందమైన ఛందముగల కరతాళములు పలుభంగులతో వేయుచు భ్రమరములతో అందమైన గట్టి పాదవిన్యాసములతో, లలితోద్ధతముగా నర్తించుట చారణ నృత్తము ; స్త్రీలైనచో కట్టుచీర కొంగులతో ముసుగు వేసికొనవలయును. 135, 136, 137, 138

### [2]ఇక బహురూపనృత్తము

అనేకరూపములుగల లోకుల ఆయారూపములను, వేషము, చేష్ట, భాష-వీనిచే ప్రదర్శించునదిగాన ఇది బహురూపమనబడును. దానిని నిరూపింతుము. 139

రక్తిగలిగింపగలవాడు, మంచిపలుకుగలవాడు యుక్తిగా మాటలాడు నేర్పు గలవాడు, ఆరోగ్యవంతుడు, కైవారమున నేర్పరి, మంచిరేఖగలవాడు, రసికుడు, రూపరి, భావనాశక్తిగలవాడు, ప్రాయముగలవాడు, మిక్కిలి పొడుగరియు పొట్టియు గానివాడు, సంస్కృతము మొదలగు భాషలందు, ఇతర దేశభాషలందును దక్షుడు, సభ్యతనెరిగినవాడు, బలవంతుడు, శ్రమను గెలిచిన వాడు, త్వరలో వేషము మార్చుకొనగలవాడు, ప్రస్తావమునకుచితమైన వానిని చదువగలవాడు, తనవంటి యనుచరులతో గూడినవాడు, గడ్డమును, తలవెండ్రుకలను క్షౌరము చేసికొన్నవాడు, మధురధ్వనిగల గాత్రము గలవాడు — ఇట్టి

---

1. దోధకమను వృత్తచ్ఛందస్సుగల రచనలు. మూడు భగణములు, రెండు గురువులును పాదమునకు గలది దోధకము : "నానన నానన నానన నానా" ఇట్లు.

2. ఇదే యిప్పటి పగటివేషమని పరిష్కర్త భావము (Introduction P. 152).

మధురధ్వని శారీరో బహురూపీ నిగద్యతే;
గుణై రేభిర్యుతా స్త్రీ వా మతా ముండనవర్జితైః. 144

త్రివిధాభినయే సాధ్యం లోకధర్మముపేయుషా
సాత్త్వికేన పరిత్యక్తం హావభావై రలంకృతమ్, 145

ద్విచతుశ్చరణా పాదసంజీవా[1]భినయాంచితమ్[?]
ప్రథమం ప్రవిశేత్పాత్రం సకలాతోద్యసంయుతమ్, 146

వాద్యప్రవర్తితైః [ప్రాప్తైః ?] నృత్తైరపి మనోహరమ్;
నృపవంశేనవా లోకప్రసిద్ధచరితేన వా. 147

యన్నాశ్యే(వర్జితం)[2] సాక్షాత్ తత్కుర్యాదత్రకృత్రిమమ్ ;
అత్యంతగ్రామ్యభాషాఢ్య మనిష్టం యత్సభాసదామ్
.........[3]యచ్చ బహురూపం నతన్మతమ్. 148

అథ కోల్లాట నర్తనమ్

కాహళై ర్మార్గపటహైః కాంస్యతాలసమన్వితైః
మర్దలైః జయఘంటాభిః భేరీభిస్తంబకైరపి, 149

వాద్యమానేషు వాద్యేషు వాదకై ర్భావ్యమద్భుతమ్[?]
వరత్రాగమనైశ్చిత్రైః కరణై రంచితాదిభిః, 150

ప్రాంశోరుపరి వంశస్య భ్రమరై రతిదుష్కరైః
ప్రాణసందేహకరణైః శస్త్రధారాగ్రవంచనైః, 151

మనుష్య దుర్వహైర్భారైః మృద్వంగ పరివర్తనైః
ఉచ్చైః ఖగవదుడ్డీనైః శస్త్రాణాం చాలనాదిభిః
యత్రనృత్యంతి కోల్లాటాస్తత్ స్యాత్ కోల్లాటనర్తనమ్. 152

---

1. 'వాదసంజీవాభి' అని వ్రా. ప్ర. పైని చిన్ని సవరణతో అర్థము సూచించితిని.

2. (దృశ్యతే ?) అని పరిష్కర్త లుప్తపూరణము. 'వర్జితం' అని నావద్ది వ్రా. ప్ర.

3. 'వత్సభావనామి స్వార్య సంశర్యత్' అని వ్రా. ప్ర. కొరుకరాని పాఠము.

వాడు బహురూపి యనదగును ; ఈ గుణములన్నియు — శౌరము తప్ప — గలిగిన స్త్రీయైనను గావచ్చును. 140, 141, 142, 143, 144

సాత్వికాభినయము వదలి, లోకధర్మమునాశ్రయించిన త్రివిధాభినయములతో, హావభావముల సొగసుతో, రెండుకాళ్ళు, నాలుగుకాళ్ళు, కాళ్ళులేని — సజీవ వస్తువుల యభినయముతో, అన్నివాద్యములతోను గూడి, పాత్రము మొదలు ప్రవేశింపవలయును ; వాద్యములందలి పాటములతోను, నృత్తములతోను, ఆట మనోహరము గావలయును ; రాజవంశముగాని (?) లోకప్రసిద్ధమైన చరిత్రను గాని అభినయింపదగును. 145, 146, 147

నాట్యమునందు ప్రత్యక్షముగా చూపగూడని వస్తువును ఇందు కృత్రిమముగా చేయవలెను(?). మిక్కిలి గ్రామ్యమైన భాష గలిగినదియు, సభ్యులకిష్టము కానిదియునగు విషయము బహురూపమున నుండదగదు(?). 148

ఇక కొల్లాట నర్తనము

ఢాకాలు, మార్గపటహములు, కంచుతాళములు, మద్దెలలు, జేగంటలు, భేరులు, తప్పెటలును భవ్యముగా, అద్భుతముగా వాద్యాలవారు వాయించుచుండవలెను ; అప్పుడు కొల్లాటవారు (దొమ్మరులు)[1] – అంచితము మొదలగు కరణములతో, వింతవింతగా తోలుపగ్గములమీద నడుచుచు, పొడువైన వెదురు గడమీద చాలదుష్కరములైన భ్రమరులు చేయుచు, ప్రాణసందేహముగలిగించునట్లు ఆయుధాల వాదరలనుండి తప్పుకొనుచు, మనుష్యులు మోయలేని బరువులు మృదువైన యంగములమీద పెట్టుకొనుచు, ఎత్తుగా పక్షులవలె ఎగురుచు, కత్తులు మొదలగు శస్త్రములు త్రిప్పుటవంటి పనులు చేయుచు – నర్తించుట కొల్లాట నర్తనమగును. 149, 150, 151, 152

1. డోంబలనువారు తక్కువజాతివారు. చాలా ప్రాచీనకాలమునుండియు వీరికి నాట్య–నృత్త–గానములు వృత్తి. ఉపరూపకములలో 'డోంబి' అను విశిష్టరచన పూర్వముండినది వీరే దొమ్మరివారు. కన్నడమున వీరికే 'కొల్లటిగ' అను మారుపేరును గలదు. కొల్లలాడు – కొల్ల మున్నగు తెలుగుపదములకు ఈ 'కొల్లాటము'తో సంబంధ మేమైన గలదేమో !

[1]అథ నర్తకీ లక్షణమ్

రూపయౌవనలావణ్య నృత్తవిద్యాశ్రయత్వతః
నేత్రానంద సుధాపాన భాజనత్వాచ్చనర్తకీ,
ఉపచార ప్రయోగజ్ఞైః పాత్ర మిత్యభిధీయతే. 153

తన్వీ తారుణ్యలావణ్య భాగ్యసౌభాగ్య సౌధభూః
కులీనా రూపవత్యాద్యా గ్రహణే ధారణేక్షమా, 154

ప్రగల్భా రసభావజ్ఞా సోత్సాహా సకుతూహలా
కలాభిజ్ఞా విధేయాంగీ సుసత్త్వా మధురస్వరా, 155

స్మితపూర్వ కృతాలాపా సుమనాః శుద్ధలక్షణా
సుతారాఽనామయా శ్యామా గౌరీవా లాఘవాన్వితా, 156

జితశ్రమా సభాధీరా చతురా త్రివిధే గ్రహే
అవధానవతీ ఖ్యాతా గీతవాద్యవిశారదా. 157

నాతిస్థూలా నాతికృశా నాత్యుచ్చా నాతివామనీ
వినయౌదార్యలజ్జాది గుణరత్నైరలంకృతా, 158

అంగప్రత్యంగకోపాంగ చారీ స్థానకమండలాన్
పాటాంగహార లాస్యాంగ భ్రమరీ కరణాన్యపి, 159

1. "ఈ శీర్షిక 'గోండలీలక్షణమ్', లేక 'గోండలీ నర్తకీ లక్షణమ్' అని యుండవల యును. ఈ గ్రంథమున ప్రత్యేకముగ గోండలీ నృత్తలక్షణమును వివరింపలేదు. దేశీ నృత్తభేదముల కడపట, గోండలిని పేర్కొని ముందు నర్తకీ సామాన్య లక్షణము చెప్పుటచేత, 'దేశీపద్ధతి-పుష్పాంజలి' అను శీర్షికక్రింద జాయసేనాని చెప్పిన ఆట-పాటలు ఈ గోండలికి సంబంధించినవిగా గ్రహింపవలసి యున్నది"- అని పరిష్కర్త సూచన చేసినారు. (Introduction P. 135) లేక, దాని లక్షణ గ్రంథభాగము లుప్తమైనదేమో ! గోండలి సంపూర్ణలక్షణమును సంగీత రత్నాకరమున (అ. ౭, శ్లో. ౧౨౭౮-౧౩౦౦) చూడవచ్చును.

**ఇక నర్తకీ లక్షణము**

రూపము, యౌవనము, లావణ్యము, నృత్తవిద్య — వీనికి ఆశ్రయమై యుండుటచేతను, నేత్రానందమను అమృతము త్రాగవలసిన పాత్రమగుట వలనను, ఔపచారిక ప్రయోగమునెరిగినవారు, నర్తకిని పాత్రము అని పేర్కొనినారు. 153

ఉత్తమమైన నర్తకి యెట్టిదనగా :

చులకని దేహము గలిగి, ప్రాయము, అందము, మంచి యదృష్టము, భర్తకు ప్రీతిపాత్రత — వీనికి నెలవై యుండవలెను ; సత్కులమున పుట్టి, రూపము, సంపద గలిగి, గ్రహణ ధారణములందు సమర్థత గలదియు, ప్రతిభ గలిగి, రస భావములను దెలిసి, ఉత్సాహమును, కుతూహలమును గలిగినదియునై యుండ దగును ; కళలు దెలిసినది, విధేయములగు అంగములు గలిగినది, మంచిసత్త్వ గలది, తియ్యని కంఠస్వరను గలదియు గావలయును. 154, 155

నవ్వుచు మాటలాడగలది, మంచిమనస్సు శుద్ధమైన లక్షణములు గలది, చక్కని కనుపాపలు గలది, ఆరోగ్యవంతురాలునై యుండదగును ; దేహవర్ణము చామనచాయగాని, బంగారువన్నెగాని కాదగును ; లాఘవముగలిగి, శ్రమను గెలుచుకొని, సభయందు ధైర్యముగలిగి, (సమము, అతీతము, అనాగతము అను) మూడు తాళగ్రహములందును చతురురాలై యుండవలెను; అవధానము గలదియు, గీత — వాద్యములందు నేర్పరియు గావలయును. 156, 157

ఎక్కువ లావుగను, బక్కగను ఉండక, ఎక్కువ పొడువును, పొట్టియును గాక, వినయము ఔదార్యము, లజ్జ మున్నగు గుణరత్నములచే అలంకృతయై యుండదగును ; అంగములు, ప్రత్యంగములు, ఉపాంగములు, చారులు, స్థానకములు, మండలములు, పాటములు, అంగహారములు, లాస్యాంగములు, భ్రమరులు, కరణములు, మార్గ - దేశి పద్ధతుల ప్రయోగములు — ఇవన్నియు

మార్గదేశీవిధానేన ప్రయోగాన్ జానతీ స్ఫుటమ్
సద్యోఽభీష్ట ప్రయోగజ్ఞా నర్తకీ ప్రవరామతా. 160

రూపయౌవన యుక్తానాం సహస్రేఽపి మృగీదృశామ్
కలాగుణ సమేతానాం నర్తకీ నైవలభ్యతే ;
[1]నర్తకీ గాయనీ స్యాచ్చేత్ భోగినీ, పాత్రమన్యథా(?). 161

కల్యాణకటకే పూర్వం భూతమాతృమహోత్సవే
సోమేశః కౌతుకాత్ కాంచిత్ ఖిల్లీవేష ముపేయుషీమ్. 162

నృత్యంతీమథ గాయంతీం స్వయం ప్రేక్ష్యమనోహరమ్
ప్రీతో నిర్మితవాన్ చిత్రగోండలీ విధిమిత్యయమ్
యతో ఖిల్లీ మహారాష్ట్రే గోండలీత్యభిధీయతే. 163

కుండలీం నామ మృద్వంగీం సుకేశీం దివ్యయోషితమ్
సంగీతం కోమలం నృత్తం శిక్షయామాసపార్వతీ
తన్నృత్తం కుండలీమాహుః తత్సంబంధాత్ పురాతనాః. 164

## అథ నర్తకలక్షణమ్

కులీనో నృత్యశాస్త్రజ్ఞః తత్త్వవేదీ జితేంద్రియః
ఊహాపోహ విశేషజ్ఞో దయోలక్ష్యప్రదర్శనే. 165

కవిర్వాద్యప్రబంధేషు స్వయం వాదనకోవిదః
జ్ఞాతా వాద్యశ్రుతీః సర్వాః ముఖవాద్యవిశారదః. 166

చతురః శిష్యశిక్షాయాం నర్తనే నిపుణః స్వయమ్
సంగీతమేలనాభిజ్ఞో నానాదేశీయ నృత్యవిత్. 167

1. ఈ వాక్యమునకు 'పాత్రమునందు నర్తనము, పాట, అందము అను మూడు గుణములను గలిగి యుండెనేని అదియొక అసాధారణ సందర్భము' అని తాత్పర్యమును పరిష్కర్త సూచించినారు. (చూ. క్రింది సూచిక)



దండలాస్యము



గరుడప్లుత

స్పష్టముగా నెరిగినది గావలయును ; కోరిన ప్రయోగమునప్పుడే చేసి చూప గలిగినది గావలయును ; ఇట్టిది ఉత్తమనర్తకి. 158, 159, 160

రూపము, యౌవనము గలిగి కళలగుణములుగల మృగాక్షులు, వేయిమంది లోను ఒక నర్తకి లభింపదు.

నర్తకి గాయనిగూడనయ్యేనేని భోగినియగును ; కాదేని పాత్ర మగును. (?) 161

పూర్వకాలమున, కల్యాణకటకమునందు, భూతమాతృకల యుత్సవ సమయ మున, ఒకానొక స్త్రీ భిల్లజాతియాడదానివేషము ధరించి, మనోహరముగా ఆడుచు, పాటపాడుకొనుచుండగా, సోమేశుడు వేడుకతో చూచి, సంతోషించి, ఈ చిత్రగోండలి నృత్తమును తానే కల్పించినాడు ; మహారాష్ట్రములో భిల్ల స్త్రీకి 'గోండలి' యని పేరుగనుక. 162, 163

'కుండలి' యనబడు ఒక సుందరియైన దేవతా స్త్రీకి, పార్వతీదేవి, సంగీత మును, కోమలమైన నృత్తమును నేర్పెను : ఆ సంబంధముచే ఆ నృత్తమును 'కుండలి' యని ప్రాచీనులు పేర్కొందురు. 164

## ఇక నర్తక లక్షణము

మంచికులమున జనించినవాడు, నృత్యశాస్త్రము నెరిగినవాడు, తత్త్వజ్ఞానము గలవాడు, ఇంద్రియములను జయించుకొన్నవాడు, ఊహా, అపోహాల భేదము నెరిగినవాడు, లక్ష్యమును ప్రదర్శించుటయందు దక్షుడు, వాద్యప్రబంధములు కవనముచేయగలవాడు, తానే వానిని వాయింపనేర్చినవాడు, వాద్యముల శ్రుతులన్నియు తెలిసినవాడు, ముఖవాద్యమందు నేర్పరి, శిష్యులకు నేర్పుట యందు చతురుడు, తానే నర్తించు నైపుణ్యము గలవాడు, నృత్తగీతవాద్యము లను మేళగింపనేర్పుగలవాడు, నానాదేశముల నృత్యరీతులెరిగినవాడు, కళా విదుడు, నిరహంకారుడు, పరంపరగా విద్యోపదేశము గలవాడు, తాళములందు కుశలుడు, మాటకారి, గీతవాద్యములు తెలిసినవాడు, క్రొత్తక్రొత్తగా ఆయా

కలావిత్ నిరహంకారః పారంపర్యోపదేశవాన్
తాలేషు కుశలో వాగ్మి వేదితా గీతవాద్యయోః. 168

ప్రతికల్పయితుం భంగీః తాస్తాః ప్రతిసవాః క్షమః
కరాభ్యాం పాదపాటాది కర్మదర్శయితుంపటుః. 169

అవ్యంగోఽంతర్ముఖః కల్యోరూపవాన స్తమత్సరః
నర్తకీ మనసా సార్ధమేకీభావమిహాగతః. 170

సురేఖో రంజకో మంజువదనో నర్తకోమతః
గుణై రేవం విధై ర్యుక్తా కించిద్గలితయావనా
అంతఃపుర (పుర)[1]స్త్రీణాం శిక్షాయాం నర్తకీపరమ్. 171

## అథ ముఖరిలక్షణమ్

........., తాళమాత్రాణాం గణితజ్ఞతా
మార్జనాత్రయవేదిత్వం[స్థి]రతా లఘుహస్తతా 172

వాద్యప్రబంధకర్తృత్వం పాత్రచిత్తానువర్తితా
బృందమేలన దక్షత్వం రంజకత్వం సురేఖతా. 173

న్యూనాతిరిక్తయోః సామ్యకృతి ర్వాద్యశ్రుతిజ్ఞతా
సంగీతయోజనజ్ఞత్వం గ్రహే మోక్షేచపాటవమ్. 174

చిత్రాదిక చతుర్మార్గ వివేచన విదగ్ధతా
బలిత్వం సావధానత్వం తాలానుగగతిజ్ఞతా. 175

సర్వాంగదోషరాహిత్యం ధిద్రావరణనైపుణమ్
ధృతిర్ముక్తిశ్చశబ్దస్య సౌష్ఠవం హృద్యవాదితా. 176

ప్రస్తావోచితకైవార చతురత్వం సభాపతేః
గాత్రస్వరానుగామిత్వం వాజవాద్యేసుకర్ణతా. 177

1. వ్రాతలో రెండక్షరములు లుప్తము. 'గత' ఉండునని పరిష్కర్త సూచన. పైది నా సూచన.

భంగులను కల్పింపగలవాడు, చేతులతో వాద - పాటములు మొదలగుపనులు చేసి చూపగలవాడు, అంగహీనతలేనివాడు, అంతర్ముఖి, ఆరోగ్యవంతుడు, రూప వంతుడు, మచ్చరములేనివాడు. నర్తకి మనస్సుతో ఏకీభావమునొందగలవాడు, మంచిరేఖకలవాడు, రంజనచేయగలవాడు, మధురవాక్కుగలవాడు - ఇట్టివాడు నర్తకుడగును. ఈ గుణములుగల నర్తకి యౌవనము కొంత సడలినదైనపుడు అంతఃపురస్త్రీలకును, (పురస్త్రీలకును.) నర్తనము నేర్పుటకు తగును.

165, 166, 167, 168. 169, 170, 171

ఇక ముఖరి లక్షణము

తాళమండలి మాత్రల లెక్కనెరిగియుండుట, మాయూరి. అర్ధమాయూరి, కార్మారవి అను మూడు మార్జనలు - ఆవనద్ధవాద్యమందు స్వరములను పుట్టించు క్రమములు — తెలిసియుండుట, స్థిరత్వము, హస్తలాఘవము, వాద్యప్రబంధ ములు రచింపగలుగుట, పాత్రచిత్తమునమసరించుట, బృందమును మేళగించు నేర్పు, రంజింపజేయు శక్తి, చక్కనిరేఖ గలిగియుండుట, ఎక్కువతక్కువలను సరిపరుచుట, వాద్యముల శ్రుతులనెరిగియుండుట, సంగీతమును కూర్చు తెలివి, పట్టు - విడుపులందు పటుత్వము, చిత్రము మొదలగు నాలుగు తాళ మార్గము లను — చిత్రము, ధ్రువము, వార్తికము, దక్షిణము అనువానిని — ఏర్పరుచు జాణతనము, కాయశక్తి, సావధానత, తాళమునమసరించు గతినెరుగుట, ఏయంగమునందును దోషము లేకుండుట, లోపములను కప్పిపెట్టు నిపుణత, శబ్దమును పట్టుకొను, వదలు — శక్తి, సౌష్ఠవము, హృద్యముగా వాయింప గలుగుట, ప్రస్తావమునకు తగినట్లు సభాపతినికై వారము చేయు చాతుర్యము, శారీరమండలి స్వరమును వెన్నంటి నడవగలుగుట, వాజవాద్యమందు [ప్రక్క వాద్యము?] మంచిచెవిగలిగియుండుట, మంచినిలుకడగల యుత్సాహము, చేయి

[సు]స్థిరోత్సాహితా చర్మలగ్నహస్తత్వమిత్యమీ
గుణాః ముఖరిణః ప్రోక్తా వాదకస్య విచక్షణైః. 178

### అథ ప్రతిముఖరిలక్షణమ్

గుణైః కైశ్చిద్విహీనోఽపి భవేత్ ప్రతిముఖర్యపి;
కింతు యత్యాది వాద్యానాం కృతానాం ముఖవాదినా
ఉచితాన్యనుయాయీతి [?][1]తద్వద్వాదయితుమ్‌క్షమః 179

### అథ వాద్యబృందలక్షణమ్

కృతానాం వాద్యకవిభిః వాద్యానామాశుశిక్షణమ్
శ్రుతిజ్ఞాన పరత్వంచ స్వవాద్యగ్రహమోక్షయోః, 180

తాలానుగత్వమైకాగ్ర్యముభయో (గ్ర్యంపుటయో?)[2] ర్మేలనజ్ఞతా
వామదక్షిణ దక్షత్వ మన్యోన్యస్తుతికారితా
ముఖానువృత్తి (వర్తి?) తాచేతి వాద్యబృంద గుణామతాః. 181

### అథ ముఖ్యగాయకలక్షణమ్

బృందమేలన చాతుర్యం రాసిక్యమనురంజనమ్
త్రిషుస్థానేషు గమకప్రాణగీతి ప్రవీణతా, 182

గంభీరమధుర స్నిగ్ధశ్రావక ధ్వనిశాలితా
తాదృక్శారీర సంపత్తిః వివిధాలప్తి నైపుణమ్, 183

సర్వగీతప్రబంధానాం గాతృత్వం తాలధారితా
విజితశ్రమతాఽయత్తకంఠతా సావధానతా, 184

---

1. భావము స్పష్టమే కాని భాష కలుషితము.
2. 'పుటయోః' ప్రా. ప్ర. స్పష్టతరము. వాద్యముల కుడి యెడమ మూతలు పుటములు. (చూ. భర. కో. 'పుటపరి కర్మ').

చర్మమునంటుకొనియే యుండుట — ఇవి ముఖరి — వాద్యగాంౘడమేటి-కివలయు గుణములు 172, 173, 174, 175, 176, 177, 178

**ఇక ప్రతిముఖరి లక్షణము**

పైగుణములలో కొన్ని లేనివాడైనను ప్రతిముఖరి — ఎదురువాద్యగాడు — కాగలడు, కాని ముఖరి చేసిన యతి మొదలగు వాద్యప్రబంధములలో, ఉచితము లైన వానిని, అతనివలె వాయింపగలిగి, అనుసరింపగలవాడు కావలెను. 179

**ఇక వాద్యబృందలక్షణము**

వాద్యకవులు రచించిన వాద్యప్రబంధములను త్వరగా నేర్చుకొనుట, శ్రుతి నెరుగుటయందాసక్తి, తమ తమ వాద్యముల పట్టు—విడుపులందు తాళమునను సరించి నడుచుట, ఏకాగ్రమయిన చిత్తము గలుగుట, వాద్యముయొక్క రెండు ప్రక్కల నాదములను మేళగించు నేర్పు, కుడియెడమలందు ధతుతతో వాయింప గలుగుట, ఒకరినొకరు పొగడుట, ముఖరిని అనుసరించుట — అనునివి వాద్య బృందములోని వారి గుణములు. 180, 181.

**ఇక ముఖ్యగాయకలక్షణము**

బృందమును మేళగించు చాతుర్యము, రసికత, రంజింపజేయగలశక్తి, మంద్ర—మధ్య—తార స్థానములు మూడిటియందు గమకములచే వెలయునట్లు పాడగల ప్రవీణత, గంభీరమై, తియ్యనై, తనుపుగలిగి వినిపించుకొను ధ్వని గలు గుట, అట్టి శారీరము, — గానముచేయు కంఠపాటవము, — గలిగియుండుట, వివిధములైన ఆలప్తులందు నైపుణ్యము, అన్నిగీతప్రబంధములును పాడగల నేర్పు, తాళమును విడువకుండుట, శ్రమను గెలుచుకొనియుండుట, కంఠము సిద్ధముగా నుండుట, అవధానము తప్పకుండుట, నర్తకియొక్క సుకలాసముతో

నర్తకీ సుకలాఽసేన సమతా (సమిత?)[1] స్థాయకారితా
శుద్ధసాలగరాగేషు భాషాంగాదౌచ కౌశలమ్, 185

గ్రహేమోక్షేచ దక్షత్వం ధీరతాఽపాస్తదోషతా
సర్వరీతిషు వైదగ్ధ్యాపశ్చిమత్వం సురేఖతా, 186

ఇత్యేతే కథితాః ముఖ్యా (ఖ్యా?) గాయకస్యగుణాఃబుధైః;
ఈదృగ్గుణా ముఖరిణీ వాద్యబృందే ప్రశస్యతే. 187

ప్రకృత్యైవాంగనాగానం కోమలం మధురంయతః
కృతార్థైరుపదేష్టవ్యం కన్యాభ్యోగాయకైస్తతః, 188

**అథ బృందలక్షణమ్**

సమానస్వరతా స్థానత్రయే గమకచాతురీ
అన్యూనాధికతా స్థాన (నే?) తన్మనస్త్వమభీరుతా, 189

నర్తనావసరే నాదం ధృత్వాగాతుం విదగ్ధతా
స్థాయాంతే ముఖ (ఖ్యా?)దాయిత్వం నియమస్య ప్రతిగ్రహః, 190

ప్రబంధగాయితా చేతి గాయినాం బృందలక్షణమ్;
బృందం నారీమయం సర్వమపి కార్యంవిలాసినా, 191

ద్రష్టుం కౌతుకినా నృత్తం శుద్ధాంతస్త్రీజనైస్సహ
రాజ్ఞాం (జ్ఞా?) విద్యావతాం చాగ్రే వైభవఖ్యాపనాయచ. 192

**అథ సంప్రదాయలక్షణమ్**

పాత్రానుజీవినాం బృందం సముదాయ ఉదీరితమ్
పారంపర్యోపదేశిత్వాత్ సంప్రదాయశ్చ, కథ్యతే. 193

చతుర్భిరధికాఽశీతిరుత్తమోత్తమ ఉచ్యతే,
విద్యావంతశ్చతుష్షష్టిరుత్తమః పరికీర్తితః. 194

1. 'సమిత' వ్రా. ప్ర. ఉచితతర పాఠము.

సరిగా తాయములు చేయగలుగుట, శుద్ధము, సాళగము, భాషాంగము మున్నగు రాగభేదములందు కౌశల్యము, పట్టు — విడుపులందలి దిట్టతనము, ధైర్యము, దోషములు లేకుండుట, అన్ని రీతులందును వెనుదీయని నేర్పరితనము, మంచి రేఖ గలిగియుండుట, — ఇవి ముఖ్యగాయకుని గుణములని బుధులందురు.

పై గుణములుగల స్త్రీ ముఖరిణిగా, వాద్యబృందములందుండుట ప్రశస్తము; సహజముగానే అంగనలపాట, మృదువు, మధురము; కావున నేర్చిన మగవారు, ఆడబిడ్డలకు గానము నేర్పదగును.

182, 183, 184, 185, 186, 187, 188.

### ఇక బృందలక్షణము

కంఠస్వరము ఒక్కతీరుగా నుండుట, త్రిస్థానము లందును గమకములు పలికించు నేర్పు, స్థానమందు ఎక్కువ తక్కువలు లేకుండుట, ఏకాగ్రచిత్తము గలుగుట, భయములేమి, నర్తించు సమయమున నాదమును పట్టుకొని పాడగల జాణతనము, రాయము తుదలో ముఖ్యగాయకునికి వదలు తెలివి, చేసిన ఏర్పాటును పరిగ్రహించుట, ప్రబంధములను గానముచేయుట - ఇవి గాయకబృందమునకు లక్షణములు.

విలాసశీలుడైన రాజు, వేడుకతో, అంతఃపురస్త్రీలతోగూడ నృత్తమును చూడవలసినప్పుడు, విద్వాంసులముందు, వైభవమును ప్రదర్శించుటకును, బృందముననంతయు స్త్రీలే యుండునట్లు చేయవచ్చును. 189,190,191,192

### ఇక సంప్రదాయలక్షణము

పాత్రమును వెన్నంటి జీవించువారి జట్టు సముదాయ మనబడును; పరంపరగా దీనికి సంప్రదాయమనియు పేరు గలదు; అది వివరింపబడును. 193

విద్యావంతులు ఎనుబదినలుగురు కలిగిన జట్టు ఉత్తమోత్తమ మనదగును; అరువదినలుగురు గలది ఉత్తమ మనబడును. 194

ద్వాత్రింశన్మధ్యమో జ్ఞేయః, వింశతిశ్చతురుత్తమా (రా ?)
అపరః, షోడశభ్యాతః కనిష్ఠశ్చేతి పంచధా. 195

ఉత్తమోత్తమ సంజ్ఞా (ఖ్యా !) యాః విద్యావంతోఽధికా యదా
తదా కోలాహలోఽయంతు నేష్టోరంగే, నమంతి యత్;
స పునర్వినియోజ్యః స్యాదుత్సవాదిషు భూభుజామ్. 196

ముఖరీ మద్దలీశ్రేష్ఠః స్వవిద్యాలక్ష్మలక్ష్యవిత్,
తస్య చిత్రక్రియాచ్ఛందానుగః ప్రతిముఖర్యపి, 197

తయోః మార్దంగికాః ప్రౌఢాః ద్వాత్రింశదనువాదకాః
హూడుక్కికాస్తు చత్వారో దేశిపాటహికావుభౌ, 198

కరటా వాదకౌచద్వౌ, తతస్తాలధరావుభౌ,
కాంస్యతాలధరాశ్చాష్టౌ, వాంశికౌద్వౌతయోః పునః, 199

ఓతుకారాశ్చ చత్వారః, శాంఖికౌ, కాహలాధరాః
చత్వారో, ముఖ్యగాయిన్యశ్చతస్రః, షోడశాపరాః
భవేయురనుగాయిన్యః బృందేఽస్మిన్నుత్తమోత్తమే. 200

యత్రైకో ముఖరీ, తస్యసమః ప్రతిముఖర్యపి,
తతో మద్దలినో ధీరాః షోడశాన్యేఽనువాదకాః, 201

హూడుక్కికాస్తు చత్వారో, దేశీపాటహికద్వయమ్,
కరటావాదకౌ, తాలధరౌ, షట్కాంస్యధారిణః, 202

వాంశికావోతుకారాశ్చ చత్వారః శాంఖికద్వయమ్,
చత్వారః కాహలావాదాః గాయిన్యోర్ముఖ్యయోర్ద్వయమ్
షోడశైనువాగామిన్యో బృందం తన్మతముత్తమమ్. 203

ముప్పది యిద్దరున్నది మధ్యమము; ఇరువది నలువురు గూడినది అవరము (తక్కువది); పదునారుగురు గలది కనిష్ఠము; ఇట్లిగి యైదు తెగలు. 195

ఉత్తమోత్తమ సంఖ్యకు మీఁరిన విద్యావంతులు గలది కోలాహలము; అది రంగమందడగదు గనుక కోరదగినది గాదు; కాని రాజుల మెరవణి మున్నగు సందర్భములందు దాని నేర్పరుపవచ్చును. 196

తన విద్య లక్షణలక్ష్యములు తెలిసిన శ్రేష్ఠుడగు మద్దెలవాయించు ముఖరి యొకడు; అతని చిత్తము, క్రియ, దాని రీతి యెరిగిన ప్రతిముఖరి యొకడు; వారిని వెన్నంటి వాయించు ప్రౌఢులైన మృదంగాలవారు ముప్పది యిద్దరు; హుడుక్క వాయించువారు నలుగురు; దేశిపటహము వాయించువా రిద్దరు; కరటావాదకు లిద్దరు; తాళము వేయువారు ఇద్దరు; కంచు తాళాలవారు ఎనమండుగురు; ఇద్దరు పిల్లగ్రోవి వాయించువారు; వారికి ఓతుకారులు[1] నలుగురు; శంఖమూదువారు ఇద్దరు; కాహల వాదకులు నలుగురు, నలుగురు ముఖ్య గాయినులు; వెనుపాట పాడు స్త్రీలు పదునార్గురు – ఉత్తమోత్తమబృందమున ఇట్లుండవలయును. 197, 198, 199, 200

ఉత్తమబృందమున – ముఖరియొకడు, అతనికి సరియైన ప్రతిముఖరి యొకడు. వారి యనువాదకులు, మద్దెలవారు పదునార్గురు, హుడుక్క వాయించువారు నలుగురు, దేశిపహటమువా రిద్దరు, కరటావాద్యమువారిద్దరు, తాళధారు లిద్దరు, కంచుతాళాలవారు ఆరుగురు, ఇద్దరు పిల్లగ్రోవివారు, ఓతుకారులు నలుగురు, శంఖమువా రిద్దరు, కాహాలమువారు నల్గురు, ముఖ్యగాయికలిద్దరు, వెనుక పాటకత్తెలు పదునారుగురే – ఇట్లేర్పడిన జట్టు ఉత్తమము. 201, 202, 203

---

1. "ఓతుకారులనగా అర్థము స్పష్టముగాదు 'ఓతా' అను వాద్య ప్రబంధము వాయించువారు కాగలరేమో ?" అని పరిష్కర్త సందేహించినారు. (చూ. Notes P, 40) 'ఒత్తు' = సుతి యను నర్థమున తెలుగున వాడుకలోనున్నది. ఒత్తుకాడు = సుతివేయువాడని శబ్దరత్నాకరము, సూర్యా. నిఘం. చెప్పుచున్నవి. ఇది ఇంకను విచారణీయము.

మధ్యమేహి ముఖర్యేకో బృందే ప్రతిముఖర్యపి
అష్టౌ మార్దంగికాః పశ్చాత్ తతో హౌడుక్కికావుభౌ, 204

కరటావాదకస్తాలీ చత్వారః కాంస్యతాలినః
వాంశికశ్చాతుధృత్ శంఖవాదకః కాహలాధరౌ
ముఖ్యగాయనికే చాష్టౌ భవేయురనుగాయికాః. 205

కేవలో ముఖరీయత్ర సప్తమార్దంగికాః పరే
హుడుక్కా కరటావాదీ (దౌ ?)[1] తాలధారీచ కేవలః, 206

కాంస్యతాలధరా ధీరాశ్చత్వారో వాంశికాః స్మృతాః (కః స్మృతః ?)[2]
ఓతుకారస్తథైకో ద్వౌ సుబద్ధౌ కాహలాధరౌ, 207

ఏకైవ గాయినీ ముఖ్యా గాయిన్యస్త్వపరాః పునః
చతస్రోయత్ర బృంతం స్యాదవరం పరికీర్తితమ్. 208

కనిష్ఠే మద్దలీ బృందే పరే మార్దంగికాస్త్రయః
హుడుక్కా కరటావాదీ (దౌ ?) కాంస్య తాలధరావుభౌ, 209

వాంశికశ్చాతుకారశ్చ కాహలీ ముఖ్యగాయినీ
తాలజ్ఞాః సహగాయిన్యః చతస్రః కథితాః బుధైః. 210

అథ మండపలక్షణమ్

[3] శతమష్టోత్తరం షష్టిశ్చతుర్భిరధికా తతః
ద్వాత్రింశదితి హస్తానాం పృథక్తేషు భవేన్మితిః;
క్రమాద్గీర్వాణ భూపాల (ప్రకృతీనాం[4]) భవంత్యమీ. 211

---

1·2 ౨౪ సంఖ్య సరిపుచ్చుటకై నా యీ సవరణ. లేకున్న ౨౫ అగును

౩. ఇక్కడ మంటపమును, దాని భేదములను ప్రస్తావించు పంక్తులు లోపించినవని తోచుచున్నది కుండలీకృతమగు తెలుగు భరతనాట్యశాస్త్రము ననుసరించినది. (చూ. అధ్యా. ౨ శ్లో. ౮)

4. 'ప్రభృతీనాం' వ్రా. ప్ర. ఈ సవరణ పరిష్కర్త సూచితము.

మధ్యమబృందమున - ఒక ముఖరి, ఒక ప్రతిముఖరి, మృదంగమువా రెని మిదిమంది, హుడుక్కలవా రిద్దరు, కరటావాదకు డొకడు, తాళమువా డొకడు నలుగురు కంచుతాళములవారు, వేణువువా డొకడు, ఓతుకారు డొకడు, శాంఖకుడొకడు, కాహాళవా రిద్దరు, మేటి పాటకత్తె లిద్దరు, వెనుపాటవా రెన మండుగురును వలయును. 204, 205

ముఖరి యొకడే, మార్దంగికు లేడుగురు, హుడుక్క కరటి వాయించువా రిద్దరు, ఒక తాళధారి, కంచుతాళాల ధీరులు నలుగురు, ఒక వేణువాదకుడు, ఓతుకారు డొకడు, ఇద్దరు మంచిపట్టుగల కాహాలవారు, ముఖ్యగాయని ఒకతె, వెంట పాటకత్తెలు నలుగురు_ఇట్లుండునది అవరబృందము. 206, 207, 208

కనిష్ఠబృందమునందు _ మద్దలి యొకడు, ఇతర మార్దంగికులు ముగ్గురు, హుడుక్క వాయించువాడు, కరట వాయించువాడు, కంచుతాళములవా రిద్దరు, ఒక పిల్లనగ్రోవివాడు, ఒక ఓతుకారుడు, ఒక కాహాళ పట్టువాడు, మేటి పాటకత్తియ యొకతె, తాళము నెరిగిన తోడి పాటకత్తెలు నలుగురు - ఉండ వగునని పండితులందరు. 209, 210

ఇక మండపలక్షణము

(రంగమండపము మూడు విధములు : జ్యేష్ఠము, మధ్యమము, కనిష్ఠముఅని; ఇది ఒక్కొక్కటి వికృష్టము, చతురశ్రము, త్ర్యశ్రము అను మూడు రూప ములు గలది యగును.)

జ్యేష్ఠమండపము కొలత నూటయెనిమిది మూరలు, మధ్యమము కొలత అరువదినాల్గు మూరలు, కనిష్ఠమునకు ముప్పదిరెండు మూరలును గావలయును. దేవతలవంటి పాత్రములకు జ్యేష్ఠమండపము; రాజులతెగకు జేరిన పాత్రములకు మధ్యమము; ఇతర ప్రకృతులకు (?) కనిష్ఠమును కావలయును. 211

జ్యేష్ఠే రంగస్య దూరత్వాత్ మంద్ర (ద ?) తాఽతోద్యగీతయోః
ప్రేక్షణీయస్య చ వ్యక్తిః నహి సమ్యగ్విభావ్యతే. 212

దూరస్థాస్తు జనాః శ్రావ్యా ఇతి తారతరోధ్వనిః
క్లేశసంపాదితో నూనం వైస్వర్య మవలంబతే. 213

ధ్వనిర్ముంచతి మాధుర్యం మండపేఽతి (పి?) కనీయసి
త్యక్త్వా జ్యేష్ఠకనిష్ఠే ద్వేతతో మధ్యః ప్రశస్యతే,
[1]యత్ర నృత్యధ్వనీ ప్రేక్ష్య శ్రవ్యేతే (శ్రవ్యౌతా?) భవతఃసుఖమ్. 214

చతుష్షష్టికరాయామో ద్వాత్రింశత్కరవిస్తృతిః
వికృష్టో మండపో రాజ్ఞా (జ్ఞాం?) చతురశ్రోఽభవాఽవరః. 215

సమంతాచ్చతురశ్రస్య ద్వాత్రింశత్ కీర్తితాఃకరాః.
ఆయామస్తు వికృష్టస్య పూర్వపశ్చిమతోమతః. 216

పూర్వతస్తస్య సంత్యజ్య కరానష్టౌ ప్రకల్పయేత్
చతురశ్రం కరైః రంగశీర్షం సమ్మితమష్టభిః. 217

రాసకాదౌ తతోఽప్యర్ధం ద్విగుణంవా యథోచితమ్.
తతోఽప్యష్టౌకరాన్ ముక్త్వా స్థానం కుర్యాత్ సభాపతేః. 218

శుద్ధాదర్శతలాకార రంగశీర్షోపశోభితః
స్తంభైరుత్కీర్ణ సింహాద్యైః విలసత్సాలభంజికైః. 219

ప్రత్యుప్తానేకరత్నాంశు చయధ్వస్తతమోభరైః
విచిత్రచిత్ర భంగీకైః ప్రేక్షణీయైరలంకృతః. 220

---

1. "యత్ర నృత్యధ్వని ప్రేక్ష్య శ్రవ్యతోభయతస్సుఖమ్" అని పాఠము సంస్క-రింపవచ్చునని పరిష్కర్త సూచన. (క్రిందిసూచి).

జ్యేష్ఠవిధమండపమున రంగము దూరమగుటవలన వాద్యముల, పాటలనాదము ప్రసరింపదు; చూడవలసినవానివ్యక్తిగూడ చక్కగా గోచరముగాదు. 212

దూరముననుండు జనులకు వినిపింపవలెనని, క్లేశముతో గట్టిగా చేసినధ్వని తప్పక వికారస్వరము గలదియగును. 213

మండపము కనిష్ఠమైనప్పుడును ధ్వనిలో మాధుర్యము నశించును; కనుక జ్యేష్ఠము, కనిష్ఠము — రెండునుగాని మధ్యమండపము ప్రశస్తమైనది; దాని యందు సుఖముగా నృత్యమును చూడవచ్చును; ధ్వనిని వినవచ్చును. 214

వికృష్టమండపమునకు (దీర్ఘచతురశ్రమునకు) పొడువు అరువదినాల్గు మూరలును, వెడల్పు ముప్పదిరెండు మూరలును ఉండనగును రాజులకు ఇదిగాని, చతురశ్రముగాని, త్ర్యశ్రముగాని కావచ్చును (?) 215

చతురశ్రమునకు నలుప్రక్కలందును ముప్పదిరెండు మూరలుండదగును. వికృష్టమునకు పూర్వ పశ్చిమములందు పొడువుండదగును. 216

దాని పూర్వభాగమున ఎనిమిది హస్తములు వదలి, యెనిమిది హస్తముల కొలతగల చతురశ్రమైన రంగశీర్షమును కల్పింపవలయును 217

రాసకము మొదలగు నృత్తములకై, పైకొలతకు సగమెక్కువగాగాని, రెండింతలుగాగాని, యథోచితముగా చేయనగును. అక్కడ నుండి యెనిమిది మూరలు విడిచి, సభాపతికి స్థానము కల్పింపవలయును. 218

మండపమందలి రంగశీర్షము నెలకట్టు, తుడిచిన యద్దమువలె నుండవలయును; స్తంభములమీద, సింహము మొదలగువానిని గండరించి, అంజలి పట్టిన బొమ్మలను పొదిగించి, యుండదగును; చీకటిని పోద్రోలు కిరణములుగల అనేక రత్నములను దాపియుండవలెను; విచిత్రములైన చిత్తరువులందలి దృశ్యములచే నలంకరింపబడియుండవలయును. 219, 220

హేమాచలగుహాకారస్వర్ణ (శుభాకారవర్ణ?)[1] కుంభై ర్విరాజితః
యంత్రనారీజనాలాప సంగీతాది విచేష్టితైః, 221

సంపాదిత చమత్కారః కర్పూరీ [?] శోభితాన్య [ద్య?][2]భూః
నీరంధ్రచ్ఛాదనోపేత ప్రేతుణీయద్వితీయభూః. 222

నానాద్వీపాంతరానీతైః దేవాంశాదిభిరంబరైః
విచిత్రేణ వితానేన నయనానందదాయకః. 223

నానా పత్రలతాబంధైః ఇతిహాసాదిభిశ్చభైః
విక్రమైః కేలిభిః [త్యాగః]...(భోగ?) ముఖ్యైః సభాపతేః
విచిత్రస్థైః సమానాభిః భిత్తిభిస్సుమనోహరః. 224

గీతాతోద్యధ్వనేః స్థైర్య సుస్వరత్వాదిహేతవే
గవాక్షైర్నాతివివృతైః భూషితో నాతి సంవృతైః. 225

(భ్రాతృభిః?) సుషమైర్ద్వారైః వేదికా మత్తవారణైః
సంగీతావసరైః సాంద్రః పుష్పతారకితక్షితిః. 226

విసారి వివిధామోద పుష్పమాలోపశోభితః
సమంతాద్ధూపితోఽజస్రధూపైః కృష్ణాగరూత్కరైః. 227

నివాస ఇవభారత్యాః క్రీడాగారమివశ్రియః
కర్తవ్యో నాట్యవృత్త్యర్థః మండపో లక్షణాన్వితః. 228

**సభాపతి లక్షణమ్**

అభిజాతో గుణగ్రాహీ పాత్రాపాత్రవిశేషవిత్
క్రీడా కేలీగృహం దాంతః ప్రియకీర్తిః ప్రియంవదః, 229

---

1. 'శుభాకారవర్ణ' నావద్ది వ్రా. ప్ర, గుహతో కుంభమునకు పోలికలేదు; లేదా 'గుహాకారః స్వర్ణకుంభైః' అని సవరింపవచ్చును. మేరుపర్వత గుహవంటిది మండపము.

2. పరిష్కర్త సూచించిన యీ సవరణకు (Notes P. 41) చూచునది.

బంగారు కొండలవంటి శుభకరమైన ఆకారము, వన్నెయుగల కలశములచే శోభిల్లవలయును; యంత్రపు స్త్రీ విగ్రహములు చేయు ఆటపాటలు, మున్నగు చేష్టలచే వేడుకగలిగించు చుండవలయును; కర్పూరము ఆదిభాగమందు వెలిగింప బడు చుండవలయును; రెండవ భూమిపై సందులేక, దర్శనీయముగా, పరపులు పరిచియుండదగును.[1] 221, 222

నానాద్వీపాంతరముల నుండి తెప్పించిన దేవాంశము (దేవాంగము?) మొదలగు వస్త్రములతో, విచిత్రముగా కట్టిన మేలుకట్టు, కన్నుల కానందమిచ్చునదియై యుండవలయును. 223

పలుతెగల ఆకుల—తీగల యల్లికలతో, చిత్తరువులందు వ్రాసిన శుభకరములగు ఇతిహాసాదులతో, సభాపతియొక్క విక్రమ—త్యాగ—భోగములతో, మనోహరములై, చదరములైన, గోడలు గలిగి యుండవలెను. 224

పాటల-వాద్యాలధ్వని స్థిరముగా, సుస్వరముగా నుండుట మున్నగు కారణములచే, మండపము కిటికీలు మిక్కిలి పెద్దవిగాగాని, చిన్నవిగాగానికాక, అందముగా నుండవలెను. 225

పరస్పరము సమానములైన (?) ద్వారములు, వేదికలు, మత్తవారణములు,[1] సంగీతావసరములు (?)—వీనితో గూడి యుండదగును; నేలమీద నక్షత్రములవలె పూవులు చల్లియుండవలెను; వివిధములై వ్యాపించు సుగంధముగల, పూలసరములుగలిగి, రమణీయమై యుండదగును; ఎడతెగని నల్లయగరు చెక్కల కమ్మని పొగ, అంతటను రాజుచుండవలెను. 226, 227

సరస్వతి దేవళమువలె, లక్ష్మీలీలాగృహమువలె, నాట్య — నృత్తములకై మండపము నిర్మింపవలెను. 228

### సభాపతి లక్షణము

మంచివంశమున జన్మించినవాడు, గుణము గ్రహించువాడు, పాత్రాపాత్రముల భేదము దెలిసినవాడు, క్రీడలకు ఆటపట్టయినవాడు, జితేంద్రియుడు, కీర్తి

1. ఇది అంతఃపురస్త్రీలు చూచుట కనువుగా తెరలుకట్టిన ప్రదేశముగా బోలునని, పరిష్కర్త యభిప్రాయపడినారు. (చూ. Notes P. 41)

1. మత్తవారణముల స్వరూపాదులమీద, వివిధాభిప్రాయములు, శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి తెలుగు 'నాట్యశాస్త్రము' (పు. 32-39) న వివరింపబడినవి చూచునది.

శృంగారీ రసికః సర్వశాస్త్రాబ్ధికూపారపారగః
మార్గదేశీ రహస్యాని జ్ఞాత్వా సంగీతతత్త్వవిత్, 230

అభిజ్ఞః సర్వభాషాసు భావకః ప్రతిభానవాన్
(తుంగనాకోధికీత్?) నిత్యవసతిర్జితమత్సరః, 231

వాదేషు ధృతమాధ్యస్థ్యః కృతకారోగ్యనిరామయః
ఆస్తికో విగతాలస్యః పరివారానుకూల్యవాన్, 232

వివేకీ కౌతుకీ వాగ్మీ తరుణో గుణదోషవిత్
సులక్షణో జితారాతిః నిపుణో...నర్మణి, 233

స్వస్తుతౌ పరనిందాయామపి నిత్యం పరాఙ్ముఖః
త్యాగీ దయాపరః శ్రీమాన్ సభాపతి రిహోచ్యతే. 234

**సభ్యగుణాః**

ప్రస్తావోచిత భాషిత్వం త్రుటితాత్రుటితజ్ఞతా
మాధ్యస్థ్యం మాన్యతాకాపి (వ్య ?) నాటకాదిషుపాటవమ్, 235

న్యాయాది శాస్త్రవేదిత్వం వాగ్మితా శీలశాలితా
ధర్మధౌరేయతా ముక్తరాగద్వేషాది (తి?) మానితా, 236

గుణవత్సలతాఽశేషదేశభాషాసు కౌశలమ్
రసభావేంగితజ్ఞానం, ధైర్యం మధ్యవయస్కతా, 237

శౌర్యత్రితయ చాతుర్యం సుమూర్తిత్వం కులీనతా
ప్రాగల్భ్యం ప్రతిభాచేతి గుణాః ప్రోక్తాః సభాసదమ్. 238

ఇతి

శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనిక
జాయసేనాపతి విరచితాయాం నృత్తరత్నావల్యాం
సప్తమోఽధ్యాయః

ప్రియుడు, ప్రియముగా మాటాడువాడు, శృంగారి, రసికుడు, అన్ని శాస్త్ర సముద్రముల మేర దాకినవాడు, మార్గదేశీ రహస్యములు తెలిసికొన్న వాడు, సంగీత తత్త్వము నెరిగినవాడు, అన్ని భాషలందును నేర్పరి, భావన చేయగలవాడు, ప్రతిభాశాలి, సత్యవంతుడు, మత్సరము గెల్చినవాడు, వాదములందు మధ్యవర్తిగా నుండువాడు, కృతకృత్యుడు, ఆరోగ్యవంతుడు, ఆస్తికుడు, ఆలస్యము లేనివాడు, అనుకూలమైన పరివారము గలవాడు, వివేకవంతుడు, వేడుక గలవాడు, మాటకారి, ప్రాయవంతుడు, గుణదోషము లెరిగినవాడు, మంచి లక్షణములవాడు, శత్రువులను గెల్చినవాడు, పరిహాసమున నిపుణత గలవాడు, తన్ను పొగడుటయందును, పరనిందయందును, ఎప్పుడును పెడమొగము గలవాడు, త్యాగి, దయావంతుడు, శ్రీమంతుడు — ఇట్టివా డిక్కడ సభాపతి యనబడును. 229, 230, 231, 232, 233, 234

### సభ్య గుణములు

సందర్భమునకు తగిన మాట, తెగిన-తెగని చోట్లను గుర్తింపగలుగుట, మధ్యస్థునితనము, గౌరవము, కావ్య నాటకాదులందు పటుత్వము, న్యాయము మొదలగు శాస్త్రముల తెలివి, మాటకారితనము, మంచి నడత, ధర్మము నెత్తి పట్టు స్వభావము, రాగము, ద్వేషము, మితిమీరిన స్వాభిమానము లేకుండుట, గుణములపై ప్రీతి, అన్ని దేశభాషలందును నేర్పరితనము, రసభావముల చేష్టల నెరుగుట, ధైర్యము, నడివయస్సు, నృత్తగీత వాద్యములందు చాతుర్యము, మంచి రూపము, సత్కులమందు జనించియుండుట, జంకుకొంకులులేమి, ప్రతిభ- ఇవి సభ్యులకు వలసిన గుణములు. 235, 236, 237, 238

ఇది

శ్రీమన్మహారాజాధిరాజ గణపతిదేవ గజసాధనికుడగు
జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళియందు
ఏడవ యధ్యాయము

# అథ అష్టమోఽధ్యాయః

**సభాపతి సభ్య విన్యాసః**

సాయాహ్నే కౌతుకీ నేతా నృత్యసందర్శనోత్సుకః
నైపథ్యసదనే రమ్యే వివిక్తే చిత్రశాలిని, 1

కర్పూరాగరు కస్తూరీ కాశ్మీర హిమవారిభిః
మిలితేన పరార్ధ్యేన చందనానులేపితః, 2

మల్లికా కేతకీ జాతీ చంపకైః కృతశేఖరః
చీనాంబరే శరచ్చంద్ర చంద్రికా కాంతిహారిణీ, 3

వసానః సూచి విజ్ఞాన భంగ్యాలంకృత పల్లవే
పాదాంగులీయ పర్యంతైః మకుటాద్యైర్విభూషితై (తః?); 4

స్వస్వకాంతాంశరూపాభిర్వ్యపతి నీరాజనేచ్ఛయా
దిగ్వధూరను కుర్వాణైః సాంద్రానందం సమాగతాః, 5

మంగళైరివ సోత్కంఠైః కామినీరూపధారిభిః,
శంభోరివ వ(న?) రాన్ ప్రాప్తైరణిమాద్యధిదైవతైః; 6

దృష్టివేధహరైః దివ్యైరవియుక్తాని మంగళైః
జ్వలత్కర్పూరదీపాని హైమపాత్రాణి లీలయా, 7

వహద్భిః పాణిపద్మాభ్యాం భ్రాంతి (త?) ప్రాంతై[1]ర్మణిశ్రియః (యా?)
గాయద్భిః పంచమం గానం (మప్వాస?)[2] కోకిలాలాప పేశలమ్. 8

---

1. 'క్రాంతిక్రాంతైః' అనుసవరణ పరిష్కర్త సూచన.
2. కోయిలస్వరము పంచమమని శాస్త్రము. అనేకస్వరములు కూడిన గానము 'పంచమగావ' మనుట సంగతి లేనిమాట. కనుక నా యీ సవరణ సూచన.

# ఇక ఎనిమిదవ యధ్యాయము

## సభాపతి, సభ్యుల విన్యాసము

సాయంకాలమందు నృత్యమును చూడ వేడుకగొన్న ప్రభువు, కర్పూరము, అగరు, కస్తూరి, కుంకుమపూవు, పన్నీరు - వీనితో కదంబించిన మంచి కలవము నలదుకొని, మల్లె, మొగలి, జాజి, సంపంగి - పూవులు, శిరస్సున ముడుచుకొని, శరత్కాలపు చంద్రుని వెన్నెలవంటి కాంతిగలవి - అంచులందు సూదికుట్టుపనితన ముతో అందమైనవియు నగు, చీనాంబరములు రెండు ధరించి, కిరీటము మొదలు కాలి యుంగరములదాక గల సొమ్ములను దొడిగి, రమ్యమై ప్రత్యేకముగానున్న చిత్తరువులచే దర్శనీయమగు, నైపథ్యభవనమునకు వచ్చి; 1, 2, 3, 4

తమ తమ పతులైన దిక్పాలకుల యంశములతో రూపుగొన్న మహారాజునకు నివాళియెత్తుటకై, నిండిన సంతోషముతో వచ్చిన దిగంగనలవలె, కామినీ వేష ములను ధరించి, తమకముతో వచ్చిన మంగళములవలె, శివుని వదలి నరులను చేరిన అణిమా మహిమాద్యష్టసిద్ధి దేవతలవలె; 5, 6

తరుణీజనులు, దృష్టిదోషములను హరించి శుభములను గలిగించునట్లు, బంగారు పళ్ళెములందు కర్పూరదీపములు వెలిగించి, పద్మములవంటి రెండుకర ములతో పట్టుకొని, రత్నాలకాంతి ప్రాంతములందు త్రిప్పుచు, పంచమ నాద మిచ్చు కోకిల పలుకులవలె మృదుమధురముగా - దంతకాంతులచే పాటను పరి

ఘుదాం గీతిమివ ప్రేక్ష్యాం కుర్వద్భిర్దంతకాంతిభిః
[1]నై రాజన శిరః ప్రాయ రజలాస్వాం గతింయతి (?), 9

యతిప్రహారణై ర్వాద్యైః నానాతోద్యసమన్వితైః
సంయుక్తం కోమలం నృత్యం కుర్వాణై స్తరుణీజనైః; 10

విహితారాత్రికః శ్రీమాన్ ప్రపుర్షోత్ఫుల్లలోచనః
తతః సభాగతో నర్మసచివైః నృత్తమండపే, 11

రత్నసాను తటోత్సంగ కల్పశాఖీవ భూపతిః
సహాసనమధిష్ఠాయ నిషీదద్భిశ్చితప్రతః (?) (రిత స్తతః (?); 12

స్వర్ణకల్పతరుం కృత్వాపృష్ఠతః పురతః పునః
రత్నైరలంకృతం హైమం వా(తో?)[2]రణం మకరాంకితమ్, 13

తలేముక్తావితానస్య వేష్టితస్య మణిస్రజా
భవేత్ సింహాసనాసీనః సార్వభౌమః సభాపతిః. 14

తస్యవామే మహాదేవీ భవేదిత్యపరే విదుః,
సేయంతు నేష్టా నీతిజ్ఞైః దర్శనీయాహి (పి?) కస్యచిత్. 15

పతితాం (తంతీం?)[3] పత్మలాక్షీణాం కటాక్ష శరసంతతిమ్
చామరోల్లాసనైః శశ్వద్వారయంత్య ఇవాంతరా, 16

కలకంకణ నిక్వాణాః లీలాజాగరితస్మితాః
పత్యుశ్చామరధారిణ్యః తిష్ఠేయుః పృష్ఠభాగతః. 17

విస్రంభాలాపనిపుణాః నర్మజ్ఞాః రాజవల్లభాః
లలితై రంగహై ర్యుక్తాః భూషాణామపి భూషణైః, 18

1. ఈ పంక్తి చాల కలుషితము.

2. 'కారణం' అని వ్రా. ప్ర. అది 'తోరణం' కావచ్చును. 'వారణం' 'మకరాంకిత' మెట్లో ఊహింపలేను. మకరతోరణము సుప్రసిద్ధమే. ఇవి శుభరాజ చిహ్నములు [పరి].

3. 'పతతీం' నావద్ది వ్రా. ప్ర.

శుద్ధముచేసి చూపుచున్నారో యనునట్లుగా - పాడుచు, నానావాద్యములందు వాయింపబడు యతి - ప్రహరణ ప్రబంధములతో గలిసిన కోమలమైన నృత్యము చేయుచు; 7, 8, 9,10

ఆరతులెత్తగా, సంతోషముచే విప్పారిన కన్నులతో, సభాప్రవేశముచేసి, నృత్తమండపముమీద ఇరుప్రక్కల ఆసనము లధిష్ఠించిన నర్మసచివులతోగూడ, మేరుపర్వతము తటమందు నెలకొన్న కల్పవృక్షమువలె; 11, 12

వెనుకప్రక్క బంగారుతో చేసిన కల్పవృక్షమును, ముందుప్రక్క మకరచిహ్నములుగల తోరణమును నిలిపి, చుట్టును రత్నాలసరులు వ్రేలుచుండు ముత్యాలమేలుకట్టుక్రింద, సార్వభౌముడగు ఆ సభాపతి సింహాసనముపై గూర్చుండదగును. 13, 14

అతని యెడమప్రక్క పట్టపురాణి కూర్చుండదగునని కొందరుచెప్పుదురు;కాని నీతివేత్తలు—ఎవరికో యొక్కరికి ఆమె చూడవచ్చునదిగా నున్నను—ఇక్కడ దానికిష్టపడరు. 15

నిండు వాలుగన్నుల వనితల క్రీగంటి చూపుతూపులు, ప్రభువును తాకకుండ నడుమనే ఎడతెగక చామరము లాడించి వారించు వారివలె, కంకణాల కలస్వనముతో ఎప్పుడును సిద్ధముగానున్న విలాసపు చిరునవ్వుతో, చామర గ్రాహిణులు అతని వెనుక నిలిచియుండవలయును. 16, 17

నమ్మికమాట లాడుటయందు నేర్పరులు, మేలపుమాటలెరిగినవారు, రాజుకు ప్రీతిపాత్రములు, లలితములై తొడవులకు తొడవులైన యంగములు గలవారు,

కామ్యాః కామకలాభిజ్ఞాః కాముకేంధనయౌవనాః
శౌర్యత్రితయవేదిన్యః సువేషాః శుభలక్షణాః
వామతః పృష్ఠతశ్చస్యుర్విలాసిన్యః సభాపతేః. 19

[1]కర్ణపూరా మిధార్యేణ (న?) నర్తకీ గాయనీతి (నితి?) పారిధయాంతం (పర్యయాంతంచ) చంజనేనే నేత్రావక్తమివ (క్తు) గేతం శుచిః(?) 20

శుచి షేత్రా (చ?) విశ్వాసభాజనం రూపశాలినీ
సువేష మధురాలాపా కలావిత్ ప్రౌఢయౌవనా, 21

సావధానేంగితాభిజ్ఞా నృపవంశక్రమాగతా
మంజూషాం దధతీహైమీం నానారత్నవిభూషితామ్, 22

భూపాలోచిత తాంబూల సామగ్రీపరిపూరితామ్
ఆసీత దక్షిణేపార్శ్వే రాజ్ఞస్తాంబూలదాయినీ. 23

వైవస్వ (?) దక్షిణే పార్శ్వే మంత్రిణశ్చపురోధసః
వేత్రాసనే నివేశ్యాః స్యుర్నరేంద్రేణ సగౌరవమ్. 24

[2]ముండాసనేచ తన్మధ్యే యువరాజం నివేశయేత్
తస్య దక్షిణతః పార్శ్వే తద్వత్ సేనాపతీ నయమ్. 25

ఆసనేషు యథార్హేషు సేనానీపృష్ఠభాగతః
మండలేశ్వర సామంత పరమండలినః క్రమాత్, 26

దైవజ్ఞపతయో వైద్యాయుధ శ్రీకరణాధిపాః
హస్త్యశ్వరథనేతారః కోశగోష్ఠగృహాధిపాః, 27

శౌర్యత్రితయ తత్త్వజ్ఞాః మల్లాద్యా రాజవల్లభాః
యథాస్థానం నివేశ్యాః స్యుః తదధ్యక్షైర్నృపాజ్ఞయా. 28

---

1 శ్లోకమంతయు చెడి, వ్రేలుపెట్ట వీలుగాకున్నది.
2. పీపును, చేతులును లేని 'బోడి' కాళ్ళపీట ముండాసనము [పరి] (క్రింది Notes చూ.)

కామింపతగినవారు, కామకళయందు జాణలు, కాముకులనురగిలించు యౌవనము గలవారు, నృత్తగీతవాద్యములు నూడును దెలిసినవారు, చక్కని వేషము గలవారు, శుభలక్షణవతులు — అగువిలాసినులు సభాపతికి ఎడమ ప్రక్కను, వెనుకను ఉండవలెను. 18, 19

రాజుగారి కుడిప్రక్క, పరిశుద్ధ జన్మము గలది, నమ్మికకు తగినది, రూపవతి, చక్కని వేషముగలది, తియ్యనిమాటలది, కళలెరిగినది, నిండుప్రాయముది, సావధానతగలది, ఇంగిత మెరుగగలది, రాజవంశక్రమమున వచ్చినది — అగు తాంబూలమిచ్చు మహిళ, రాజులకు తగిన తాంబూలసామగ్రి నించిన, వివిధ రత్నములు చెక్కిన పైడియడపము పట్టుకొని కూర్చుండవలయును.
20, 21, 22, 23

తన కుడిప్రక్క ప్రభువు, మంత్రులను, పురోహితులను, సగౌరవముగా వేత్రాసనము (బెత్తముతో నల్లినకుర్చీ) లయందు కూర్చుండబెట్టదగును; వారి నడుమ ముండాసనమున యువరాజును, అతని కుడిప్రక్క అట్లే సేనాపతులను కూర్చుండ జేయవలయును. 24, 25

సేనాపతికి వెనుక తగిన యాసనములపై క్రమముగా మండలాధిపతులు, సామంతులు, పరమండలములవారు, జోస్యుల పెద్దలు, వైద్యుల—ఆయుధముల— కరణాల—యధిపతులు, ఏనుగుల—గుర్రాల—రథముల నాయకులు, కోశాధిపతి. గోష్ఠాధిపతి, గృహాధిపతులు, నృత్తగీత వాద్యముల తత్వమెరిగినవారు, మల్లులు మొదలగు రాజవల్లభులు—నీరిలి, ప్రభువుగారి యుత్తరువు ప్రకారము ఆయా యధికారులు చోటుతప్పక కూర్చుండ బెట్టవలెను. 26 27, 28

వాగ్గేయకార గాంధర్వ స్వరాదీన్ గాయనాన్ నటాన్
నర్తకాన్ వాగ్మినః పుణ్యపాఠకాన్ కథకానపి
వామతోద్వి (వి?) విధాతోద్యవాదకాంశ్చ నివేశయేత్. 29

మాన్యామాన్య విచారజ్ఞః స్వామిచిత్తానువర్తకః
నాతిదూరే ప్రతీహారస్తిష్ఠేత్ వేత్రధరః పురః. 30

కరవాలకరై రాప్తైరంగరక్షైః సమంతతః
పరివృత్త్య సదః స్థేయం స్వపరజ్ఞానతత్పరైః. 31

రత్నాభరణ సంక్రాంతైః ప్రతిబింబైర్బహూకృతాః
పూరితా గంధతైలేన స్ఫారకర్పూరవర్తయః
దీపికాః పురుషైర్ధార్యాః సువేషైర్వర్ణదండికాః. 32

ప్రధాననర్తకీ నైపథ్యమ్

రాజ్ఞః (జ్ఞా) పూర్వేద్యురావిష్టా పాత్రః స్నానవతీతతః
ఇష్టేష్టదేవతా విప్రైః కారయిత్వాగ్రహాధ్వరమ్
ప్రీణయిత్వా ద్విజాచార్యబృంద విద్యావతోఽఖిలాన్. 33

గర్వోల్లసిత సౌవర్ణ సామిదర్శిత కేతకమ్
ధమ్మిల్లం దధతీక్లృప్తం (ప్తైః?) కుంతలైర్వకుళప్రయామ్ [?]
(శ్రియా?) 34

అంగప్రభానుసారేణ తత్తత్కాలోచితేన వా
చందనేన విధాయాంగోద్వర్తనం కుంకుమేనవా. 35

[1]వాగ్గేయకారులు (బయకారులు), గాంధర్వులు, స్వరాదులు, అగుగాయకులను, నటులను, నర్తకులను, మాటకారులను, పుణ్యగ్రంథములు పఠించువారిని, కథ చెప్పువారిని, వివిధవాద్యములు వాయించు వారిని ఎడమప్రక్క కూర్చుండ బెట్టదగును. 29

ఎవరు గౌరవింపదగినవారో, యెవరుకారో యెరిగినవాడు, ప్రభువు చిత్త మెరిగి నడుచుకొనువాడునగు ద్వారపాలకుడు, బెత్తమును ధరించి, ముందు ప్రక్క, ఇంచుక దవ్వులో, నిలిచియుండవలెను. 30

సభను చుట్టుముట్టి, విచ్చుకత్తుల చేతులతో, తమవారిని, పెరవారిని, గుర్తించు మెలకువగలిగి, ఆప్తులగు అంగరక్షకులు నిలుచుండదగును. 31

రత్నాలసొమ్ములందు తోచుప్రతిబింబములచే అనేకములుగా గానవచ్చుచు, సుగంధి తైలమునిండి, లావైనకర్పూరపువత్తులు గలిగిన, బచ్చెనదండియల దీవియలు ధరించిన పురుషులు, మంచివేషములు గలిగి యుండనగును. 32

## ప్రధాననర్తకి నైపథ్యము

వెనుకటిదినమే ప్రభువుచే ఆజ్ఞాపితురాలైన నర్తకి, ప్రాతఃకాలమున స్నానముచేసి, ఆపై ఇష్టదేవతలను పూజించి, బ్రాహ్మణులచేత నవగ్రహయాగము చేయించి, విప్రులను, గురువును, బృందమును, ఎల్లవిద్యలవారిని, సంతోష పరుపవలయును. 33

కురులు దువ్వి, లోపల సంపంగిపూవులను (?), ఇంచుక వెలికి దోచునట్లు, మొగలిరేకులును ముడిచి, పొగడపూవురీతిగా (?) కొప్పుపెట్టుకొనవలెను. 34

దేహకాంతికి తగినట్లు—లేదా ఆయాకాలముల కుచితముగా—శ్రీగంధముచే గాని, కుంకుమ పూవుచేగాని, మైపూత చేసికొనదగును. 35

---

1. సంగీత సాహిత్యములు రెండును తెలిసి, రచింపగలవారు వాగ్గేయకారులు. మార్గ – దేశిపద్ధతులు బాగుగా నెరిగినవారు గాంధర్వులు; మార్గ సంగీతము మాత్రము నేర్చినవారు స్వరాదులు [పరి] (క్రిందిసూచి. చూ.)

మంజు శింజాన మంజీర మేఖలా వలయాదిభిః
రత్నాలంకరణైః హీరస్థూలముక్తాఫలోత్తరైః
తాన్యంగైర్భూషయంతీ స్వైః తైరప్యంగేషుభూషితా. 36

అంకాధిరోపిత స్వాతీ శశిబింబ విడంబినా
అననేన విరాజంతీ నాసామౌక్తికశోభినా, 37

కస్తూరీ తిలకాంకేన వదనేనానుకుర్వతీ
ప్రాంతస్థిత కురంగస్యపూర్ణస్యామృత దీధితేః, 38

ముఖపద్మపతత్కామి నయనాలి జిఘృక్షయా
[1]సువర్ణవస్త్రమాల్యాద్యైః (ద్య?) ఖాండయుక్తేన రాజతా,
స్మరేణ దధతీ న్యస్తాం మౌలౌ మౌక్తిక జాలికామ్. 39

రూపస్య (స్యా?) ప్రతిరూపస్య దర్పణే ప్రతిమాంతదా
దృష్ట్వేవ వామ [నామ?] మందాక్షు మందస్మితముఖితతః, 40

కనకాందోలికారూఢా ఛత్రచామరశోభితా
*బృందేన సహితా సాయం యాయాన్నృపతిమందిరమ్. 41

•నైపథ్య స్థానమాసాద్య కౌతుక త్వరితం తతః
ఊరోర్వరాలోకనం చారీకరణాద్యేషు లక్షణమ్, 42

కూర్పాసంగుస్తూక్షింత మాదీయత [?] మాస్మఘూత్
ఇతి సూక్ష్మతరం త్వంతరర్ధోరుకముపర్యథ, 43

సూచీవిజ్ఞాన సౌవర్ణ పత్రరత్నాన్వితాంచలమ్
(శ్లక్ష్ణం ?) కార్పాసమథవా డౌమం పట్ట...విచిత్రితమ్., 44

కర్ణాటీ ప్రియయారీత్యా యాసీతావసితం తతమ్ (?)
రత్నసౌవర్ణపత్రాద్యైః మండితం దధతీ లఘుమ్, 45

---

1. ఈ పంక్తిని (*) గుర్తుగల పలువాతి 'బృందేన' అనుదానికి విశేషణముగా, గ్రహించుటమేలు. తెలుగు తాత్పర్యమట్లే చేయబడినది. ఇక్కడ దీనిసంగతి కానరాదు.

కాలందియలు, ఒడ్డాణము, కంకణములు మొదలగు సొమ్ములు, రత్న ఖచితములు, ధరింపవలెను; వానిలో వజ్రములు, పెద్దముత్యములును ప్రధానముగానుండదగును; వాని చప్పుడు ఇంపుగా నుండదగును; తనయంగములచే వానికిని, వానిచే తనయంగములకును, అందము గలుగవలెను. 36

ముక్కరముత్యముతో అందమైన ముఖము, స్వాతినక్షత్రమును తొడమీది కెక్కించుకొన్న చంద్రబింబమువలె తోపవలయును; కస్తూరి తిలకముతోగూడిన ముఖము లేడితోగూడిన నిండుచంద్రునివలె ఒప్పియుండవలెను. 37, 38

కాముకుల చూపుతుమ్మెదలు, ముఖపద్మము మీదికి వాలగా, వానిని పట్టుకొను వేడుకతో, మన్మథుడొడ్డిన వలవలెనుండు ముత్యాలయల్లికను, శిరసుపై అమర్చుకొనదగును. 39

ఆపై, సాటిలేని తనరూపునీడను అద్దమునఅప్పుడే చూచుకొన్నదోయన్నట్లు, చిలిపి సిగ్గుతోడి చిరునగవుగల మోముతో, బంగారు పల్లకినెక్కి, ఛత్రచామరములతో, బంగారువస్త్రములు, పూవులు మొదలగు ద్రవ్యములుగల పాత్రలను ధరించిన బృందమువారితోగూడి, సాయంకాలము రాచనగరికి పోవలెను. 40, 41

తరువాత, కుతూహలముతో, త్వరగా వేషమువేసికొను గృహమునకు పోవలయును. చారులు, కరణములు, మున్నగువానియందు స్పష్టతకడ్డము రాకుండుటకై, లోపల గుత్తముగా అర్ధోరుకము (చల్లడము) తొడిగి, వెలికి ప్రత్తి—నార — పట్టు — వీనిలో దేనితోనైనను నేసిన పలుచని వలిపెము—, అంచులలో చిత్రమైన సూదికుట్టు పనితనము గలిగి, బంగారుతళుకులు, రత్నములును గూర్చినది—కుబుసముగా ధరింపదగును. ముత్యాలసరమువంటివి, అంగ

ఆలోకనమిదం శ్లక్ష్ణం ప్రేక్షణేతు [యథా] భవేత్
......పాత్ర (ం?) ధృతార్ధోరుకకంచుకమ్, 46

[1]ముక్తాహారాది నాత్యంతమంగసంలగ్నభూషణమ్
సజ్జీభూయ తతస్సర్వం బృందం రంగభువం విశేత్. 47

**అథబృందవిన్యాసః**

పాత్రస్య దక్షిణే పార్శ్వే ముఖరీ స్యాన్ముఖేస్థితః
క్రమాన్మార్దంగికాస్తస్య తిష్ఠేయుర్వామతస్తతః, 48

హుడుక్కా శాంఖికా (కో?) దేశీపటహీ కరటాధరః
కాహలావాదకాః కాంస్యతాలినశ్చయథాక్రమమ్, 49

తిష్ఠేయుః పృష్ఠతస్తేషామేవం ప్రతిముఖర్యపి
తస్యానువాదకాద్యాశ్చ భవేయుర్వామపార్శ్వతః 50

తిష్ఠేతాం ముఖ్యగాయిన్యౌ పాత్రపాశ్చాత్త్యభాగతః
ఏతయోః పార్శ్వయోస్తాలధరాః ప్రౌఢాః కలాదిషు. 51

బృందం నారీమయం సర్వమపి కార్యం విలాసినా
[2]రాజ్ఞాం (జా?) విద్యావతాంచాగ్రే వైభవఖ్యాపనాయచ. 52

**అథ ఆతోద్యమేళనమ్**

భావిరాగాంశభూతేన మధ్యసప్తకవర్తినా
వాదయేద్వాంశికోనాదం స్వరేణాదౌ ప్రయత్నతః, 53

---

1. •ఈ గుర్తు నుండి ఇంతవరకుగల ఆరుశ్లోకములు (42, 43, 44, 45, 46, 47) చాల చెడినవి. పై పాఠము పరిష్కర్తయొక విధముగా సవరించిన కూర్పు. కాని అస్పష్టమే. ఒక విధముగా స్థూలతాత్పర్యము మాత్రమే తెలుగులో కొంత యూహించి యియ్యబడినది.

2. ఈ రెండు పంక్తులును వెనుకనే (శ్లో. 161-162) వచ్చినవి. ఇక్కడ 'రాజ్ఞా' అనియే నావద్ది వ్రా. ప్ర. పాఠమున్నది.

ముతోబిగువుగా అతుకుకొనునవి యగుసొమ్ములు పాత్రము ధరింపరాదు. ఇట్లు సిద్ధమై బృందమంతయు రంగభూమిని ప్రవేశింపనగును.

42, 43, 44, 45, 46, 47

### ఇక బృందవిన్యాసము

పాత్రమునకు కుడిప్రక్క, మొదలు ముఖరి నిలువదగును. అతని యెడమ ప్రక్క, మృదంగాలవారు క్రమముగా నుండవలెను; వారివెనుక, క్రమముగా హుడుక్క, శంఖము, దేశిపటహము, కరట, కాహళము, కంచుతాళములు— వీనిని వాయించువారుండవలెను. ఇట్లు, ఎడమప్రక్క ప్రతిముఖరి, వానియను వాదకులు మున్నగువారును ఉండదగును. పాత్రము వెనుక, ముఖ్యమైన పాట కత్తెలిద్దరును, నిలువదగును; వారి యిరుప్రక్కలను, కళలు మొదలగువాని యందు ప్రౌఢలయిన తాళమువేయువారు, వారివెనుక, పిల్లగ్రోవివారు, కంచుతాళములు ధరించిన అనుగాయికలును, అమరియుండవలయును.

48, 49, 50, 51

విలాసశీలుడైన రాజు విద్యావంతుల యెదుటగాని, తనవైభవమును వెల యించుటకైకాని, బృందమంతయు ఆడువారేయగునట్లు చేయవచ్చును. 52

### ఇక వాద్యములమేళగింపు

మొదలు పిల్లగ్రోవి వాయించువాడు, రాబోవురాగమునకు అంశమైన స్వరముతో, మధ్యస్థాయియందు, ప్రయత్నపూర్వకముగా నాదము పలికింప వలెను; అది లేకున్నచో, పాటపాడు వాడు మంద్రస్థాయిని గాని, తారస్థాయిని

మంద్రం గాతా ఽమః ప్రాప్తుం తారంచ న వినాఽమునా
యోజ్యస్తేన సమం నాదః సర్వాతోద్య సముద్భవః. 54

యథానాదమయం సర్వం జగత్ స్థావరజంగమమ్;
స్యాదేవం సతి నాదాత్మా దేవో నేతః [ఽనేక—నంత?] (నేతుః?)
ఫలప్రదః
[1]ప్రయోగస్సుభగః సాంద్రః సమ్మతశ్చ సభాసదామ్. 55

అథ శుష్కవాద్యమ్

పూర్వోక్తలక్షణాత్ తస్మాత్ సమహస్తాదనంతరమ్
జోడనీక్రమతో వాద్యం వాయిదత్వా హుడుక్కినా, 56

స్నిగ్ధతారతరం ప్రాంతే ఝుంకారే తత్రప్రవర్తితే
నర (?) తాలప్రమాణేన తతస్తద్ద్విగుణేనవా, 57

హుడుక్కా కరటా దేశీపటహైః శ్రోత్రమంజులమ్
లహర్యాం వాద్యమానాయాం లయచ్ఛందానుసారతః, 58

నిస్సారుకైక తాలాభ్యాం క్రమాన్మద్దల వాదకాః
వాదయేయుః; యతిః శ్రోత్రం సుధాసారేణ సించతీ, 59

తాలద్విమానతః పూర్వం ప్రారభ్య క్రమవర్ధితైః
యావత్ షోడశభిః గానైః (మానైః?)
అమితా (సంమితా?) తత్ప్రమాణతః. 60

హస్తేన మృదునా స్నిగ్ధా ప్రారభ్య ముఖవాదినా
వీణానినాదినీ పూర్వం, పశ్చాదారభటధ్వనిః, 61

1. 'ఈ పంక్తి విషయమును ఆకస్మికముగా ముగించు నట్లున్నది గనుక ఇక్కడ గ్రంథ లోపమున్నదేమో' యని పరిష్కర్త సందేహము. (క్రిందిసూచి).

గాని, అందుకోలేదు. తక్కిన అన్నివాద్యాలనాదమును గూడ దానితో సమముగా కలుపవలయును, 53, 54

చరాచరమగు ప్రపంచమంతయు నాదమయముగా చేయవలయును. అట్లయినచో నాదస్వరూపుడగు భగవంతుడు నాయకునికి సత్ఫలములిచ్చును; ప్రయోగమును, సొబగుగలిగి, నిండుదనముతో, సభాసదులకు తృప్తికరమగును. 55

ఇక శుష్కవాద్యము

మునుపు చెప్పిన లక్షణముగల[1] సమహస్తమునకు తరువాత, హుడుక్కవాడు జోడని క్రమముతో[2], వాద్యము వాయింపగా, అందుండి వెడలిన సిద్ధమైన ఘన ఘోంకారముతో గలిపి, హుడుక్క, కరట, దేశీపటహముల వారు, నర్త (?) తాళపుకొలతకు సరిగాగాని, దాని రెండింతల కొలతకు సరిగాగాని, చెవికింపుగా లయచ్ఛందముననుసరించి, లహరి[3] వాయించుచుండగా, మద్దెలలవారు క్రమముగా నిస్సారుక - ఏకతాళములతో, వాయింపవలయును.

చెవులలో అమృతధార పోయునట్లు యతి, తాళప్రమాణమునందలి రెండవ కాలమానముతో ప్రారంభింపబడి, క్రమముగా పదునారు మానములదాక (౧౬ వ కాలమానము వరకు) పెరుగవలయును. 56, 57, 58, 59, 60

ముఖ్యవాదకుడు ఆ యతిని మెత్తని చేతి దెబ్బలచే, వీణనాదమువలె కోమలముగా నుండునట్లు ప్రారంభింపవలెను ; ఆపైని, గట్టిదెబ్బలతో, నిండిన హర్షోత్సాహములతో, పెద్దధ్వని గలుగజేయవలయును ; ఆ యతి, హుడుక్క,

---

1. 7 వ యధ్యాయము శ్లో. 22 చూ.

2 జోడని, హుడుక్కను వాయించు క్రమములలో నొకటి (పరిష్కర్త).

3. ఉద్గ్రాహమను వాద్యప్రబంధ భాగము లహరి. (వక్షి) (క్రిందిసూ )

దృఢహ_స్తప్రహారేణ ప్రహర్షాద్రాగమేదురా,
హుడుక్కా కరటోద్దామ వహావీభిర్మనోహరా,
కాహలా కాంస్యతాలోత్థనినాదై రుపబృంహితా. 62

తతః ప్రహరణం లగ్నమేక తాళ్యైవ సమ్మితమ్
స్నిగ్ధారభటభేదేన వాదయేయుర్యథోచితమ్. 63

కరటాం కాహలాం కాంస్య తాళ్రమజామత్ర భూభుజః
రసార్ద్రహృదయాః కేచిత్ పారుష్యాన్నానుమన్వతే.
గీత నృ_త్తవిహీనత్వాత్ వాద్యం శుష్కమితి స్మృతమ్. 64

ఇహ స్నిగ్ధస్య పర్యాయౌ సమానోపశమౌ బుధైః
తథై వారభటస్యాపి గదితౌ గజరోచ్ఛ్రలౌ. 65

—o—

చతురశ్రా చతుః స్తంభా రంగే రత్నవిరాజితా
. . చండిత్వికా [మండపికా ?] స్థాప్యా హ_స్త ద్వితయ సమ్మితా 66

హ_స్తమాత్రాధికోత్సేధా త_త్రత్రాప్రాణాంతః [?]
(త_త్తత్రాప్రత్రప్రమాణతః)[1]
విచిత్ర మణిసందోహద్యోతమాన ప్రభావలిః 67

తిష్ఠేత్ తత్ర విమానస్థా నాకనారీవ న_ర్తకీ
వంద్యమానాఽభితః స్త్రీభిశ్చామరవ్యజనాదిభిః. 68

తుల్యరూపవయోవర్ణప్రమాణాభ్యాం పరస్పరమ్
అనఘైః శోభమానాభ్యామంబరాభరణాదిభిః, 69

వాద్యతాల ప్రమాణాభ్యాం [?] తృణాభ్యాం [తూణాభ్యాం ?]
పుష్పధన్వినా [నః ?]
నారీభ్యాం చోలికాగు_ప్తకుచాభ్యాం విధృతాంచలాః, 70

1. 'త_త్తత్రప్రమాణతః' నావద్ది ప్రా. ప్ర; దానిపై నా యీ సవరణ సూచన.

కరటల యుద్ధామమైన వహానులతో[1] మనోహరమై, కాహళనుండి, కంచుతాళ ముల నుండి పుట్టిన నినాదములచే బలిసి సాగదగును. 61, 62

తరువాత, అన్నివాద్యములవారును గూడి యేకతాళితోనే, మృదుత్వ ఘనత్వముల భేదముచే, యథోచితముగా ప్రహారణమును వాయింపవలెను. 63

ఇక్కడ, రసార్ద్రమైన హృదయముగల దొరలు కొందరు, కంచుతో, తామ్రముతో చేసిన కరటావాద్యమును, కాహళవాద్యమును, ధ్వని పరుషమైనదని, అనుమతింపరు. గీతము, నృత్తము, రెండును లేని కారణముచే, దీనిని శుష్కవాద్యమందురు. 64

ఇచ్చట, స్నిగ్ధవాద్యమునకు సమానమని[2], ఉపశమమని, పర్యాయపదములు ; అట్లే ఆరభట వాద్యమునకు గజరమని, ఉచ్చలమని[3] మారుపేళ్ళు. 65

రంగస్థలమున, చతురశ్రమై, నాలుగు కంబములు గలిగి, రత్నకాంతులునిండిన చిన్నమండపము గట్టవలయును ; అది రెండుమూరల వెడల్పుగలది గావలయును. దానియెత్తు, ఆయాపాత్రల కొలతకంటె ఒక మూరమాత్ర మెక్కువగా నుండదగును ; దాని ప్రభావళి - వెలుపలి చట్టము - రంగురంగుల మణుల గుంపుచే వెలుగుచుండవలయును. 66, 67

దానినడుమ, ఇరుప్రక్కలను చామరములు, వీచోపులును పట్టుకొని, స్త్రీలు కొలుచుచుండగా విమానమునందుండు దేవకాంతయో యనునట్లు, నర్తకి నిలిచి యుండవలెను. 68

ఆమె ముందర ఇద్దరిద్దరుగా, స్త్రీలు తెరల అంచులు పట్టుకొని నిలువదగును. వారు ఒకరికొకరు, సమానమైన రూపము, వయస్సు, వన్నె, కొలత గలవారు గావలెను ; నిర్దుష్టమైన చీరలు, సొమ్ములు మున్నగునవి కలిగి శోభిల్లవలయును. వాద్యతాళప్రమాణముగలిగి (?), మన్మథుని అమ్ముల పొదులవలె, పొట్టి కుప్పసముతో కుచములను గప్పుకొని యుండవలెను. ఆతెరలు, ఎనిమిదిమూరల

1. 'వహని రథ్యానవిశేషః' అని రత్నాకరవాఖ్యలో కల్లినాథుడు (సం. రత్నా. 7—1304) వాద్యముల పలుకులను మరలమరల వాయించునొక పద్ధతి.

2., 3., 'సమము' అను వాద్యప్రబంధము; 'సమానము' గా వచ్చునని, 'ఉచ్చసితము' అను యతిప్రబంధము 'ఉచ్చలము' గా వచ్చునని పరిష్కర్త. (కిందిసూచి).

అష్టారత్ని కృతాయామాః తదర్ధేన తు విస్తృతాః
పురో యవనికాశ్చిత్రాః సూచీవిజ్ఞాన భంగిభిః
తిరస్తతోధికా వాస్యుర్యథా వాద్యం యథారుచి. 71

తతః పుష్పాంజలేః పూర్వం పీఠమర్దైః [పాటబంధైః?] సహక్రమాత్
కర్తవ్యం ప్రతిసీరాణా మేతాభ్యామపసారణమ్
ప్రథమామంతరేణైకాం పాత్రస్య పురతః స్థితామ్. 72

కర్పూరధూప సంకాశ పీ (శ్వే ?)[1] తాంశుక తిరోహితా
సద్యః క్షీరాబ్ధిజాతేవ తిష్ఠేత్ లక్ష్మీః పతింవరా. 73

తృతీయో పీఠ [పాట ?] బంధస్య శబ్దేనాంతేఽపసర్పితా
సర్వాతోద్య నినాదేషు యుగపత్ శ్రోత్ర హారిషు. 74

[2]ఊర్ధ్వభూమౌ తురీప.........తుముద్యతైః [?]
హైమైర్మణిమయైః కాంచీ మంజీర వలయాదిభిః, 75

అన్యైరాభరణైః కించ వస్త్రైశ్చామీకరోచ్చయైః
శ్రీఖండాగరుజైః.........కుంకుమజైరపి, 76

తోషయేయురిమాం బృందయుక్తామింగితవేదినః
మత్తద్విపఘటా వాజిభైర...దురంపరమ్ [?]
క్రమేణ కుంకుళం [మం] దద్యాత్ (?) ద్వంద్వా [?] (యద్వా ?)
శక్త్యనుసారతః. 77

...శ్రాంతా...గత్వా వేశ్మ విశ్రామ్యతాం త్వయా
ఇత్యాదిశ్య మహీపాలో హర్షాదేనాం విసర్జయేత్.
స్వామిసంభావనాధన్యాం మన్యాం లక్ష్మీభరాలసామ్ 78

---

1. 'వీతాంశుక' నావద్ది వ్రా. ప్ర; కర్పూరధూళి పీతవర్ణముగాదు. కనుక ఈ నా సవరణ సూచన.

2. ఇక్కడ కొంత గ్రంథములోపించిన దనుటస్పష్టమే; హఠాత్తుగా నర్తకిని సన్మానించుట యెత్తుకొనబడినది గనుక.

